**RAMBABU DIARY**
By
NANDURI PARTHA SARATHI

*Published by*
**NANDURI PUBLICATIONS**
Hyderabad - 500 033.

*First Editon*
**January 2001**

*Cover Page Art Work*
**BAPU**

*Inside Illustrations*
**BAPU & SANKU**

*Prited at*
**NAVYA PRINTERS**
Himayatnagar, Hyderabad - 29.

***Copies can be had from :***
*In India :*
**Nanduri Publications**
A-21, Journalist Colony,
Jubilee Hills,
Hyderabad - 500 033.
Ph : 040 - 3548352
nampaasaa@rediffmail.com

*In USA & Other Countries :*
**Dr. Madhu Sarathi Nanduri**
401, Cobble Stone Lane
Edison, New Jersey 08820, U.S.A.
**madhu_nanduri@worldnet.att.net**
**madhu_nanduri@hotmail.com**
**Price : 100/- (India)**
**S 8 (U.S.A)**

ఈ పుస్తకం ప్రచురణకుగాను శ్రీ పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం రు.8,000/- ఆర్థిక సహాయం అందించింది. ఈరచనలోని అభిప్రాయాలతో విశ్వవిద్యాలయానికి ఎలాంటి సంబంధం లేదు.

# అంకితం

నీలోని నాలోని

**'రాంబాబు'** కి

# నండూరి పార్థసారథి

జననం 1939, కృష్ణాజిల్లా ఆరుగొలను గ్రామంలో. చదువు- ఇంటర్మీడియట్ విజయవాడ; బి.ఏ. హైదరాబాద్; ఎం.ఏ శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి. 1959 నుంచి 1996 వరకు - దాదాపు 37 సంవత్సరాలు - ఆంధ్రప్రభలో పాత్రికేయ ఉద్యోగం. 1957లో మొదటి కథ అచ్చయింది. అప్పటి నుంచి వివిధ పత్రికలలో పెక్కు కథలు, గల్పికలు, ధారావాహిక నవలలు ప్రచురణ పొందాయి. అవి కాక సంగీతం, సాహిత్యం, సినిమా, నృత్యం, నాటకం వంటి విషయాలపై వందలాది వ్యాసాలు, సమీక్షలు వివిధ పత్రికలలో వెలువడినాయి.

ఇప్పటి వరకు పుస్తక రూపంలో వచ్చిన రచనలు : 'శిఖరాలు-సరిహద్దులు' (యుద్ధం నవల -1966); 'కార్ఖానాఖ్యానము' (హాస్యనవల -1973); 'సాహిత్య హింసావలోకనం' (వ్యంగ్య రచన -1973); 'అనగనగా ఓ కథ' (నవల-1983). 'రాంబాబు డైరీ'-మొదటి భాగం (హాస్య, వ్యంగ్య రచన -2001).

'రాంబాబు డైరీ' రెండవ భాగం, 'అయోమయ రాజ్యం' త్వరలో వెలువడ బోతున్నాయి.

హాస్యరచనకు గాను 1991-92లో తెలుగు విశ్వవిద్యాలయం నుంచి పురస్కారం.

ప్రస్తుతం - 'రసమయి' సాంస్కృతిక మాస పత్రిక సంపాదకత్వం.

# కథా-కమామీషు

ప్చ్... ఏమిటో... మళ్ళీ ఆ రోజులు రావు కదా!

నలభై రెండు, నలభై మూడేళ్ళ కిందట నేను బియ్యే చదివే కాలంలో హైదరాబాద్ ఎంత అందంగా వుండేది! ఎంత శుభ్రంగా, ప్రశాంతంగా, ఆహ్లాదకరంగా వుండేది! ఈ ట్రాఫిక్ జామ్‌లు, వాయుకాలుష్యం, ధ్వని కాలుష్యం ఎరగం. గతుకుల రోడ్లు, చెత్త కుప్పలు ఎరగం. ఈగలు ముసిరినట్లు ఈ జనాల గుంపులు ఎరగం. మనుషులు దర్జాగా వుండేవారు. అరుస్తున్నట్లు, కరుస్తున్నట్లు మాట్లాడేవారు కాదు. మరీ ముఖ్యంగా సన్మానాలు, సావనీర్ల సాంస్కృతిక కాలుష్యం ఎరగం.

మా కాలేజీ ఏడాది పొడుగునా ఎక్స్‌ట్రా కరిక్యులర్ యాక్టివిటీస్‌తో కళకళలాడుతూ వుండేది. ఏడాదికో సారి నైజాం కాలేజీ ఆవరణలో జరిగే ఆంధ్రాభ్యుదయోత్సవాలలో నాటకం వెయ్యడానికి ఆర్నెల్ల ముందు నుంచి ప్రిపరేషను. మా కాలేజీ గోడపక్కనే ఎంచక్కా సినిమాహాలు. స్టూడెంట్సు మార్నింగ్ షోలు, మ్యాట్నీలు చూడడానికి ఎంతో కన్వీనియెంట్‌గా వుండేది. కాలేజీ ఎదురుగా ప్రిన్స్‌కేఫే అనే ఇరానీ రెస్టారెంట్ (ఆహా... ఆ వేడి వేడి పకోడీల రుచి అవిస్మరణీయం!); కోఠీ తాజ్‌మహల్ హోటల్లో వెన్న వేసిన మసాలా దోశ (అనుభవైక వేద్యం!); గోపీ హోటల్లో ఇడ్లీ (అనిర్వచనీయం) – మరతు మన్నా మరపురాని మధుర స్మృతులలో యివి కొన్ని.

నారాయణగూడాలో... ఓ మేడ రెండో అంతస్తులో ఒక్కటే గది, పెద్ద టెరేస్. ఆ గదిలో ముగ్గురం మిత్రులం... ముగ్గురిలో పెద్దవాడు కవి, నాటక రచయిత, మేధావి. కాలేజీలో అందరూ అతన్ని 'గురువుగారు' అనీ, 'కవిగారు' అనీ అనేవారు. ఆంధ్రాభ్యుదయోత్స వాలలో ప్రదర్శించాల్సిన నాటకాలన్నీ అతనే రాసేవాడు. అందులో హీరో వేషం అతనే వేసేవాడు. డైరెక్షన్ తనే చేసేవాడు. అందులో పాటలూ తనే రాసేవాడు. ఆ పాటలకి, అతడి ఇతర పాటలకి ట్యూన్లు కట్టి పాడటం, నాటకానికి మ్యూజిక్ డైరెక్షన్ చేయడం నా బాధ్యత. నేను అతని పర్మిషన్ లేకుండా యింకెవరి పాటలూ పాడడానికి వీల్లేదు. పాడితే

మిత్రద్రోహి, తేనె పూసిన కత్తి, పయోముఖ విషకుంభం అంటూ కోప్పడతాడు. అతను సైకో ఎనాలసిస్సు, టెలిపతీ, హిప్నాటిజం, న్యూమరాలజీ, పామిస్ట్రీ మొదలైన విషయాలను గురించి చెబుతుంటే అందరూ అతని చుట్టూ చేరి చెవులప్పగించి వినేవారు. ఇంక పోతే మూడోవాడు 'రాంబాబు'. మా అందరిలోకి మంచి వాడు అతనే. కవిగారు నాటకంలో ఏ వేషం వెయ్యమంటే ఆ వేషం వేసేవాడు. కాదంటే మిత్రద్రోహి, తేనెపూసిన కత్తి అంటాడు కదా కవిగారు.

మారూము, మాడాబా అప్పట్లో 'ఇంటలెక్చువల్' స్టూడెంట్స్‌కి (అంటే మా లాంటి వాళ్ళకి అన్నమాట) సమావేశ స్థలంగా వుండేది. షేక్స్‌పియర్, వర్డ్స్‌వర్త్, షెల్లీ, కీట్స్, టాగోర్, శరత్, విశ్వనాథ, చలం, శ్రీశ్రీ, దేవులపల్లి, బి.ఎన్.రెడ్డి, నాగయ్య, రాజేశ్వరరావు, బాలసరస్వతి, భానుమతి, శాంతారామ్, బిమల్‌రాయ్, వసంత్ దేశాయ్, సి. రామచంద్ర, నౌషాద్, బర్మన్, లత, తలత్, బిస్మిల్లా, రవిశంకర్, ద్వారం, ఈమని... యిలాంటి పేర్లు మా సమావేశాల్లో నలుగుతూ వుండేవి. పాత సినిమాలు, పాత పాటలు, పాత పుస్తకాలు, సాహిత్య సభలు, పబ్లిక్ గార్డెన్స్‌లో, టాంక్ బండ్ మీద ప్రకృతి సౌందర్యోపాసన, అర్ధరాత్రి వెన్నెల షికార్లు మా అభిమాన విషయాలు.

* * *

ఇలా చెప్పుకుంటూ పోతే యిదే ఒక గ్రంథం అవుతుంది. నిజానికి ఈ విశేషాల్లో విశేషం ఏమీలేదు – చిన్నప్పటి జ్ఞాపకాలు ఎవరికి వుండవు గనక! ఎవరి జ్ఞాపకాలు వారికి తీపి. 'మంచి గతమున కొంచెమేనోయ్' అన్నారు. నిజమే. కాని, నెమరు వేసుకుని 'ఆహా' అనుకోడానికి ఆ కొంచెమే చాలు. మనస్సు ఎప్పుడూ ముందుకి తోస్తుంటే వెనక్కి పరుగెత్తుతూ వుంటుంది. అది దాని సహజ లక్షణం. దాన్ని తప్పుపట్టలేం. ఎందుకంటే దానికి వున్నదంతా వెనకే – ముందు కాదు. ముందు చూపు అవసరమంటారు గాని అసలది కనిపించి చావదు కదా! 'ముందు' అనేది మనకి సంబంధించినంత వరకు వుందన్న గ్యారంటీ లేదు. ఒక వేళ మనకి 'రేపు' అనేది వున్నా అది ఎలా వుంటుందో తెలియదు. కాలమనే పొగమంచు తెర అవతల 'మరుక్షణం'లో ఏముందో కనిపించదు. కనిపించని దాన్ని ఊహించుకోవడం, కలలు కనడం కంటే గతంలోని మాధుర్యాన్ని నెమరేసుకోవడం నయం. వర్తమానం అనే దానికి అసలే నిలకడ లేదు. క్షణక్షణం అది గతంలోకి పాదరసంలా

జారి పోతుంటుంది. స్మృతుల ఖజానా లోకి చేరిపోతుంటుంది. అందుకని... నిజంగా, నికరంగా, నిస్సందేహంగా మనకు వున్నది గతం ఒక్కటే. గతం కంటే సత్యమైనది యింకోటి లేదు.

గతంలో మధుర ఘట్టాలను తలచుకొనే వాళ్ళంతా నిజంగా మళ్ళీ ఆ రోజులు రావాలని కోరుకోరు. వెనకటి రోజులొస్తే వెనకటి కష్టాలూ వస్తాయి. (కష్టాలు లేని దెప్పుడు గనక!) నాలుగు రకాల చట్నీలతో ప్లేటు యిడ్లీ బేడాకి వస్తే జీతం వంద రూపాలయకి తగ్గిపోతుంది. 'అమ్మో బేడాయే!' అనుకుంటాం. కాని, వెనకటి కష్టాలని అనుభవించాల్సిన అవసరం లేకుండా అప్పటి సుఖాల మాధుర్యాన్ని మాత్రమే ఆస్వాదించే వెసులుబాటు 'స్మరణం'లో వుంది. ఈ వెసులు బాటు భవిష్యత్తు గురించిన ఉహల్లో వుండదు. ఎంత మధురమైన ఊహలైనా వాటి పక్కనే 'భయం' పొంచి వుంటుంది. స్మృతుల విషయంలో ఆ 'భయం' లేదు.

జ్ఞాపకాల గ్రామఫోన్ రికార్డులో మనకు కొన్ని ఫేవరిట్ ఘట్టాలుంటాయి. వాటిని మళ్ళీ మళ్ళీ 'ప్లే' చేస్తుంటాము. కాలేజ్ డేస్ జ్ఞాపకాల దగ్గర ఒక గాడి. మనస్సనే ముల్లు ఆ గాడిలో పడికొట్టుకుంటూ వుంటుంది. దాన్ని అక్కణ్ణించి లేవదీస్తే కాసేపటికి పాతికేళ్ళ గాడిలో పడుతుంది. అది దాని లక్షణం. సన్యాసం పుచ్చుకున్న పీఠాధిపతులు కూడా మా చిన్నప్పుడు ఫలాని సినిమాలు చూసే వాళ్ళం అంటూ జ్ఞాపకం చేసుకుంటూ వుంటారు. ఇంక మన మనగా ఎంత!

* * *

'రాంబాబు డైరీ'కి ఉపోద్ఘాతం రాద్దామని మొదలు పెడితే మనస్సు కాలేజ్ జ్ఞాపకాల గాడిలో పడింది. ఈ 'డైరీ'కి ముడి పదార్థాం ఆ జ్ఞాపకాలే. నేను కథలు రాయడం మొదలు పెట్టింది ఆ రోజుల్లోనే. ఐదారు కథలు అచ్చయ్యాక 'కథా – కమామీషు' అనే రాంబాబు కథ రాశాను. బాపు గారు వేసిన చిన్న చిన్న బొమ్మలతో ఆ కథ ఆంధ్ర సచిత్ర వార పత్రిక (1958 నవంబరు 5వ తేదీ సంచిక)లో అచ్చయింది. ఆ బొమ్మల పుణ్యామా అని రాంబాబు చాలా మంది పాఠకులను ఆకర్షించాడు. తర్వాత 1962లో మొదటి సారి 'రాంబాబు డైరీ' రాశాను. అప్పటి నుంచి 2000 వ సంవత్సరం వరకు అడపాతడపా 'డైరీ' రాస్తూ వచ్చాను. ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి వార పత్రికలలోనూ, జ్యోతి, విజేత,

హాస్యప్రియ మాస పత్రికలలోనూ, ఆంధ్రప్రభ దిన పత్రికలోనూ 'డైరీ'లు అచ్చయినాయి.

'రాంబాబు డైరీ' కథా కాదు, నవలా కాదు. ఇది 'డైరీ' మాత్రమే. అందుకే యిందులో 'కథా-కమామీషు' కథను చేర్చలేదు. దానికి బాపుగారు వేసిన బొమ్మలను మాత్రం వాడుకున్నాను. అవి కాక యింకా బాపుగారి బొమ్మలు చాలానే వున్నాయి ఈ పుస్తకంలో. అవన్నీ ఆయన **1958-88** మధ్య కాలంలో వేసినవి. ఆయనకు నేనెంతో కృతజ్ఞుణ్ణి. ఈ డైరీ పేజీలలో సగానికిపైగా 'హాస్యప్రియ'లో అచ్చయినాయి. నేను చాలా టెన్షన్‌లో - రాయలేని స్థితిలో - వున్నా... 'మీ నుంచి డైరీ వచ్చేదాకా హాస్యప్రియ బైటకు రాదు' అంటూ బెదిరించి, బలవంతంగా నా చేత రాయించిన శంకు గారికి కృతజ్ఞుణ్ణి. ఇప్పుడు ఈ పుస్తకంలో కనిపించే ఆయన బొమ్మలన్నీ కొత్తగా, ప్రత్యేకంగా వేసినవి.

ఎంత జాగ్రత్తగా దాచి పెట్టినా 'డైరీ'లో కొన్ని భాగాలు గల్లంతయ్యాయి. వాటిని తిరిగి సంపాదించడానికి ఎన్నో సంవత్సరాలు పట్టింది. దాదాపు ముప్పయ్యేళ్ళ పాటు 'రాంబాబు' కటింగ్స్ భద్రపరచి నాకు అందించిన ఉడయవర్లు గారికి ఎంతో కృతజ్ఞుణ్ణి.

* * *

రాంబాబు, అతడి రూమ్మేట్లు సారధి, భాస్కర్రావు - తొంభై శాతం కల్పిత పాత్రలు. వర్లక్ష్మి, పక్కింటి కోతి, మావయ్య, నాన్నగారు, ఎడిటరు గారు, న్యూసెడిటరు కల్పిత పాత్రలు. వీళ్ళంతా కాలాతీత వ్యక్తులు. రాంబాబు ఎప్పుడూ ఇరవయ్యేళ్ళవాడు. ఎప్పుడూ బియ్యే చదువుతూ వుంటాడు, 'సుజన మిత్ర'లో పార్టైమ్ పాత్రికేయుడుగా పనిచేస్తుంటాడు.

నలభయ్యేళ్ళ పాత్రికేయ జీవితంలో నాకు తటస్థపడిన అనేక మంది రాంబాబుల కలబోత ఈ రాంబాబు. అతడి డైరీలో మొదటి భాగం యిది. రెండో భాగం త్వరలో వస్తుంది. 'రాంబాబు డైరీ' ఎప్పుడూ సశేషమే. రెండో భాగం తర్వాత మరో భాగం వస్తుందన్న హామీ లేదు. రాదన్న గ్యారంటీ లేదు. ఈ డైరీని మొదటి నుంచి చివరికి, చివరి నుంచి మొదటికి, మధ్యలో మొదలు పెట్టి ముందుకి, వెనక్కి ఎలాగైనా చదువుకోవచ్చు. ఎక్కడైనా ఆపేయవచ్చు. ఇది ఆదిమధ్యాంతరహితం.

- నం.పా.సా.



పేరు : రాంబాబు

వయస్సు : ఇరవై సం॥లు

ఎత్తు : 5 అ. 7 అం.

బరువు : 130 పౌనులు

ఛాతీ : 34 అం.

రంగు : యావరేజి

చదువు : బి.ఏ. (ఫైనలియర్)
విద్యావర్ధినీ కాలేజి,
హైదరాబాద్

అభిమాన విషయములు : జర్నలిజము, సంగీతము, సాహిత్యము, సైకోఎనాలసిస్సు, హిప్నాటిజము, వేదాంతము, వైరాగ్యము, పొలిటిక్స్, దేశభక్తి, దైవభక్తి, చారిత్రక పరిశోధన, లాజిక్కు, మేజిక్కు, సౌందర్యారాధన, పవిత్రప్రేమ వెు॥

లాస్ట్‌బట్ మోస్ట్ ఇంపార్టెంట్ హాబీ : డైరీ వ్రాయుట.

## నవంబర్ 6

నన్ను హాస్యాస్పద చక్రవర్తిగా వర్ణించుచు సారథి యిటీవల ఒక పత్రికలో కథ వ్రాసెను. ఇంటాయన కుమార్తెతో నా విషాదాంత ప్రేమ వృత్తాంతమును, తదనంతరము మామయ్య కూతురును ఏకపక్షముగా, అజ్ఞాతముగా ప్రేమించు వైనమును అతడా కథలో వివరించెను. ఆ కథ చదివినప్పటి నుండియూ కాలేజీలో పలువురు విద్యార్థులు నేను నిజముగానే అమాయకుడననియూ, వెర్రివాడననియూ అపార్థము చేసికొని నవ్వుచున్నారు. వీలైనంత అనతి కాలములో ఈ అపప్రథను తొలగించుకొనవలయునని ప్రతిజ్ఞ చేసితిని.

మెదడులో ఆవిర్భవించు అమూల్యములైన అయిడియాలను డైరీయందు నిక్షిప్తము చేయుట అవసరము. లేకున్నచో అవి విస్మృతి పథమున పడిపోవును. డైరీ అనునది విజ్ఞానాత్మకముగా వుండాలి.

అసలు కష్టం, సుఖం అనేవి ఏమిటి అని తీవ్రముగా ఆలోచించాను. మంచి అనగా అంతర సుఖం, బహిర కష్టం. చెడువల్ల అంతర దు:ఖము, బహిర సుఖము, సైన్సు, వేదాంతము ఆలోచనా శక్తి జనితములు. సంస్కారం అనేది ఆలోచనల పరస్పర సంఘర్షణ సారం.

పుస్తకము లేని రాజుయింట జన్మించుటకంటె పుస్తకముగల పేదయింట జన్మించుటకు నేనిచ్ఛగింతును. ఈ మాటను ఎవరో మహాపురుషుడు చెప్పినట్టు జ్ఞాపకం. గాంధీ గారివలె ధైర్యమును పెంపొందించుకొనవలెను. మానవుడు ఏ ఘనకార్యమును సాధించవలెనన్నా ధైర్యము ముఖ్యము. అదే నాలో కొరవడినది.

ఇకపై ఒక కార్యనిర్ణయానుక్రమణిక ప్రకారము ఉన్నతాదర్శము వైపు సాగిపోవలెను. ఐరను డిసిప్లిను మెన్‌టైన్ చేయవలెను.

ఓం. మంగళం మహత్.

## నవంబరు 10 :

ఇకనుంచి నేను గంభీరకరముగా వుండడానికి ప్రయత్నించాలి. పన్నాసి ఆడంగి ఏడుపుగొట్టుతనం మానెయ్యాలి. తొందరగా గడుగ్గాయిని కావాలి. హనుమంతుల వారు గొప్పవారు. తన వాలముతోనే ప్రపంచమును చుట్టెయ్యగలడు. 'హిమకిరణ్' అనే కలం పేరుతో వారపత్రికకు కథ పంపించాను. ఆదర్శం ఎప్పుడూ సాధ్యమైనంత వరకు ఆకాశమంత ఉన్నతంగా ఉండాలి. ఎప్పటికైనా అమెరికాకి రాయబారిని కావాలని ప్రతిజ్ఞ చేశాను.

హోటల్‌కు వెళ్ళి టిఫిన్ తిని బైటకొస్తుంటే సర్వరు రెక్కుచ్చుకుని ఆపాడు. ఎందుకూ అని అడిగితే "బిల్లుయివ్వరేం?" అన్నాడు. ఓహో అనుకుని చూస్తే బిల్లు లేదు. అప్పుడు యిందాక కూర్చున్న చోటికెళ్ళి చూస్తే అది అక్కడ గట్టిగా నలిపి చుట్ట చుట్టి పడేసుంది. విజ్ఞానాత్మక విషయాలేవో ఆలోచిస్తూ దీనితో కొద్దిగా చెవిలో గులివి తీసుకున్నట్లున్నాను. తీరా బైటికొచ్చి ఐదురూపాయల నోటు యిస్తే రెండున్నరే తిరిగి యిచ్చాడు క్యాషియరు. పరధ్యానంలో చాలా తినేసి వుంటాను.

## నవంబరు 16 :

రాత్రి వెంకటేశ్వరస్వామి కల్లో కనబడి 'నా మొక్కు మాటేంచేశావురా భడవకానా' అని కోప్పడ్డాడు. 'దేనికీ? మా యింటాయన కూతురి పెళ్ళి అప్పుడే అయిపోయిందిగా' అన్నాను. లేదు కూడదు ఏమైనా సరే చెల్లించాల్సిందే అంటూ ఆయన పేచీ పెట్టాడు. ఇప్పుడు గుండు కొట్టించుకోవాలి కాబోలు దేవుడా. వర్లక్ష్మి చూస్తే నవ్వుతుందో ఏమో. సాయంత్రం కాలేజీ నుంచి మావయ్యగారింటికెళ్ళాను. అత్తయ్య పకోడీలు పెట్టింది. వర్లక్ష్మి హార్మణీ వాయిస్తోంది. నేనూ కాసేపు వాయించి వచ్చాను. రూముకి రాగానే బాబూరావు వచ్చి ప్రేమ ఎంత గొప్పదో, ఎలా చెయ్యాలో చెప్పాడు. తను ఎంతమందిని పవిత్రంగా ప్రేమించాడో వర్ణించి చెప్పాడు. అతను సిగరెట్లు యమ ఫోజులో తాగుతాడు. నేనుకూడా మొదలు పెడితే మంచిదేమో. సిగరెట్లు తాగితేగాని వెర్రిబాగుల తనం పోదు.

మిరపకాయలు, సిమెంటు, జనపనార గుంటూరులో, బెజవాడలో, ఏలూరులో క్రమముగా పండును, తయారగును, మిల్లులుగలవు (క్రమాలంకారము). చిన్నప్పుడు చదివిన అలంకారములు, విభక్తులు మధ్య మధ్య జ్ఞాపకము చేసుకోవలెను. కూర్మ మూషికములు జలబిలముల దూరెను (మిత్రలాభము).



ఇండియా చాలా బీద దేశము. భోగాలు, లక్జరీసు లేకపోతే మానే. ప్రతి మనిషికీ కనీసం తినేందుకు తిండి, కట్టుకునేందుకు పెళ్ళామూ అయినా వుండాలా?

ఇకనుంచి వీలైనంత తరచుగా పబ్లిక్ గార్డెన్‌కి వెళ్ళి ప్రకృతి సౌందర్యారాధన ప్రాక్టీసు చేయాలి. అలాగే శుక్ల పక్షములందు వెన్నెల షికారు చేయవలెను. పొయెట్రీ బాగా చదవవలెను.

## నవంబరు 21:

సారధికంటె, భాస్కర్రావుకంటే చాలా ముందుగా తెల్లవారుజామునే నిద్రలేచి కాళికాదేవి నుపాసించితిని. తరువాత డాబా మీద ఆరుబైట చలిలో లంగోటీ బిగించి 42 బస్కీలు, పది దండీలు తీసితిని.

రాత్రి కృశ్చేవ్ కల్లోకొచ్చి షేకాండ్ యిచ్చాడు. 'నీ అంత లావు అవుతానా నేను? నువ్వేం తింటావు?' అనడిగాను. అతను చాలా చెప్పాడు. భయమేసింది. రోజుకు వంద రూపాయలు తింటాట్ట. 'నీ అంత గొప్ప వాణ్ణవుతానా నేను' అనడిగాను. 'కాలేవు' అన్నాడు అతను. 'పోనీ నెహ్రూ అంత కాగలనా' అనడిగాను. 'కాగలవు' అన్నాడతను.

ఇవాళ పై మేడమీదికి నిచ్చెనెక్కుతుంటే కాలుజారింది. కొద్దిగానే. పళ్ళేదు. పక్కింటి అరవమ్మాయి కోతి చూసి 'వొండ్రఫుల్' అంది నవ్వుతూ. ఆ కోతి రోజూ అలాగే నవ్వుతుంది నన్నుచూసి. 'ప్రేమించేస్తా జాగర్త' అని బెదిరించాను. ఆమ్మాయికి తెలుగు రాదు. ఇకిలిస్తే అరవపిల్లే యికిలించాలి. ఓహో ఏమి అందం! నేను కొద్దిగా రౌడీని, రాలుగాయిని అయినట్టున్నాను. బస్టాప్ దగ్గర ఎవరో అమ్మాయి అంది. ఫరవాలేదు - కొంత డెవలప్పయ్యాను. అయితే ఆమె వ్యాఖ్యకు కారణమేమిటో తెలియలేదు. తెలుసుకుంటే ఈ డెవలప్‌మెంటును యింకా బాగా డెవలప్ చేసుకోవచ్చు. ఇహ త్వరగా మోట్రసైకిల్ నేర్చుకోవాలి.

డైరీ వ్రాయుటలో ఎల్లప్పుడూ సత్యసంధతకు కట్టుబడి వుండాలి.

## డిసెంబరు 1:

వారపత్రిక వాళ్ళు నా రచనలని వరసగా తిప్పి పంపుతున్నారు 'హిమకిరణ్' అని. వాళ్ళు నా రాతలని పూర్తిగా అపార్థం చేసుకుంటున్నట్టున్నారు. దస్తూరీ యింప్రూవ్ చేయవలయును. నా పెన్నేమ్ హిమకిరణ్ అని ఈ పేటలో అందరికీ తెలిసిపోయింది. సారథే చెప్పివుంటాడు. లేకపోతే పోస్టుమేనో.

మొన్న కుట్టించుకున్న కొత్తపాంటు చిరిగిపోయింది వెనకపక్క. పొద్దున్న బాగానే వుంది. బహుశ ఈ మధ్యలో ఎప్పుడో ఏ మేకుకో పట్టుకొని చిరిగి వుంటుంది. పరధ్యానము అనగా ఇహముపై బొత్తిగా ధ్యానము లేకపోవుట. మతము అనగా మానవుని మేధాసంపత్తి జనితమైన ఒక విధమైన విరక్తితో కూడిన వేదాంతము అనుకొంటాను.

సాయంత్రము ఆకాశము మేఘావృతమై పెనుగాలి వీచి వర్షము కురిసెను. వడగళ్ళు పడెను. డాబామీదనుంచుని చుట్టూ కలయజూడగా ఈ విశాల ప్రపంచకంలో నేనెంతా అనిపించింది.

అక్కరకు రాని చుట్టము గ్రక్కిన వరమీని వేల్పు, మోహరమున దానెక్కిన బారని గుర్రము విశ్వదాభిరామ వినురవేమ. ఆహా ఎంత గొప్పమీనింగు. అక్కరకు రాని చుట్టాన్ని గుర్రంతో పోల్చాడు కవి.

## డిసెంబరు 7 :

బాబూరావు కూలింగ్ గ్లాసెస్ పెట్టుకుని, సిగరెట్టు తాగుతూ, మోట్రసైకిలు మీద వచ్చాడు. బలే ఫోజుగా వున్నాడు. రౌడీని కావాలంటే సిగరెట్టు తాగక తప్పదు. సిగరెట్టు తాగుతుంటే మనిషికి మంచి డిగ్నిటీ వస్తుంది. అమాయకత్వము పటాపంచలై పోతుంది. మొన్న వ్యాయామం చేస్తుండగా బాబూరావు ఫొటో తీశాడు. ఇవాళ స్టూడియో నుంచి దాని ఎన్‌లార్జిమెంటు తెచ్చాడు. లంగోటీ, కండలు బాగా వద్దాయి. రూములో తగిలిద్దామనుకుంటుండగా భాస్కర్రావు 'ఇంటాయన పిల్లలూ వాళ్ళూ చూస్తే జడుసుకుంటారే మోనోయ్ ఎందుకొచ్చిన గొడవ' అని వారించాడు.

ఆరోగ్యం, పర్సనాల్టీ అంతా బాగానే వుంది గాని ఆయుర్వేదంలో 'జీవకళ' అనే టానిక్కు పుచ్చుకోమని సారధి సజెస్టు చేశాడు.

మోట్రసైకిలుకి ఒట్టి సైకిలుకి తేడా : మోట్రసైకిల్ తొక్కి ఎక్కవలెను. ఒట్టి సైకిల్ ఎక్కి తొక్కవలెను. మో.సై పెట్రోలు మీద నడుచును. ఒట్టి సైకిల్ మానవుని జీవకణముల శక్తితో నడుచును. మోట్రసైకిల్ వల్ల హీరో కళవచ్చును. ఒట్టి సైకిల్‌వల్ల బడుగుజీవి కళ వచ్చును. మోట్రసైకిల్ నేర్చుకోవాలి తొందరగా.



ఆడవాళ్ళకి సినిమా పాటలంటే యిష్టంట. బాబూరావు చెప్పాడు. సారధి దగ్గర రెండో మూడో పాటలు నేర్చుకోవాలి అర్జెంటుగా. ఈ సారి మావయ్య గారింటికెళ్ళినప్పుడు వర్లక్ష్మికి వినిపించాలి హార్మణీవాయిస్తూ.

ఓం. అవిఘ్నమస్తు.

## డిసెంబరు 13 :

వర్లక్ష్మి నన్ను ప్రేమించడం ప్రారంభించిందేమోనని అనుమానంగా వుంది. రాత్రి భలే కలవచ్చింది. నేనూ, వర్లక్ష్మి మోట్రసైకిలు మీద పోతున్నాంట ఎలక్షన్‌కి. నేను ఖద్దరు లాల్చీ, వులెన్‌ప్యాంటు వేసుకుని, గాంధీ టోపీ పెట్టుకున్నాను. వర్లక్ష్మి పంజాబీ డ్రస్సు వేసుకుంది. మోట్రసైకిలు వందమైళ్ళ స్పీడులో పోనిచ్చాను.

ఇవాళ బాబూరావు ఒకతన్ని పరిచయం చేశాడు. పేరు శ్యాంప్రసాద్. (షరా: అతన్ని శ్యాంబాబు అంటుంటారు). మనిషి పోజూ అదీ మాత్రం పెద్ద హిట్లరులా వున్నాడు. ఒట్టి అయోమయం మనిషి. బొత్తిగా జీవకళ లేదు. ఎప్పుడు చూసినా మైండు ప్రజెంటు, బుర్ర ఆబ్సెంటూ. అంత విచిత్రమైన మనిషిని నేనెక్కడా చూడలేదు. బాబూరావు బలేవాడే. అతనికి దొరికే వాళ్ళంతా యిదే సరుకు. బాబూరావు రహస్యం చెప్పాడు మీసం పైకి మెలిపెట్టమని. ట్రై చెయ్యాలి. అతను భలేవాడు. ఇంకో రహస్యం కూడా చెప్పాడు. మనం ప్రేమిస్తున్న అమ్మాయి మనని ప్రేమిస్తోందో లేదో తెలుసుకోవాలంటే ఆ అమ్మాయి ముందు గబ గబా రెండో మూడో సిగరెట్లు కాల్చేయాలిట. అప్పుడు ఆ అమ్మాయి ఆందోళనతో 'నాకోసమైనా సిగరెట్లు మానెయ్యి బాబూరావ్ (లేదా రాంబాబూ)' అన్నదనుకో. ఇంక నో డౌట్... ఆ అమ్మాయి మనని ప్రేమిస్తోందన్నమాటే.

సారధి సజెష్టు చేసిన జీవకళ టానిక్కు కొనుక్కొచ్చాను. తియ్యగా వుంది. ఒక బాటిల్ అయ్యేటప్పటికి ఎంత డెవలప్‌మెంటు వస్తుందో అబ్జర్వ్ చెయ్యాలి.

## డిసెంబరు 18 :

శ్యాంబాబు పొద్దున్నే వచ్చి తన ప్రేమ కథంతా చెప్పాడు. ట్రాజెడీయే. ఒట్టి అమాయకుడు. నా అంత పర్సనాల్టీ వుందన్నమాటేగాని బొత్తిగా లోకజ్ఞానం లేదు. అతన్ని చూస్తే జాలేస్తుంది. అతని ప్రేమ ఫలించడంకోసం నా సర్వస్వం త్యాగం చేయాలనిపించింది.

తెల్లవారుజామున లంగోటీ బిగించి డాబామీద రహస్యంగా బస్కీలు తీస్తుంటే పక్కింటి కోతి కిటికీలోంచి చూసి ఫక్కున నవ్వింది. అంత పెందరాళే లేవాల్సిన అవసరమేమిటో ఆ అమ్మాయికి. "అటువంటి పరిస్థితిలో నేనే అయితే నూతిలో దూకి చస్తా" అన్నాడు బాబూరావు (పూర్‌ఫెలో). రేపు గుడికి వెళ్ళాలి. హనుమంతులవారు బుద్ధిమంతులవారు. మహా వీరుడు. నేను ఆయన తోకంత కూడా వుండను.

'గుజ్జనగూళ్ళు' అనే పత్రికలో నాకథ 'తల్లిమాటవినవలెను' అనేది వేశారు. రచన



'హిమకిరణ్' అని దర్జాగా పెద్దక్షరాల్లో వేశారు. త్వరలోనే ఒక పెద్ద నవల రాసి ఆంధ్రుల అభిమాన వార పత్రిక్కి పంపిస్తా. 'గుజ్జనగూళ్ళు' లాంటి చిన్న పత్రిక వాళ్ళే వేసుకోగాలేంది అంత పెద్ద వారపత్రిక వాళ్ళెందుకు వేసుకోరు.?

## డిసెంబరు 24 :

'గుజ్జనగూళ్ళు' పత్రికలో పడిన నాకథని వర్లక్ష్మికి చూపించా. 'హిమకిరణ్' నా పెన్నేమ్ అని చెప్పా. కథ చదివి బలేగా నవ్వింది. కాని, అది హాస్యకథ కాదు. నేను హాస్యం రాస్తే యింకెంత నవ్వేదో కదా! ఆమె నవ్వు శరత్కాలపు వెన్నెల వలెనుండెను. నా మనమున మల్లెలు బూచెను. అప్పుడప్పుడు నాక్కూడా కవిత్వం వస్తూవుంటుంది. కవిత్వం వచ్చినా కక్కువచ్చినా ఆగదు. ఇకనుంచి వీలైనంత వరకు ప్రోజు రాయదలచుకోలేదు. భాష అనేది మానవుని హృదయ సంబంధమైన ఒకానొక ఆవేదనాజనితమైన శబ్దం.

జన్మలో ఒక్కసారైనా ఆలిండియా రేడియోలో పాట పాడాలని తీర్మానించుకున్నాను. సంగీతం స్కూల్లో చేరాలి. వర్లక్ష్మి ఎక్కడ నేర్చుకుంటుందో అడగడం మర్చిపోయా. ఓ సారెప్పుడో నాన్నగారు సజెష్టు చేశారు భరతనాట్యం నేర్చుకోరాదా అని. షేమ్!

బాబూరావు చెప్పినట్టు రోజూ మీసం మెలిపెడుతూనే వున్నాను పైకి. కాని తిరగటం లేదు. అందుకని క్లిప్పులు కొన్నాను. సారథి చూశాడా చచ్చానే. ఇంకో కథరాసి పారేస్తాడు. అందుకని రాత్రిళ్ళు ఎవరూ చూడకుండా తగిలిస్తున్నాను. మంటగా వుంది. మీసం బాగా దుబ్బులాగా పెరిగితేగాని మెలి తిరగదనుకుంటా.

జాతికుల మత వయో వివక్షత లేకుండా ప్రేమించి పెళ్ళి చేసుకోవడం మంచిదా కాదా అనే శీర్షిక కింద సంతకాలు సేకరించాలి. ప్రేమ అతి పవిత్రమైనది. అది వీటన్నింటినీ అధిగమించి ఉన్నతోన్నత పథాలకు సాగిపోతుంది.

## డిసెంబరు 31 :

ఉమెన్సు కాలేజీ గోడ ఎక్కుతుంటే కాలు జారి పడినట్లు కలవచ్చింది. తెల్లారి లేచి చూస్తే నేలమీద పడుకొని వున్నాను. రాత్రి మంచంమీద పడుకొన్న వాణ్ణి తెల్లారే పాటికి నేలమీదకు ఎలా వచ్చానా అని ఆశ్చర్యమేసింది. భాస్కర్రావుని అడిగితే అతను

దొర్లిపడ్డావేమోనోయ్ అన్నాడు. అదే నిజమైవుంటుంది.

"లవ్ ఈజ్ బ్లైండ్"

"వైఫ్ ఈజ్ ఎ నైఫ్

టు కట్ ది లైఫ్".

"ఆడది అంటే లయం లయం

ఆ నీడంటేనే భయం భయం".

ఇట్లు

సుకవి సూక్తులు.

అప్పుడప్పుడూ శాస్త్రీయ సంగీతం వినడం ప్రాక్టీసు చేయాలనుకున్నాను. ఇవాళ తిలక్ హాల్లో ఆయనెవరో పాటకచేరీ చేస్తుంటే వెళ్ళాను. అందరూ తలకాయలు తెగవూపేశారు. ఆయన చాలా గొప్పగా పాడి వుంటాడు. లేకపోతే వాళ్ళంతా అంతగా తలకాయలు వూపరు కదా. అందుకని నేను కూడా వూపేశాను. కాసేపు ఆనందించి టైమైపోతోందని వచ్చేశాను. రూముకొచ్చేసరికి పర్సులో ఐదు రూపాయల నోటు కనిపించలేదు. పర్సువుంది. నోటులేదు. కాబట్టి ఎవరో బహుశా నోటు తీసుకుని పర్సు మళ్ళీ నా జేబులో పెట్టేసివుంటారు. కాళ్ళు చూసుకుంటే ఒక కాలికి ఎర్రబూటు, యింకో కాలికి నల్లబూటు. ఆ ఎర్రబూటు ఎవరిదో. పాపం ఏడ్చివుంటాడు. పాట కచేరీలతో వచ్చిన గొడవ యిదే.

'జీవకళ' అయిపోయింది. పని చెయ్యలేదు. ఇంకోబాటిల్ పుచ్చుకోమన్నాడు సారథి. అతి ఆకలి అనేది దరిద్రుడి లక్షణాల్లో ఒకటని భాస్కర్రావు అన్నాడు. దాన్ని జయించాలి.

ఈ సంవత్సరము నేను సాధించినవి :

ఛాతీ : రెండు అంగుళములు పెరిగెను.

బరువు : పది పౌనులు పెరిగెను.

బలము : చాలా పెరిగెను.

అమాయకత్వము : పోయెను.

ప్రేమమహాత్యము : తెలిసెను.



గంభీరముగా నుంటున్నాను. టైమ్ టేబుల్ ప్రకారం నడుచుకొనుచున్నాను. చాలామందిని అజ్ఞాతముగా ప్రేమించితిని. కొంచెం రౌడీ లుక్కు వచ్చెను.

ఇంతే సంగతులు

ఇట్లు

రాంబాబు.

**జనవరి 4 :**

కాలేజీలో ఫంక్షన్ జరిగింది. నేను మైకులో పాడాను. పాడుతున్నంతసేపూ జనం తప్పట్లు కొడుతూనే వున్నారు. ఈలలు కూడా కొట్టారు. పాపం సారధికి పాటంతా అయింతరవాత గాని కొట్టలేదు తప్పట్లు. ఫీలయి వుంటాడు. నిష్కామ ప్రేమ చాలా పవిత్రమైందిట. రిటైరైన తరువాత పెళ్ళిచేసుకుంటే దానిని తేలిగ్గా సాధించవచ్చుననుకుంటాను.

సుల్తాన్ బజారుదగ్గర రోడ్డు గోతులు పడింది. రూము కొచ్చిన తర్వాత తిందామని పది పైసలు పెట్టి బటానీలు కొని జేబులో పోసుకొని గబగబా వస్తుంటే దార్లో ప్రతివాడూ నన్ను చూసి నవ్వటమే. రూముకొచ్చి చూసుకుంటే జేబులో బటానీలు లేవు. జేబుకి చిల్లి పడింది. అదీ సంగతి.

నాన్నగారు వచ్చారు పూర్నించి. నేను మొన్న కొనుక్కున్న నైట్‌డ్రస్సు చారల పైజామా తొడుక్కుంటే 'అరేబియా సాయెబులా వున్నావు' అన్నారు ఆయన. షేమ్ అనిపించింది. దాన్ని పనివాడికిచ్చెయ్యాలి. నాన్నగారు నాకోసం సంబంధాలు వెతుకుతున్నట్లున్నారు. మొన్న ఏదో సంబంధం వచ్చిందిట. మూడు వేలు కట్నం యిస్తామన్నారుట. మోట్రసైకిలు కొనుక్కోవచ్చు. లేకపోతే అసలు అలక పాన్పుమీదే మోట్రసైకిలు అడగవచ్చు. కాని, యిప్పుడు మళ్ళీ వర్లక్ష్మిని మానేసి యింకో అమ్మాయిని ప్రేమించాలి గాబోలురా దేముడా అని విసుగ్గా వుంది. అమ్మ మాత్రం పరాయి సంబంధానికి ఒప్పుకోదు. మావయ్య అమ్మకి సాయానా అన్నయ్యేగా. ఇంతకీ మావయ్య మోట్రసైకిలు కొనిపెడతాడోలేదో.

**జనవరి 9 :**

పురుష రాక్షసుని కరాళ కోరల కింద అణగారిపోయే స్త్రీలను సముద్ధరించవలెను. మనిషికి ప్రతిరోజూ ఏదో ఒక ప్రతిజ్ఞ అవసరం.

ప్రిన్స్ కెఫేలో పకోడీ అమోఘంగా, చిరస్మరణీయంగా చేశాడు. టీ మామూలే.

బెల్లం వీశ-ముప్పావలా. పంచదార వీశ - రూపాయిన్నర. ఆంధ్రలో పన్నెండు పంచదార మిల్లులు గలవు. ఉత్తరప్రదేశ్ చెరకుకు ప్రసిద్ధి.

ఆరోగ్యం డెవలప్‌మెంటు :

శీర్షాసనము : పావుగంట.

బస్కీలు :నలభైఏడు.

దండీలు : పదిహేడు.

డైరీని ఎంత జాగర్తగా దాచినా లాభం వుంటంలేదు. సారధి దాన్ని బట్టీపట్టేసి నాముందే అప్పజెప్పేస్తున్నాడు. అందుకని దర్జాగా లెక్కలేనట్లు దాన్ని పెట్లో పడేసి తాళం పెట్టకుండా వదిలేస్తున్నాను. నాకేమన్నా భయమా? బూతులు రాస్తున్నానా? నా డైరీ నిండా అన్నీ విజ్ఞానాత్మక విషయాలేకదా. అసలు సారధే ప్రశంసించాడు నా డైరీ ఒక కావ్యమని.

(ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక 4.10.61 సంచిక నుంచి)

# రాంబాబు డైరీ



**జూన్ 7 :**

కవిత్వంలో శాయశక్తులా కృషిచేయాలనుకుంటున్నాను. చెమట ఓడ్చందే కవిత్వం పుట్టదు. కవిత్వ మనగా అక్షర రూపము దాల్చిన మానవుని మేధా సంపత్తి జనితమైన నవరసముల యొక్క ఒకానొక నిష్పత్తి. మేధా సంపత్తికోసం పుస్తకాలు చదవాలి. నవరసముల కోసం ప్రకృతిని ఉపాసించాలి. ఈ రెండూ కలిసినప్పుడే కవిత్వం జనిస్తుంది. సాహిత్యం చదువుతున్నాను రోజూ. ఇంట్లో చదివితే లాభం లేదు. రేపణ్ణుంచి పబ్లిగ్గార్డెన్స్‌కి వెళ్ళి చదవాలి. అప్పుడు ప్రకృతారాధన కూడా కలిసొస్తుంది.

**జూన్ 13 :**

ఇహనుంచి కవిత్వం చదవడం తగ్గించి రాయడం మొదలుపెట్టాలి. ఎందుకంటే ఆట్టే చదివితే వాటి ప్రభావం మన మీద పడుతుంది. అప్పుడు మనం ఏది రాసినా కాపీ అనేస్తారు జనం. చదవకుండా రాయగలిగితేనే ఒరిజినాలిటీ ఉన్నట్టు లెక్క. ముత్యాల సరంతో కవిత్వం ఆరంభించాలని ఆకాంక్ష గలిగింది.

"అతివలను ప్రేమించుమన్నా

మంచి చేసుకు మెలగుమన్నా"

అని రెండు లైన్లు రాశాను. ఆ తర్వాత సాగలేదు. కృష్ణ దేవరాయల కాలంలో అయితే వీటికి అక్షర లక్షలు ఇచ్చి ఉండేవారు అన్నాడు భాస్కరరావు. అతని మాటల్లో అతిశయోక్తి లేదు. ఆరోజుల్లో అంత ధనం ఇవ్వబట్టే పెద్దన్న, తిక్కన్న, తిమ్మరుసుగార్లు అంత బాగా పద్యాలు వ్రాశారు. ఈ ప్రజాస్వామ్యంలో కవిత్వానికి ఆదరణ కరువై పోయింది కదా.

## జూన్ 18 :

సినిమాకు బయల్దేరబోతూ వుండగా హఠాత్తుగా నాన్నగారు ఊడిపడ్డారు ఊరినుంచి. పక్కింటి అమ్మాయి లిద్దరూ వెళ్ళిపోయారు సినిమాకి. నాన్నగారు నన్నూ, సారథినీ, భాస్కర్రావునీ కూర్చోబెట్టి హిట్లరును గురించి, నెపోలియన్‌ను గురించి, చర్చిల్ రాజకీయ నీతిని గురించి కొద్ది గంటలు ఉపన్యసించారు. నెహ్రూ పాలనలో గల లోపాలను వివరించారు. రాజకీయాలమీద ఇంట్రెస్టు పుడుతోంది. వార్తా పత్రికలు చదువుతున్నాను. నెహ్రూగారు జాతీయ సమైక్యతగురించి జోరుగా మాట్లాడుతున్నారు ఈ మధ్య. ప్రతిపక్షాలను తిడుతున్నారు. వాటినిండా చీలికలుట. వాటికి బలం లేదుట. అక్కడికి మహా కాంగ్రెసులో చీలికలు లేనట్టు. అ.భా. కాంగ్రెసు, ప్రదేశ్ కాంగ్రెసు, మండల కాంగ్రెసు, మహిళా కాంగ్రెసు, యువజన కాంగ్రెసు మొదలయినవి ఎన్ని చీలికలు లేవు కాంగ్రెసులో మాత్రం? చెప్పాలంటే కొల్లలు. బుకాయింపులకు మోసపోరాదు. వాన కురిసి వెలిసింది - నా మనస్సులాగా. ఎన్నో అస్పష్ట మధుర భావాలు - ఆకాశంలో చిరుమబ్బుల్లాగా.

## జూన్ 24 :

రాజకీయ విజ్ఞానం కోసం పత్రికలు చదువుతున్నాను. (షరా: పత్రికలు కూడా సాహిత్యంలో భాగమే. దీనివల్ల రాజకీయం, సాహిత్యం రెండూ కలిసొస్తాయి.)

రాజకీయం అనగా స్వార్థ కలుషితమైన దేశ సేవాసక్తి కార్యరూపము దాల్చుట. దీనినే మరొక విధముగా చెప్పవచ్చును. దేశభక్తితో కూడిన మానవ మేధస్సు వక్రమార్గమును బట్టుట. పంచదారకంటె బెల్లము చౌక. కాని ఆరోగ్యంలో రెండూ సమానమే. కానీ మన ప్రజలు బెల్లమును నీచముగా పరిగణించుచు, పంచదారకొరకు మోజు పడుచుందురు. భారతదేశమందలి దారిద్ర్యమునకు సగము కారణ మిదియే. ఈ విషయం ఈ రోజు నాన్నగారు చెప్పారు. ఆయన జ్ఞానం అద్భుతం. నేను కూడా అంతటివాణ్ణి కావాలి. బస్కీలు బాగా తియ్యాలి రేపణ్ణుంచి. దానివల్ల మడతబందుకీళ్లు బలిష్టమవుతాయి. ఆరంభశూరత్వం సిగ్గుచేటు.

## జూన్ 29 :

అసెంబ్లీ భవనం దగ్గర ఒక జర్నలిస్టుగారు కనుపించాడు. పంచ, లాల్చీ వేసుకున్నాడు. పైన నెహ్రూ లాగా వేస్టు కోటు వేసుకున్నాడు. మధ్య పాపిడి తీసి, కళ్లజోడు పెట్టుకున్నాడు. కాళ్లకు ఆకుజోడు, చేతులో ఓ ఫైలు, నోట్లో పైపు - యమ ఫోజులో ఉన్నాడు. ఒక ఎమ్మెల్లేతో మాట్టాడుతున్నాడు జాతీయ సమైక్యత గురించి, నెహ్రూగారి విదేశాంగ నీతినిగురించి. నాక్కూడా జర్నలిస్టు కావాలనిపించింది. ఆ ఉద్యోగంలోనే ఉంది అసలా డిగ్నిటీ అంతా. విలేఖరులంటే మంత్రులకు కూడా హడల్‌ట. ఏదైనా పత్రికాఫీసులో పార్ట్‌టైమ్ జాబ్ దొరుకుతుందేమో ట్రై చెయ్యాలి. ముందు జాతీయ సమైక్యత మీద ఓ వ్యాసం రాసి పడెయ్యాలి. జాతీయ సమైక్యత అనగా ఒకానొక దేశములోని వివిధ జాతుల, మతముల, కులముల, ప్రజల మనస్తత్వముల మధ్య ఒక విధమైన సుహృద్భావ పూర్వక వాతావరణమును నెలకొల్పుట. ఫైలు, పైపు, కళ్లజోడు కొనుక్కోవాలి తొందరగా. వేష మహిమ మరువరాదు.



## జూలై 5 :

మొన్న 'సుజన మిత్ర' పత్రిక్కి పంపిన అప్లికేషన్‌కి సమాధానం వచ్చింది. ఇంటర్వ్యూకు రమ్మన్నారు. మూడ్రోజులు ఆగి వెళ్లాలి. పక్కింటి కోతి ఈ మధ్య నన్ను ప్రేమిస్తోందేమోనని అనుమానంగా ఉంది. భాస్కర్రావుతో చెబితే ఆటోసజెష్చన్ అన్నాడు. అసలు నీకు తెలీకుండా నువ్వే ఆ అమ్మాయిని ప్రేమిస్తున్నావు; అది ఒప్పుకోవటం ఇష్టంలేక ఆత్మ వంచన చేసుకుంటున్నావు ఆవటా అన్నాడు. మొన్న తలనొప్పిగా ఉందంటే దానికీ ఆటోసజెష్చన్ అన్నాడు. ఆటో సజెష్చన్ అంటే ఏమిటో తెలుసుకోవాలి. సైకాలజీ చదవాలి. ఈ మధ్య భాస్కర్రావు కింద వాటాలో అమ్మాయిని కిటికీ సందులోంచి రహస్యంగా ప్రేమిస్తున్నాడు. ఆ అమ్మాయిక్కూడా తెలీదు. మేం చూట్టం లేదనుకుంటున్నాడు పాపం. ఇక పోతే సారథి విషయం బ్రహ్మరుద్రుడిక్కూడా తెలీదు. నేననుకోవడం అసలు అతని క్కూడా తెలీదేమోనని. అందుకే ప్రేమ గుడ్డిదన్నారు పెద్దలు. అనగా గుడ్డివారు ఎక్కువగా ప్రేమిస్తారని దాని అంతరార్థం అయియుంటుంది.

## జూలై 9 :

'సుజన మిత్ర'కు ఇంటర్వ్యూకు వెళ్ళాను. నాన్నగారు రూమ్‌లో వదిలిపెట్టిన పంచ, లాల్చీ, ఖద్దరు వేస్టు కోటు వేసుకున్నాను. నిన్న సాయంత్రమే ఫైలూ, పైపూ కొన్నాను. భాస్కర్రావు నడిగి కళ్లజోడు తీసుకున్నాను. పైపు నోట్లో పెట్టి అద్దంలో చూసుకుంటే యమఫోజులో ఉన్నాను. 'గుజ్జనగూళ్లు' పత్రికలో హిమకిరణ్ పేరుతో రాసిన 'తల్లి మాట వినవలెను' మొదలైన కథలు, రెండేళ్ల క్రితం పెట్టె అడుగున పడేసిన 'వలపుల మిఠారి' అముద్రిత అపరాధ పరిశోధన గ్రంథం, జాతీయ సమైక్యతా వ్యాసం, ఇండియన్ ఎక్స్‌ప్రెస్ పత్రిక ఒకటి ఫైల్లో పెట్టాను. వెళ్లబోతూ హఠాత్తుగా జ్ఞాపకం వచ్చి ఎందుకైనా మంచిదని నాన్నగారి గాంధీ టోపీ కూడా పెట్టుకున్నాను. పత్రికాఫీసులో ఎడిటర్‌గారి గదిలోకి వెడుతూంటే ప్యూను రెక్కుచ్చుకుని ఆపాడు. నోట్లో పైపు తీసెయ్య మన్నాడు. తీసేసి లోపలి కెళ్లాను. నా వేషం చూచి ఎడిటర్ డంగై పోయి ఉంటాడు బహుశా. ఒక వార్త ఇచ్చి అనువాదం చెయ్యమన్నాడు. "ఆపమన్నా ఆపకుండా గంటకు 50 మైళ్ల వేగంతో గత ఆదివారం ఉదయం 10 గంటలకు హైదరాబాదు లోని కోఠినుంచి సుల్తాన్ బజారుకు వెళ్తున్న ఒక కారుతో వెంకటేశ్వరరావు అనే 20 సంవత్సరాల వయస్సుగల ఒక కాలేజీ విద్యార్థి ఢీకొనబడిన సందర్భంలో అతడు అసువులు బాసినట్లు పోలీసులచే అందజేయబడిన వార్తల వల్ల తెలుస్తున్నది" అని ఒకే ఒక్క వాక్యంలో రాసి పారేశాను. ఎడిటర్‌గారు అదిరిపోయారు తర్వాత నాన్నగారిపేరు, ఊరుఅడిగి "ఓర్నీ... నువ్వటోయ్... ముకుందరావు కొడుకువా? ముందే చెప్పావు కావేం? నేను, మీ నాన్న క్లాస్‌మేట్స్, రూమ్మేట్సువోఁయ్. కలిసి వండుకుతిన్నాం. ఆ మధ్య కనిపించి 'మావాడి కేవఁన్నా పార్టైమ్ జాబ్ యివ్వరాదటోయ్' అన్నాడు. 'చదువు చెడిపోతుందోయ్' అన్నాను. సరే.... రేపే వచ్చి జాయనవ్వు" అన్నాడు ఆయన. రోజూ కాలేజీ విడిచి పెట్టగానే వచ్చి మూడుగంటల సేపు పని చేస్తానని చెప్పాను. సరేనన్నాడు. జీతం యాభై రూపాయలిస్తానన్నాడు. కాదు 80 ఇవ్వమన్నాను. "మాది చిన్న పత్రికోయ్. అంత యివ్వలేం" అన్నాడు. పోనీ 70 ఇమ్మన్నాను. 'ముందుగా యాభైలో చేరవోయ్. తర్వాత చూద్దాం" అన్నాడు. అసలు వంద అడిగితే 70కి దిగివచ్చేవాడు. పొరపాటైపోయింది. సరే... ఎంతైనా నాన్నగారి ఫ్రెండు గారు కదాని ఒప్పుకున్నాను.

## జూలై 16 :

శాంతారాం గారి కొత్త పిక్చరొచ్చిందని లాక్కెళ్లాడు భాస్కర్రావు. ఆట మొదలు పెట్టగానే ఒకావిడ తామర పువ్వులో నుంచుని పువ్వులు జల్లుతోంది. ఈ పిక్చరిదివరకే

చూశాను. వట్టి బోరు అంటూ వచ్చేస్తుంటే భాస్కర్రావు రెక్కుచ్చుకు లాక్కొచ్చి కూచ్చోబెట్టాడు. తీరా చూస్తే ఆ తరవాత కథంతా వేరు. ఇదొరకు చూసింది కాదు. శాంతారాం గారి ప్రతి పిక్చర్లోనూ ఆవిడలా వచ్చి పూలు జల్లి పోతూ వుంటుందిట. తామర పువ్వులో మనిషి నుంచోవడం వాస్తవికతకు దెబ్బ అన్నాను. భాస్కర్రావు ఏకీభవించలేదు. మొత్తానికి చిత్రం అపూర్వ కళాఖండం. నటీనటులందరూ తమ పాత్రలకు న్యాయం చేకూర్చారు. ఛాయాగ్రహణం నేత్ర పర్వంగా వుంది. శబ్ద గ్రహణం నిర్దుష్టంగా వుంది. సంగీతం వీనుల విందుగా నుండి చిత్రానికి ప్రాణం పోసింది. నృత్యాలు పసందుగా నున్నవి. దర్శకుడు అభినందనీయుడు. ఈ చలన చిత్రంపై రేపు 'సుజన మిత్ర'లో సమీక్ష వ్రాయాలి. పక్కింటికోతి, ఆమె స్నేహితురాలు కూడా ఈ చిత్రానికి వచ్చిరి.

**జూలై 22 :**

ఇక్కడినుంచి అక్కడికి ఎంత దూరమో అక్కణ్ణించి ఇక్కడకు అంతే దూరం. దీనికీ దానికీ ఎంత తేడానో దానికీ దీనికీ సరిగ్గా అంతే తేడా. ఇది ఐన్‌స్టీన్ థీరీ. ఇంతమాత్రం కనిపెట్టినందుకే ఆయన్ని యుగపురుషుడని జనం చెప్పుకుంటున్నారంటే సిగ్గుచేటు. ఆయన థీరీ తప్పని రుజువు చేయడానికి నిమిషం పట్టదు. 30వ తారీఖుకి 1వ తారీకుకి తేడా ఒక్కరోజే. కాని ఒకటో తారీకుకి ముప్ఫయ్యవ తారీకుకి తేడా 29 రోజులు. ఐన్‌స్టీన్ థీరీ దెబ్బకి ఎగిరిపోయింది. శ్యాంబాబుతో దీని విషయం చెప్పగా 'నీకు నోబెల్‌ప్రైజ్ ఇవ్వాలోయ్' అన్నాడు. అందులో అతిశయోక్తిలేదు. మా యిద్దరి అభిప్రాయాలూ అన్నింటిలో అలా ఏకీభవిస్తూ వుంటాయి.



ఇవాళ మావయ్య గారింటికెళ్ళాను. అత్తయ్య పెసరట్లు పెట్టింది. మావయ్య అటక మీంచి పాత గ్రాంఫోను తీశాడు. పాదుకా పట్టాభిషేకం రికార్డులు పెట్టాడు. అందులో 'నాకీ రాజ్యము కావలెనంటి నటే' పద్యాన్ని భరతుడు చాలా భావయుక్తంగా పాడాడు. తరువాత మావయ్య కురుక్షేత్రంలో ధర్మరాజు పద్యాలు పాడాడు. నేను హార్మణీ మీద శ్రుతి పెట్టాను. వర్లక్ష్మి మాత్రం తలుపు చాటునుంచి ఒకటే నవ్వు. ఏమిటో... ఎవరి పిచ్చి వారికానందం. వర్లక్ష్మి నవ్వు చిరుమువ్వలు మ్రోగినటుల, సెలయేరులు దుమికినటుల వుంది.

## జూలై 29 :

ఇవాళ పత్రికలో ఉపరాష్ట్రపతి డాక్టర్ రాధాకృష్ణన్‌గారి ఉపన్యాసం చదివాను. ప్రతి మానవునికీ జీవితంలో చిత్తశుద్ధి అత్యవసరమని ఆయన ఉద్ఘాటించారు. కాని, నా ఉద్దేశంలో మనిషికి చిత్తశుద్ధితో పాటు దేహ శుద్ధికూడా అవసరం. ఆరోగ్యమే మహాభాగ్యం. ఆరోగ్యం బావుండకపోతే మనస్సు బావుండదు. అనగా దేహశుద్ధిలేనిదే చిత్తశుద్ధిరాదు. ఇహపోతే డొక్క శుద్ధి. ఇది కూడా చాలా అవసరమే. పక్కింటి కోతి, వాళ్ళ చెల్లాయి, ఇంకా కొంతమంది కాలేజీ అమ్మాయిలూ రేపు గండిపేట పిక్నిక్కి వెళ్తారుట. ఇవాళ సాయంత్రం వాళ్ళ డాబామీద ఎక్కి బిగ్గరగా మాట్లాడుకుంటున్నారు మాకు వినబడాలని. నేను, భాస్కర్రావు, సారథి, శ్యాంబాబు, బాబూరావు కూడా రేపు గండిపేట పిక్నిక్ వేద్దామనుకున్నాము. రేపు కాలేజీకి సెలవు పెట్టాలి. ఏం వంకపెడితే బావుంటుందో తెలీటంలేదు.

'టుది ప్రిన్సిపాల్...

సార్...

యాజయాం సఫరింగ్ ఫ్రమ్ మై బ్రదర్స్ మ్యారేజ్ ఐ రిక్వెస్ట్‌యూ....'

## ఆగస్టు 7 :

చర్మసౌందర్యము కొరకు గ్లామర్ టాయ్‌లెట్ సోప్‌నే వాడవలయును రేపట్నించీ. సౌందర్యమే అన్నింటికంటే ప్రధానం. ఎందుకంటే అసలు ఫస్ట్ యింప్రెషన్ మొహాన్ని చూసే కదా కలిగేది? ఈ మధ్య మీసాలమీద శ్రద్ధ తీసుకోవడం లేదు. అవి కిందికి వాలిపోతున్నాయి. అది వాటి నైజం. మొన్న చూసిన టెక్నికలర్ టెలిస్కోప్ చిత్రంలో చెంఘిజ్ ఖాన్‌కీ మీసాలు కిందికే వున్నాయి. చైనా వాళ్ళకీ అంతే.

బాగా చదవాలనీ, చదివిన దానికి రెట్టింపు ఆలోచించాలనీ, అప్పుడే బుద్ధి వికసిస్తుందనీ నిన్న ఒకాయన ఉపన్యాసంలో చెప్పాడు. అందులో అత్యుక్తి దోషం ఆవంతైనా లేదు. రోజూ కనీసం ఇరవై పేజీలు చదవాలనీ, నలభై పేజీలు రాయాలనీ, 80 పేజీలు ఆలోచించాలనీ ప్రతిజ్ఞ చేశాను. మనిషన్న వాడికి రోజూ ఒక ప్రతిజ్ఞ, సాధన, విజయం వుండాలి. లేకుంటే బ్రతుకు వృధా. చదువు వృధా.

## ఆగస్టు 12 :

రూములో మేము ప్రేమ కబుర్లు చెప్పుకుంటుండగా హఠాత్తుగా నాన్నగారు వచ్చారు

నక్కదోసకాయ తింటూ. కోటు జేబులోంచి మూడు నక్కదోసకాయలు తీసి మాకు యిచ్చి తినమన్నారు. తినడానికి సందేహిస్తుండగా 'ఇవి దోసకాయలు కావు. విటమిన్ల ముద్దలు' అన్నారు. ఆయన జేబుల్లో యింకా అరటిపళ్ళు పటికబెల్లం, ఖర్జూరపు కాయలు, పచ్చి వేరుశనక్కాయలు మొదలైనవి వున్నాయి. హైదరాబాదు వచ్చినప్పుడల్లా ఆయన భోజనం అవే. హోటలుకు వెళ్ళరాదని ఆయన మతం. ఈ వూళ్ళో వున్నన్నాళ్ళూ ఆయన పొద్దున పూట చిక్కడపల్లి వెంకటేశ్వరస్వామి గుడికి వెళ్ళి దేవుడి ప్రసాదం పులిహోర, వడలు, సాతాళించిన సెనగలు మొదలైనవి కొనుక్కు తింటారు. 'హోటల్లో ఆ చెత్త తినేబదులు ఇవి తినరాదూ' అని ఆయన సలహా యిచ్చారు. నిజమే. ఆ పనే చెయ్యాలి యిహ నుంచి. పుణ్యం కూడా కలిసొస్తుంది. అంతదూరం నడిస్తే ఎక్సర్‌సైజ్ చేసినట్లూ అవుతుంది. భోజనానంతరం నాన్నగారు డాబా మీద వెన్నెట్లో చాపవేసుకుని పడుకుని పదకొండు గంటల దాకా పేటంతా వినిపించేటట్లు శ్రావ్యంగా భాగవతం పద్యాలు చదివారు. ఎదురుగా హాస్టల్ కుర్రాళ్ళు, పక్కింటి కోతీ వాళ్ళూ డాబాలెక్కి చోద్యం చూస్తున్నారు ఎవరా అరిచేదని. నాన్నగారింకా వారం రోజులుంటార్ట. సరదాగా సిగరెట్టు కాలుద్దామంటే వీల్లేదు కదా.

## ఆగస్టు 18 :

'ఆగస్టు 13వ తేదీ ఆదివారం మిట్టమధ్యాహ్నం మొగలితుర్రు గ్రామంలో పొలములో నున్న భర్తకొరకు తెచ్చుచున్న తన తలపైగల అన్నపు గిన్నెలో పడిన పిడుగు కారణంగా గోనెల కామాక్షమ్మ (48) అనే స్త్రీ హఠాత్తుగా మరణించినట్లు చెప్పబడుతున్నది'. అతి విచిత్ర వార్త. ఇవాళ పత్రికలో నేను అనువదించిన వార్త యిది. 'అశనిపాతానికి అబలమృతి' అని హెడ్డింగ్ పెట్టాను. అనువాదంలో బాగా చెయ్యి తిరుగుతోందని ఎడిటర్‌గారు మెచ్చుకున్నారు. (చెయ్యితో పాటు బుర్రకూడా తిరగాలి. అప్పుడే ఫలితం దక్కుతుంది.) ఆఫీసునుంచి వచ్చి పిట్టగోడమీద కూర్చుని వెన్నెట్లో సిగరెట్ తాగుతుండగా నాన్నగారు వచ్చారు. గబుక్కున సిగరెట్‌ని రోడ్డుమీదికి విసిరేశాను. బహుశా చూసే వుంటారు. తర్వాత ఆయన ప్రకృతి వైద్యం గురించి వుపన్యసించారు. సిగరెట్లు తాగేవాళ్ళు ఎంత దౌర్భాగ్యులో వివరించారు.

## ఆగస్టు 25 :

కాలేజీలో చిన్మయానంద గారి వేదాంతోపన్యాసానికి వెళ్ళాను. హృదయమంతా ఒక పవిత్ర దేవాలయంగా మారిపోయింది. మనోక్షేత్రంలో వైరాగ్య బీజములు అంకురించుచున్నవి. ఈ ప్రేమలు, ప్రకృతి వైద్యాలు అన్నీ మిధ్యయే కదా! బ్రతుకే బుద్బుద

ప్రాయము కదా! ఈ మూణ్ణాళ్ళ ముచ్చటకే యింత డాబు, దర్పం. జానెడు పొట్టకోసం యిన్నిపాట్లు. ఆహా... దేవా! ఏమి నీ లీల! వేదాంతం మీద పత్రికలో వ్యాసం రాయాలి. వేదాంతం అనగా లోక కళ్యాణము కొరకు కొందరు మానవోత్తముల మహామేధస్సుల నుండి జనించిన వైరాగ్య భావపరంపర, తన్నిగూఢమైన సత్యస్వరూపము. నాన్నగారు ప్రెజంటు చేసిన ఆంజనేయదండకం, బ్రహ్మంగారి తత్వాలు పెట్టె అడుగునుంచి తీశాను. రోజూ పారాయణం చేయాలి. నాలో నాస్తికత పెరిగిపోతున్నదని హెచ్చరించడానికి కాబోలు ఈ మధ్య ఒకసారి హనుమంతుల వారు కలలోకొచ్చారు. అపరాధం జరిగింది. శ్రీ ఆంజనేయం, ప్రసన్నాంజనేయం. ఓం శాంతి: శాంతి:. ఆ భక్తి పారవశ్యంలో అట్నించి అలా విప్రనారాయణ సినిమాకి వెళ్లాం నేను, సారథి. ఓహో ఎంత పవిత్రకర జీవితం. బి.ఏ. అయిపోగానే మా ఊళ్ళో మామిడి తోటలో ఆశ్రమం వేసుకుని రంగధామునికి మాలాకైంకర్యం చేసుకోవాలని పించింది. వీలైతే గుండుకూడా చేయించుకోవాలి. ఎంత కలుషితమైపోయింది కలియుగ జీవితం!

## ఆగస్టు 31 :

నరుడా, జీవితము బుద్బుదప్రాయము. భవబంధములలో పడెదవేలా. మూణ్ణాళ్ల ముచ్చట అన్నాడు బ్రహ్మంగారు. బుద్బుద ప్రాయము గనుకనే అంతా గబగబా అనుభవించేస్తున్నాను. మళ్ళీ మళ్ళీ దొరకదు మానవ జన్మ. ఉన్నప్పుడే అనుభవించు. ఒక్క రోజు బతికినా రాజా లాగా ఝూమ్మని బతుకు. తిను, తాగు, సుఖించు నరుడా అన్నాడు ఉమర్‌ఖయాం గారు. కొంచెం నిదానంగా ఆలోచించి చూస్తే ఆయన వాదమే సమంజసంగా కనిపిస్తుంది. ఎప్పుడో చస్తాం గదా అని రోజూ ఏడుస్తూ కూచుంటామా, తంబూరా మీద తత్వాలు పాడుకుంటూ. నిక్షేపం లాంటి బతుకంతా ముక్కు మూసుకొని, మడికట్టుకుని, రుద్రాక్షలు తిప్పుతూ కార్తీక స్నానాలు చేస్తామా. ఆంజనేయ దండకం, బ్రహ్మంగారి తత్వాలు కోతివాళ్ల తమ్ముడి కిచ్చేశాను అచ్చంగా. బతికినన్నాళ్లూ సూట్లు వేసుకోవాలి. సైపు తాగాలి. సినిమాలు చూడాలి. షంషేర్. వయస్సు మళ్లిన, ఎముకలు కుళ్లిన వృద్ధుల నందరి చంపండి.

## సెప్టెంబరు 6 :

సాయంత్రం నగర పొలిమేరలకు షికారు వెళ్లాను. దాదాపు ఐదు మైళ్లు నడిచాను. ఫర్లాంగు రాళ్లని తీక్షణంగా లెక్కపెట్టుకొంటూ పోయాను. ఒక మైలు రాయికీ ఇంకో మైలు రాయికీ మధ్య ఏడు ఫర్లాంగురాళ్ళే ఉన్నాయి. ఐదు మైళ్లూ ఇలాగే ఉన్నాయి. పొరపాటు లెక్క పెట్టానేమోనని మళ్లీ తిరిగి వచ్చేటప్పుడు లెక్క పెట్టాను. మైలు రాయికీ మైలు రాయికీ

మధ్య సరిగ్గా ఏడు ఫర్లాంగురాళ్లే ఉన్నాయి. ప్రజాస్వామ్యంలో జరిగే పచ్చి మోసాలకి ఇది చక్కని తార్కాణం. మైలుకి ఎనిమిది ఫర్లాంగులని తెలీని వాళ్లంతా మననీ, దేశాన్నీ ఉద్ధరించడానికి మహా నాయకులుగా, మంత్రులుగా ఆవిర్భవిస్తారు. ఎంత కపటం, ఎంత దారుణం. దీనిమీద ఎడిటోరియల్ రాయమని చెప్పాను ఎడిటర్ గారికి. ముందు అసలు ఇది నిజమో కాదో మళ్లీ ఇంకోసారి లెక్క పెట్టించి. నిజమే అయితే తప్పకుండా సంపాదకీయం రాస్తానన్నాడు ఆయన. ధనవంతులకూ, బీదవంతులకూ ప్రముఖ తేడా ఉంది. ధనవంతులకు సుపీరియారిటీ కాంప్లెక్సు ఉంటుంది. బీదవంతులకు ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సు ఉంటుంది. కానీ సుపిరియారిటీ కాంప్లెక్సు ఎప్పుడూ ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సులోంచే పుట్టుకొస్తుందిట. సారాంశం : ధనవంతు లెప్పుడూ బీదవంతుల లోంచే పుట్టుకొస్తూ ఉంటారు. దీనిమీద సుజన మిత్రలో వ్యాసం వ్రాశాను. హిమకిరణ్ పేరుతో వరసగా రాస్తున్నాను. నా వ్యాసాలు చాలా హాస్యాస్పదంగా ఉంటున్నాయని ఉత్తరాలు వస్తున్నాయట. చాలా గర్వకారణంగా ఉంది. నేను చేరింతరువాత పత్రిక సర్క్యులేషన్ 20 కాపీలు పెరిగిందిట.

విజయోస్తు, దిగ్విజయోస్తు.

## సెప్టెంబరు 12 :

ఈ మధ్య మగవాళ్లకంటే ఆడవాళ్లకి పెళ్లిళ్లు ఎక్కువగా అవుతున్నట్టున్నాయి. క్రమంగా ఆడవాళ్ల జనాభా పెరగటమే ఇందుకు కారణం అయుంటుంది. నా మొహంలో అమాయకత్వము, అయోమయత్వము పోవాలంటే కళ్లజోడు పెట్టడం తప్ప మార్గాంతరం లేదని చెప్పాడు బాబూరావు. నేను మానసికంగా రౌడీని అవుతున్నప్పటికిన్నీ భౌతికంగా కాలేకపోతున్నాను. కళ్లజోడు పెట్టితే మంచి డిగ్నిటీ వస్తుంది. అభిరుచి వలెనే రుచి కూడా కేవలం మానసిక మైనదని ఈ రోజు గ్రహించాను. ఒకానొక పదార్థము యొక్క రుచిని గ్రహించునది నాలుక కాదు. మనస్సు. ఉదా: ఇవాళ హోటల్ వాడు రసం గిన్నెలో స్పెషల్ సేమియా పోసి పంపించాడు. నేను మామూలుగా రసమే గాబోలు ననుకొని పాయసం అన్నం లో కలుపుకొని తినేస్తున్నాను కబుర్ల ధ్యాసలోపడి. సారథి ఒకటే విరగబడి నవ్వటం. అతను చెప్పేవరకు తెలిలేదు నేను తినేది పాయసమని. తర్వాత తియ్యగా కనిపించింది. అనగా రసము అనే భావముతో తినినచో పాయసము కూడా రసమువలె ఉండునన్నమాట. చాలా ఆశ్చర్యం వేసింది.

## సెప్టెంబరు 19 :



కోతి నన్ను ప్రేమిస్తూందన్న అనుమానం దృఢపడింది. లౌలెటర్ రాస్తే అనుమానం పటాపంచలై పోతుందని భాస్కర్రావు సలహా ఇచ్చాడు. మక్కెలిరగ్గొడతారు జాగ్రత్త అన్నాడు సారథి. మరెట్లా అనడిగాను. ఉపాయం చెప్పాడు. అతను పైకి అలా కనిపిస్తాడు గాని అఖండుడు. కోతి ఒక్కతే ఉండగా చూసి ఒక తెల్లకాయితాన్ని ఉండగా చుట్టి వాళ్ల బాల్కనీ లోకి విసిరాను. కోతి చురచురా చూసి పటపటా వళ్లు కొరుకుతూ, తిప్పుకుంటూ వెళ్లిపోయింది. హడలిపోయాను. గబగబ రూమ్‌లోకి పరుగు తీసి తలుపులు బిడాయించాను. గుండె యమస్పీడులో కొట్టుకొంటూంది. వాళ్ల నాన్నగారితో చెప్పి తన్నిస్తుందేమో దేవుడా అని భయపడ్డాను. నీకేం ఫర్వాలేదు, అది ఒట్టి కాయితమేగదా, అయినా నువ్వు పడేసి నట్టు రుజువేది అన్నాడు సారథి. సాయంత్రం నెమ్మదిగా పిట్టగోడదాకా డేక్కుంటూ వెళ్లి చూశాను. ఆ కాయితం ఉండ అక్కడే ఉంది. తర్వాత పనిమనిషి ఊడుస్తూ దాన్ని తీసి పారేసింది. నా హృదయంపు ఉండ. బాబూరావు బజారుకు తీసుకెళ్ళి కళ్లజోడు కొనిపించాడు నా చేత. కళ్లజోడు పెట్టుకుంటే జయప్రకాష్ నారాయణ్ పోలికలు వచ్చినట్టు అనుమానంగా ఉంది. మొత్తానికి ఫోజుగా ఉంది. త్వరలోనే నాయొక్క భౌతిక అమాయకత్వము పోతుంది.

## సెప్టెంబరు 25 :

'మసురా' అనే ఆయనను నా అభిమాన రచయితగా పరిగణించాను. ఆయన వర్ణనలు అమోఘంగా ఉంటాయి. చీకటితుట్టెలు తుట్టెలుగా రాలుతోందనీ, వెన్నెల పిటపిట లాడుతోందని వర్ణిస్తాడు ఆయన. అంతగొప్ప ఎక్స్‌ప్రెషన్ మరో రచయితకు లేదు. ఆ వర్ణనలకు అక్షర లక్ష లివ్వచ్చునన్నాడు భాస్కర్రావు. కళ్లజోడు ఇబ్బందిగా ఉంది. కళ్లజోడు పెట్టినప్పటినుంచి ముక్కుకి, చేతికి అవినాభావ సంబంధం ఏర్పడింది. ఈ మధ్య సిగరెట్లు జోరుగా తాగుతున్నాను. తగ్గించాలి. "డోంట్ డ్రింక్ సిగరెట్స్" అని ఓ కాగితం మీద రాసి జేబూలో పెట్టుకుంటున్నాను. సిగరెట్ తాగాలనిపించినప్పుడల్లా జేబులోంచి ఆ కాగితం తీసి చూసుకుంటా వుండాలి. సిగరెట్లు తాగే వాళ్ళంటే వర్లక్ష్మికి బలే అసహ్యం.

## సెప్టెంబరు 30 :

ఉమెన్స్‌కాలేజీలో ఏదో ఫంక్షన్ జరిగితే వెళ్ళాను. వర్లక్ష్మి అమోఘంగా పాడింది. లేక ఆమె పట్ల నాకు గల ప్రేమ భావము వల్ల అలా అనిపించిందో! అసలు సంగీతము యొక్క విశిష్టత ఏమిటి అని తీవ్రంగా ఆలోచించాను. సంగీతమనగా పాములు, పశువులు, శిశువులు మున్నగు వాటిని రంజింపజేయుచూ, రాళ్ళను, హృదయములను కరిగించు ఒకానొక దివ్యశబ్ద విశేషము. అది పూర్వజన్మ సుకృత వశమున అబ్బును. సువర్ణమునకు తావి అబ్బినట్లు వర్లక్ష్మికి సౌందర్యముతో పాటు సంగీతము కూడా అబ్బినది. ధన్యురాలు. వర్లక్ష్మిని అభినందించడానికి మావయ్య గారింటికెళ్ళాను. గుమ్మంలోనే వెంకటేశం ఎదురుపడి లెక్కచెప్పమన్నాడు. బజారు బిల్లుల లెక్క. బద్దింపు పద్ధతిని చేశాను. రాలేదు. అప్పుడు డోకరాల పద్ధతిని చేశాను. అయినా రాలేదు. చివరికి పుస్తకంలో ఆన్సరు చూసి చేస్తే చచ్చినట్టు వచ్చింది. అట్నించి నరుక్కురావడం అంటారు దీన్నే. జీవితంలో యిది అత్యంత అమూల్య సూత్రం. వర్లక్ష్మి నా యిల్లాలు అయితే వాయిదాల పద్ధతిపై వంద కొబ్బరికాయలు కొడతానని తిరపతి దేవునికి మొక్కుకున్నాను. మనోభీష్ట సిద్ధిరస్తు !

## అక్టోబరు 6 :

నా సౌందర్యారాధన రోజురోజుకీ పరాకాష్ట నందుకుంటోంది. జిజ్ఞాస పెరుగుతోంది. సౌందర్యాన్ని గురించి గంటల తరబడి ఆలోచించాను. సారాంశం : సౌందర్యమనగా చూడగానే మనస్సును ఆకట్టుకుని ఆహ్లాదపరచు ఆకృతి విశేషము. (ఉదా: వర్లక్ష్మి). దీనిలో ప్రకృతి సౌందర్యమనియూ, స్త్రీ సౌందర్యమనియూ, ఆత్మ సౌందర్యమనియూ మూడు రకములు గలవు. (ప్రకృతియే స్త్రీ యనియూ, సౌందర్యము భ్రాంతి అనియూ పురాణ శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు). ఆత్మ సౌందర్యము అను రకమునకు చెందినది నా సౌందర్యము. పెక్కు ముఖ్య విషయములను క్షుణ్ణముగా ఆలోచించి, ఆ నిర్వచనములను సంపుటీకరించ వలెనన్న ఆసక్తి కలిగినది. అది ముందు తరముల వారికి పనికివచ్చును. ఇష్టకార్యసిద్ధిరస్తు!

('ఆంధ్రప్రభ' సచిత్ర వారపత్రిక 30.5.1962)



## అక్టోబరు 12 :

ఇవాళ అద్దంలో తీక్షణంగా చూసేసరికి అనతికాలంలో నాకు బట్టతల సంప్రాప్తించే

సూచనలు కనిపించాయి. మేధావంతుణ్ని అవుతున్నా ననడానికి ఇది నిదర్శనం అని చెప్పక తప్పదు. భాస్కర్రావుకిగానీ, సారథికిగానీ ఈ విషయం చెబితే నవ్వేస్తారు.

మహామహులందరూ ఒకప్పుడు కొందరి పరిహాసములకు గురికాబడిన వారేకదా. బట్టతల అనునది ప్రేమకు గొడ్డలి పెట్టు. (మేధస్సు గొడ్డలివంటిదని భావము)

## అక్టోబరు 20:

చైనావారు సరిహద్దు పొడవునా భారీ ఎత్తున కాల్పులు జరిపారు. దేశం అట్టుడికి పోయింది. (రూపకాలంకారం అనుకుంటాను. దేశానికీ అట్టుకూ అభేదం. మెట ఫారిక్ స్టేట్‌మెంట్) నాలో ఉడుకు రక్తం పొంగులు వారింది. దేశభక్తిని నిరూపించుకోడానికి ఇదే అదను అని నెహ్రూ గారు సందేశమిచ్చారు. కమ్యూనిస్టులకు మంచి ఛాన్సు. (రచయితలకి కూడా) చాలా రోజుల తర్వాత ఇవాళ మావయ్యగారింటి కెళ్ళాను. మావయ్య అటకమించి గ్రాంఫోను దింపి అర్జెంటు పనుందని వెళ్ళిపోయాడు. వేమూరి గగ్గయ్య రికార్డు పెట్టాను. పెద్ద శృతిలో మొదలెట్టి క్రమేణా శృతి తగ్గించి తగ్గించి అలా మంద్రాతి మంద్రంలోకి దిగి పోయాడు. 'అమోఘం అద్భుతం. బ్రహ్మాండమైన ఎక్స్పెరిమెంటు. ఈ మాదిరిగా ఒకే పద్యాన్ని 14 శృతుల్లో ఈ కాలపువాళ్ళు ఛస్తే పాడలేరు' అన్నాను ఆవేశంతో. వరలక్ష్మి కడుపు చెక్కలయ్యేట్టు నవ్వుతోంది. 'గ్రామఫోను కీ తగ్గిపోయి అలా పాడుతోంటే అద్భుతం అంటున్నాడు చూడవే' అంటూ వాళ్ళమ్మతో చెప్పి నవ్వుతోంది. నాకు షేమ్ అనిపించింది. కీ తగ్గిన మాట నిజమే కావచ్చుగానీ నిజంగా అలాంటి ఎక్స్పెరిమెంటు చేస్తే అది సంగీత చరిత్రలో చిరస్థాయి కాగలదు. ముందు తరాలవాళ్ళకి యెవరికో ఈ ఐడియా



తట్టి తీరుతుంది. నా మేధ యెప్పుడూ కాలంకంటే ముందు పరుగెత్తుతూ వుంటుంది. నవ్వు ఆరు రకములని కాబోలు శాస్త్రకారుడు వచించి యున్నాడు. అందులో వర్లక్ష్మి యీరోజు నవ్విన నవ్వు ఏ రకమునకు చెందునో. మోటారు సైకిలు తొక్కేయుగం యీ జన్మకు వుందో లేదో గదా, ఇష్ట ఫలసిద్ధిరస్తు.

## అక్టోబరు 24:

ఇంటాయన వచ్చి అద్దెకోసం గలాటా ప్రారంభించాడు. రెండు నెల్ల అద్దె తక్షణం యివ్వాలన్నాడు. ఇంత ఆలస్యంచేస్తే కుదరదన్నాడు. 'ఆలస్యమనగా నేమి' అన్నాను. 'రెండు నెల్లంటే ఆలస్యంకాదా' అన్నాడు. బుద్బుదప్రాయమైన మానవ జీవితంలో రెండు నెలలనగా

నెంత అన్నాను. ఆయన తెల్లపోయాడు. మళ్ళీ తేరుకుని వేదాంతం కట్టిపెట్టండి' అన్నాడు. "భారతీయ సంస్కృతికి వేదాంతమే వెన్నెముక. ఋగ్వేదకారుడు యేమన్నాడో తెలుసా" అంటూ మొదలెట్టే సరికి ఇహ కిక్కురు మనకుండా వెళ్ళిపోయాడు. నిత్యజీవితంలో 'వేదాంతము యొక్క ఆవశ్యకత ఎంతటితో తెలిసి వచ్చింది. అసలీ వేదాంతము వల్లనే భారతదేశము మనగలుగుచున్నది. ఈ వేదాంతము వల్లనే డాక్టర్ రాధాకృష్ణన్ ప్రసిద్ధుడయ్యెను. వేదాంతం మీద రేపు 'సుజనమిత్ర'లో వ్యాసం రాయాలి. మనస్సు బహు చంచలమైనది. మళ్ళీ సితార్ మీద మోజు పుట్టింది. ఇవాళ తిలక్ హాల్లో కచేరీ జరిగితే వెళ్ళాను. పైజామా, లాల్చీ వేసుకుని కొంచెం జులపాలు పెంచుకుని మెళ్ళో బంగారు గొలుసు వేసుకుని సితార్ వాయిస్తుంటే యమపోజుగా వుంటుంది. 'ఎయిమ్ హై' అన్నారు పెద్దలు.



## అక్టోబరు 28 :

బట్టతలకు మేధా సంపత్తికి గల అవినాభావ సంబంధమును గురించి యీరోజు బహుతీవ్రంగా ఆలోచించాను ఎంత ఆలోచించినా సమస్య తెగలేదు. (శ్రద్ధాశ్రయ హాస్యమనగా నిదియే). రోజూ యింత తీవ్రంగా ఆలోచిస్తే వారం రోజుల్లో బట్టతల వచ్చేస్తుంది. బట్టతల వస్తే ప్రేమించే అర్హతపోతుంది. పెళ్ళి అయిన తర్వాత ప్రేమయొక్క ఆవశ్యకత లేదు కనుక అప్పుడు బట్టతల వచ్చినా ఫరవాలేదు. ఈలోగా మేధావి (ఖర్వాటుడు) ని కాకూడదు. బట్టతలవల్ల అందము కుంటుబడుననుట నిర్వివాదాంశము. అయినా నెహ్రూ, రాధాకృష్ణన్, కృశ్చేవ్ మున్నగువారి కోవలో చేరుట కంటే అందము ప్రధానము కాదు కదా. అసలు అట్టే ఆలోచిస్తే దీనిమీద ఒక హ్యూమరికల్ వ్యాసము రాయాలనిపిస్తోంది. భారతదేశంలోని షెడ్యూలు కులాలు, జాతుల వారిని ఫ్రాన్స్ దేశంలోని నోబుల్స్‌తో పోల్చవచ్చు. ఇవాళ ఫ్రెంచి రివల్యూషన్ గురించి మేస్టారు బ్రహ్మాండంగా చెప్పారు. అరిష్టాలన్నింటికీ అబల కారణం. ఔరా!

## అక్టోబరు 31 :

భారతదేశం ఛస్తే తటస్థ విధానాన్ని వదిలిపెట్టదని నెహ్రూగారు చెప్పారు. మనం పాశ్చాత్యకూటంలో చేరాలని ప్రతిపక్ష నాయకులు వాదిస్తున్నారు. నేనీ విషయంలో పూర్తిగా నెహ్రూగారితో ఏకీభవిస్తాను. లేకపోతే మాటిమాటికీ విధానం మారుస్తూ వుంటామా? అది మన వ్యక్తిత్వానికే దెబ్బ. (షరా: మరీ అవసరమైతే మన అవసరాలకు అనుగుణంగా తటస్థ

అనే పదానికి అర్థాన్ని సవరించుకోవచ్చు - రాజ్యాంగ సవరణ మోడల్లో). అసలు బస్సును కని పెట్టినవాడు కొలంబస్సు అయివుంటాడని నా నమ్మకం. కష్టపడ్డ వాడికి కీర్తి దక్కక పోవడం మన మెల్లరం ఎరిగినదేకదా. చరిత్రకారులు ఈ విధంగా తనకు అన్యాయం చేస్తారని వూహించే కొలంబస్సు ఆ వాహనానికి తన పేరులో సగం పీకి బస్సు అని నామకరణం చేసి వుంటాడని నా అనుమానం. దీనిపై పరిశోధన సాగించవలసిన అగత్యం ఎంతైనా వుంది. ఈ మధ్య మరీ ఇంటలెక్చువల్ (మేధాసంబంధమైన) గొడవల్లోపడి స్త్రీ సౌందర్యాన్ని విస్మరిస్తున్నాను. ఆ విషయం జ్ఞాపకం వచ్చి చాలా బాధపడ్డాను. జీవిత మాధుర్యాన్ని చాలా కోల్పోయాను. పక్కింటి కోతిని చూస్తే జాలేసింది. పాపం ఈ మధ్య నేను ఆ అమ్మాయి కేసి చూట్టం లేదు. చిక్కి పోయింది. త్వరలో చిత్రకళా భ్యాసం ప్రారంభించాలి. టాగోర్ స్కూల్ ఆఫ్ ఆర్ట్‌లో ఇప్పటికే నాకు కొంత ప్రవేశముంది.

## నవంబరు 4 :



భాస్కర్రావు హిప్నాటిజం ప్రాక్టీసు చేస్తున్నాడు. తెల్లారు ఝామునలేచి స్నానంచేసి ముఖాన పెద్ద కుంకుం బొట్టు పెట్టుకుని పద్మాసనం వేసి కూర్చుంటున్నాడు. ఎదురుగా గోడమీద పెద్ద చక్రం గీసి, మధ్యలో చుక్క పెట్టి దానికేసి తీక్షణంగా చూస్తున్నాడు. హిప్నటైజ్‌చేస్తే ఎవరినైనా సరే ఐన్‌స్టీన్ అంత గొప్పవాడిగా, లేదా రాంబాబు అంత చవటగా తయారు చేయచ్చుట. నాకు వొళ్ళు మండి పోయింది. నేను ఐన్‌స్టీన్ అంత గొప్పవాణ్ణి కావడం అసంభమని అతని భావం. పూర్‌ఫెలో. పొద్దున్న తలంటి పోసుకుని తల తుడుచుకుని, దువ్వు కోకుండా అలాగే అద్దంలో చూసుకుంటే మొహంలో కొంచెంగా ఐన్‌స్టీన్ పోలికలు కనిపించాయి. జుట్టు అలాగే వుంచుకుని, మంచి మూడ్‌లోకి వెళ్ళి థియరీ ఆఫ్ రెలెటివిటీని గురించి థింక్‌చేస్తూ ఫొటో తీయించుకోవాలి. (దుబ్బుమీసం పెంచితే మరీ మంచిది) ఏమో! ఎవరు ఏ నాటికి ఎంత గొప్పవారు కానున్నారో ముందు తెలుస్తుంది గనకనా. మానవునికీ భూమికీ ఏదో అవినాభావ సంబంధం వుందని నా అనుమానం. ఎందుకంటే భూమిలోనుంచి పంటలు మొదలగునవి పండుతాయి. వాటి వల్లనే మనిషికి తిండి లభిస్తుంది. తిండి లేకపోతే మనిషి లేడు. మనిషి మట్టిలో నుంచే పుట్టాడంటారు ఇందుకేగామోసు. ఈమధ్య ఇటువంటి

బ్రిలియంట్ ఐడియాస్ ఎన్నో తట్టుతున్నాయి. ఏం లాభం? గుర్తించేవాళ్ళు లేరు.

## నవంబరు 9 :

సత్యజిత్‌రాయ్ అనే ఆయన తీసిన 'పథేర్ పాంచాలీ' సినిమా చూశాం నేనూ సారథీ. పిక్చరు ఫర్వాలేదు. అక్కడక్కడ సాంకేతిక లోపాలు కొన్ని వున్నా మొత్తం మీద బాగానే వుంది. దర్శకుడు కృషి చేస్తే పైకి రాగలడని ఆశిస్తున్నాను. దీని మీద 'సుజన మిత్ర'లో సమీక్ష రాశాను. పాపం నెహ్రూగారి తాపత్రయం చూస్తోంటే జాలేస్తోంది. నా వంటి నవయువకుల భుజస్కంధములపై భారము నుంచి ఆయన ఇక విశ్రాంతి తీసుకొన కూడదా? లేకున్న ఒక రాజకీయ పాఠశాలను బెట్టి తటస్థ విధానము, శాంతియుత సహజీవనము, సోషలిజము మున్నగు విషయాలపై మంత్రులచే పాఠములు వల్లె వేయించ వచ్చునుగదా. తాపత్రయం అంటే మూడు తాపములు అని అర్థం అయియుంటుంది. (కవిత్రయంలాగా). వాటిల్లో ఒకటి విరహతాపం కావచ్చు. ప్రస్తుతం నాకున్నది అదొక్కటే. కోతి పాలయలుక వహించినది.

## నవంబరు 13 :



భారతదేశంలో ఎవ్వరికీ బ్రతికుండగా కీర్తి రాదుట. చచ్చిపోయిన తర్వాత చవటకి కూడా బోలెడు పేరు వస్తుందిట. అందుకని భాస్కర్రావు ఆత్మహత్య చేసుకుందామనుకున్నాట్ట. కాని తన ప్రేయసిని ఇంకెవడైనా పెళ్ళిచేసుకుంటాడేమోనని గావోను ఆత్మహత్య చేసుకోకుండా యింకో పథకం వేశాడు. తను ఆత్మహత్య చేసుకుంటున్నట్లు ఉత్తరం రాసిపెట్టి ఎక్కడికో వెళ్ళిపోతాట్ట రహస్యంగా. అతను చచ్చిపోలేదన్న సంగతి నాకు, సారథికి, తన ప్రేయసికి తప్ప ఎవ్వరికీ తెలీకూడదట. (అమ్మాయికి తెలీకపోతే యింకెవర్నైనా పెళ్ళిచేసుకోవచ్చు - అందుకని) అతని ఆత్మహత్య వార్తని నేను పత్రికల్లో వేయించి ప్రచారం చెయ్యాలిట. అతని పాటలనీ, పద్యాలనీ సారథి సభల్లో పాడాలిట. చందాలు పోగుచేసి 'అజ్ఞాతకవి అమరగీతాలు' అని పుస్తకం వేయించాలిట. అప్పుడు తనకి బోలెడు కీర్తి వస్తుందిట. రెండు సంవత్సరాలు పోయాక మళ్ళీ తను తిరిగి వచ్చి 'చూశారా గాడిదల్లారా బతికుండగా నా ప్రతిభని గుర్తించలేకపోయారు' అని జనానికి బుద్ధిచెబుతాట్ట.

పథకం ఆచరణ యోగ్యంగానే వుందని చెప్పాను. ఈ ఐడియా అతనికి తట్టింది కాబట్టి సరిపోయింది గానీ, నాకే తట్టివుంటే అతనూ, సారథీ కలిసి నన్ను తెగ ఏడిపించేసి వుండే వాళ్ళు. అసలు ఇదికూడా భాస్కర్రావు ఒరిజనల్ ఐడియాకాదు. మొన్న ఏదో సినిమా చూసి ఈ వాగుడు మొదలెట్టాడు. మనిషి కొక్క పిచ్చి మహిలో సుమతీ. బీర్, బ్రాందీ మున్నగునవి తాగితే అమాయకత్వము పోవునని, ముఖంలో గాంభీర్యము, కళ్ళల్లో చురుకుతనమూ వచ్చుననీ బాబూరావు సజెష్టు చేశాడు. అదికూడా ట్రై చెయ్యాలి. ప్రతిమనిషికీ తగు మాత్రపు రౌడీ కళ అవసరము. అదియే పురుష లక్షణము.

## నవంబరు 16 :

కృష్ణా గోదావరీ జలాల పంపిణీ వివాదంలో గుల్హాతీగారు ఆంధ్రకు అన్యాయం చేస్తున్నారని తిడుతూ 'సుజనమిత్ర'లో వ్యాసం రాశాను. ఎవరో రాజకీయ వాది వచ్చి "నువ్వెవరివి? ఈ వ్యాసం రాసే అర్హత నీ కెక్కడిది?" అన్నాడు. "మహామహా నాయకులే తిడుతుండగా  లేనిది నేనెందుకు తిట్టకూడదు" అని యెదురు ప్రశ్న వేశాను. ఆయన తెల్లబోయాడు. ఇదే సమయమని గట్టిగా బారెడు పొడుగున ప్రజాస్వామ్యంలో ప్రజల ప్రాథమిక హక్కుల మీద ఉపన్యాసం దంచేశాను. ఆయన కిక్కురు మనకుండా వెళ్ళిపోయాడు. తప్పదియ్యి. నేనంటే ఆఖరికి రాజకీయ నాయకులకి కూడా అలుసుగా వుంది. ప్రజాస్వామ్యంలో ప్రధానమంత్రి అయ్యేహక్కు ప్రతి ఒక్కడికీ వుందని నెహ్రూగారు ఒక ఉపన్యాసంలో చెప్పారు. ఇవన్నీ ఒట్టి కబుర్లు. ప్రతివాడికీ హక్కుంటే తనొక్కడే ప్రధాని యెందుకైనట్టు? నాలాటి యువకులు పూనుకొని దేశంలో రాజకీయాలను సంస్కరించవలసిన అవసరం యెంతైనా వుంది. 'సుజనమిత్ర'లో పార్టైమ్ జాబ్ బాగాలేదు. బి.ఏ కాగానే సొంతపత్రిక పెట్టాలి. తర్వాత ఎలక్షన్‌లో నిలబడాలి. సొంతపత్రిక వుంటే ప్రచారానికి ఖర్చు కూడా తప్పుతుంది.

## నవంబరు 20 :

ఎన్ని కష్టాలుపడితే అంత అనుభవజ్ఞుడవుతాడు. (ఈ లెక్కన యెంత దరిద్రుడవుతే అంత అనుభవజ్ఞుడన్నమాట). అలాగే ఎన్నిసార్లు జైలుకువెళ్తే అంత గొప్ప రాజకీయ నాయకుడవుతాడు. ఎలాగూ రాజకీయాల్లో దిగనే దిగాను గనక ఓసారి పన్లోపని జైలుక్కూడా వెళ్ళాలనివుంది. చైనా దురాక్రమణపై నిరసనగా సెక్రటేరియట్ ఎదుట ఆందోళనచేసి జైలు కెళ్ళాలి. వీలైతే దెబ్బలు కూడా తినాలి. (సప్రెస్డ్ డిజైర్). నెహ్రూగారు కూడా తిన్నారు. ఒక్కొక్కప్పుడు అతి సీరియస్ విషయాల్లోంచి కూడా హాస్యం పుట్టుకొస్తుందని కొత్తగా

తెలిసింది. ఎందుకంటే భాస్కర్రావు, సారథి కలిసి దొంగతనంగా నా డైరీ తీసి చదివి కడుపు చెక్కలయ్యేట్టు నవ్వుతున్నారు. నేను ఇంత సీరియస్‌గా, ఇంటలెక్చువల్‌గా విజ్ఞానాత్మక విషయాలు రాస్తుంటే ఇందులో నవ్వడాని కేముందో అర్థం కాలేదు. పూర్వం నవ్వారంటే అర్థం వుంది - ఆరోజుల్లో నేను అమాయకుణ్ణి గనక. ఇప్పుడు నా మెంటల్ ఏజ్ (మానసిక వయస్సు) చులాగ్గా 63 వుంటుంది. అంతా హనుమంతులవారి చలవ.



## నవంబరు 23 :

జ్ఞాపకశక్తికి నిదర్శనం. కురు చిరు నడు నిడు శబ్దంబుల రడల కచ్చు పరంబగునపుడు ద్విరుక్తటకారంబగు. ఇవాళ వర్లక్ష్మి ఎన్.సి.సి. డ్రస్సులో కనిపించింది. ఆ డ్రస్సులో భారత వీర నారీమణిలా, రుద్రమాంబ అనుంగు పుత్రికలా వుంది. పరికిణీ, వోణీకంటే ఈ వేషంలోనే బావుంది పకడ్బందీగా. మామూలు దుస్తులు ధరిస్తే ఒకానొక విధమైన అనిర్వచనీయ మైన వినయము, ఒద్దిక కనిపిస్తాయి. సీతా, అనసూయా, సావిత్రీ మొదలయిన పతి వ్రతామతల్లులు జ్ఞాపకం వస్తారు. సాయంత్రం మావయ్యగారింటికి కెళ్ళాను. వర్లక్ష్మి వీణ వాయిస్తోంది. మూర్తీభవించిన సరస్వతియా, లేక కోకిలయా అనిపించింది. మామయ్య మాత్రం మూర్తీభవించిన ఆముదంలా వున్నాడు. నాచెయ్యి చూసి వచ్చే జన్మలో నెపోలియనువై పుడతావు అన్నాడు. ఒట్టి క్రాక్. బహుశా కిందటి జన్మలో అయ్యుంటుంది.

## నవంబరు 27 :

ధరలు తగ్గించడం ఎలా? కొనకపోతే సరి. డిమాండ్ లేకపోతే చచ్చినట్టు ధర తగ్గుతుంది. సింపుల్ ఎకనామిక్స్. మన నాయకులంతా దీని కోసం ఇంతచేటు బుర్ర బద్దలు కొట్టుకోవడం దేనికో అర్థంకావడం లేదు. పంచదార ధర తగ్గించడం కోసం ప్రభుత్వం యిటీవల యెన్నో టన్నుల నిల్వలను మార్కెట్లోకి విడుదల చేసింది. దానివల్ల వాడకం యింకా పెరిగి, గిరాకీ హెచ్చి, ధర పెరిగే అవకాశం వుంది. అంతకంటే అసలు పంచదార వాడకంపై నిషేధం పెడితే సరిపోయేది. (మద్యపాన నిషేధం మోడల్లో). అపుడు ఠక్కున గిరాకీ తగ్గి, ధర తగ్గేది. భారతదేశం ప్రధానంగా వ్యవసాయదేశం. ప్రతి ఒక్కరికీ (వర్లక్ష్మితో సహా) నిర్బంధ వ్యవసాయ శిక్షణ యివ్వడం అవసరం. దీనిపై వ్యాసం రాశాను.

## డిసెంబరు 2 :

ఇవాళ క్షవరం చేయించుకున్నాను. ఖాళీ చేసేసిన ఇల్లులా, వెల్లవేసిన గోడలావుంది తలకాయి. అద్దంలో చూసుకునేందుకే సిగ్గేస్తోంది. జుట్టు తగ్గించద్దయ్యా అని మరీ మరీ



చెప్పాను నాయీ బ్రాహ్మణునితో. అద్దంలో చూసుకునేందుకు తల యెత్తినపుడల్లా మొట్టికాయ వేసినట్టు కిందికి నొక్కడం మొదలెట్టాడు. క్షవరం చేయించుకుంటే కనీసం వారంరోజుల వరకు అమ్మాయి లెవరూ ప్రేమించరు. సెలూన్ నుంచి రాగానే నన్ను చూసి భాస్కర్రావు ఒకటే నవ్వటం మొదలెట్టాడు. అసలు మన్మధుడైనా సరే. లేక పోతే దేవానందైనా సరే క్షవరం చేయించుకున్న రోజు నాలాగే వుంటారని వాదించాను. సారధి నాతో ఏకీభవించాడు. అయితే ఇందులో ఒక సుఖంవుంది. క్షవరం చేయించుకున్న రోజు తలకి బాగా చెమట పట్టింతర్వాత ఫానుకింద నుంచుంటే ఆ సుఖం కేవలం అనుభవై కవేద్యం. ఇంకా వారం రోజుల దాకా వర్లక్ష్మికి కనిపించకూడదు. రామాయణ కాలంలో క్షవరం దేనితో చేసుకునేవారో?

## డిసెంబరు 8 :

భాస్కర్రావు నేడు 'కలలు - వాని పుట్టు పూర్వోత్తరములు' అను విషయమై ప్రసంగిస్తూ మానవుని తీరని కోరికలు, అణచి వేయబడిన కోరికలు స్వప్నములలో తీరు చుండుననియూ, వాస్తవిక ప్రపంచమున అసంభవముగా గన్పట్టు పెక్కు విషయములు స్వాప్నిక ప్రపంచమున జరుగుచుండుననియూ ఉద్ఘాటించెను. అందులకే కాబోలు నన్ను కలలో పెక్కురు ఆడవాండ్రు ప్రేమించుచుందురు. కొండొకచో కలలు నిజమగునట. ఈ విషయమై నాకింకనూ ఆశాభావమున్నది. ఇవాళ సాయంత్రం అయిదుగంటలకు ఒక అందమైన అమ్మాయి కనిపిస్తే (ప్రయోగాత్మకంగా) వెనకాలే అనుసరించాను. నల్లద్దాల కూలింగ్ గ్లాసెస్ పెట్టాను. కాలరు పైకెత్తాను. నోట్లో పైపు, కాళ్ళకు ఫుల్‌బూటు బహుశ యమ ఫోజులో వుండి వుంటాను. అమ్మాయి వెనక్కి తిరిగినప్పుడల్లా ఏదో పనివున్నట్టు నటిస్తూ, అమ్మాయి ఎన్ని సందులు తిరిగితే అన్ని సందులూ



తిరిగాను. అమ్మాయి చివరికి ఒక ఇంట్లోకి వెళ్తూ నావంక కొరకొర చూసి 'రౌడీ వెధవ' అంటూ ఛళ్ళున తలుపు వేసేసింది. వెంటనే రిక్షా యెక్కి ఇంటికొచ్చి అద్దంలో చూసుకుంటే ఆశ్చర్యం వేసింది. అమ్మాయి చెప్పింది రైటే. దాదాపు దేవానందంత రౌడీలాగా వున్నాను. జనం మనని చూసి తిట్టినా ఫర్వాలేదు. నవ్వక పోతే చాలు.

## డిసెంబరు 13:

ఈ మధ్య ఒక మంత్రిగారు ఒక సభలో ప్రసంగిస్తూ దేశ ప్రజల జీవన ప్రమాణం పెరిగిందని అన్నారు. ఆయన యిటీవల ఒక గ్రామానికి వెళ్ళి చూస్తే అక్కడి ప్రజలందరూ చొక్కాలు వేసుకుని వున్నారట. జీవన ప్రమాణం పెరుగుదలకు యింతకంటే మంచి దాఖలా అక్కర్లేదన్నాడు ఆయన. మురార్జీదేశాయ్ గారు సిగరెట్లని కూడా లగ్జరీస్ (విలాస వస్తువులు)లో చేర్చారు. (ఆయన వక్కపొడి కూడా వేసుకోరని అనధికార వార్త). అసలు ఈ రోజుల్లో పెళ్ళి అంత లక్జరీ యింకోటి లేదని నేను ఒక సందర్భంలో వాదించాను. అందుకే దానిమీద పన్ను వేయడం. ఈ ఎమర్జన్సీలో పెళ్ళిళ్లు రద్దుచేస్తే బావుణ్ణు.

## డిసెంబరు 17 :

ఇవాళ సాయంత్రం సుల్తాన్ బజార్ బట్టల దుకాణంలో ఒక కాలేజీ అమ్మాయిని ప్రేమిస్తూ వుండగా విలన్ లాగా భాస్కర్రావు వచ్చాడు. పెద్ద అపరాధాన్ని పరిశోధించిన వాడిలాగా పోజుపెట్టి 'ఏం చేస్తున్నావు యిక్కడ' అని అడిగాడు. గాఢంగా ప్రేమిస్తున్నానని చెప్పాను. అతను రాజనాల లాగా నవ్వి 'నిన్నెవరైనా ప్రేమిస్తారనేనా నీ ధైర్యం' అన్నాడు. వెంటనే పరువు నష్టం దావా వెయ్యాలనిపించింది. 'సొంత మావయ్య కూతురే ప్రేమించగాలేంది పరాయివాళ్ళు ప్రేమించడం గొప్పా?" అన్నాను." మీ మామకూతురు నిన్ను ప్రేమిస్తోందనుకోడం ఆటో సజెషన్. నీకు సైకో ఎనాలసిస్సు తెలీదు" అన్నాడు. నేను వేదాంతి పోజుపెట్టి" అయినా మనం యితరులతో వంతు పెట్టుకోకూడదు. మన విధిని మనం నిర్వర్తించాలి. అవతలివాళ్ళు ప్రేమిస్తేనే నేనూ ప్రేమిస్తాననుకోవడం సకామ ప్రేమ. ఏ తద్విరుద్ధమైనది నిష్కామ ప్రేమ. నాది ఆ కోవకే చెందును" అన్నాను. అతను ఇహ వాదించలేక వెళ్ళిపోయాడు. ఈ మధ్య తర్కంలో ఆరితేరాను. ఓం తత్సత్ !

('జ్యోతి' మాసపత్రిక 1963)



# రాంబాబు కలలు

**జనవరి 2 :**

రాత్రి ప్రధాని నెహ్రూగారు  కల్లోకొచ్చారు. మోటారు సైకిలు మీద పార్లమెంటు భవనానికి పోతున్నాట్ట. మంచి పోజులో తొక్కాడు సైకిలు దార్లో ఆయనకి కృశ్చేవ్ కనిపిస్తే వెనక కూచోబెట్టుకున్నాట్ట. అలా వాళ్ళిద్దరూ కొంతదూరం పోయాక చూస్తే, కృశ్చేవ్ గారు రాజేంద్రప్రసాదు గారుగా మారిపోయారు. ఇంకాసేపయాక చూస్తే, అసలు ఆ మోటారు సైకిలుమీద పోతున్నది నెహ్రూ కాదు, రాజేన్‌బాబూ కాదు. నేనూ, వర్లక్ష్మి. అలా మేము పార్లమెంటు భవనం పక్కనుంచి మలుపు తిరిగే సరికి బెజవాడ కనకదుర్గ గుడి వచ్చింది. ఇక్కడ పూజ చేస్తూ కూచుంటే సినిమా దాటిపోతుందని వందమైళ్ళలో పోనిచ్చాను మోటారు సైకిలు. దుర్గగుడికి, హుస్సేన్ సాగర్ టాంక్ బండ్‌కీ ఫర్లాంగు కూడా లేదు. టాంక్ బండ్ దాటి లిబర్టీ టాకీసుకి వచ్చేసరికి అది తాజ్‌మహల్ హోటలుగా మారిపోయింది. వెళ్ళి ఐదు రూపాయలు తిన్నాం. ఏమిటో కలలకి అర్థం వుండదు కదా!



**జనవరి 14 :**

రాత్రి ఎదురింటివాళ్ళింట్లో పెళ్ళి జరిగింది. రాత్రి పన్నెండుదాకా సినిమా రికార్డులు దంచేశారు. తల పగిలిపోయింది వినలేక. ఇంకో పక్క కింద వాటాలో ఇంటాయన



చంటిపిల్లాడి ఏడుపు. వీటి తరవాత పెళ్లిబాండు. అబ్బబ్బ.. ఇంత సౌండ్ స్లీప్ నా జన్మలో ఎప్పుడూ పోలేదు. ఎప్పుడో తెల్లవారుఝామున నాలుగ్గంటలకి నిద్రపట్టింది. కల కూడా వచ్చింది. అసలు ఇందాకణ్ణించీ జరిగింది నా పెళ్ళేట. పెళ్ళికూతురు ఎవరోమరి! మంగళ సూత్రం కట్టబోతుంటే ఎవరో తుమ్మారు. ఉలిక్కిపడి లేచాను. భాస్కర్రావే తుమ్మింది. పెళ్ళి సీను కల్లోకి రావడం అశుభం అన్నాడు అతను. అతన్నోట్నుంచి వచ్చేవన్నీ అపశకునాలే.

## జనవరి 19 :

నాన్నగారు లంగోటీ బిగించి కాచిగూడా ప్రకృతి ఆశ్రమంలో బస్కీలు, దండీలు తీస్తున్నట్టు కలవచ్చింది. నేనూ అక్కడే వున్నాను. 'జై వీర హనుమాన్', 'లంబోదరాయనమ:' అని నినాదాలు చేస్తున్నాను. నేను కూడా లంగోటీ బిగించాను. కండలు బాగా వున్నాయి. ఛాతీ తేలిగ్గా నలభై అంగుళాలుంటుంది. ఒక గడ్డం ఆయన వచ్చి మంత్రం ఉపదేశించాడు.



ఆ మంత్రం ఉచ్చరించి గట్టిగా వూపిరి పీల్చేసరికి ఛాతీ పెరిగిపోయింది. మనిషిని బాగా పొడుగైపోయాను. 'హనుమాన్ పాతాళ విజయం' సినిమాలో హనుమంతుడిలాగా పెరిగిపోయాను. తరవాత మళ్ళీ నేను కనిపించలేదు. హనుమంతుల వారే కనిపించారు. బహుశ నేనే ఆయనగా మారిపోయి వుంటాను. చేతిలో గద వుంది. ఆకాశంలో ఎగిరిపోతున్నాను. తోక కూడా వుంది. కింద హైదరాబాదంతా బొమ్మరిల్లులా వుంది. 'ఆంజనేయులు వారి మీద నీకు గల మూఢభక్తికి నిదర్శనం' అన్నాడు భాస్కర్రావు. 'భక్తి కాదు ఏం కాదు. సినిమాలో హనుమంతుడి కున్నంత పర్సనాల్టీ రావాలనీ, ఆకాశంలో ఎగిరే శక్తి వుండాలనీ నీ కోరిక' అన్నాడు సారధి.

## జనవరి 23 :

వరలక్ష్మిని ముందు కూచోపెట్టుకుని పత్తర్ గట్టీలో చార్మినార్ దగ్గిర సైకిలు తొక్కుతున్నట్టూ, మంచి పోజులో సిగరెట్ తాగుతున్నట్టూ రాత్రి కలొచ్చింది. తర్వాత ఎగ్జిబిషన్లో పీచుమిఠాయి తిన్నట్టు కలొచ్చింది. ఈ సంగతి భాస్కర్రావుకి చెబితే అతను 'నీ కొచ్చేవన్నీ దిక్కుమాలిన కలలేనోయ్' అన్నాడు. తనకి ప్రేయసితో మబ్బుల్లో విహరిస్తున్నట్టూ, హంసలు ఆడుతున్నట్టూ, జల తరంగిణి వాయిస్తున్నట్టూ కల్లొస్తాయిట.

అన్నీ కోతలు. ఎంత భావకవి అయితే మాత్రం మరీ అటువంటి కలలొస్తాయా బడాయిగానీ! అయినా, నా కలలు సిగ్గుచేటు అయినవేం కాదు. ఆ మాటకొస్తే అసలు భాస్కర్రావు కలలే అసంభవమైనవి. నేను వర్లక్ష్మితో చార్మినార్ దగ్గర సైకిలు షికార్లు కొట్టడం అసాధ్యంకాదు. కాని అతను తన జన్మలో మబ్బుల్లో విహరించలేడు. పైగా అతనిది గార్దభస్వరం. అతను జలతరంగిణి వాయించడం ఏమిటి? (సప్రెస్డ్ డిజైర్ కాబోలు). ఆ కల సారథికి వచ్చినా కాస్త అందం చందం. సారథికి ఒకరోజు ఎవరితోనో కత్తి యుద్ధం చేస్తున్నట్టు కలొచ్చిందిట. ఎవరితోనూ చెప్పొద్దని రహస్యంగా చెప్పాడు. ఇదీ సప్రెస్డ్ డిజైరే (అణచివేయబడిన వాంఛ!). ఎందుకంటే అతను సన్నగా, డొక్కులా వుంటాడు గెడవాసంలా.



## జనవరి 30 :

రాత్రి వినాయకుడు కల్లోకొచ్చి వీపు గోకాడు. ఎలికలేదు. భయవేఁసి గావు కేకపెట్టాను. 'భయపడకు వత్సా!' అన్నాడు. 'గొప్ప సైంటిస్టు వౌతావుగాక!' అని తొండంతో దీవించాడు. కడుపు చెక్కలయ్యేట్టు నవ్వొచ్చింది ఆయన్ని చూస్తే. ఆయన మొహం అట్టతో చేసినట్టుంది. జై విఘ్నేశ్వర, జై లంబోదర! తెల్లారింతర్వాత సారథి అడిగాడు. 'రాత్రి గావుకేక పెట్టావు. తరవాత నవ్వావు. ఏం సంగతి?' అని. 'కలవరించేవాడు దరిద్రుడు' అని చెప్పాడు భాస్కర్రావు.



## ఫిబ్రవరి 5 :

రాత్రి మృత్యుదేవత రూపంలో వచ్చింది రాంబందో, లేకపోతే గబ్బిలమో సరిగా తెలీలేదు. అది నా తలపైన రెండు గజాల ఎత్తున వుండి రెక్కలాడిస్తోంది. రెక్కలాడించడంవల్ల గాలి వేసింది. అది గాలి కాదుట. చీకటిట! భయంతో ఒళ్ళు బిగుసుకుపోయింది. చీకట లాంటి ఆ గాలివల్ల కరెంటు షాక్ కొట్టినట్టుగా అనిపించింది. వంటికి కరెంటు ఎక్కించినట్టు బిగిసుకుపోతోంది. ఎలాగో బలం తెచ్చుకుని అక్కణ్ణించి పరిగెత్తడం ప్రారంభించాను. మృత్యువు వెంటనే తరుముకు వస్తోంది. మావూరి శివాలయం గోడమీదుగా పరిగెత్తాను. ఎంత పరిగెత్తినా గోడ పూర్తి కావడం లేదు. ఎంత స్పీడుగా పరిగెత్తినా మృత్యువుకూ, నాకూ

దూరం రెండు గజాలే వుంటోంది. కాస్తాగి చూస్తే అసలు కింద గోడలేదు. మరిందాకణ్ణించీ ఎలా పరిగెత్తుతున్నానో తెలీలేదు. వెనక చూస్తే మృత్యువు పాముగా మారిపోయింది. ముందు చూస్తే హుస్సేన్ సాగర్. దాంట్లో ఈదుతూ పోయాను.



పాముకూడా ఈత్తూ వస్తోంది. తరవాత నీళ్ళు అయిపోయి నేల వచ్చింది. గబుక్కున జ్ఞాపకం వచ్చి మెలికలు మెలికలుగా, వంకరటింకర్లుగా పరిగెత్తడం ప్రారంభించాను. కాళ్ళు అడ్డంపడి చతికిలబడ్డాను. మళ్ళీ లేచి పరిగెత్తేసరికి కాలుజారి ఒక్కసారిగా దభేలుమని మైలు లోతుగల చీకటి అగాధంలోకి పడిపోయాను. భయవేఁసి గావుకేక పెట్టాను. సారథి భుజం తట్టి లేపాడు. అయిదు నిమిషాలవరకూ వణుకు తగ్గలేదు. నా కేక విని భాస్కర్రావు కూడా లేచాడు. కల వొచ్చిందని చెప్పాను. ఇహ ప్రారంభించాడు శాపనార్థాలూ, లెక్చర్లూ, 'నే చెబితే విన్నావూ, చామదుంప లకూర రాత్రిళ్ళు తినకూడదయ్యా అంటే? ఉడకనివి కూడా చూసుకోకుండా అదేపనిగా లగాయించేస్తే ఏమవుతుంది మరి? అరక్క అడ్డమైన పీడకలలూ వస్తాయి' అన్నాడు. 'నీలో అణిగియున్న మరణ భయమే ఈ స్వప్నముగా ఆకృతించినది' అన్నాడు సారథి.

## ఫిబ్రవరి 13 :



పాట పాడుతూ బంజర్లను సాగుచేస్తున్నట్టు కలొచ్చింది. (ఆ పాట శ్రీశ్రీగారు రాసి వుంటారు. ఆ వూపు అలాగే వుంది.) నాట్లు వేసే సీను. తలపాగా చుట్టాను. పంచ కట్టాను. యమ ఫోజులో వున్నాను. ఇంకా బోల్డంతమంది అమ్మాయిలూ, అబ్బాయిలూ కూడా వున్నారు. అంతా కలిసి సహకార సేద్యం చేస్తున్నాము. నా మొహంలో కొద్దిగా హీరో నాగేశ్వరరావు పోలికలు కనిపించాయి. తరువాత కర్రయుద్ధం జరిగింది. ఎందుకో తెలీలేదు. నేను అమోఘంగా సాము చేశాను.

నాగేశ్వరరావు వ్యవసాయం చేస్తుండగా చూశాను ఈ మధ్య ఏదో సినిమాలో. ఈ కలని సారథి ఎనలైజు చేసి చెప్పాడు. 'నీ ఇంట్రస్టు సహకార సేద్యం మీదా కాదు, బంజర్ల మీదా కాదు. పంచ కట్టుకుని తలపాగా చుట్టుకుంటే నాగేశ్వర్రావంత అందంగా వుండాలనీ, సినిమాలో లాగా ఎవరైనా అమ్మాయి నిన్ను ప్రేమించాలనీ నీ కోరిక. అది అసంభవం కనుక

కలలో నెరవేరింది' అని చెప్పాడు. బైటి కైతే ఓ్రటించి పారేశానుగానీ, నిజమే సుమా అని పించింది. ఏ అమ్మాయి గానీ నన్ను ప్రేమించడం అసంభవమని సారథి తేల్చెయ్యడం మాత్రం ఇన్‌సల్టింగా వుంది.

## ఫిబ్రవరి 19 :

ఎగ్జిబిషన్‌లో ఒకచోట అర్ధణా దొరికింది. కొంత దూరం పోయాక ఇంకోచోట అణా దొరికింది. తమాషాగా వుందే అని వెతకటం మొదలెట్టా. వెతుకుతున్నకొద్దీ బోళ్ళన్ని అర్ధణాలూ, అణాలూ, బేడలు దొరకటం మొదలెట్టాయి. అక్కడికి వచ్చే వాళ్ళంతా వాటిని



పారేసుకుంటారట. అది మామూలేట. అసలు వాళ్ళకి అది లెక్క వుండదుట. డబ్బులతో జేబులు నిండిపోయాయి. ఇంకా బోళ్ళన్ని మిగిలిపోయాయి. ఎలాగాని విచారం వేసింది. తరువాత మావూళ్ళో వేపచెట్టు దగ్గర గొయ్యితీసి ఆ డబ్బుల్ని పాతిపెట్టాను. తర్వాత కల ఇంకేదో చాలావుంది. కానీ జ్ఞాపకం లేదు.

భాస్కర్రావు వ్యాఖ్యానం : నువ్వు పైకి అమాయకుడిలా కనిపిస్తావు కాని, చాలా దేవాంతకుడివి. నీలో పైకి కనిపించకుండా అణిగి మణిగి వుండిన ప్రబల ధనవాంఛే ఈ కలగా అవతరించింది. నీ నిజస్వరూపం ఇప్పుడు బైటపడింది.' అహ్హాహ్హా అని విలన్‌లా నవ్వాడు భాస్కర్రావు. తరవాత పయోముఖ విషకుంభం, తేనె పూసిన కత్తి అనీ ఇంకేవో చాలా అన్నాడు. 'భాస్కర్రావు వట్టి క్రాక్' అన్నాడు సారథి. నేను ఈ విషయంలో సారథితో ఏకీభవిస్తాను.

## ఫిబ్రవరి 27 :

'పక్కింటి అమ్మాయి'లో సుబ్బారాయుడు రాత్రి కల్లోకొచ్చాడు. మేమిద్దరం బుజాలమీద చేతులు వేసుకుని మా వూళ్ళో కాలవగట్టుమీదకి షికారెళ్ళాము. ఇద్దరం కాలవలో ఈతకొట్టాం. తరవాత తాటి తోపులో కెళ్ళి ముంజకాయలు కొట్టుకు తిన్నాం. అసలు మేమిద్దరం చాలా రోజుల్నుంచీ స్నేహితులమేట. అతను సిగరెట్టు మంచి ఫోజులో తాగుతాడు. బొమ్మల బుష్‌కోటు ఎర్రటిది వేసుకున్నాడు. నేను కూడా



అలాంటిది కుట్టించు కోవాలనుకున్నాను. అతను కర్నాటక సంగీతం నేర్చుకున్నాట్ట. నన్ను

కూడా నేర్చుకోమన్నాడు. అమ్మాయిలకి సంగీతం అంటే భలే ఇష్టంట. తరవాత నేను పబ్లిగ్గార్డెన్స్ రోడ్డుమీద చేతులొదిలిపెట్టి సైకిల్తొక్కుతున్నట్టు కలొచ్చింది. పక్కింటి అరవమ్మాయి (కోతి) కనిపించింది ఎన్.సి.సి డ్రస్సులో. కొద్దిగా ఆంజనేయులువారి పోలిక లున్నాయి.

సుబ్బారాయుడు కల్లోకొచ్చిన సంగతి సారథికి, భాస్కర్రావుకి చెప్పలేదు. అసలే సుబ్బారాయుణ్ణని ఏడిపించేస్తున్నారు అందరూ. ఇది చెప్తే ఇహ బ్రతకనిస్తారా!

## మార్చి 6 :



నిర్వచనోత్తర రామాయణం లోని సీతాపరిత్యాగం సీను కలలోకి వచ్చింది. నిర్జనారణ్య మధ్యంబున ఆ సీతామహాతల్లి కడు దీనయై దిక్కులు పిక్కటిల్ల విలపించుచున్నది. 'అన్నా లక్ష్మణా, మీ యన్న రఘురామునికిది పాడియా!' అనుచున్నది. నేను అశ్రు నిరుద్ధాకుల లోచనుడ నైతిని. సమీపమందున్న గంగానదీ ఘట్టంబున వాల్మీకి సంధ్య వార్చుకొనుచున్నారు. అంతవరకే వచ్చింది కల. సీతమ్మవారు లక్ష్మణా! నేడేలనో నా దక్షిణ నేత్ర మదరుచున్నది. అక్కటా, ఏమి వాటిల్లునో కదా! అన్న మాటలు చెవుల్లో గింగురుమంటున్నాయి. ఆ అరణ్యం మా వూళ్ళో సీతారామయ్యగారింటి వెనకాతల వున్న డొంక. వాల్మీకి సంధ్య వార్చినరేవు ఆ డొంకలో పాటిమట్టికోసం సీతారామయ్య గారు తీయించిన పెద్ద గొయ్యి. వానలకి దాన్నిండా నీళ్ళునిండి చెరువులా వుండేది. చిన్నప్పుడు మేం అక్కడ ఆడుకునేవాళ్ళం. ఇహనించీ నా కలలని ఎవరికి చెప్పదల్చుకోలేదు. వట్టి ఫూల్స్. సానుభూతితో అర్థం చేసుకోకుండా వూరికే నవ్వేస్తారు. నిన్న పొద్దున్నే తెలుగు మేష్టారు సీతా పరిత్యాగం పాఠం చెప్పారు. ఈ కల రావడానికి కారణం అదే అయుంటుంది.

## మార్చి 14 :

రాత్రి కృశ్చేవూ, కెన్నెడీ మల్ల యుద్ధానికి తయారవుతున్నట్టు కలొచ్చింది. ఇద్దరూ లంగోటీలు కట్టుకున్నారు. కెన్నెడీ పర్సనాల్టీ చాలా బావుంది కానీ చురుకుదనం తక్కువ. కృశ్చేవ్ నవ్వుతూ కెన్నెడీ పైన జోకులు వేస్తున్నాడు నాతో.. కెన్నెడీ మాత్రం ఎలాగైనా సరే కృశ్చేవ్‌ని ఓడించాలని దండీలు, బస్కీలు తీయడం ప్రారంభించాడు. ఇనప గదలు తిప్పాడు. పరిగెత్తాడు. చివరికి కుస్తీ ప్రారంభం కాకుండానే అలిసిపోయి రొప్పడం మొదలెట్టాడు.



క్రుశ్చేవ్ విరగబడి నవ్వుతున్నాడు. మరి తరవాత వాళ్ళు కుస్తీపట్టారో లేదో తెలీదు.

నేనీమధ్య నా కలల్ని చెప్పటం లేదని భాస్కర్రావు దొంగచాటుగా నేను లేనప్పుడు నా పెట్టెతీసి చదివాడు. నేనింటికి వచ్చేసరికి అతనూ, సారథీ పొట్ట చెక్కలయ్యేట్టు నవ్వుతున్నారు. నాకు ఒళ్ళు మండిపోయింది. నేను సౌండ్ స్లీప్ అనేది తప్పు అర్థంలో రాశానట. అదీ వాళ్ళ నవ్వుకు కారణం. సౌండ్ అనగా శబ్దం. స్లీప్ అనగా నిద్ర. సౌండ్ స్లీప్ అనగా శబ్దముతో కూడినటువంటి నిద్ర. నవ్వటానికేముంది? చాలా సింపుల్‌కదా. అది కాదుట. సౌండ్‌స్లీప్ అంటే గాఢనిద్రట. పూర్తిగా విరుద్ధమైన అర్థం. నిజమేనేమోగానీ, ఆంగ్లభాష ఎంత చచ్చుభాషో ఇవాళ నాకు తెలిసింది. అందుకే కాబోలు విశ్వనాథ గారికి ఇంగ్లీషు అంటే అంత మంట.

## మార్చి 19 :

రాత్రి చార్మినార్ చిట్టచివరంతస్తులో ఎవరి తోనో కత్తియుద్ధం చేసినట్టు కలొచ్చింది. రాజనాల తోనో, లేకపోతే బేతాళుడితోనో. హరా హోరీగా యుద్ధం చేశాను. ఇంత యుద్ధం ఎప్పుడు నేర్చుకున్నానా అని నాకే ఆశ్చర్యం వేసింది. చాలాసార్లు నాకు కత్తిపోట్లు తగిలాయి. కానీ ఎందుకో మరి మంటపుట్టలా. అలా కొంతసేపు యుద్ధం చేశాక ఆపై గోపురంమీంచి జగదేక వీరుడిలా దభేలుమని కిందికి దూకాను. కింద నిర్జనారణ్యంలో గుర్రం నిలబడి వుంది. దానిమీదకి దూకాను. బేతాళుడు కూడా అలాగే దూకాడు.



తరవాత నావెంట పడ్డాడు. అమోఘంగా గుర్రపుస్వారీ చేశాను. ఆ గుర్రం తెల్లటిది, మధ్యలో నల్లమచ్చ వుంది. అది మాయాలోకం సినిమాలో శరాబందిరాజు (హీరో) ఎక్కిన గుర్రం.

## మార్చి 26 :

బియ్యే తప్పినట్టు కలొచ్చింది. గుండె ఆగిపోయినంత పనైంది. జీవితంమీద విరక్తి పుట్టింది. ఈ ప్రపంచంలో బతకడం దండగనిపించింది. సన్యాసం పుచ్చుకోవాలనుకున్నాను. పక్కింటి కోతి పాసయింది. ఆ అమ్మాయి, వాళ్ళ చెల్లాయి, వాళ్ళ నాన్నగారు, వాళ్ళ బావ (గెడవాసంగాడు) కలిసి మేడమీద బాల్కనీలో కూచుని పేపరు చూస్తున్నారు. కోతి నన్ను

చూసి పకపకా నవ్వుతూ, వాళ్ళ నాన్న గారితోనూ, బావగాడితోనూ ఏదో చెబుతోంది అరవంలో. 'రౌడీ వెధవ, తిక్క కుదిరింది' అని చెప్పి వుంటుంది. నేను తప్పిన సంగతి వాళ్ళ తమ్ముడు లడ్డూగాడు చెప్పివుంటాడు. నాకు తల కొట్టేసి నట్టయింది. ఏడుపు ఆగలేదు. 'అడ్డగాడిదలా తిరిగితే సరి' అన్నారు నాన్నగారు. 'హిమకిరణ్' పేరుతో కథలు రాయడం అనుకున్నావా బియ్యే అంటే?' అన్నాడు భాస్కర్రావు. ఎక్కెక్కి ఏడవటం మొదలెట్టాను. ఇంతలో సారథి నిద్ర లేపాడు. తెల్లారి పోయింది. కన్నీళ్ళతో చెంపలు తడిసిపోయాయి. "కలలో ఏడ్వటం దౌర్భాగ్యుడి లక్షణం" అన్నాడు భాస్కర్రావు. "తెల్లారు ఝామున వచ్చిన కల నిజమవుతుంది. నువ్వు తప్పటం ఖాయం." అన్నాడు. అతను మాట్లాడేవన్నీ అశుభప్మాటలే. "మొన్న వరల్డ్ హిస్టరీ పేపరు కొంచెం పాడు చేశావుకదూ. అందుకే అలా కల వచ్చింది" అన్నాడు సారథి.

## మార్చి 31 :

ఇంటాయన కూతురు రాణిని ప్రేమిస్తున్నప్పటి సంఘటనలు కలలోకొచ్చాయి. 'స్టెప్ నంబర్ వన్" అంటూ కొబ్బరికాయ కొట్టి ఆమ్మాయి తమ్ముళ్ళకిస్తున్నానుట. (అప్పట్లో నేను అపక్వాహరుడిని) తరవాత ఆ పిల్లలకి బ్లేళ్లూ, రబ్బర్లూ తగరాలూ, వేరుసెనక్కాయలూ ఇచ్చానుట! దాని తరువాత రాణి పెళ్ళిసీను. నాన్నగారు బలవంతంగా లాక్కెళ్ళి నాచేత కూడా అక్షింతలు వేయించారు. పిల్లలంతా నా చుట్టూమూగి 'తగరాలివ్వవ్' అని అడుగుతున్నారుట! ఆ తరవాత ఇహ ఏడుపాగలేదు.



అదంతా ఒక విషాదగాథ. మరతునన్నా, మరుపురాని మధురబాధ, తీరని వ్యథ. చిత్రవధ. ('అన్ కాన్షస్‌గా' - అనగా అపస్మారక దశలో - అవ్పుడప్పుడూ ఇలా కవిత్వం జనిస్తూ వుంటుంది.)

షరా: కొన్ని విషాదకర సంఘటనలను స్మృతిపథమునుండి తొలగించుటకు మనము ప్రయత్నింతుము.కాని అది మనసునందుగల అన్ కాన్షస్ అరయందు నిక్షిప్తమైయుండి, కలలందు అనగా సబ్‌కాన్షస్ దశయందు వెలికివచ్చుచుండును. ఇంటాయన కూతురి పెళ్ళి సంఘటనను మరచిపోవుటకు ప్రయత్నించగా అది పై విధముగా కలలో కొచ్చింది. కలలను

ఇప్పుడు నేనే స్వయంగా ఎనలైజు చేసుకోగల స్థితికి వచ్చితిని.

## ఏప్రిల్ 4 :

అత్తయ్యగారింటి కెళ్ళినట్టూ, వరలక్ష్మి ఒక కత్తితో బ్రెడ్డునుకోసి, దానికి జామ్ రాసి నవ్వుతూ నాకు ఇచ్చినట్టూ కల వచ్చింది. దానికి భాస్కర రావు చేసిన వ్యాఖ్యానం వింటే కడుపు చెక్కలయ్యేట్టు నవ్వొచ్చింది. ముందు కలని కాయితం మీద రాశాడు. దాంట్లో బ్రెడ్డు, కత్తి, జామ్, ముక్కలు ముక్కలుగా కోయుట అనే పదాలకింద అండర్లైన్ చేశాడు. తరవాత ఈ క్రింది విధంగా ఈక్వేషను వేశాడు.

బ్రెడ్డు = రాంబాబు జీవితం.

కత్తి = వర్లక్ష్మి.

కత్తి + జామ్ = తేనెపూసిన కత్తి = వరలక్ష్మి. ము.ము. కోయుట = జీవితమును ఛిన్నా భిన్నము చేయుట.

మొత్తం కల = రాంబాబు సంసారం.

సారాంశం : వైఫ్ ఈజ్ ఎ నైఫ్ టు కట్ ది లైఫ్.

తాత్పర్యం : తేనెపూసిన కత్తివంటి వరలక్ష్మిని చూసి మోసపోయి రాంబాబు బ్రెడ్డు వంటి జీవితమును లేదా హృదయమును ఆమెకు అర్పించగా ఆమె దానిని ముక్కలు



ముక్కలుగా ఛిన్నా భిన్నము చేసినది. పూర్వం ఒకసారి రాంబాబు 'వైఫ్ ఈజ్ ఎ నైఫ్ టు కట్ ది లైఫ్' (భార్య అనగా జీవితమును కోయు కత్తి) - అని డైరీలో రాసుకొన్నాడు. అతని మనస్సులో ఇప్పటికీ అణగి వున్న ఆ భావమే ఈ కలగా ఆకృతించినది.

భాస్కర్రావుని చూస్తే జాలేస్తోంది. అతనికి కొంచెం పిచ్చెక్కిందని నాకు అనుమానంగా వుంది. ముక్కుపచ్చలారని ఈ యువకునికి ఆ గతి పట్టుట చాలా విషాదకరం. రోజూ అడ్డమైన వాళ్ళకీ సైకో ఎనాలసిస్సు చేస్తున్నాడు. ఇంకా థాట్ రీడింగ్, టెలిపతీ కూడా ప్రాక్టీసు చేస్తున్నాడు.

('జ్యోతి' మాసపత్రిక 1963)



# రాంబాబు డైరీ

## ఆగస్టు 4 :

ఓం! అవిఘ్నమస్తు : అసలు ఓంకారంలో నుంచే శబ్దమయ ప్రపంచం యావత్తున్నూ పుట్టుకొచ్చిందని నాన్నగారు ఆ మధ్య చెప్పిన సత్యం జ్ఞాపకం వచ్చింది. పాశ్చాత్యులు ధ్వని గురించి ఎన్నో పరిశోధనలు చేసి శాస్త్రములు రచించియున్నారు కాని ఈ సత్యాన్ని కనుగొనలేదు. శబ్ద తరంగాలకు, ఓం కారానికి మధ్యగల అవినాభావ సంబంధం గురించి ఎప్పటికైనా రిసెర్చి చెయ్యాలని తీర్మానించుకున్నాను. బియ్యే అయిపోగానే ప్రారంభిస్తాను. ఉస్మానియా యూనివర్సిటీకి థీసిస్సు సబ్మిట్ చెయ్యాలి. పేరు పక్కన పిహెచ్.డి. వుండడం ఎందుకైనా మంచిది. ఓంకారము యొక్క విలువను మన పూర్వులు ఎప్పుడో గుర్తించారు. అందుకే వారు ఏది వ్రాసిననూ ఓంకారముతో ప్రారంభించెడివారు. విదేశములలో పర్యటించి ఓంకార మహాత్మ్యమును ప్రచారము చేయుట అవసరం. ఈ మధ్య అస్తమానం అత్యున్నతమైన విషయాలను గురించి ఆలోచిస్తున్నాను. ఇవాళ అద్దంలో తీక్షణంగా మొహం చూసుకుని డెవలప్‌మెంటును సమీక్షించుకున్నాను. (ఎందుకంటే ఫేస్ ఈజ్ ది ఇండెక్స్ ఆఫ్ ది మైండ్ అన్నాడు షేక్స్పియర్.) ఇప్పుడు భౌతిక అయోమయత్వం పోయింది. మంచి గడుసుతనం, పరిణతి



మొదలైనవి కనిపిస్తున్నాయి. నా మెంటల్ ఏజ్ కూడా ఈ ఏడాదిలో ఓ పదేళ్ళు పెరిగింది. మొహంలో భవిష్యత్ జీనియస్ పోలికలు తొంగిచూస్తున్నాయి. (ఎందుకంటే మనిషి ఒక్కసారిగా జీనియస్సైపోడు. ఆ పోలికలు క్రమక్రమంగా ఆవిర్భవిస్తాయి. ఉదాహరణకు మహా పురుషుల చిన్నప్పటి ఫోటోలు చూస్తే తెలుస్తుంది). ఇదంతా జీవకళ ఆయుర్వేదం మందు ఫలిత మనుకుంటాను. మందు కంటిన్యూ చేయాలి. ఈలోగా కాశ్మీర్ బుకే

బ్రిలియంట్గా రాయాలనుకుంటున్నాను. తప్పక బ్రిలియంటు ఫెలో కాగలనని విశ్వసిస్తున్నాను. ఈ రహస్యం సారధిక్కూడా చెప్పదలచుకోలేదు.

బియ్యే చదువుకీ, సుజనమిత్ర పార్టైమ్ జాబ్కీ లంగరు కుదరడం లేదు. ఈ చదువై పోయినట్టుంటే జర్నలిజానికి ఎనలేని సేవచేసి ఉండే వాణ్ణి. ఇప్పుడు రచనా వ్యాసంగంలో పడి ఇటు చదువుకు కూడా న్యాయం చేకూర్చలేక పోతున్నాను. నా ప్రతిభ బూడిదలోపోసిన పన్నీరై పోతున్నది.

నా మనస్సులోని నిరాశవు టాలోచనలవలె ఆకాశంలో శ్రావణ మేఘాలు కమ్ముకుంటున్నాయి. అవి కన్నీటినే కదా వర్షించేది. (ఈ ఐడియా నా సొంతమో, పూర్వం కాళిదాసు చెప్పాడో జ్ఞాపకం లేదు.)

## ఆగస్టు 9:

ఓం! ఎడిటర్ గారికి, నాకూ రోజురోజుకూ అభిప్రాయ భేదాలు పెరుగుతున్నాయి. తెలుగు జర్నలిజంలో విప్లవాత్మకమైన మార్పులు తీసుకురావాలనుకుంటున్న నా ప్రగాఢవాంఛను ఆయన ఎంత మాత్రం హర్షించడంలేదు. ఈ మధ్య 'గ్రామీణ స్త్రీలకు పరపతి సౌకర్యం' అని హెడ్డింగు పెట్టినందుకు ఆడవాళ్ళ దగ్గర్నుంచి బోలెడు వుత్తరాలు వచ్చాయట. సవరణ వేస్తారా ఛస్తారా అని నిగ్గదీసి అడిగారట. ఆయన నామీద విరుచుకుపడ్డారు. ఇదివరకు ఒకసారి ఆయనే చెప్పారు 'సహకార పరపతి సంఘం' అని రాయమని. 'ఋణ సౌకర్యసంఘం' అని రాస్తానంటే వద్దన్నారు. పొద్దున కాలేజీకి బస్సులో వెడుతూంటే ఒక ముసలాయన ఈ కాలపు యువకులను వూరికే దుమ్మెత్తిపోయడం మొదలు పెట్టాడు. విద్యార్థులు సిటీబస్సుల్లో మర్యాదలేకుండా ఆడపిల్లల పక్కన కూర్చుంటున్నారట. నాకు ఒళ్ళు మండింది. "మహామహా డెబ్భై ఏళ్ళ ముసలాళ్ళే ఆడపిల్లల పక్కన కూచుంటుంటే లేనిది, యువకులు కూర్చుంటే తప్పా?" అన్నాను. ముసలాళ్ళు పడుచువాళ్ళకి ఆదర్శకరంగా ప్రవర్తించవలసిన అవసరాన్ని గురించి ఉద్ఘాటించాను. ఇకనైనా ఇట్టి అనుచిత విమర్శలకు స్వస్తి చెప్పగలరని ఆశాభావం వ్యక్తం చేశాను. మళ్ళీ ఆయన మాట్లాడితే ఒట్టు. ఆయన పక్కన కూర్చున్న అమ్మాయి నా వంక అదోరకంగా చూసింది. మొన్న అదేదో హిందీ సినిమాలో వక్తృత్వం పోటీలో గెల్చిన హీరోను హీరోయిన్ అలాగే చూసినట్లు జ్ఞాపకం. వాక్కునకు అధిదేవత బ్రహ్మగారు. ఆయన కటాక్షము కావలెను. కాని బ్రహ్మగారికి దేవాలయములుండవట. మనస్సులోనే పూజించవలెను.

ఓం. పరబ్రహ్మణేనమః

## ఆగస్టు 12 :

ఈ మధ్య భాస్కర్రావు దగ్గర సైకో ఎనాలసిస్సు బాగా స్టడీ చేస్తున్నాను. దీనివల్ల చాలా లాభాలున్నాయి. మనలోని అభివృద్ధిని ఇతరులు మన వంక చూసే చూపును ఎనలైజ్ చేసి తెలుసుకోవచ్చును. ఉదా: నాలో హీరో పోలికలు ఎంత వరకు వచ్చాయో తెలుసుకోడానికి పక్కింటి కోతి నన్ను చూసే చూపులో క్రమక్రమంగా వచ్చే మార్పును పరిశీలించిన చాలును. అట్టి పరిశీలనకు థాట్ రీడింగ్, సైకోఎనాలసిస్సు అవసరం. వీటిలో ఆరితేరిన తర్వాత టెలిపతీ, హిప్నాటిజం ప్రాక్టీసు చెయ్యాలి. ఇవాళ భాస్కర్రావు హిప్నాటిజంపై ఒక బుక్కు తెచ్చాడు.

ఇవాళ బాబూరావు ఎవరో అమ్మాయిని చూశాట్ట బస్సులో. 'అందంగా వుందోయ్' అన్నాడు. నాకు నవ్వొచ్చింది. "పెద్ద ఆశ్చర్యంగా చెబుతావ్... అమ్మాయిలు అందంగా వుండరుటోయ్" అన్నాను. "నువ్వు వట్టి యిడియట్టువోయ్" అంటూ వెళ్లిపోయాడు. తను చెప్పినదానితో ఏకీభవించకపోతే ప్రతివాడికీ కోపమే ఈ రోజుల్లో. ఎడిటరుగారూ అంతే. నిన్న ఆయన ఒక బ్రహ్మాండమైన తప్పు రాస్తే నేను దిద్దినందుకు ఇవాళ చివాట్లు పెట్టారు. వన్యమృగ సంరక్షణ సప్తాహంపై ఎడిటోరియల్‌లో ఆయన ' అటవీ మంత్రి' అని రాశారు. ఆయన ఇంటికి వెళ్ళిపోయాక తీరా కంపోజ్డ్ మేటరు పేజీలో పెట్టేస్తుంటే చూసి పట్టుకున్నాను. 'సుజనమిత్ర' వాళ్ళకి





బొత్తిగా వ్యాకరణం రాదని పాఠకులు నవ్వుకుంటారనే ఉద్దేశంతో 'ఆటవిక మంత్రి' అని దిద్దాను. అందుకు కృతజ్ఞత చెప్పడంపోయి, అది తప్పని వాదించాడు ఆయన. కృతఘ్నతకు మచ్చుతునక యిది. మోస్ట్ అన్‌గ్రేట్‌ఫుల్ ఫెలో. 'ఆటవిక' అంటే బార్బేరియన్ అని అర్థంట. అసలు తెలుగును ఇంగ్లీషుతో పోల్చడం దేనికని వాదించాను. "మీరు చిన్నప్పుడు ఎప్పుడో చదువుకోవడం వల్ల వ్యాకరణం మరిచిపోయి వుంటారు. 'ఆటవిక' అనేది తద్ధిత రూపం" అని చెప్పాను. "మీరు పెద్దవారు. మీకు దేనికి శ్రమ. మీరు ఎడిటోరియల్ రాసి అక్కడ పెట్టండి. వ్యాకరణం సంగతి నేను చూసుకుంటాను" అని కూడా చెప్పాను. అబ్బే.. ఆయన కన్విన్స్ కాలేదు. తెలిసీ తెలియని నరుదెల్ప బ్రహ్మదేవుని వశమే!

మనస్సు కల్లోల తరంగిణిలా కకావికలమై పోయింది. ఈ మధ్య నేను తరచుగా అపార్థములకు గురి అవుతున్నాను.

## ఆగస్టు 15 :

స్వాతంత్ర్య దినోత్సవం. మూడు శతాబ్దాల దాస్యశృంఖలాలు ఎందరో మహనీయుల త్యాగ ఫలితంగా పటాపంచలయిన దినం. ఫతే మైదాన్‌లో బహిరంగ సభకు వెళ్ళాం. నేను సారధి, భాస్కర్రావు. ఎందరో నాయకులు ఉపన్యసించారు. పూర్వం స్వాతంత్ర్యోద్యమంలో యువకులు ఎన్నో త్యాగాలు చేశారనీ, ఇప్పుడలా చేయడంలేదనీ మంత్రిగారు అన్నారు. ఆయనతో నేను ఏకీభవించజాలను. ఆయనను ఖండిస్తూ 'సుజనమిత్ర'లో వ్యాసం రాయాలి. యువకులలో రాజకీయ చైతన్యం ఏమాత్రం కొరవడలేదు. ఈనాడు సైతం కళాశాల చదువులను త్యాగం చేసి విద్యార్థులు మహత్తరమయిన ఆందోళనలు సాగిస్తూనే వున్నారు. గాంధీజీ బోధించిన సత్యాగ్రహం, శాసనోల్లంఘనం, సహాయ నిరాకరణం, నిరాహారదీక్ష ముున్నగునవి ఇప్పటికీ త్రికరణ శుద్ధిగా అమలు జరుపుతూనే ఉన్నారు. ఈనాడూ లాఠీచార్జీలు, అరెస్టులు జరుగుతూనే వున్నాయి. కాల్పులలో విద్యార్థులు మరణించి అమర వీరులవుతూనే వున్నారు. గాంధీజీని ప్రజలు విస్మరించారన్న మాటకు అర్థంలేదు. ఆయన బోధలు తరతరాల ప్రజలను వుత్తేజపరచ గలవనడంతో ఎంత మాత్రం సందేహం లేదు.




ఈరోజు నాలో వేడినెత్తురు పెల్లుబుకుతున్నది. నానాటికీ పెచ్చు పెరుగుతున్న దారిద్ర్యం పట్ల నిరసనగా శాసన సభ ఎదుట సత్యాగ్రహం చేసి జైలుకు వెళ్ళాలి. జైలుకు వెళ్ళని బ్రతుకువృధా. (ఉదా: మహామహులందరూ తాము నమ్మిన సత్యాలకొరకు జైళ్ళకు వెళ్ళారు.) జైల్లో కూర్చుని భారత స్వాతంత్రోద్యమ చరిత్రను సారథికి లేఖల రూపంలో వెయ్యి పేజీల ఉద్గ్రంథంగా రాయాలి. అసలు మనకి జైలులో 'ఎ' క్లాస్ ఇస్తారో లేదో కనుక్కోవాలి. అది ఇవ్వకపోతే దండగ. జైల్లో టైము వేస్టు.

ఓం! ఇష్టకామ్యార్థ సిద్ధిరస్తు. శ్రీరాములవారి సహాయము కావలెను.

ఇవాళ ఎన్.సి.సి. పెరేడ్ దగ్గర వర్లక్ష్మి యూనిఫారంలో కనిపించింది. ఎల్లుండి వరలక్ష్మి వ్రతం పండక్కి నన్ను భోజనానికి రమ్మని మామయ్య చెప్పమన్నాట్ట. తప్పకుండా వస్తానని చెప్పాను. వర్లక్ష్మి... ఓహో ఏమి దివ్యసౌందర్యము !

## ఆగస్టు 17 :

పొద్దున్న మావయ్యగారింటికి వెళ్ళాను. వరలక్ష్మి తలంటుకుని, జడలో చేమంతులు

పెట్టుకున్నది. కాళ్ళకు పసుపు, ముఖాన కుంకుమ బొట్టు, చేతికి వరలక్ష్మి వ్రతం తోరం. అచ్చంగా ఆదర్శ భారత స్త్రీత్వానికి మచ్చుతునకలావుంది. పట్టుచీర కట్టుకుని నడుస్తుంటే, పొడవైన ఆమె జడపదార్థం వయ్యారంగా అటూయిటూ నాట్యం చేస్తుంటే నా గుండె ఝల్లుమన్నది. ఎందుకో తెలీదు మరి. భాస్కర్రావైతే యిట్టే చెప్పెయ్యగలడు. ఆమె నన్ను చూసి అదోరకంగా నవ్వింది. ఆ నవ్వు పిండి యారబోసినట్లున్నది. సాయానా దేవత నవ్వినట్లేవుంది. వెంకటేశం గాడు హార్మణీమీద లంబోదర లకుమికర వాయించాడు. నేనూ కాసేపు ప్రాక్టీసు చేశాను. భోజనంలో గుత్తివంకాయ కూర అనిర్వచనీయంగా వుంది. వెంకటేశం అటకమీద నుంచి గ్రాంఫోను దింపి "గుత్తివంకాయ్ కూరోయ్ బావా' పాట పెట్టాడు. నేను కూర తింటుండగా వర్లక్ష్మి ఆ పాట పెట్టించి వుంటుందనుకున్నాను. మావయ్య మాత్రం ఆడవాళ్ళకి చదువు ఎంత అనవసరమో, ఎంత డబ్బు దండగో వుపన్యసిస్తున్నాడు. బియ్యే ఫస్టియర్ అయిపోగానే వర్లక్ష్మికి ఏదో సంబంధం చూసి పెళ్ళిచేసేస్తే మంచిదని తనలో తనే అనుకుంటున్నట్లుగా అన్నాడు. నాకు గుండె కలుక్కుమంది. గుత్తివంకాయలో పలుగురాయి వచ్చింది. సాయానా మేనల్లుణ్ణి పక్కన కూచుని భోంచేస్తుంటే ఆయన వేరే సమ్మంధంగురించి మాట్లాడడం బొత్తిగా అనౌచిత్యంగా, అప్రస్తుత ప్రసంగంగా అనిపించింది. తర్వాత ఇక అన్న హితవు పోయింది. సేమ్యా పాయసం కూడా సయించలేదు. నేనే యింత బాధపడితే మావయ్య మాటవిని వర్లక్ష్మి ఎంత బాధపడి వుంటుందోకదా. "పండగలకైనా వస్తూండరా. ఈ మధ్య బొత్తిగా రావడమే మానేశావు. రాచకార్యాలతో సతమతమై పోతున్నావా యేం?' ' అన్నాడు పెద్ద ఆపేక్ష వున్నవాడిలాగా. సరేనని వచ్చేశాను.

నేడేలనో నా వామ నేత్రమదురుచున్నది. ఏమి దురపిల్లునోకదా! శుభమస్తు !

ఇవాళంతా మనస్సులో వర్లక్ష్మీవ్రతం చేసుకున్నాను.

## ఆగస్టు 18 :

రాత్రి అంతా నా ఆలోచనా సామ్రాజ్యానికి వర్లక్ష్మి రాణి అయింది. ఆమెను భవిష్యత్తులో వివాహం చేసుకోవడం నా జన్మహక్కు కదా అని తలుచుకుంటే.... అబ్బ... చెప్పలేను... ఆ మధురానుభూతి అనుభవైక వేద్యం, వర్ణనా తీతం...

ఏదో ఏదో ఏదో ఐపోతున్నది...

ఏమిటిది? ఏలనిది.?

ఈ గిలిగింత, ఈ పులకింత.... వరలక్ష్మిని తలచుకుంటే ఇలా కవిత్వం పుట్టుకొస్తుంది. ఈ పాటని ఎవరైనా సినిమావాళ్ళ కిస్తే బావుణ్ణు.

ప్రేమించనివాడు కవిత్వం రాయలేడని వెనకటికి ఎవరో మహాకవి చెప్పినట్లు జ్ఞాపకం. మహాకవి కాకపోతే అంత మహత్తర సత్యం చెప్పలేడు. (లేకపోతే నాకే తట్టిందో ఈ ఐడియా) అంతేకాదు. ప్రేమించినవాడు కవిత్వం చెప్పకుండానూ వుండలేడు. అందుకే కాబోలు నాక్కూడా వుండబట్టలేక అప్పుడప్పుడూ కవిత్వం వస్తూవుంటుంది.

సారథి, భాస్కర్రావు నా ప్రేమను పరిహసిస్తూ దొంగచాటుగా మాట్లాడుకోవడం విన్నాను. అయినా వాళ్ళని క్షమించి వూరుకున్నాను. అదే భాస్కర్రావుని గూర్చి మేము మాట్లాడుకున్నామనుకోండి - తేనెపూసిన కత్తులు, పయోముఖ విషకుంభాలు. పక్కలో బల్లాలు, మిత్రద్రోహులు అంటూ గర్జిస్తాడు అతను. వాళ్ళు అలా మాట్లాడుకోవడం సహజమే. ప్రేమించని వాళ్ళకేం తెలుస్తుంది దాని మహిమ. అందుకే వాళ్ళిద్దరూ కవిత్వం రాయలేకపోతున్నారు నాలాగా.

నల్లకుంటలో ఎవరో ఆంజనేయోపాసకుడు గారు వున్నారట. అందరూ ఆయన దర్శనం కోసం క్యూలో నించుంటున్నారట. ఆయన అందరి రోగం కుదురుస్తున్నాట్ట. బాబూరావు వెళ్ళివచ్చాట్ట. నన్నుకూడా వెళ్ళమన్నాడు. నాకు ఇటువంటి వాటిల్లో నమ్మకం లేదు. నేను ప్రోగ్రెసివ్‌ను బూజుపట్టిన భావాలు లేవన్నాను. అయినా ఒకసారివెళ్ళి ఆయన్ని టెస్ట్ చేయాలనుకున్నాను.

జయోస్తు. విజయోస్తు !

## ఆగస్టు 25 :



ఇవాళ చిస్మరణీయమైన దినం. ఇవాళ నల్లకుంటవెళ్ళి శ్రీ ఆంజనేయోపాసకుడు గారిని దర్శించుకున్నాను. వారం రోజులనుంచి అనుకుంటుంటే అటు కాలేజీ. ఇటు జర్నలిజం. మధ్యలో పెక్కు సాంస్కృతిక కార్యకలాపాలతో తీరిక చిక్కలేదు. శ్రీ స్వామివారి దగ్గరకు వెళ్లగానే ఆయన 'నాయనా నువ్వు కష్టములలో వుండి తరుణోపాయం కోసం వచ్చావుకదూ?' అన్నారు . అదిరిపోయాను నా కష్టాలను ఈయన ఎలా కనిపెట్టేశాడా అని. ఆయన నిజంగానే మహానుభావుడు. ఆయన్ని టెస్ట్ చేయడానికి నేనెంత అనుకున్నాను. వినమిత శిరస్కుడినై "అవును స్వామీ. మీకు తెలియనిదేముంది?" అన్నాను. ఆయన నా నోటిలో ఏదో తీర్థం పోశారు. శ్రీ ఆంజనేయస్వామి

బొమ్మవున్న బిళ్ళ ఒకటి యిచ్చి మెడలో కట్టుకోమన్నారు. "ఇంకా కొన్నాళ్ళు నీకీ కష్టాలు తప్పవునాయనా. నీలో అధైర్యం ప్రవేశించినప్పుడల్లా జై హనుమాన్ అనుకో" అని సెలవిచ్చారు. ఆయనకు పాదాభివందనం చేసి వచ్చాను. మూడుకులాల దారంలో శ్రీ ఆంజనేయులవారి బిళ్ళవేసి మెడలో వేసుకున్నాను. జై హనుమాన్. సుల్తాన్ బజారులో పెద్ద హనుమంతులవారి ఫోటో కొని ఫ్రేమ్ కట్టించి తెచ్చాను. ప్రతి శనివారం బడీచౌడీ లోని శ్రీ హనుమంతులవారి గుడికి వెళ్ళాలనుకున్నాను. ఈ కష్టాలనుంచి ఎప్పుడు గట్టెక్కుతానో కదా అని దిగులుగావుంది. ఇవాళ బాబూరావును కూచోబెట్టి హనుమద్భక్తిని బోధించాను. ఇంతే సంగతులు.

## సెప్టెంబరు 2 :

ఇవాళ గోల్చాకేఫ్‌లో పకోడా తిన్నాను. అమోఘం. ఎదురుగుండా ఇంత మంచి హోటల్ పెట్టుకుని ఇన్నాళ్ళూ గుర్తించలేకపోయాను గదా అని బాధపడ్డాను. అనేక విషయాల్లో మనం ఇలాగే నగ్న సత్యాలను ఆలస్యంగా గుర్తించుతూ వుంటాము. పకోడా నేర్పిన గుణపాఠం ఇది.

బాబూరావు ఎక్కడో మోటార్ సైకిల్ సంపాయించాడు. కూలింగ్ గ్లాసెస్ పెట్టి, ఫోజుగా సిగరెట్టు త్రాగుతూ రంయ్‌మని వచ్చాడు. నన్ను వెనక ఎక్కమన్నాడు. నాకు షేమ్ అనిపించింది. నేను మోటార్‌సైకిల్ తొక్కుతుంటే వరలక్ష్మి వెనక కూర్చోవాల్సిందిపోయి, బాబూరావు తొక్కడం, నేను వెనక ఎక్కడమూ ఖర్మకాలి పోయి అనుకున్నాను. నేను రాను పొమ్మన్నాను. పోయాడు. మోటార్ సైకిల్ తొక్కాలన్న కోరిక తీరని కోరికై పోయింది. ప్చ్... ఎప్పటికో కదా ఆ యోగం. జై హనుమాన్ !

కాలేజి నుంచి బస్సులో వస్తుంటే ఓ అమ్మాయి నన్ను "స్కౌండ్రల్" అంది. అమ్మాయికి నా భుజం రాసుకుందిట. నాకు తెలీదు. అమ్మాయే చెప్పింది. అలా అని.

(ఉదా: పురుషులకంటే స్త్రీలకు స్పర్శ జ్ఞానము ఎక్కువ) బస్సు కిటకిటలాడి పోతూంటే మరి భుజం రాసుకోవడంలో ఆశ్చర్యం ఏముంది. దానికి అంతమాట అనాలా? 'స్కౌండ్రల్' స్పెల్లింగ్ తెలుసా అని అడిగాను. తెల్ల మొహం వేసింది. (నాకూ తెలీదు) అసలు అస్పృశ్యతా నివారణ చట్టం క్రింద ఆమెపై కేసు పెట్టవలసిన అవసరం వుందని వాదించాను. అందరూ నవ్వారు. అమ్మాయికూడా నవ్వింది. ఇందులో నవ్వడానికి కేముందో నాకు అర్థం కాలేదు. ఆమె నవ్వు శరత్కాలపు వెన్నెల వలె వున్నది. నా భుజం రాసుకున్నప్పుడు ఆమె ఒళ్ళు పులకరించి వుంటుంది బహుశ : (సహజం కదా మరి) ఆ పులకరింతయే తదుపరి నవ్వుగా అభివ్యక్తమై వుంటుంది.

## సెప్టెంబరు 7 :

వినాయకచవితి. తెల్లవారు ఝామున లేచి తలారా స్నానం చేశాను. డాబా మీద ఒళ్ళు తుడుచుకుంటుంటే పక్కింటి కోతి వాళ్ళ డాబా మీంచి చూసింది. అంత చీకటిలో ఆ అమ్మాయికి డాబామీద ఏంపనో! నాకు షేమ్ అనిపించింది. వాళ్ళ తమ్ముడు గణేష్ (లడ్డూగాడు) నన్ను చూసి లేవిడీ అన్నాడు ఏదో కుర్రవెధవ అని వదిలేశాను. సుల్తాన్ బజార్ మార్కెట్‌కి వెళ్ళి పత్రీ, పూలు తీసుకొచ్చేసరికి రూమ్‌లో నాన్నగారు ప్రత్యక్షమయ్యారు. ఆయన వచ్చేసరికి సారథి, భాస్కర్రావు ఇంకా నిద్రపోతున్నారట. వీళ్ళచేత బలవంతంగా చన్నీళ్ళు తలారా స్నానం చేయించారు ఆయన. ఈయనెక్కడ దొరికాడ్రా అని గొణుక్కుంటున్నారు వీళ్ళు. మాచేత మడి గట్టించి పూజ్జేయించారు. మంత్రాలు మొదలయినవి ఆయనే చదివారు. పుస్తకాలకి పసుపు, కుంకుంబొట్లు పెట్టించారు. మా మొహాలకి కూడా బొట్లు పెట్టారు. ఇవాళంతా వాటిని చెరపద్దన్నారు. నాన్నగారు చూడకుండా నా డైరీకి కూడా బొట్లు పెట్టాను. అది నా ఆత్మకు అద్దం కదామరి. తరవాత నాన్నగారు, నేను మావయ్యగారింటికి వెళ్ళాం భోజనానికి. వర్లక్ష్మి హాల్లో కూర్చుని నోట్సు రాసుకుంటోంది. నన్ను చూడగానే సిగ్గుతో చివాలున లేచి తలుపు చాటుకి వెళ్ళిపోతుందేమో ననుకున్నాను. కాని నా ఆశ నిరాశే అయింది. కదలనైనా లేదు. “దాన్ని చూచి సిగ్గుతెచ్చుకోరా. పండగ పూట కూడా ఎంత శ్రద్ధగా చదువుకుంటోందో” అన్నారు నాన్నగారు. నన్నుచూసి తను సిగ్గుపడడం పోయి దాన్ని చూసి నేను సిగ్గుపడాలా? స్త్రీకి సిగ్గే సింగారం కదా? మగవాడు సిగ్గుపడితే ఆడంగిగా వుంటుందంటారు. వరహీనం అంటారు. భోజనం టైములో నాన్నగారు, మావయ్య రాజకీయాల్లో పడి నా వునికినే గుర్తించలేదు. నాన్నగారు అక్కడే వుండిపోయారు. నన్ను రూమ్‌కి పొమ్మన్నారు. రాత్రి పడుకునేందుకు మాత్రం వస్తానన్నారు. హమ్మయ్య అని బైటపడ్డాను. మధ్యాహ్నం నేనూ, సారథీ, భాస్కర్రావు మాట్నీకి చెక్కేశాము. పిక్చరంతా మాబ్ ఎట్రాక్షన్ తప్ప నాలాంటి ఇంటలెక్చువల్స్ చూడదగినదిగాలేదు. న్యూస్‌రీలులో క్రికెట్ మాచ్ మాత్రం ఉద్రూత లూగించేసింది. క్రికెట్ ఆట పురుషత్వానికి చిహ్నం. అది ఆడని జన్మ వృధా. ఎప్పటికైనా పటౌడీని ఓడించాలని ప్రతిజ్ఞ పట్టాను. రేపే బషీర్‌బాగ్‌లోని ఇంటలెక్చువల్స్ క్లబ్‌లో చేరి క్రికెట్ నేర్చుకోవాలనుకున్నాను. జై హనుమాన్.

## సెప్టెంబరు 8 :

రాత్రి నిద్రపట్టలేదు, నాన్నగారు ఒకటే గుర్రు. మరీ అంత సౌండ్‌స్లీప్ పనికిరాదు. ఏదైనా మందు పుచ్చుకోరాదూ !

ఈ మధ్య అమూల్యమైన మధురానుభూతుల వెన్నింటినో కోల్పోతున్నాను. వాటిలో వెన్నెల ఒకటి.



అటు వెన్నెల, ఇటు వెన్నెల

ఎటు చూసిన విరివెన్నెల

తెల్లని వెన్నెలా

విచ్చిన పొన్నలా

మెరిసే వెన్నలా...

నా కవిత్వం అడవినిగాచిన వెన్నెలైపోతున్నది. "సుజనమిత్ర'లో వేసేందుకు ఎడిటర్ గారు ఛాన్సు ఇవ్వడంలేదు.

ఇవాళ ఇంటలెక్చువల్స్ క్లబ్‌కి వెళ్ళాను. అక్కడ అందరూ కాంభోజిరాగం, అటతాళం, టాగోర్‌స్కూల్ ఆఫ్ ఆర్ట్, పికాసో ఇంప్రషనిజం, యాంగ్రీయంగ్‌మెన్ లిటరేచర్, ఎగ్జిస్టెన్షియలిజం, రంజీట్రాఫీ, డేవిస్‌కప్, చర్చిల్ రాజనీతి, నేఫాలో ఇండియన్ ఆర్మీ రివర్సల్సు మొదలయిన వాటిని గురించి చర్చిస్తున్నారు. కొందరు వెనక ప్లే గ్రౌండ్‌లో టెన్నిస్ ఆడుతున్నారు. చందా వివరాలు కనుక్కొని గుండె ఆగిపోయి వచ్చేశాను. ఇంటి ముందు ఇంటాయన కొడుకు ఉండ్రాయిగాడు, పక్కింటి కోతి తమ్ముడు లడ్డూగాడు, ఇంకా కొందరు కుర్రాళ్ళు క్రికెట్ ఆడుతున్నారు. ఈ రోజుల్లో చిన్నపిల్లలకి క్రికెట్ ఆడడం ఫాషనైపోయింది. శుభ్రంగా గోడెం బిళ్ళ ఆడుకోరాదూ. ప్రయోగాత్మకంగా నేనూ ఒక నిమిషం ఆడదామని ఉండ్రాయిగాడి దగ్గర బాట్ తీసుకున్నాను. లడ్డూగాడు పూచి పుచ్చుకుని బాల్ విసిరేసరికి అది వచ్చి నా కుడి కాలి పిక్కమీద తగిలింది. పెద్ద ఆర్తనాదం చేసేసరికి అందరూ పోగయ్యారు. కోతి కూడా చూసింది. జంఘిక, జానుక విరిగి పోయి వుంటాయనుకున్నాను. ఎక్స్‌రే తీయించాలేమోననుకున్నాను. ఇంటాయన "ఏమీ అక్కర్లేదు. జాంబక్ రాయి. తగ్గిపోతుంది" అంటూ ఏదో ఆయింట్‌మెంట్ యిచ్చాడు. ఇంకా నయం కొంచెం పైన తగిలి వుంటే మడతబందు కీలు తొలగిపోయేది.

ఇవాళ రెండు గొప్ప నీతులు నేర్చుకున్నాను. కాని పనులకు పోరాదు. దురాశ దు:ఖమునకు చేటు. సాహిత్యం, కళలు, ఫిలాసఫీలలో సాధించిన విజ్ఞానముతో తృప్తిపడక క్రీడారంగములో సైతం ఆరితేరాలని ఆశపడ్డాను.

జై హనుమాన్.

## సెప్టెంబరు 14:

రాత్రి అంతా ప్రేమ, హృదయము, పులకింతలను గురించి, వీటి మధ్యగల అవినాభావ సంబంధము గురించి తీవ్రంగా ఆలోచించాను. ప్రేమ, హృదయము, పులకింత వరుసగా గులకరాయి, నిశ్చల సరోవరము, చిరుకెరటముల వంటివి. (క్రమాలంకారము). అనగా ప్రేమరాయి హృదయ సరోవరమునందు విసిరినచో పులక తరంగములు శరీరమంతయునూ వ్యాపించును. దీనిని సైంటిఫిక్‌గా కూడా రుజువు చేయవచ్చును. హృదయం నుంచే కదా శరీరములోని అణువణువునకు రక్తం ప్రవహించునది. ఆ హృదయమునందు ప్రేమ పడినప్పుడు అది రక్తములో కలిసి, కరిగి ధమనుల ద్వారా శరీరమంతయూ ప్రవహించును. శరీరమంతయూ పులకించుటకు కారణమిదియే. ఇది చాలా గొప్ప ఐడియా. నేను గొప్పవాడినయ్యే వరకూ ఈ థియరీని రహస్యముగా నుంచవలెను. లేకుంటే ఎవరైనా కాపీ కొట్టేసి డాక్టరేట్ పుచ్చేసుకుంటారు. నా నోట్లో మట్టే. జై హనుమాన్.

ఇవాళంతా ప్రేమ గురించే ఆలోచిస్తూ పరధ్యానంగా నాన్నగారినుంచి వచ్చిన వుత్తరాన్ని కంపోజ్‌కిచ్చాను. తీరా అది 'సంపాదకునకు లేఖలు' కాలమ్‌లో పెడుతుంటే చూసి పట్టుకున్నాను. పేపర్లో పడి వుంటే నా వుద్యోగం వూడిపోయేది. కాని, ఒక గొప్ప విషయం కనిపెట్టాను. ఆ ఉత్తరాన్ని కంపోజ్ చేసినవాడు, ప్రూఫ్ చూసినవాడు కూడా ప్రేమలో పడి వుంటారు. లేకపోతే అంత పరధ్యానంగా ఉండరు. జగమే ప్రేమమయం. ఓం శాంతి: శాంతి: శాంతి:!

## సెప్టెంబరు 19:

కాలేజీకి వెళ్ళబోతుంటే ఇంటాయన కొడుకు శేషాద్రి (ఉంద్రాయిగాడు) వచ్చి పట్టుకున్నాడు. 'రాష్ట్రపతి విధులెవ్వి?' అంటూ నిగ్గదీశాడు. ఇవాళ వాడికి పరీక్షట. 'పుస్తకంలో లేదా' అని అడిగితే ఆ కాయితాలు ఎవడో కుర్రాడు చింపి పట్టుకు పోయాడని చెప్పాడు. 'మీరు ఎడిటరు కదాని మీచేత చెప్పించుకోమన్నాడు నాన్న' అన్నాడు. ఆ ముక్కు పచ్చలారని కుర్రవాణ్ణి చూస్తే జాలేసింది. పరేనని క్లుప్తంగా చెప్పాను. (1) విదేశములలో పర్యటించుచూ విందులు ఆరగించుట. ప్రముఖులతో కరచాలనములు చేయుట. (2) స్వదేశములో ప్రారంభోత్సవములు చేయుచూ ఉపన్యాసములిచ్చుట. (3) తీరిక సమయములందు ప్రభుత్వ సిఫార్సులపై ఆమోద ముద్రలు వేయుట. ఉంద్రాయిగాడు చాకులాంటి వాడు. ఒక్క ముక్క

అందిస్తే చాట భారతం రాయగలడు. ఫస్టు మార్కు వచ్చినా ఆశ్చర్యం లేదు.




'గోల్డ్‌రష్' అనే చార్లీచాప్లిన్ సినిమా చూశాను. మంచి హ్యూమరసప్రధానంగా వుంది. చాప్లిన్ బాగానే యాక్ట్ చేశాడు గాని రాజకపూర్‌ని యిమిటేట్ చెయ్యడం మాత్రం నాకు నచ్చలేదు. వర్జినాల్టీ శూన్యం. మరి అతనికి అంతపేరు ఎలా వచ్చిందో ఆశ్చర్యం. దీనిమీద ఏకేస్తూ రివ్యూరాసి కంపోజ్‌కిచ్చి వచ్చాను. "చాప్లిన్ బాగా ముసలాయన. ఆయన రాజకపూర్‌ని యిమిటేట్ చెయ్యడం ఏమిటి నీ తలకాయ్" అన్నాడు భాస్కర్రావు. "అంత ముసలాయన యిమిటేట్ చెయ్యడమేమిటీ. ఏదో కుర్రవాళ్ళు చేశారంటే అర్థం వుంది" అన్నాను. అది ఎప్పటిదో పాత పిక్చరని చెప్పాడు భాస్కర్రావు. "అయితే అది మరీ విచారకరం. అంత పాత కాలంలో కూడా ఆయన రాజకపూర్‌ని యిమిటేట్ చేసేవాడన్నమాట" అన్నాను. అతను యింక వాదించలేక చేతులెత్తేశాడు. ప్రతిదానికీ ఎడ్డెం అంటే తెడ్డెం అంటాడు భాస్కర్రావు.

ఈ మధ్య వ్యాయామం బాగా సాగడంలేదు. సాహితీ వ్యాసంగంతో అన్నీ అడుగంటాయి.

## సెప్టెంబరు 25 :

ఇవాళ పాత డైరీలన్నీ తిరగేసి చూశాను. అప్పటికీ యిప్పటికీ చాలా డెవలప్ అయాను. డైరీ ప్రారంభించిన కొత్తలో రాసినవి చదువు తుంటే నాకే కడుపు చెక్కలయ్యేట్టు నవ్వొస్తోంది. ఇక భాస్కర్రావు, సారథి నవ్వుకునే వారంటే అబ్బురమేముంది? ఆరోజుల్లో వాళ్లని అపార్థం చేసుకున్నాను. బెల్లంధర, పంచదార ధర కూడా డైరీలో రాసేవాణ్ణి సిల్లీగా. (ముందు ముందు మనం గొప్పవాళ్ళమై "పద్మభూషణ్' అయిపోతే, మన తదనంతరం మన శత జయంత్యుత్సవ సంఘం వాళ్ళు ప్రింటు చేసేందుకు తగినట్టుగా వుండాలి డైరీ. అందుచేత విజ్ఞానాత్మక విషయాలకే డైరీని పరిమితం చేయాలి). ఆ రోజుల్లో అయోమయత్వం వుట్టిపడుతూ వుండేవాణ్ణి. కాని ఇప్పటికీ వాళ్ళు నన్ను చూసి నవ్వడమే అనౌచిత్యంగా వుంది. టక్‌చేసి, ఫుల్‌బూటువేసి, కూలింగ్ గ్లాసెస్ పెట్టి, పైపు కాలుస్తూ రోడ్డుమీద పోతుంటే నన్నుచూసి అదిరిపోతున్నారు జనం. అలాని ఈ మధ్య బాబూరావు చెప్పాడు. మోట్రసైకిలొక్కటే తక్కువన్నాడు.

క్లాసులో భాస్కర్రావు సారథి, బాబూరావు వెనక బెంచీల్లో కూర్చుని తమ తమ తెలివితేటలను ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా వక్రమార్గం పట్టిస్తూ చెడిపోతున్నారు. పులిని చూసి నక్క వాతలు పెట్టుకున్నట్టు నన్ను చూసి భాస్కర్రావు కూడా కవిత్వం రాయడం మొదలు పెట్టాడు క్లాసులో. ఇక సారథి అందరికీ నిక్‌నేమ్స్ పెట్టడంలో ఆరితేరాడు. కాలేజీ బ్యూటీ చారుమతికి పప్పుచారుమతి అని పేరు పెట్టాడు ఇవాళ. (అమ్మాయి యింటి పేరు 'పి' కదా మరి) క్లాసులో పాఠం జరుగుతుండగా పప్పు చారుమతి పేరు కాయితం మీదరాసి బాబూరావు స్టూడెంట్సు అందరికీ చూపించి ప్రచారం చేశాడు. అందరూ ఒకటే నవ్వు. ఎందుకు నవ్వుతున్నారో మేస్టారుకి అర్థం కాలేదు. అంతమంచి పేరు పెట్టినందుకు సారథిని హృదయపూర్వకంగా అభినందించవలసిందేకాని, అతను తన ప్రతిభను నిర్మాణాత్మక కార్యకలాపాలకు వినియోగిస్తే మంచిది. వెనక బెంచీలో కూర్చోవడం తప్పని నేను అనను. ఉదాహరణకు నేనూ వెనక బెంచీలోనే కూర్చుంటాను. కాని, నేను క్లాసులో వున్నంత సేపూ వేదాంతం, ప్రేమ, జర్నలిజం, సైకాలజీ మున్నగు విజ్ఞానాత్మక విషయాలగురించి ఆలోచిస్తూ వుంటాను.

ఆఫీసు తరవున సినిమాలకీ, సంగీత కచేరీలకీ రిక్షాలో వెళ్ళడం షేమ్‌గావుందనీ, ఒక మోట్ర సైకిల్ కొనమనీ ఎడిటర్‌గారికి సజెస్టు చేశాను. ఆయన నవ్వాడు. ' ఈ పత్రిక్కి మోట్రసైకిల్ కొనే స్తోమతేవుంటే నీలాంటి వాణ్ణి సబ్ ఎడిటర్‌గా ఎందుకు తీసుకుంటారోయ్' అన్నాడు. నర్మ గర్భాలంకారంవేసి మాట్లాడాడు. (లేకపోతే భ్రాంతి మదలంకారమో నాకు అర్థంకాలేదు.)

## అక్టోబరు 2 :

గాంధీ జయంతి. గాంధీజీ కలలుగన్న ఆదర్శ ఆర్థిక వ్యవస్థ గురించి ఆ మధ్య నాన్నగారు ఉపన్యసించిన విషయాలను మననం చేసుకున్నాను. ఈనాడు దేశంలో దారిద్ర్యం ఇంతగా ప్రబలడానికి ప్రధాన కారణం ఫాషన్లు పెరగడమే. ప్రజలు నాజూకు మీరారు. ఇంటి ముందు కుంకుడు చెట్టు వుండగా లక్జరీ లవెండర్ సోప్ కోసం అర్రులు జాస్తున్నారు. గాంధీ గారు కనిపెట్టిన ఖద్దరు వుండగా తిండియైన మానుకొని టెర్లిన్ బట్టలు ధరించుచున్నారు. పైగా డబ్బు చాలుట లేదని జీతములు పెంచమంటున్నారు. శుభ్రముగా తోలుబొమ్మలు, వీధి భాగవతములు వుండగా రిక్షా వారు సైతము సినిమాలు చూస్తున్నారు. కుటీర పరిశ్రమలు అడుగంటుట వల్లనే నిరుద్యోగము ప్రబలినది. ఆర్థిక వ్యవస్థను పటిష్ఠం చేయడానికి అత్యవసరమైన చర్యలు యివి : వనమహోత్సవంలో భాగంగా బాటల కిరువైపులా

కుంకుడు చెట్లు, చింత, మామిడి, ఉసిరి (ఊరగాయల జాతిచెట్లు), వెలగ మున్నగు చెట్లు నాటుట. ప్రతి చెట్టు క్రింద ఒక కుటీరం వేసి రాట్నములు వడికించుట. సినిమాలను నిషేధించుట. భారీ పరిశ్రమలను నిర్మూలించుట. యువతీ యువకులకు నిర్బంధ వ్యవసాయ శిక్షణ ఇచ్చుట (చైనాలో నిర్బంధ సైనిక శిక్షణ మోడల్లో).



కాలేజీలో గాంధీ జయంతి సభకు ఖద్దరు పంచె, ఖద్దరు లాల్చీ ధరించి, గాంధీ టోపీ పెట్టుకుని వెళ్ళాను. స్టూడెంట్సు నవ్వారు. నవ్వి పోదురుగాక నాకేటి సిగ్గు; నా ఇచ్ఛయేగాక నాకేటి వెరపు. ఈనాడు గాంధీజీ మనమధ్య లేకున్ననూ ఆయన సిద్ధాంతములు ఈనాటికీ చెక్కు చెదరక వున్నాయనీ, ఆయన పేరు నిలబెట్టగలవారు ఇప్పుడూ, ఎప్పుడూ వుంటారనీ మంత్రి గారు అన్నారు. ఆమాట నిజమే. గాంధీ గారి పేరు నిలబెట్టడానికి ఇందిరా గాంధీ గారున్నారు కదామరి.

## అక్టోబరు 9 :

ఏమిటో ఈ కాలంలో నినాదాలు తీవ్ర పర్యవసనాలకు దారితీసేవిగా కనిపిస్తున్నాయి. "దున్నేవాడిదే భూమి" అంటున్నారు రైతులు. అంటే వ్యవసాయం చాతైన వారికేభూమి వుండాలని తాత్పర్యం. బాగానే వుంది. కాని రేపు రజకులు 'ఉతికే వాడిదే బట్ట' అని పేచీ పెట్టవచ్చు. ఎల్లుండి నాయీ బ్రాహ్మణులు 'గొరిగే వాడిదే తల' అని వాదించరని గ్యారంటీ ఏమిటి? మహాత్మా గాంధీకి చాలా దూరదృష్టి వుంది. తన కాలానికి 50 ఏళ్ళ తర్వాత జరగబోయే వాటిని ముందుగానే వూహించారు ఆయన. అందుకే ఆయన తన బట్టలు తానే వుతుక్కునేవారు. తన క్షవరం తానే చేసుకునేవారు. ఈ నిగూఢ సత్యాన్ని ఇంతవరకు ఆయన ప్రియ శిష్యులు కూడా కనిపెట్టలేకపోవడం ఆశ్చర్యం.

ప్రపంచమంతటా కూడా అన్ని వృత్తుల వారూ ఈనాడు సమ్మెలు చీటికీ మాటికీ చేస్తున్నారు. ఇటువంటి పిదప కాలం వస్తుందనే మహా పురుషులు ఎలెక్ట్రిక్ షేవర్లు, వాషింగ్ మెషీన్లు కనిపెట్టారు. (నాకు ఇంతటి ఒర్జినల్ ఐడియాస్ వస్తుంటే హర్షించే వాళ్ళు లేరు కదా ! మనదేశంలో ప్రతిభకు తగిన పరిగణన లేదు. అందుకే గొప్ప విజ్ఞానులందరూ విదేశాలకు వెళ్ళిపోతున్నారు. స్వదేశంలో వుండే యోగం నాకూ వున్నట్టు లేదు)

## అక్టోబరు 13 :

ఇవాళ తెల్లారు జామున భాస్కర్రావు తన ప్రేమకథని సారధితో చెబుతుంటే విన్నాను. నేను నిద్రపోతున్నాననుకున్నారు. అతను సరోజను ప్రేమిస్తున్నాట్ట. కాని ఆమె వెంకటేశ్వర్రావుని ప్రేమిస్తోందిట. అయితే వెంకటేశ్వర్రావు తన హృదయాన్ని పద్మకు అర్పించాడట. కాని పద్మ అంతకుముందే తన మనస్సును భాస్కర్రావుకు అంకితం చేసిందట. ఇతను మాత్రం ఆమెను ప్రేమించలేక పోతున్నాడు. సరోజనే ధ్యానిస్తూ ఆజన్మ బ్రహ్మచారిగా వుండడమా? లేక తననే ధ్యానిస్తున్న పద్మను చేసుకుని ఆమె సుఖంకోసం తన ప్రేమను త్యాగం చేయడమా? కర్తవ్యం తెలీక కన్నీళ్ళు పెట్టుకున్నాడు భాస్కర్రావు. "ఈ విషవలయాన్ని ఛేదించడం ఎలా సారథీ? ఈ హృదయవేదన ఎలా తీరుతుంది? ఈ జీవితమిక యింతేనా? ఈ బ్రతుక్కి యిక నిష్కృతి లేదా?" అని అతడు దు:ఖించాడు. " ఓరి బాబోయ్: భాస్కర్రావుకి కూడా ప్రేమించడం చాతవునన్నమాట" అనుకున్నాను. కాని, అతను తన విషాద గాథ వివరిస్తూంటే నాకు కన్నీరు ఆగలేదు. దుప్పటినిండా ముసుగెట్టుకునే ఏడ్చాను. కథ అంతా విన్న తర్వాత సారథి ఎంతో స్నేహంగా భాస్కర్రావుని సముదాయించాడు. అక్కడే నాకు మండుకొచ్చింది. స్నేహితుల మధ్య ఇంత పక్షపాతం పనికిరాదు. నా ప్రేమని వేళాకోళం క్రింద తీసిపారేసి, భాస్కర్రావు పట్ల సానుభూతి చూపడం నిజంగా మిత్రద్రోహం. ఒక్కసారి ముసుగు తీసిపారేసి సారధిని పట్టుకుని దులిపేశాను. అతను తన తప్పును ఏకగ్రీవంగా అంగీకరించాడు. నేను అతన్ని హృదయపూర్వకంగా క్షమించాను. తర్వాత చెప్పాడు సారథి "ప్రేమ అనేది దూరం నించి చూస్తే హాస్యం పుట్టుకొస్తుంది. దగ్గర్నించి చూస్తే సీరియస్‌గా కనిపిస్తుంది. ముట్టుకు చూస్తే మహా డేంజర్‌గా వుంటుంది" అని. కృష్ణదేవరాయలైతే ఆ మాటకు అక్షర లక్షలు యిచ్చి వుండేవాడు. ఇంతటి ముక్కుపచ్చలారని లేబ్రాయంలో సారథికి ఇంత అద్భుతమైన థాట్ ఎలా వచ్చిందో! బహుశ: స్వానుభవంతోనే చెప్పి వుంటాడు. ఇవ్వాల్టినుంచి డిటెక్షన్ ప్రారంభించాలి.



ఈ రోజుల్లో హోటల్ సర్వర్స్‌కి కూడా బొత్తిగా వినయం లేకుండా పోయింది. ఇవాళ చాముండి హోటల్లో బజ్జీలు తిని ప్లేట్లో చెయ్యి కడుక్కుని, ఒక కప్పు పాలు తెమ్మన్నాను. (ఇటీవల కాఫీ కంప్లీట్‌గా మానేశాను.) నీళ్లపాలు తెచ్చాడు. ఈ మధ్య ప్రతివాళ్ళతోనూ పేచీలు వస్తున్నాయి. నిగ్రహంగా వుండడం మంచిదనుకున్నాను. కాని,

సర్వర్ "ప్లేట్లో నీళ్ళు ఎందుకు పోశారు వాష్ బేసిన్ వుండగా" అని లడాయి వేసుకున్నాడు. నాకు ఒళ్లు మండింది. "నువ్వు పాల్లల్లో నీళ్ళు పొయ్యగాలేంది నేను ప్లేట్లో పోస్తే వచ్చిందా?' అని డబాయించాను. తెల్లమొహం వేసి వెళ్ళిపోయాడు. జై హనుమాన్!

## అక్టోబరు 18 :

కాలేజీకి వెళ్ళబోతుంటే సారథి "తలమీద బొప్పి ఏమిటోయ్?" అని అడిగాడు. అద్దంలో చూసుకుంటే నిజంగానే వుంది. ఎలా వచ్చిందా అనుకున్నాను. ఏ గుమ్మమో కొట్టుకుని వుంటుంది. ఆమాటే చెప్పాను. సారథి నవ్వడం మొదలెట్టాడు. ఇందులో నవ్వడానికేముందో తెలీదు. ఒక్కొక్కప్పుడు అతను మరీ సిల్లీగా బిహేవ్ చేస్తాడు. 'గుమ్మం కాకపోతే గోడ. అదీ కాక పోతే తలుపు. ఏదో ఒకటి తగలకపోతే తల బొప్పి కట్టదు కదా' అని వాదించాను. అతను నవ్వు ఆపకుండా భాస్కర్రావుకి చెప్పాడు. తర్వాత యిద్దరూ కలిసి నవ్వడం మొదలెట్టారు. "మీ యిద్దరితో వేగలేక తల బొప్పి గట్టింది" అన్నాను. వాళ్ళు నవ్వు ఆపి ఆశ్చర్యపోయారు.

ఎడిటరు గారు రోజూ నా తప్పులు చూపించి ఎద్దేవా చేస్తుంటారు. నాకు ఔచిత్యం తెలీదంటూ వుంటారు. పోనీలే ఏదో పెద్దవాడు అని వూరుకుంటున్నాను కానీ వెతికితే ఆయన రాతల్లోనూ తప్పులు కనబడతాయి. ముప్ఫయి రోజులుగా నిరాహార దీక్ష చేస్తున్న ఒక నాయకుని గురించి ఆయన ఎడిటోరియల్ రాశారు. ఆ నాయకుడు గారు పూర్వం చేసిన త్యాగాలన్నీ ఏకరువుపెట్టి "ముప్ఫయి రోజుల దీక్ష వల్ల ఆయన శల్యావశిష్టులై పోయారు' అని రాశారు. ఈ మాటల్లో ఏమైనా ఔచిత్యం వుందా? ఇహ వూరుకుంటే లాభం లేదని వెళ్ళి మొహం మీదే అడిగేశాను. "ఆయన ఎంత గొప్పవాడైనా కావచ్చు. కాని, ఆయన్ని శల్యుడు, వశిష్టుడు మున్నగు పురాణ పురుషులతో పోల్చడం ఎంత మాత్రం బాగాలేదు. పైగా అసందర్భం" అన్నాను. ఎడిటర్‌గారు తెల్లమొహం వేశారు. నేను రంయ్‌మని బయటికొచ్చేశాను. తర్వాత ఆయన ఏదో గొణుక్కోవడం వినిపించింది. నాన్నగారు, తను బాల్యస్నేహితులు కావడంవల్ల ఆయన మొహం చూసి నాకు ఉద్యోగం యిచ్చారట్ట. బుద్ధి తక్కువైపోయిందట.

ఇదిలా వుండగా ఎకనామిక్స్ లెక్చరర్ ఆత్మరామ్ గారికి సారథి బలే నిక్ నేమ్ పెట్టాడు. ఆస్మారామ్ అని. (పాఠం చెబుతూ ఆయన అస్తమానం గుక్క తిప్పుకోకుండా దగ్గుతూ వుంటాడు. పాపం ఆయనకి విపరీతమైన ఆస్మా). నవ్వలేక చచ్చాను. మరీ నా అంత చేటు కాకపోయినా మధ్య మధ్య సారథి క్కూడా బ్రిలియంటు జోక్సు వస్తూ వుంటాయి.

పొగిడితే చెడిపోతాడని వూరుకున్నా. ఆస్మారామ్ అనే పేరు అప్పుడే కాలేజీ అంతా మోగిపోయింది. సారథి కూడా రహస్యంగా బ్రిలియంట్రైన్ రాస్తున్నాడేమోనని నా అనుమానం.

## అక్టోబరు 25:

రాత్రి పండిత్ రవిశంకరు గారి సితార కచేరీకి వెళ్ళాను. ఆఫీసుకు యిన్విటేషన్ వస్తే ఎడిటరుగారు నన్ను మ్యూజిక్ క్రిటిక్‌గా పంపించారు. శ్రీ రవిశంకరు గారు మిక్కిలి అద్భుతంగా వాయించి నన్ను ఉత్తేజపరచారు. బియ్యే ఐపోగానే సితార నేర్చుకుని అమెరికా వాళ్ళని వుర్రూతలూగించేయ్యాలని తీర్మానించుకున్నాను. రవిశంకరుగారు మాల్కోస్, జైజైవంతీ, బేహాగ్, బహార్ రాగాలను వరుసగా తీన్‌తాల్, ఏక్‌తాల్, ఝుప్‌తాల్, కేహర్వా తాళాల్లో పధ్నాలుగు అలంకారాలు వేసి, నూటొక్క కళలతో వాయించగా సభాసదులు మూర్ఛనలు పోయారని రివ్యూరాసేసరికి ఎడిటర్‌గారు డంగై పోయినట్లు కనిపించారు. (రాగ తాళ వివరాలు కొన్ని శంకరు గారే ప్రకటించారు. మరి కొన్నింటిని పక్కనున్న క్రిటిక్ ద్వారా తెలుసుకున్నాను. మిగతా వర్ణన, వ్యాఖ్యానం నా సొంతం. జర్నలిస్టు అన్నవాడికి కొంత కనీసపు డబాయింపు అవసరం.)

కచేరి ఇంటర్వెల్‌లో ఓ తమాషా జరిగింది. క్రిటిక్‌ని కదా కొంచెం పోజుగా వుంటుందని సైపు కాల్చాలనుకున్నాను. అగ్గిపెట్టెలేదు. వరండాలో ఎర్రబకెట్లు ఒక స్టాండునకు వేళ్లాడుతున్నాయి. పైన 'ఫైర్' అని ఇంగ్లీషులో రాసి వుంది. వెలిగించు కుందామని దగ్గరికి వెళ్ళి చూస్తే వాటిలో ఇసక వుంది. నాకు ఒళ్ళు ఫైరై పోయింది. తిన్నగా మేనేజర్ దగ్గరకు వెళ్ళి "ఆయాం రాంబాబూ ఫ్రమ్ 'సుజనమిత్ర' మోస్ట్ ఫేవరిట్ డైలీ ఆఫ్ ఆంధ్రా" అని పరిచయం చేసుకుని, "మీరు ఏం పాసయ్యారు?" అని అడిగాను. ఎం.ఏ అన్నాడు. 'ఫైర్' అంటే ఏమిటని అడిగాను. తెల్లబోతూ 'నిప్పు' అన్నాడు.




"మరి ఆ బకెట్ల లో ఇసుక పోయడంలో మీ ఉద్దేశ మేమిటి?" అని అడిగాను. ఆయన ముందు ఆశ్చర్యపోయి తర్వాత నవ్వడం మొదలుపెట్టాడు. "భలే జోకువేశారు మేష్టారూ" అన్నాడు. నేను సీరియస్‌గా అడుగుతుంటే జోకు అంటాడేమిటి పెద్దమనిషి? సమాధానం చెప్పలేక మాట దాటేస్తున్నాడని నేను రయ్‌మని వచ్చేశాను. రూమ్‌కి వచ్చి ఈ ఉదంతం చెబితే భాస్కర్రావుకూడా నవ్వడం మొదలుపెట్టాడు. "అగ్ని ప్రమాదం సంభవిస్తే చల్లడంకోసం

బకెట్లలో ఇసక పోశారు." అని చెప్పాడు "బాగానే వుందయ్యా. శుభ్రంగా ఇసక అని రాయకూడదూ అన్నాను. ఇంగ్లీషు సంప్రదాయం అంతే నని వాదించాడు భాస్కర్రావు. బోడి సంప్రదాయం. అతను చెప్పింది నిజమే కావచ్చుకాని, ఇంగ్లీషుమీద మహా రోత పుట్టుకొచ్చింది. అంత అపభ్రంశపు భాష ఇంకోటి లేదనిపించింది. ఈ విషయంలో నేను శ్రీవిశ్వనాథ వారితో ఏకీభవిస్తాను.

## నవంబరు 1

పొద్దున్నే ఉంద్రాయిగాడు వచ్చి "నరకాసురుడనగా నెవరు? అతడి కాపేరు ఎట్లు వచ్చెను" మున్నగు ప్రశ్నలతో వేధించాడు. తెలీదు పొమ్మంటే వినిపించుకోడు. కాంపోజిషన్ రాసుకు రమ్మన్నారట మేష్టారు. "నరకాసురుడు నరకలోకాధీశుడు. రాక్షసుగుటను బట్టి నరకాసురుడను పేరు వచ్చినది. అతడికే నరకుడనియూ, నరకాధిపుడనియూ పేర్లు గలవు. ఋషులు, మునులు మున్నగు వారిని చెరబట్టి నరకుటచే వానికా పేరు ప్రసిద్ధమయ్యెను" అని చెప్పి వాణ్ణి వదిలించుకున్నాను. వెధవకి వర్జినాల్టీ లేదు. ఒక్కక్షణం దీర్ఘంగా ఆలోచిస్తే వాడికే తెలిసేది వ్యుత్పత్తి అర్థం.

పద్మశ్రీ, పద్మభూషణ్ మున్నగు బిరుదుల కేటాయింపులో కేంద్ర ప్రభుత్వం పక్షపాతంతో వ్యవహరిస్తున్నదని ఈ మధ్య ఒక సినిమా కళాకారుడు అన్నారు. నేను ఆయనతో ఏకగ్రీవంగా ఏకీభవిస్తాను. ముఖ్యంగా నాగాల్యాండ్, నేఫా, అండమాన్ నికోబార్, లక్కదీవుల ప్రజలకు, దేశంలోని అనేక మన్య ప్రాంతాల ప్రజలకు ఈ విషయంలో మిక్కిలి అన్యాయం జరుగుతున్నది. వివిధ రాష్ట్రాలకు జనాభానుబట్టి పద్మశ్రీలను కేటాయించవలెను. విద్యాసంస్థల్లో వలెనే షెడ్యూల్డు కులాలు, తెగలవారికి పద్మశ్రీ లను ప్రత్యేకించవలసిన అవసరం వుంది. మనది ప్రజాస్వామ్యం, జమిందారీ వ్యవస్థకాదు.

నాకు ఆడరచయితలంటే విపరీతమైన గౌరవం. ఎస్సెల్సీ తప్పిన ఆడవాళ్ళు కూడా ఇంతింతలావు నవలలు రాసిపడేస్తున్నారనీ, వాళ్ళకి లోకజ్ఞానం, భాషజ్ఞానం శూన్యమనీ సారథి విమర్శిస్తాడు కాని, ఆ విమర్శ న్యాయమైనది కాదు. అసలు భాషాజ్ఞానం లేకుండా అన్నేసి పేజీలు రాయడమే గొప్ప. ఎమ్మేలూ, బియ్యేలూ మొదలయినవి చదివి కూడా మగవాళ్ళందరూ నవలలు రాయలేక పోతున్నారంటే మన విద్యాప్రమాణాలు ఎంతగా దిగజారిపోతున్నాయో అర్థం చేసుకోవచ్చు. అట్టే భాషాజ్ఞానం లేని రచయితలను, రచయిత్రులను ప్రోత్సహించడానికే కాబోలు ప్రభుత్వం ఏటా కొత్తగా చదవనేర్చినవారికి (నియోలిటరేట్స్) వుద్దేశించిన సాహిత్యం పోటీలు నిర్వహిస్తున్నది. ఇది మిక్కిలి హర్షణీయం. జై వీర హనుమాన్.

## నవంబరు 2 :

దీపావళి దీపావళి

తిమిరావళి పోద్రోలెడి దీపావళి

మతాబాల రవ్వలు

మగువల ముసి ముసి నవ్వులు

ప్రేయసి జడలో పువ్వులు

నా మనసున మల్లెల జల్లులు...

ఆ తర్వాత ఇక నా కవితా వాహిని యింకిపోయింది. మళ్ళీ రాత్రంతా మతాబాలు వెలుగుతున్నప్పుడు వస్తుందేమో ఇన్స్పిరేషన్. ఇప్పుడు సాయంత్రం ఆరు. బాలభానుడు పశ్చిమాద్రిని గ్రుంకుచున్నాడు. పక్కింటి కోతి, లడ్డూగాడు వాళ్ళ డాబామీద పిట్టగోడపై ప్రమిదలు వరసగా పెట్టుచున్నారు. మాటి మాటికీ వెడితే లోకువైపోతానని ఇవాళ పండగైనా మావయ్యగారింటికి భోజనానికి వెళ్ళలేదు. వర్లక్ష్మి ఎంత బాధపడిందో పాపం! పొద్దునే భాస్కర్రావు ఒక దారుణమైన మాట అన్నాడు. దానితో మనస్సు కొంతసేపు కకావికలమై పోయింది. “నువ్వు పైకి అమాయకుడిలా, చవటలా కనిపిస్తావు. కాని యమ సెటైర్ కొడతావోయ్” అన్నాడు. నా అంతరంగము నెరింగిన భాస్కర్రావే ఇట్లు అపార్థం చేసుకుంటే ఇక నా రచనలు చదివి పాఠకులు ఎంత అపార్థం చేసుకుంటారు? డైరీ ఆత్మకు అద్దం కదా! నా డైరీ నా వ్యక్తిత్వమును సరిగా ప్రతిబింబించుట లేదా? అతని మాటలో నాకు మరింత బాధ కలిగించిన విషయం నా అమాయకత్వముపై అతని కామెంటు. నేను ఇంత డెవలప్ అయిన తర్వాత కూడా పైకి అమాయకుడిలా కనిపిస్తున్నానని అతను అనడం శోచనీయం. నేను ఈ మధ్య యమపోజుగా వుంటున్నానని బాబూరావు కూడా చెప్పాడు. భాస్కర్రావు బహుశ జలసీతో అలా అనివుంటాడు. అసూయగలవాడు వృద్ధిలోకి రాడు. ఓం తత్సత్ !

## నవంబరు 9 :

యమ రహస్యం. బాబూరావు ఇవాళ తన ప్రేయసి శకుంతల రాసిన లవ్‌లెటర్ చూపించాడు. ఎవరికీ చెప్పద్దని ఒట్టు వేయించుకున్నాడు. భాస్కర్రావైతే అంతా విన్న తర్వాత ఒట్టు తీసి గట్టున పెట్టేసేవాడు. నేను అటువంటి మిత్రద్రోహిని కాను. నా పట్ల బాబూరావుకి

ప్రగాఢ విశ్వాసం. శకుంతల లేఖ అంతా విరహవేదనాయుతంగా వుంది. వెంటనే సమాధానం రాసి ఎకనమిక్స్ పుస్తకంలో పెట్టి రేపు బస్టాప్ దగ్గర ఇమ్మని రాసింది. అక్కడక్కడ అక్షరాలు తడిసి చెరిగిపోయి వున్నాయి. అవి కన్నీళ్ళు అని చెప్పాడు. నాకో సందేహం వచ్చింది. "ఉత్తరం రాస్తూ తుమ్మిందేమోనోయ్" అన్నాను. "ఛ... పోవోయ్ వెధవ జోకూ నువ్వూను" అన్నాడు. నేను సీరియస్‌గా అంటేనే జోకు అంటారు. ఇహనిజంగా జోకువేస్తే చచ్చూరుకుంటారు నవ్వలేక.



రెండు మూడు రోజులుగా చూస్తున్నా. సారథి, భాస్కర్రావు వూరికే గుసగుసలాడుతున్నారు. ఏదో కుట్ర చేస్తున్నారు. నన్ను గురించే అయుంటుంది. పయోముఖ విషకుంభాలు. డిటెక్షన్ చెయ్యాలి.

"అసలు వర్లక్ష్మి నిన్ను ప్రేమిస్తోందని గ్యారంటీ ఏమిటి?" అని భాస్కర్రావు అడిగాడు. "నా మరదలు కనుక నన్ను ప్రేమించడం దాని జన్మహక్కు" అన్నాను. "అది సరేలేవోయ్. ప్రేమిస్తోందనడానికి దాఖలా ఏమిటి? అది నీ ఆటోసజెషన్. విష్ ఫుల్ థింకింగ్" అన్నాడు. "భగవంతుడున్నాడని దాఖలా ఏమిటి?" అని అడిగాను. "నువ్వు ఒట్టి శుంఠవోయ్" అంటూ వెళ్ళిపోయాడు. వాదించలేని ప్రతివాడూ అలాగే అంటాడు. లేకపోతే ఇడియట్. వర్లక్ష్మి ప్రేమను శంకిస్తాడా? భగవంతుడు సర్వాంతర్యామి, సర్వవ్యాపి, ప్రేమయే దైవము లేక భగవంతుడు. అనగా ప్రేమ కూడా ఇందుగల దందులేదని సందేహము వలదు. వర్లక్ష్మిలో కూడా వుంది.

నాన్నగారినుంచి వుత్తరం వచ్చింది. వెధవ్వేషాలు వెయ్యక బాగా చదువుకోమన్నారు. తథాస్తు.

### నవంబరు 10 :

బాబూరావు పొద్దున్నే వచ్చి కూర్చున్నాడు. ఇవాళ ఫస్టవరు, సెకండవరు ఖాళీ. లెక్చరర్లు ఇద్దరూ సెలవ మీద పోయారు. "నేనూ, రాంబాబూ అత్యవసరమైన అంతరంగిక విషయాలు మాట్లాడుకోవాలి. మీరిద్దరూ మార్నింగ్‌షోకి పొండి. డబ్బు లేకపోతే అప్పిస్తాను" అని చెప్పి భాస్కర్రావుని, సారథిని పంపేశాడు బాబూరావు. తన ప్రేయసి శకుంతలకి వుత్తరం

ఎలా రాయాలో చెప్పమన్నాడు. పెద్ద దేవానందులాగా ఫోజు కొడతాడు. ప్రేమలేఖ రాయడం చేతకాదు. ఓ ఘంటసేపు డిక్టేట్ చేశాను. పోనీ ఒక్క ముక్క చెబితే అందుకు పోవడమన్నా చేతకాదు - యూసెలెస్‌ఫెలో. అంతా అయింతర్వాత కన్నీటితో అక్కడక్కడ అక్షరాలని తడిపాడు. అదొక్కటే అతని వర్జినల్ ఐడియా. అతనికి ఎప్పుడు కావాలంటే అప్పుడు రకీమని కళ్లల్లో నీళ్ళు వస్తాయి. కాస్సేపు నిశ్చలంగా నిశ్శబ్దం నీరవ ప్రపంచంలోకి శూన్యంగా చూశాడంటే కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరుగుతాయి. అది అనన్య సాధ్యం. రాయడం పూర్తి అయింతరవాత అడిగాడు - నీకు ఇంత మంచి లాంగ్వేజి చిరుత ప్రాయంలో ఎలా అబ్బిందోయ్ అని. డైరీలు రాయగా రాయగా వస్తుంది. అఫ్‌కోర్స్ ఆరంభ దశలో కొందరు నవ్వేస్తారనుకో" అని చెప్పాను. ఇకనుంచి తనూ రాస్తానన్నాడు.

క్లాసులో వున్నంతసేపూ బాబూరావు దృష్టి శకుంతల మీదనే వున్నది. అతడి ఏకాగ్రతకు మనస్సులోనే జోహారులర్పించాను. కాని అమ్మాయి అతనికేసి చూడలేదు. కాలేజీ అయిపోయాక మాక్కొంచెం యమర్జంటు పనుందని సారథిని, భాస్కర్రావుని ముందు పంపేశాము. తర్వాత అమ్మాయిని ఫాలో అయ్యాడు బాబూరావు. నేను కొంచెం వెనకాల వున్నాను. ఉత్తరాన్ని ఎకనామిక్స్ పుస్తకంలో పెట్టి, ఎవరూ లేకుండా చూసి అమ్మాయి కిచ్చాడు. అమ్మాయి ఆశ్చర్యంగా చూసింది. ఇతనేదో చెప్పాడు. నాకు వినిపించలా. తర్వాత అమ్మాయి పుస్తకం తెరిచి, ఉత్తరం చూసి ఛడా మడా ఏదో అంది. ఉత్తరం పరపర చించి, పుస్తకం అతని మొహాన కొట్టి, రిక్షాలో వెళ్లిపోయింది. వండ్రఫుల్ అనుకున్నాను. నేను అతని దగ్గరకు వెళ్ళేసరికి అప్పుడే బస్టాప్ వెనకాల పాత పుస్తకాల షాపులోంచి భాస్కర్రావు, సారథి బయటికొచ్చి "కంగ్రాచ్యులేషన్స్ బాబూరావ్" అన్నారు. తర్వాత ఒక్కక్షణం ఆక్కుండా 'యమర్జంటు' పనుందని ఇద్దరూ రిక్షాలో వెళ్ళిపోయారు. నేను కూడా హృదయపూర్వకంగా అభినందించాను. కాని బాబూరావు మొహంలో సంతోషం వీసమంతైనా లేదు. "నువ్వు కూడా నన్ను పరిహసిస్తున్నావా రాంబాబూ" అన్నాడు దీనంగా. "ఫస్టు ట్రయల్లోనే ఇంత బ్రహ్మాండంగా సక్సెస్ అయితే ఏడుపు మొహం పెడతావేం? అన్నాను. "మరి అమ్మాయి వుత్తరం చించి మొహాన కొట్టిందిగా" అన్నాడు. "ఏడిసినట్టుంది. ఆడవారి చేతలకు అర్థాలే వేరులే అన్నారు. హిందీ సినిమాల్లో హీరో హీరోయిన్ల ప్రేమ మొదటి సీను ఖచ్చితంగా ఇలాగే వుంటుంది. తర్వాత క్రమంగా ఆమె పశ్చాత్తాప పడుతుంది. ఆ పశ్చాత్తాపమే దరిమిలా విరహతాపంగా మారుతుంది" అని చెప్పాను. ఇన్ని హిందీ సినిమాలు చూసి ఈ మాత్రం ఎందుకు తెలుసుకోలేక పోయాడో ఆశ్చర్యం! కాని, భాస్కర్రావు, సారథి చేసిన కుట్ర ఏమిటో తెలిసింది. బాబూరావుకు తెలిసినట్లు లేదు. ఏమైనప్పటికీ బాబూరావు జీవితంలో ఇది

చరిత్రాత్మకమైన రోజు అనడంలో సందేహం లేదు.

ఇవాళ వరల్డ్ హిస్టరీకి కొత్త లెక్చరర్ వచ్చాడు. మూర్తీభవించిన వంటాముదంలా ఉన్నాడు.

## నవంబరు 21 :

అంతయూ మన మేలుకే అని చిన్నప్పుడు ఒక కథ చదివాను. అది నిజమేననిపిస్తూ వుంటుంది. నేను ఇంతకాలం మోట్రసైకిలు కొనుక్కోలేకపోవడం కూడా మేలునకే అని ఇప్పుడు తెలిసింది. కొనుక్కునివుంటే పశ్చాత్తాప పడవలసి వచ్చేది. కేంద్రప్రభుత్వం నిరుపేదల కొరకు చిన్నకార్లు వుత్పత్తి చేయాలని పథకం వేసింది. ఏకంగా చిన్నకారే కారు చౌకగా కొనుక్కోవచ్చు. మోట్రసైకిలు వేస్టు. భారతదేశం ప్రగతిపథంలో వడివడిగా పురోగమిస్తున్నది. గుడిసెల్లో నివసించే వారికి సైతం, బిచ్చగాళ్ళకు సైతం చిన్నకార్లు లభించేరోజు తప్పక వస్తుంది. అప్పుడు కుంటివారు, గుడ్డివారు సైతం కార్లలోనే భిక్షాటనం చేస్తారు. అభివృద్ధి చెందిన సోషలిస్టు దేశాలలో అలాగే వుంటుంది కాబోలు.



జర్నలిజంలో బాగా రాటుతేలాను. రెండు రోజుల క్రితం ఆఫీసులో కొత్త సబ్ ఎడిటర్‌ని అప్రెంటిస్‌గా వేశారు. వట్టి శుంఠ. ట్రైనింగ్ ఇవ్వలేక ఛస్తున్నా. కుర్రాడు వృద్ధిలోకి వస్తాడు కదాని - ఎడిటర్‌గారు చెప్పకపోయినా - నేనే ట్రైనింగ్ ఇస్తున్నా. "బస్సు క్రిందపడి ఒకని మృతి" అని హెడ్డింగు పెట్టాడు. అలా రాస్తే బస్సు క్రింద పడిపోయిందని అనుకుంటారని వివరించి "బస్సు మీదనుంచిపోగా ఒక మనిషి మృతి" అని మార్పించాను.

ఇవాళ బాబూరావు, నేనూ మాట్నీకి వెళ్ళాము. సినిమా అత్యంత గంభీరంగా, శోక రస ప్రధానంగా వున్నది. చూస్తున్నంతసేపూ కన్నీరు మున్నీరుగా ఏడ్చాను. నా రుమాలు తడిసిపోగా బాబూరావుది అడిగితీసుకున్నాను. దీనిమీద రివ్యూ రాయాలి. వినోదం పన్ను మినహాయించ వలసిన అవసరం వున్నది. వినోదం బొత్తిగా లేదుకదా మరి!

రూమ్‌కి వచ్చేసరికి సారథి, భాస్కర్రావు నా డైరీ గురించే డిస్కస్ చేస్తున్నారు. "నిజంగా రాంబాబుకి సన్మానం చెయ్యాలోయ్" అని సారథి అంటుండగా రూమ్‌లో అడుగుపెట్టాను. సాధారణంగా సారథికి, నాకూ అభిప్రాయాలు ఎంత మాత్రం కలవ్వు.

కానీ ఈ ఒక్క విషయంలో మాత్రం ఏకీభవిస్తాను. "ప్రతిభగల వారికి గుర్తింపు గౌరవం లేకపోవడమే మన దేశంలో పెద్ద దౌర్భాగ్యం" అని మొన్న ఎడిటర్‌గారు ఒక సభకు అధ్యక్షత వహిస్తూ అన్నారు. బహుశా తన విషయం మనస్సులో పెట్టుకునే ఆయన అలా అని వుండవచ్చు. ఏది ఏమైనప్పటికీ అంత మంచిమాట చెప్పినందుకు ఆయనను మనసారా అభినందించక తప్పదు.

ఓం + జై హనుమాన్ శుభమస్తు!

## నవంబరు 28 :

ఇవాళ మళ్ళీనాకూ, ఎడిటర్ గారికి పడింది లడాయి. యానిమల్ హజ్బెండరీ మంత్రికి పశు భర్తృత్వశాఖమంత్రి అని రాశాను నిన్న. అది పేపర్లో పడింది. మినిష్టర్ గారి సెక్రట్రీ ఎడిటర్ గారికి ఫోన్‌చేసి అడిగాట్ట. ఈయన అపాలజీ చెప్పుకుని సవరణ వేస్తానన్నాట్ట. నన్ను పిలిచి ఇహనుంచి పిచ్చిరాతలు రాయద్దని వార్నింగ్ ఇచ్చాడు. పశుగణాభివృద్ధి శాఖ అని రాయమన్నారు. అసలు యానిమల్ హజ్బెండరీ అనే దాంట్లో గణం, అభివృద్ధి ఎక్కడున్నాయని వాదించాను. నోరు మూసుకుని చెప్పినట్టు రాయమన్నారు. సంస్కృతం వెలగబెట్టకుండా శుబ్బరంగా తెలుగులో యాడవమన్నారు. సరేనని ఫిషరీస్ మంత్రికి చేపల మంత్రి అని రాస్తే అదీ తప్పేనన్నారు. పోనీ జాను తెలుగులో జాలరి మంత్రి అని రాస్తానంటే అదీ వద్దన్నారు. మత్స్య శాఖమంత్రి అని మళ్ళీ సంస్కృతంలోనే ఏడవమన్నారు. పైగా నాతో అరిచి అరిచి తలనొప్పి వచ్చేస్తోందని అన్నారు.. ఎడిటర్‌గారు మరీ నిరంకుశంగా ప్రవర్తిస్తున్నారు. మనదేశంలో పత్రికాస్వాతంత్ర్యం, భావప్రకటన స్వాతంత్ర్యం బొత్తిగా కొరవడినాయి. వాటి కోసం జర్నలిస్టులందరినీ కూడగట్టుకుని సెక్రటేరియట్ ఎదుట గుడారం వేసి సత్యాగ్రహం చేయాలి.

ఒక్కసారి ఎడిటర్‌గారిని బెదిరించడం ఎందుకైనా మంచిదనుకున్నాను. పని అయిపోయి వచ్చేసేముందు ఎడిటర్‌గారి గదిలోకి వెళ్ళి "మన పత్రికలో ప్రజాస్వామిక సత్సంప్రదాయాలు కొరవడిన దృష్ట్యా రాజీనామా ఇవ్వాలనుకుంటున్నాను" అన్నాను. 'ఆవశ్యం' అన్నాడాయన. విశ్వాస ఘాతకుడు. కాళ్ళబేరాని కొస్తాడేమోననుకున్నాను. న్యూయార్క్ టైమ్స్ స్పెషల్ కరెస్పాండెంట్‌గా వుండమని నిన్ననే బ్రిటిష్ కౌన్సిల్ నుంచి ఆఫర్ వచ్చిందని చెప్పాను' ' "విష్ యూ గుడ్‌లక్" అన్నాడాయన. రయ్‌మని బైటికొచ్చేశాను. ఎంత అహంభావం! తేనె పూసిన కత్తి. పయోధర విషకుంభం. నేను నిజంగా పత్రిక అభివృద్ధి కోసం ఎంతోసేవచేశాను! నిజంగా వెళ్ళిపోతేగాని నా విలువ ఆయనకు తెలియదు. అప్పుడు పశ్చాత్తాపపడితే ప్రయోజనం ఏముంది. "నువ్వు వెళ్ళిపోతే మర్నాడే సర్క్యులేషన్

తగ్గిపోతుందోయ్. వెళ్ళడానికి వీల్లేదోయ్ " అని బతిమాల్తాడేమోననుకున్నాను. ఇప్పుడు ఏమిటి చెయ్యడం? నా వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోవడం కోసం, నేను నమ్మిన సిద్ధాంతాల కోసం, ధర్మాల కోసం, పత్రికా రచయితల భావ ప్రకటన స్వాతంత్ర్యసాధన కోసం ఉద్యోగాన్ని త్యాగం చేయడమా? లేక ఈ కష్టాలను, పరాభవాలను చిరునవ్వుతో స్వీకరించి, దీర్ఘకాలిక ప్రయోజనం దృష్ట్యా, పత్రికా రచనలో మరింత పరిశ్రమిస్తూ మాతృసంస్థ అభివృద్ధికై ఇతోధికంగా సేవచేయడమా? ఎటూ తేల్చుకోలేక మనస్సు తీవ్రంగా ఇదమిద్ధమై పోతున్నది.

ఓం! విఘ్నేశ్వరాయ నమ: జై హనుమాన్.

## డిసెంబరు 4 :

సాయంత్రం కాలేజీ నుంచి తిరిగి వస్తూ వుండగా బస్సు దగ్గర పెద్దరష్. క్యూలో నించోకుండా జనం మూకవుమ్మడిగా కుమ్ముకోవడం మొదలుపెట్టారు. ఇటువంటప్పుడే జేబు దొంగతనాలు జరుగుతాయని జ్ఞాపకం వచ్చి జేబులో పర్సు గట్టిగా పట్టుకున్నాను. ఇంతలో ఒక దృశ్యం నాకంటబడింది. ఒక చెయ్యి ఒక పాంటు జేబులోనుంచి పర్సు లాగేయ్యడానికి ప్రయత్నిస్తుంది. వెంటనే పట్టేద్దామనుకున్నాను. కాని అలాచేస్తే దొంగ తానేమీ తీయలేదని వాదించవచ్చు. అందుకని పర్సు బైటికి లాగిన తర్వాత రెడ్ హాండెడ్‌గా పట్టేయాలనుకున్నాను. జాగ్రత్తగా ఆ చేతినే గమనిస్తూ పర్సు బైటికి లాగగానే ఠకీమని పట్టేశాను. నా బదులు అతనే 'థీఫ్ థీఫ్' అని అరవడం మొదలు పెట్టాడు. జనం బస్సుని వదిలి మా చుట్టూ మూగారు. బస్సు వెళ్ళిపోయింది. ఇంతా చేస్తే అతను దొంగకాదు. తన జేబులో తనే చెయ్యి పెట్టుకున్నాడు. నేను చెయ్యినే చూస్తూ వుండిపోయాను గానీ, మొహాన్ని చూడలేదు. అలా అని చెబితే జనం నమ్మలేదు. నేనే పర్సును కొట్టెయ్యబోయానని



తన్నబోయారు. సారథి, భాస్కర్రావు వచ్చి నేను వట్టి వెర్రిబాగులవాడినని చెప్పి విడిపించారు. తర్వాత అనిపించింది - వెర్రిబాగులవాడిననిపించుకోవడం కంటె తన్నులు తింటేనే బావుండేదని. ఒక్కొక్కప్పుడు యిలా మంచికి పోతే చెడు ఎదురవుతుంది. ఏమైనప్పటికీ నా కర్తవ్యం నేను పాలించాను. ఫలితం దైవేచ్ఛ. గీతాసారం అదేకదా. తర్వాత ముగ్గురం ఇంకో బస్సులో ఎక్కాం. టిక్కెట్టు కొందామని జేబులో చెయ్యిపెడితే పర్సు లేదు. ఓహో.. దేవా ఏమి నీలీల !

అంతర్గతంగా నేను ఎంత ఉన్నత పథాలను అందుకున్నప్పటికీ బహిరంగంగా ఇంకా తగినంత డెవలప్ కాలేదు. నాన్నగారు చెప్పిన ఆయుర్వేదాశ్రమానికి వెళ్ళి మళ్ళీ 'జీవకళ' తెచ్చుకున్నాను. అయితే కేవలం అదొక్కటే చాలదు. భౌతిక రూపంలో మార్పు తీసుకురావాలి. ఇకనుంచి ఇంట్లో పెద్దచారల బనీనులు, గళ్ళ లుంగీలు మాత్రమే ధరించాలి. బైటకు వెళ్ళేటప్పుడు పెద్ద గళ్ళ షర్టును బైటు పొంటులో టక్ చేసి, పెద్ద పటాకాబెల్టు పెట్టాలి. దుబ్బు మీసం పెంచాలి. చూపు కూడా బాగా మార్చెయ్యాలి. విలన్ లాగా బొమలు ముడిచి కొరకొర చూడడం అలవాటు చేయాలి. అప్పుడు నన్ను వెర్రిబాగులవాడు అనే దమ్ము ఏ మొనగాడికీ వుండదు. మొగాడు వుంటే రౌడీలా వుండాలి. లేకపోతే జీనియస్ లాగా వుండాలి. నేను గెడ్డం, దుబ్బు మీసం పెంచి సూటు వేసుకుని పైపు నోట్లో పెట్టుకుంటే ఎలా వుంటానో మనస్సనే అద్దంలో చూసుకున్నాను. కొంచెం అశోక్ మెహతా పోలికలు కనిపించాయి. యమ ఫోజుగా, జీనియస్‌లాగా వున్నాను.

## డిసెంబరు 12 :

గడిచిన 15 రోజులుగా నేనూ, ఎడిటర్‌గారూ మొహం మొహం చూసుకోలేదు. ఇవాళ ఆయనే పిలిపించాడు నన్ను. "రాజీనామా విషయం ఏం చేశావు?" అని అడిగాడు. "తల్లికి తనయునిపై ప్రేమ లేకున్నా తనయునికి తల్లిపై ప్రేమపోదు. తల్లీ బిడ్డల పవిత్రానుబంధాన్ని ప్రపంచంలో ఏ శక్తి విడదీయజాలదు" అని అన్నాను. అసలు సంగతి ఏడవమన్నారు. "సుజనమిత్ర నాకు మాతృ సంస్థ. ఈ తల్లిని విడిచి మనజాలను. కంఠంలో వూపిరి వున్నంత వరకూ ఈ తల్లినే సేవిస్తాను. నా ఎత్తు ధనం కుమ్మరించినా మరొక పత్రికలోకి పోను" అని చెప్పాను. ఆయన నవ్వాడు. అదేమిటో నేను సీరియస్‌గా మాట్లాడినప్పుడల్లా జనం నవ్వుతూ వుంటారు. జోకువేస్తే ఒక్కళూ నవ్వరు. "నువ్వు రాజకీయ రంగంలో రాణించగలవోయ్" అన్నాడు. " నాకా విషయం ఎప్పుడో తెలుసు" అన్నాను. "రిజైన్ చేయకపోతే పోనీ, బ్రిటిష్ కౌన్సిల్ వాళ్ళ ఆహ్వానాన్ని పురస్కరించుకుని అమెరికాను సందర్శించి రాకూడదూ" అని సలహా యిచ్చాడు. ఆ విషయం పరిశీలనలో వున్నదని చెప్పి వచ్చేశాను. నేను బెదిరించానని వేళాకోళంగా వుంది ఆయనకి.

ఇంటికొస్తుంటే దారి పొడుగునా అందరూ నన్నే చూసి నవ్వడం మొదలుపెట్టారు. నా ముందు నవ్వడానికి దమ్ములేక వెనక నవ్వుతున్నారు. భాస్కర్రావుతో చెబితే అందరూ మనని చూసే నవ్వుతున్నారను కోవడం ఇన్ఫిరియారిటీ కాంప్లెక్స్‌కు నిదర్శనం అంటాడు. అదే నిజమేమో, నాది భ్రమేనేమోననుకుని, ఎందరు నవ్వుతున్నా ధీమాగా, స్టయిలుగా నడిచి

వచ్చేశాను. రూమ్‌కి రాగానే సారధి, భాస్కరావు కూడా నవ్వడం మొదలుపెట్టారు. స్టయిలుగా వుంటుందని వైట్ పాంటుకి హిప్ పోకెట్లో పెన్ను పెట్టుకున్నాను. అది మధ్యలో కక్కి అరచేతి వెడల్పున సిరా మరక పడింది. అదీ అసలు సంగతి. యాబ్సెంట్ మైండెడ్‌గా వుండడం జీనియస్‌లకు సహజమే.

వర్లక్ష్మిపట్ల నా ప్రేమ బూడిదలో పోసిన పన్నీరుగా మారిపోవుచున్నది. ఈ అశ్రుధారా వ్రతం ఇంకా ఎన్నాళ్ళు సాగవలెనో కదా!

ఓం.

## డిసెంబరు 19 :

మహాకవి చలంగారి లేఖలు చదువుతున్నాను. గొప్ప ఉత్తేజం కలుగుతోంది. డైరీ రాయడంలో ఆరితేరాను కనుక. ఇక లేఖాసాహిత్యంలో కృషి చేయాలి. వచ్చే వేసం కాలంలో సారధి, భాస్కరావు పరీక్షలై వెళ్ళిపోయింతరవాత వాళ్ళిద్దరికీ అమూల్యమైన లేఖలు వ్రాయాలి. తెలుగు సాహిత్యంలో శాశ్వతంగా నిలిచిపోగల లేఖలు వ్రాయాలని సంకల్పించుకున్నాను. ఓం! సంకల్పసిద్ధిరస్తు! జై హనుమాన్! బడీచౌడీ లోని ఆంజనేయస్వామి గుడికి వెళ్ళి కొబ్బరికాయ కొట్టి వచ్చాను. ప్రతి శనివారం వెళ్ళి ఆంజనేయ ప్రదక్షిణాలు చేద్దామంటే మర్చిపోతున్నాను. వచ్చే వేసంకాలం వరకూ ఆగకుండా ఈలోగా చలం ప్రేమలేఖల మోడల్లో 'పోస్టు చేయని ప్రేమలేఖలు' అనే శీర్షికతో వర్లక్ష్మికి కొన్ని లేఖలు వ్రాయాలి. రెండు దస్తాలు అయింత తర్వాత వాల్యూమ్ వన్ అచ్చు వేయించవచ్చు.




నెలరోజులు దాటిపోయినా బాబూరావు, శకుంతలల మధ్య వ్యవహారం ఏమీ ప్రోగ్రెస్ అయినట్లు కనిపించలేదు. ఆ అమ్మాయి హిందీ సినిమాలు - ముఖ్యంగా దేవానంద్ సినిమాలు చూడడం లేదేమోననుకున్నాను. లేకపోతే అంత నిర్లిప్తంగా వూరుకోదనిపించింది. బాబూరావు వచ్చి అడిగితే ఆ మాటే చెప్పాను. అమ్మాయి

వినోదంపన్ను లేని సినిమాలు మాత్రమే చూస్తుందని బాబూరావు చాలాకాలం స్టడీ చేసి చెప్పాడు. అమ్మాయి ఫాదర్ రిటైర్డ్ హెడ్మాష్టరుగా పని చేస్తున్నాట్ట. సినిమాల విషయంలో ఆయన చాలా స్ట్రిక్టుగా వుంటాట్ట.

ఇవాళ పక్కింటి కోతి ఎన్.సి.సి. డ్రస్సులో ఒంటరిగా కనిపించింది. ఇదివరకు వినాయకచవితి నాడు నేను స్నానం చేసి ఒళ్ళు తుడుచుకుంటుంటే, వాళ్ళ తమ్ముడితో కలిసి లేవిడీ చేసినందుకు నిరసనగా, ప్రతీకారంగా ఈల కొట్టాను. నా వంక రుసరుస చూస్తూ' యూ ఈడియట్, మేనర్లెస్ బ్రూట్" అన్నది. పేరలుకం జెందిన యట్టి కాంత లుచిత వ్యాపారముల్ నేర్తురే! అదేదో సినిమాలో షమ్మీకపూర్‌ని చూసి ఆశాపరేఖ్ ఇలాగే అందని చెప్పి రంయ్ మని వచ్చేశాను. ఎవరికి తెలియదులే ఇంతుల సంగతి, చేమంతుల సంగతి, పూబంతుల సంగతి!

## డిసెంబరు 27 :

నేటి నుంచి ధ్యానయోగము ప్రారంభించాను. తెల్లవారు జామున లేచి, డాబామీద పద్మాసనం వేసుకు కూర్చుని, కన్నులు మూసుకుని సాధన ప్రారంభించాను. ధ్యాన సాధన యనగా శరీరము నందలి రక్తమంతటినీ మూర్ధము లోనికి ప్రవేశపెట్టుట. పిదప మనస్సును సర్వ ప్రాపంచిక విషయాల నుంచి ఉపసంహృతముచేసి, అతీంద్రియ విషయములపై, అనగా భగవంతునిపై లేదా శూన్యముపై లగ్నము చేయుట. ప్రాపంచిక విషయులనగా కాలేజీ, సుజన మిత్ర, సినిమాలు, స్నేహితులు, వర్లక్ష్మి, సాహితీ వ్యాసంగం, రాజకీయములు, పక్కింటి కోతి, వేదాంతము మున్నగునవి. ఈ బంధములనుంచి మనస్సును విముక్తం చేయటయే ధ్యానము, అట్టి ధ్యాన స్థితిలో వుండగా పంచేంద్రియ జ్ఞానము నశించును. చీమ కుట్టినను, పక్కింటి డాబాపై కోతి, లడ్డాగాడు నన్ను చూసి నవ్వినను ఏమీ తెలియదు. అట్టి స్థితిని సాధించుటయే నా అంతిమ లక్ష్యము.

ధ్యాన సాధనానంతరము వాకింగ్‌కు వెళ్ళాను. ప్రతి యింటి ముందు ముగ్గులు, గొబ్బిళ్ళు, ఓహో! ఏమి ధనుర్మాస్య సౌందర్యము! నామనస్సంతా అలికి ముగ్గులిడినట్లున్నది. గొబ్బిళ్ళు మహోన్నతమైన ప్రాచీన భారతీయ సాంస్కృతిక వారసత్వమునకు మచ్చు తునకలుగా భాసించినవి. ఏదా వైభవము నేడు? ఏదా పవిత్రత నేడు? ఏవి తల్లీ నిరుడు కురిసిన హిమమయూఖములు. శిరముపై అక్షయ పాత్రనిడుకొని హరినామ సంకీర్తనము చేయుచున్న సాతాని జియ్యరు అగుపించినాడు. ఓహో! ఏమి పునీత జీవనము. తెల్లవారు జామున నదీస్నాన మాచరించి, ముఖ మండలమున తిరుపుండ్రములు తీర్చిదిద్ది, గోవింద

గోవింద యనుచు, మాధూకరము చేయుటకంటే గొప్ప శాంతి, తృప్తి మరి ఎందునను గనిపించవు. ఆ మహనీయుని చూచినప్పుడు నా జీవితముపై నాకే రోత కలిగినది. ఈ బంధాలను త్రెంచుకుని హరిదాసునై పోవాలని సంకల్పం కలిగింది. సారథి, భాస్కర్రావు, బాబూరావు... వీరందరూ మాయాప్రపంచంలో దిక్కుతోచక అలమటిస్తున్నట్లు అనిపించింది. వారిని ఉద్ధరించవలెను. ఓం! గోవింద!

## జనవరి 7

కేంద్ర ప్రభుత్వము నిరంకుశముగా ప్రవర్తిస్తున్నదనీ, కేంద్రమంత్రుల ప్రకటనలను, ప్రసంగాలను జాగ్రత్తగా పరికించినట్లయితే కేంద్రం కమ్యూనిజం వైపు మొగ్గుతున్నట్లు కనిపించగలదనీ ఇటీవల ఒక ప్రతిపక్ష నాయకుడు అన్నారు. ఆయన మాటల్లో ఎంతైనా నిజం వున్నది. నేను ఆయనతో పూర్తిగా ఏకీభవిస్తున్నాను. కమ్యూనిస్టు దేశాలలో వయస్సు మళ్ళిన, ఎముకలు కుళ్ళిన వారందరినీ గవర్నమెంటు పర పర నరికేసి, ఎప్పటికప్పుడు జనాభాని తగ్గించేస్తూ వుంటుంది. అందుకే రష్యాలో జనాభా సమస్య లేదు, కుటుంబ నియంత్రణ లేదు. అసలు సైబీరియా లాంటి ప్రదేశాలు బొత్తిగా నిర్జనంగా వుండడానికి కారణం అదే. సినిమాల్లో చూస్తుంటే రష్యాలో పిల్లలందరూ యాపిల్ పళ్ళులా ఉండడానికి కారణం ఏమిటి? అలా లేని పిల్లలందరినీ నరికేస్తారు కనుకనే. అందుకే భారతదేశం రష్యావైపు మొగ్గుతున్నదని ప్రతిపక్షాలవారు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. కుటుంబ నియంత్రణ కార్యక్రమం ఇంకో పదేళ్ళలో జయప్రదం కాకపోతే మన ప్రభుత్వం కూడా అలాగే ప్రవర్తించవచ్చు. ఇటీవల కేంద్ర మంత్రి ఒకరు ఇంకో పదేళ్ళలో దేశంలో గృహవసతి లేని వారెవరూ లేకుండా చూస్తామని హామీ ఇచ్చారు. ఆయన ప్రకటన పైకి ప్రొగ్రెసివ్‌గానే కనిపిస్తోంది కానీ, ప్రతిపక్షాలవారు చెప్పినట్లు జాగ్రత్తగా పరికించితే అందులో ఒక పెద్ద కుట్ర అంతర్గర్భితంగా వున్నది. పదేళ్ళలో సాధ్యమైనన్ని ఇళ్ళు కట్టించి అప్పటికీ గృహవసతి లేకుండా మిగిలిపోయే జనాభాను నరికేస్తామనే బెదిరింపు ఆయన మాటల్లో అంతర్లీనంగా వున్నది. అందుకే ప్రతిపక్షాలవారు అంతగా నెత్తీనోరూ బాదుకుంటున్నారు. ఈ విషయాన్ని విపులంగా ఎనలైజ్ చేస్తూ అద్భుతమైన వ్యాసం రాసి ఎడిటర్‌గారి కిచ్చాను. ఆయన చదివి నవ్వుతూ "నువ్వు అపహాస్యం బాగా రాస్తావోయ్" అని తిరిగి యిచ్చేశారు. "బాగా రాస్తానని మెచ్చుకుంటూనే తిరిగి యివ్వడంలో మీ ఆంతర్యం యేమిటి?" అని ప్రశ్నించాను. "ముందు తరాల వాళ్ళకి పనికొస్తుంది భద్రంచెయ్యి. మరీ ఇంత ఇంటలెక్చువల్‌గా వున్నది ఈ కాలపు వాళ్ళు అర్థం చేసుకోలేరు." అని చెప్పారు. నేను ఆయనతో ఏకీభవించాను. నా మేధస్సు ఎప్పుడూ భవిష్యత్తులోకి పాతిక సంవత్సరాలు లోతుగా చొచ్చుకొని పోతూ వుంటుంది.

అందుకే ఎప్పుడూ వర్తమానంలో అపార్థాలకు గురియవుతూ వుంటాను. భూమి గుండ్రంగా వుందని గలీలియో కనిపెట్టినప్పుడు జనం ఇలాగే విరగబడి నవ్వారు. ఆర్కిమెడీస్ పైథాగరస్ సిద్ధాంతాన్ని కనిపెట్టినప్పుడూ అలాగే వెక్కిరించారు. ఓం! హనుమాన్!! జయోస్తు!!!

**జనవరి 14 :**



అత్యంత శుభదినము

సంక్రాంతి పర్వదినము

కన్నుల పండుగ దినము

వెన్నెల నిండిన దినము

ప్రేయసి నవ్విన దినము

హాయనిపించిన దినము...



మావయ్యగారింటికి భోజనానికి వెళ్ళాను చాలారోజుల తర్వాత. ఎంత ఆలస్యంగా కనిపిస్తే వర్లక్ష్మి హృదయంలో నా స్థానం అంత బలపడుతుందనుకున్నాను. కాని, ఆమె చూపులో అందుకు దాఖలా ఏమీ కనిపించలేదు. లేకపోతే నారీ హృదయాన్ని నేను అర్థం చేసుకోలేకపోయానో! అభ్యుదయ కవి నారాయణరావు మావయ్యగారింటికి వచ్చాడు. ఆయన మావయ్య ఆఫీసులోనే పనిచేస్తున్నాడు. ఎందుకైనా మంచిదని ఆటోగ్రాఫు పుచ్చుకున్నాను. భోజనాలయ్యాక ఆధునిక కవిత్వం రాయడంలోని కిటుకులు చెప్పమని కోరాను. ఆయన చెప్పాడు. ఏదో ఒక రిథిమ్, లేక మాత్రాఛందస్సు తీసుకోమన్నాడు.

ఉదా: టట్టటాటట టట్టటాటట

టట్టటట్టట టట్టటా...

లేక

నన్నానన్నన నన్నన్నా

నన్నానన్నన నన్ననా...

ఇలాగే ఎన్ని వందల మాత్రాఛందస్సులైనా తీసుకోవచ్చునని టట్టట, నన్ననాల స్థానాలలో పదాలను యిరికించాలనీ, అన్ని లైనుల్లోనూ దెబ్బ సరిగా పడాలనీ చెప్పాడు. ఈ కిటుకు ఇదివరకే తెలిస్తే ఈ పాటికి ఎన్ని కావ్యాలైనా రాసి పారేసి వుండేవాణ్ణి కదా

అనుకున్నాను. తరుచుగా నారాయణరావు గారిని కలుసుకుని కవిత్వం నేర్చుకోవాలి ఇంకా బాగా. కొన్నాళ్ళకి అసలు మనం వచనం రాయకూడదు. డైరీ, వుత్తరాలు కూడా వచన కవిత్వం మోడల్లోనే వుండాలి. మన కలం నుంచి కారేదంతా కవిత్వం కావాలి.

**జనవరి 23 :**

బర్కత్‌పురాలో రోజూ వేదాంతోపన్యాసాలు జరుగుతున్నాయి. మంత్రులు, జడ్జీలు, పారిశ్రామికులు కూడా కార్లు వేసుకుని వెడుతున్నారు రోజూ. ఊపిరి సలపని పనుల ఒత్తిడిలో ఎలాగో తీరిక చేసుకుని ఇవాళ వెళ్ళివచ్చాను. ఉపన్యాసం చాలా గొప్పగా వున్నది. నన్ను చకితుణ్ణి చేసింది. స్వామీజీ ఉపన్యాస సారమిది. ఈ ప్రపంచకంలో ప్రతివస్తువూ సృష్టికి సంబంధించిన ఏదో ఒక అభేద్య రహస్యానికి సంకేతం. పామరుడు వస్తువును వస్తువుగానే చూస్తాడు. జ్ఞాని వస్తువులో సృష్టి రహస్యాన్ని కనుగొంటాడు. ఉదాహరణకు బండీ వున్నది. పామరునికి అది ఒట్టి బండీగానే కనిపిస్తుంది. జ్ఞానికి అది పుట్టుకనుంచి చావునకు కొనిపోయే జీవితమనే శకటంగా కనిపిస్తుంది. రెండు చక్రాలలో



ఒకటి పరమాత్మ. మరొకటి జీవాత్మ. రెండింటినీ కలిపే ఇరుసు ప్రకృతి. అలాగే తామరపువ్వు అజ్ఞానము, మోహము అనే బురదలో పుట్టి జ్ఞాన సూర్యుని వైపు వికసించే తాత్వికునికి సంకేతం. కుంపటి వెలిగించడం, మండడం, ఆరిపోవడం సృష్టిస్థితి లయాలకు సంకేతంగా గుర్తించాలి. అందులో బ్రహ్మ విష్ణుమహేశ్వరుల లీలలను దర్శించాలి. ఈ విధమైన అంతర్ దృష్టియే మహోత్కృష్టమైన హైందవ మతానికి వెన్నెముక. పాశ్చాత్యులకు యిట్టి ఆధ్యాత్మిక దృష్టిలేదు. వాళ్ళది వట్టి మెటీరియలిస్టిక్ ఔట్‌లుక్. ఇకనుంచి నేను ఈ అంతర్ దృష్టిని అలవరచుకోవాలి. హోటల్‌కు వెళ్ళి భోజనం ముందు కూర్చునేసరికి అన్నం విష్ణురూపంగా కనిపించింది. సృష్టి స్థితిలయలలో స్థితికి కారకుడు విష్ణువు. అన్నము తినడంవల్లనే మనం జీవించగలుగుతున్నాము.

ఓం! విష్ణురూపాయనమ : !

జనవరి 30 :

రోజూ స్వామీజీ ఉపన్యాసాలకు హాజరవుతున్నాను. అంతర్దృష్టి పెరుగుతోంది. పొద్దున కాలేజీకి వెడుతుంటే ఇంటాయన చిన్న కొడుకు టొమాటో గాడు మూడు చక్రాల సైకిలు తొక్కుతూ కనిపించాడు. ఆమూడు చక్రాలను బ్రహ్మావిష్ణు మహేశ్వరులుగా తీసుకోవచ్చు. బస్టాప్ దగ్గర ఓ కాలేజీ కుర్రాడు పెద్ద గళ్ళచొక్కాని టైట్ పాంటులో టక్‌చేసి, కోన్ బూటు వేసుకుని కనిపించాడు. యమ ఫోజుగా వున్నాడు. ఒక ముసలాయన పక్కనున్న యింకో ముసలాయనతో మాట్లాడుతూ ఈ కాలపు కుర్రాళ్ళనీ, వాళ్ళ ఫాషన్లనీ దుయ్యబట్టుతున్నాడు. ఆ గళ్ళ షర్టుని అదేపనిగా ఆక్షేపిస్తున్నాడు. అంత వార్ధక్యం వచ్చినా ఆయన యింకా అజ్ఞానంలో కొట్టుమిట్టాడుతూ వుండడం చూస్తే జాలేసింది. ఆ గళ్ళని జీవితమనే చదరంగపు గళ్ళుగా తీసుకోవాలని చెప్పాను. మానవులందరినీ పావులుగా చేసి భగవంతుడు జీవితమనే చదరంగం ఆడుతున్నాడనీ, కాని మానవుడు తన జీవితానికి తాను అధిపతిననే అజ్ఞానంతో విర్రవీగుతున్నాడనీ చెప్పాను. ఆ గళ్ళ చొక్కాని కేవలం గళ్ళ చొక్కాగా చూడడం పామరుని లక్షణమనీ, ఇందులో జీవితసత్యాన్ని గ్రహించడం జ్ఞాని లక్షణమనీ వివరించాను. ఆయన మొదట తెల్లమొహం వేశాడు. తర్వాత తేరుకుని "నాయనా.. పిన్నవాడవయినా గొప్ప వేదాంతం చెప్పావు. నిన్ను చికాగో విశ్వమత పరిషత్‌కు పంపాలి" అన్నాడు. "పెద్దల ఆశీర్వాదం వూరికేపోదు" అన్నాను.

ఈమధ్య ఎందుకో నా చుట్టూవున్న వారిని చూస్తే ఒక విధమైన జాలి కలుగుతోంది. జీవిత పరమార్థాన్ని తెలుసుకోకుండా, తెలుసుకోవాలన్న ఇచ్ఛలేకుండా వీరు అనేక తాపత్రయాలలో పడి కొట్టుకుంటున్నారు. ముఖ్యంగా ఎడిటర్‌గారిని చూస్తే విపరీతమైన జాలి కడుపులోంచి దేవుకొస్తోంది. పాపం... సారథి, భాస్కర్రావు, బాబూరావు... వీళ్ళందరినీ ఎలా ఉద్ధరించాలో ఏమీ పాలు పోవడంలేదు. వీరందరినీ కాపాడవలసిందని ఆ సర్వేశ్వరుడిని, సర్వాంతర్యామిని నిశ్చలంగా ప్రార్థించాను.

ఈ మనుషులమధ్య నేను కేవలం తామరాకు మీద నీటి బొట్టులా వుంటున్నాను. "రాంబాబు పురాణ వైరాగ్యంలో పడ్డాడోయ్" అన్నాడు భాస్కర్రావు సారథితో. హు! ఆ పసివాడిని చూస్తే జాలివేసింది.

రేపటితో స్వామీజీ ఉపన్యాసాలు ముగుస్తాయి.

## ఫిబ్రవరి 11 :

ఇవాళ సాయంత్రం ఒక్కణ్ణి నౌబత్ పహాడ్‌కి వెళ్ళాను. ఒక పెద్ద రాయిమీద కూర్చుని ఆకాశాన్ని, క్రింద రోడ్డుమీద పోతున్న బస్సులనీ శూన్యంగా చూస్తూ గడిపేశాను. చుట్టూ ఎవరూ లేరు. ఆ నిశ్శబ్ద నీరవ ఏకాంతంలో గత స్మృతులెన్నో మనస్సును ముసురుకున్నాయి. గుండెను తొలిచేసే ఆవేదన పుట్టుకొచ్చింది. ఈ విశాల ప్రపంచంలో నాకెవరూ లేరనిపించింది. మహాకవి చెప్పినట్లు ఆకాశపు టెడారిలో కాళ్ళు తెగిన ఒంటరి బిడారి ననిపించింది. నా ఒంటరితనాన్ని, దిక్కులేని దీనత్వాన్ని తల్చుకుంటే కన్నీరు ఆగలేదు. ఎంతోసేపు వెక్కి వెక్కి ఏడ్చాను. అంతలో ఎవరో ఫెడీమని వీపు చరిచినట్లు అనిపించింది. "వచ్చే నెలలోనే పరీక్షలు" అని నా లోని అంతర్వాణి పలికింది. అదిరిపడ్డాను. అయ్యో బాబోయ్! మార్చి వచ్చేస్తోంది. ఈ ఆడంగి సన్నాసి వెధవ ఏడుపు గొట్టుతనానికి స్వస్తి చెప్పి ఇక కర్మక్షేత్రంలో ప్రవేశించాలి. ఇన్నాళ్ళూ నేను విజ్ఞానాత్మక విషయాలలో, నిత్యజీవిత సత్యాల పరిశీలనలలో నిమగ్నుడినై ఎకనామిక్స్, వరల్డ్ హిస్టరీ మున్నగు వాటిని విస్మరించాను. పరీక్ష పోయిందంటే తాట వల్చేస్తానని నాన్నగారు క్రిందటిసారి వచ్చినపుడు చెప్పారు.

భోంచేసి వచ్చి వరల్డ్ హిస్టరీ తీశాను. సారథి, భాస్కర్రావు సినిమాకి పోయారు. వాళ్లు బొత్తిగా బాధ్యతారహితంగా ప్రవర్తిస్తున్నారు. అలెగ్జాండర్ ది గ్రేట్ గురించి చదువుతూంటే ఉత్తేజం కలిగింది. 'మనమూ వున్నాం దేనికి. వెధవబతుకు. ఏం సార్థకం?' అనిపించింది. ఎకనామిక్స్ తీశాను. యమబోర్. అసలు ప్రస్తుత విద్యావిధానంలోనే పెద్దలోపం వుంది. ఈ ఐడియా ఇప్పుడు కొత్తగా వచ్చింది కాదు. క్లాసులో మేస్టరు పాఠాలు చెబుతున్నప్పుడు అనేకసార్లు అనిపించింది ఈ విద్యా విధానాన్ని సంస్కరించవలసిన ఆవశ్యకత ఎంతైనా వుందని. రాజకీయవాదులు కూడా నెత్తీనోరూ పెట్టుకుని చెబుతూనే వున్నారు. ఈ మధ్య రాష్ట్రపతి కూడా చెప్పారు. అక్కడికీ ఒకటికి రెండు సార్లు ఈ విషయమై సుజనమిత్రలో ఉద్ఘాటించాను. అయినా ప్రభుత్వం వినిపించుకుంటేనా? బియ్యే అయిపోగానే ఎలక్షన్‌లో పోటీచేసి శాసన సభ్యుణ్ణై ప్రభుత్వాన్ని ఏకెయ్యాలి. అసలు మన పరీక్షా విధానంలో కూడా చాలా లోపాలున్నాయి. ప్రతిభగలవారు ఎందరో తప్పుతున్నారు. నాలాంటి ప్రతిభావంతులకే నూటికి 30 మార్కులు రావడం కష్టంగా వుంది. ఇక సామాన్యుల మాటేమిటి? మళ్ళీ శకుంతలకీ, లోకజ్ఞాన శూన్యులకీ ఫస్టుమార్కులొస్తాయి. ఉదాహరణకి మా క్లాసులో ఫస్టుమార్కులొచ్చే శంకరం గాడికి ఈ ఏడాది రాష్ట్రపతి అవార్డు ఏ సినిమాకి వచ్చిందో తెలియదు. ఎన్.టి.ఆర్. ఎన్ని సినిమాల్లో నటించాడో తెలియదు. ఏది ఏమైనప్పటికీ నేను పరీక్ష ప్యాసవడం అనేది కేవలం పురుష ప్రయత్నం మీదనే ఆధారపడి వుండదు.

దైవానుగ్రహం కూడా వుండాలి. అందుకే భగవద్గీతలో కృష్ణుడు ఫలితం నామీద వదిలేసి నిష్కామకర్మ చెయ్యమన్నాడు. ప్యాసయితే తిరుపతి వెళ్ళి గుండు కొట్టిస్తానని మొక్కుకున్నాను.

ఓం! శ్రీరాములవారి సహాయము కావలెను.

### ఫిబ్రవరి 20 :

రాత్రి "విప్రనారాయణ" సినిమా చూశాను. ఇది మూడోసారి చూడడం. రాత్రి అంతా స్వామి వారి పవిత్ర జీవితాన్ని గురించే ఆలోచించాను. ఆయన అడుగుజాడలలోనే నా జీవితాన్ని తీర్చి దిద్దుకోవాలని చరిత్రాత్మకమైన నిర్ణయం తీసుకున్నాను. అది నా జీవితంలో ఒక పెద్ద మైలు రాయి. లోగడ నేను తీసుకున్న అనేక నిర్ణయాలను క్రోడీకరిస్తూ నా భవిష్యజ్జీవితానికి ఒక ప్రణాళిక లేక టైమ్‌టేబుల్ తయారు చేసుకున్నాను. ఇక అది ఆల్మోస్ట్ సర్టెన్లీ ఫైనలైజ్డ్ డెసిషన్.



### జూన్ :

శాసన సభ ఎదుట ఆందోళన. జైలు శిక్ష. జైలు నుంచి నెహ్రూగారి మోడల్లో సారధికి లేఖల రూపంలో భారతస్వాతంత్ర్యోద్యమ చరిత్ర ఉద్గ్రంథమును రచించుట.

### ఆగస్టు :

జైలుశిక్ష. గ్రంథరచన కొనసాగింపు. రచన పూర్తి అగువరకు ఆందోళనలు చేసి శిక్ష పొడిగించుకొనుట. సాధ్యమైనంత వరకు లాఠీదెబ్బలు తినుటకు ప్రయత్నించుట.

### సెప్టెంబరు :

గ్రంథరచన సమాప్తి. రోజుకు పది పేజీలు చొప్పున 100 రోజుల్లో వెయ్యి పేజీలు వ్రాయుట. జైలులో ఒక పది రోజులు - లేక విపరీతంగా ఆకలివేయువరకు - ఆమరణ నిరాహారదీక్ష. విలేకరులతో గోష్ఠులు. ఫొటోలు వగైరా.... ప్రముఖ రాజకీయ బాధితునిగా విడుదల.

అక్టోబరు :

పరీక్ష ప్యాసైనందుకు తిరుపతి వెళ్ళి గుండు కొట్టించుకొనుట. ఖద్దరు మాత్రమే ధరించుట. సొంత పత్రిక పెట్టుట. రాజకీయ బాధితులకు ప్రభుత్వము సహాయము చేయవలసిన అవసరము గురించి పదే పదే ఉద్ఘాటించుట.

నవంబరు :

మంత్రుల స్థాయిలో ఒత్తిడితెచ్చి రాజకీయ బాధితునిగా శ్రీరంగం వద్ద కావేరీ తీరమున ఒక ఐదెకరముల తోట సంపాదించుట. పిమ్మట ఆజన్మాంతం శ్రీరంగని కొలుచుచూ, మాలా కైంకర్యముతో తరించుట. గుండును విప్రనారాయణ మోడల్లో రూపొందించుకొనుట. పంచె కట్టుకొని, ముఖమండలమున తిరుపుండ్రములు తీర్చిదిద్దుట. మాధూకరము చేసికొంటూ జీవించుట.

(షరా : నాకు జైలులో "ఎ" క్లాస్ ఇస్తారో లేదో వాకబు చేయాలి ముందు. లేకుంటే గ్రంథరచన సాగదు.)

ఈ టైమ్‌టేబుల్ అంతా పకడ్బందీగా తయారుచేసుకున్నాను గానీ, నేనే తన జీవిత సర్వస్వమని నమ్ముకున్న బేల వర్లక్ష్మిని దుఃఖసాగరంలో ముంచడం తగునా అని చాలాసేపు మనస్సులో ఇదమిత్థ మైపోయాను. కాని గౌతమ బుద్ధుడు లక్ష్యసాధనకై భార్యాపుత్రుల విడనాడి కారడవుల కేగెను.

నా సంకల్పం సిద్ధించాలంటే శ్రీరంగని కటాక్షం కావలెను. రంగా రంగ రంగ, కావేటి రంగ... .. కరుణాంత రంగ...

ఫిబ్రవరి 26 :

ఇవాళ నాన్నగారు సర్‌ప్రైజ్ విజిటింగ్ చేశారు - అక్రమ నిల్వదారులపై ఎక్సైజ్ అధికారుల దాడుల మోడల్లో. స్నానం చేయటానికి తువ్వాలు కావాలని నా పెట్టెతీసి డైరీ చూశారు. "ఏమిటీ వెర్రి మొర్రి రాతలు. వెధవ్వేషాలు వేస్తే చెమ్డాలెక్కదీస్తాను" అన్నారు. పరీక్ష తప్పానంటే దాపటెద్దును అమ్మేసి నన్ను కాడికి కడతానన్నారు.

జై హనుమాన్... నీవే గతి.

('ఆంధ్రజ్యోతి' వారపత్రిక, 1971)



# రాంబాబు డైరీ

## మార్చి 2:

నేను రోజు రోజుకూ మరీ బోర్న్ జీనియస్‌నై పోతున్నానా అని ఈ మధ్య అస్తమానం అనుమానం కలుగుతోంది. నా ప్రతిభని నేనే గుర్తించలేక పోతున్నానేమోనని బాధగావుంది. నా ప్రతిభ నేనే గుర్తించ లేకపోతే ఇతరులెలా గుర్తిస్తారు. గుర్తింపులేని ప్రతిభ అడవిని గాచిన వెన్నెలేకదా? ఈ మాట బైటికి చెబితే భాస్కర్రావు పగలబడి నవ్వి ప్రచారం చేస్తాడుగాని, అసలు నా ఆరాధ్య దైవం (జై హనుమాన్) కూడా తన బలాన్ని తాను గుర్తించలేక పోయాడు. అంతే కాదు - ఆయన ప్రత్యక్ష దైవమైన శ్రీరామచంద్రుల వారికే తాను అవతార పురుషుడన్న సంగతి తెలీదు. ఇక నేననగా ఎంత? అందుకే వేదాలు, ఉపనిషత్తులు మొదలైన సకల శాస్త్ర పురాణాలు కూడా ముందు నిన్ను



గూర్చి తెలుసుకో అని ఉద్ఘోషిస్తున్నాయి. హూయామై (నే నెవరు?) అని ప్రశ్నించుకోమని రమణ మహర్షి కూడా బోధించారు. అనగా ఆత్మజ్ఞానము పొందుము అని తాత్పర్యము. అలా ఆత్మజ్ఞానము పొందినవాడే 'అహంబ్రహ్మ' అన్నాడు. అట్టి సెల్ఫ్‌రియలైజేషన్ కోసం సాధన చేయాలి.

ఈ మధ్య దేన్ని గురించి ఆలోచించినా బుర్ర చాలా డీప్‌గా వేదాంత పరంగా పోతోంది. నానాటికీ ఇంటలెక్చువల్‌గా విపరీతంగా ఎదిగి పోతున్నందువల్ల నా చుట్టూ వున్న

వారితో మాట్లాడుతుంటే చంటిపిల్లలతో మాట్లాడుతున్నట్లు అనిపిస్తోంది. సారథి, భాస్కర్రావు సరే ఎలాగూ పసివాళ్ళే. తలనెరిసి పోయిన ఎడిటర్‌గారిని చూస్తే కూడా అమిత జాలి పుట్టుకొస్తోంది. పెట్టీపాల్టిక్సు మీద ఎడిటోరియల్స్ రాస్తూ తనో మేధావి ననుకుంటాడు. పూర్ ఫైల్డ్. 'నువ్వింకా నేర్చుకోవలసింది చాలావుంది నాయనా' అని ఆయన భుజం నిమిరి చెప్పాలనిపిస్తోంది. ఆయన వయస్సులో సగం కూడా నాకు లేదు కదా అని ఆ కోరికను అణచుకుంటున్నాను. నా ఇంటలెక్చువల్ గ్రోత్ నామొహంలో కనిపించదు కదా మరి. ఆయన అనవసరంగా అపార్థం చేసుకుంటాడు.

మధ్యాహ్నం ఆస్మారామ్ గారి క్లాసు ఎగ్గొట్టి కాలేజి వెనక తోటలోకి వెళ్ళి శూన్యంలోకి చూస్తూ ఉన్నత విషయాలను గురించి ఆలోచించాను.

## మార్చి 7 :

ఇవాళ పొద్దున్న క్లాసులో (పప్పు) చారు మతి నాకేసి అదో రకంగా చూసింది. ఆ చూపులోని భావమేమిటో సరిగా తెలియలేదు. భాస్కర్రావైతే సైకో ఎనాలసిస్సు చేసి ఇట్టే చెప్పేసేవాడు. అతన్ని అడిగితే చులకనైపోతానని వూరుకున్నాను. సైకో ఎనాలసిస్సు విషయంలో ఇప్పటికీ నేను అతనిపై ఆధారపడవలసి రావడం దయనీయం. ఈ విషయంలో నా కాళ్ళపై నేను నిలబడ గలిగిన స్థితికి రావడానికి కృషి చేయాలి. అనేక విషయాల్లో నేను భారతదేశపు స్థితిలో వున్నాను. చారుమతిని చూస్తే జాలేసింది. నా హృదయం ఇదివరకే ఒకరికి అంకితమై పోయిందని ఆమెకు తెలియదు కదా పాపం. అంత అందమైన అమ్మాయికి సారధి పప్పుచారుమతి అని నిక్‌నేమ్ పెట్టడం అనౌచిత్యంగా వున్నదని చెప్పక తప్పదు.



మధ్యాహ్నం ఎకనామిక్స్ క్లాసు ఎగ్గొట్టి నేను, సారథి "బైజూబావరా" పాత సినిమా మ్యాట్నీకి వెళ్ళాము. సంగీతం రాళ్ళు కరిగించేట్టుగా వుంది. సంగీతం నేర్చుకోని జీవితం వృధా అనిపించింది. ప్రభుత్వ సంగీత పాఠశాలలో చేరి రోజూ ఉదయం గంట సేపు కర్ణాటక సంగీతం నేర్చుకోవాలని నిర్ణయించుకొన్నాను. దానివల్ల వ్యాయామం (మార్నింగ్ వాక్), దారి పొడుగునా ప్రకృతి సౌందర్య దర్శనం కూడా ఆటోమేటిక్‌గా కలిసొస్తాయి.

ఇంటాయన వారం రోజుల్నుంచీ అద్దెకోసం ప్రాణం తీస్తున్నాడు. ఆయన వచ్చే సమయానికి సారథి, భాస్కర్రావు గబుక్కున బాత్‌రూమ్‌లో దూరుతున్నారు. ఆయన నన్ను పట్టుకుని దులిపేస్తున్నాడు. ఆ వయస్సులో ఆయన శుభ్రంగా



ఆధ్యాత్మిక విషయాలపై కాన్ సెన్‌ట్రేట్ చెయ్యకుండా ఇంకా అద్దెకోసం తాపత్రయ పడడం ఏమిటో? మళ్ళీ రెగ్యులర్‌గా పురాణాలకి వెడుతూనే వుంటాడు. అదే 'మాయ' అంటే. బైజుబావరా తాన్‌సేన్‌ను చంపడానికి కత్తిపుచ్చుకుని గోడదూకి వస్తాడు. తాన్‌సేన్ పారవశ్యంలో కళ్ళు మూసుకుని పాడుతూ వుంటాడు. బైజు బావరా ఆయన్ని చంపలేక కత్తికింద పారేస్తాడు. నేను సంగీత సాధన చేస్తుండగా అద్దె అడగడానికి వచ్చిన ఇంటాయన మనస్సు కరిగిపోయి వెళ్ళిపోతే బావుండు.

## మార్చి 10 :

ఎడిటర్‌గారికీ నాకూ పెద్ద ఘర్షణ జరిగింది. మేటరు చాలటంలేదు ఎక్కువ రాయమంటున్నారు కదా పాపం అని, మైనారిటీవర్గాలు, బలహీనవర్గాల మీద ఓ వ్యాసం మంచి ఎనలిటికల్‌గా రాసి కంపోజ్‌కిచ్చాను. ఈ మధ్య పేపర్లో ఎక్కడచూసినా మైనారిటీ వర్గాలు, బలహీనవర్గాల కడగండ్లు తరచుగా కనిపిస్తున్నాయి. మంచి టాపికల్‌గా వుంటుందని రాశాను. మనదేశంలో నూటికి 75 మంది పైగా మైనారిటీ వర్గం వారున్నారని పేర్కొన్నాను. దేశంలో ఔషధాల పరిశ్రమ అభివృద్ధి చెందుతున్నప్పటికీ, ఎన్ని టానిక్కులు ఉత్పత్తి అవుతున్నప్పటికీ, బలహీన వర్గాల పరిస్థితులు మాత్రం మెరుగుపడక పోవడం పట్ల విచారం వ్యక్తం చేశాను. దీనికి కారణం బలవర్ధకాహార లోపమేననీ, అందుచేతనే మనదేశం బలహీన దేశాలలో ప్రముఖ పాత్ర వహిస్తున్నదనీ స్పష్టం చేశాను. "నాకు చెప్పకుండా ఇటువంటి వెర్రిమొర్రి రాతలు కంపోజ్‌కి పంపిస్తే, వుద్యోగం వూడిపోతుంది" అని అరిచాడు ఎడిటర్‌గారు "పోనీ మీకు అంత పనికిరాకపోతే ఈ నెలలో జరగబోయే బలహీన వర్గాల సదస్సుకు సబ్మిట్ చేస్తాను ఇవ్వండి" అని తీసేసుకున్నాను. "నీతో చాలా డేంజర్‌గా వుంది. నువ్వు రాసే ప్రతి వాక్యం జాగర్తగా చూసుకుని మరీ పంపించాల్సి వస్తోంది. నాకున్న పని చాలక ఇదొక ఎక్స్‌ట్రా పని" అని విసుక్కున్నాడు. "షేమ్" అనిపించింది. జర్నలిస్టు యూనియన్‌లో చేరి సబ్ ఎడిటర్ల భావ ప్రకటన స్వాతంత్ర్యం కోసం పోరాటం సాగించాలనుకున్నాను. కాని

ఎడిటరుగారు నాన్నగారికి పుత్తరం రాస్తే డేంజరు. ఏంచేయాలా అని మనస్సు పూరికే ఇదమిద్ధమైపోతోంది. (జైహనుమాన్.)

ఈ మధ్య ఆధ్యాత్మిక, నైతిక, వైజ్ఞానిక, సాంస్కృతిక వ్యవహారాలలో సతమతమవుతూ వరలక్ష్మిని గురించి ఆలోచించడమే మానేశాను. ఆ సంగతి తలుచుకుంటే బాధ కలిగింది. మామయ్య గారింటికి వెళ్ళి చాలా రోజులై పోయింది. ఒక రకంగా ఇదీ మంచిదే. ఎంత ఆలస్యంగా వెళ్తే అంత ఎక్కువగా వరలక్ష్మి ఎదురుతెన్నులు చూస్తుందికదా! త్వరలో తీరిక చేసుకుని వెళ్ళాలి. రెస్పాన్సు చూడాలి.

## మార్చి 13 :

చంద్రశేఖర్రావు మొదటి బెంచిలో కూర్చుని మేష్టారు చెప్పేదంతా సావధానంగా విని, నోట్సు రాసుకుంటాడు. యూనివర్సిటీ ఫస్టురావడానికి అదే చాలు అసలు. కాని అతను రోడ్డుమీద పోతూ చదువుతాడు. బస్సులో కడ్డీపట్టుకు నుంచుని చదువుతాడు. హోటల్లో భోంచేస్తూ చదువుతాడు. రూమ్‌లో ఎప్పుడూ చదువుతూనే వుంటాడు - ప్రెజెంట్ కంటిన్యువస్‌టెన్స్‌లాగా. అతన్ని చూస్తే యమజాలి కలుగుతుంది. ఈ చదువువల్ల అతను ఎంతో జీవిత మాధుర్యాన్ని కోల్పోతున్నాడు. చదవడానికే కాలమంతా ఖర్చుపెడితే ఇక ఆలోచించడానికి టైము ఏది? ఆలోచించకపోతే మెంటల్‌గా ఏమి ఎదుగుతాడు? పూర్‌ఫెలో. అతని మెంటల్ ఏజ్ నాట్ మోర్‌దేన్ టెన్. కాగా, నా మెంటల్ ఏజ్ హీనపక్షం అరవై. (ఎడిటర్‌గారి మెంటల్ ఏజ్ పదిహేనో పదహారో ఉంటుందని ఉజ్జాయింపుగా అంచనా వేశాను). చదవడం అనవసరమని కాదు నా అభిప్రాయం. పరీక్షలు దగ్గరకొస్తున్నప్పుడు చదవాల్సిందే. ఒక పేజీ చదివితే పదిపేజీలు ఆలోచించి, వంద పేజీలు రాయాలి. చదివేదాన్ని ఛప్తే రాయకూడదు. దానిమీద వ్యాఖ్యానం, ఎనాలసిస్ రాయాలి. పోనీ చంద్రశేఖర్రావు ఏదో పసివాడు. తెలీక అంతచేటు చదువుతున్నాడనుకుందాం. కాని, అతనికి ఫస్టు మార్కులు వేస్తున్న లెక్చరర్లనేమనాలి? పుస్తకంలో వున్నదాన్ని మక్కికి మక్కి రాసేవాడికే ఫస్టుమార్కులువేసి, పుస్తకంలో లేని అనేక కొత్త విషయాలు రాసే నాలాంటి ప్రతిభావంతుడికి మార్కులు వేయకపోవడం వల్లనే దేశంలో, వర్జినాల్టీ అడుగంటిపోతున్నది. విద్యా ప్రమాణాలు నానాటికీ దిగజారి పోతున్నాయి. విద్యావ్యవస్థలో మార్పు రావాలని మన నాయకులు మొత్తుకునేది ఇందుకే.

నా మనస్సు కోనేటివంటిది. చంద్రశేఖర్రావు మనస్సు నేలవంటిది. నా మనసులో ఒక భావమనే చిన్న గులకరాయి పండిందంటే కోనేటిలో అలలవలె మనస్సుంతా ఆలోచనా తరంగములు వ్యాపిస్తాయి. అతని మైండులో గులకరాయి పడితే నేలమీద పడినట్టే

కదలకుండా వుంటుంది.

## మార్చి 15 :



నిజానికి తల్లిని మించిన దైవములేదు. అందుకే పోతన సోమయాజిగారు భాగవతంలో "అమ్మలగన్నయమ్మ ముగురమ్మల మూలపుటమ్మ, చాలా పెద్దమ్మ, సురాసురుల కడుపారడి పుచ్చినయమ్మ, వేల్పుటమ్మల మనమ్ముల యుండెడి యమ్మ గదమ్మకృపాబ్ధి ఇచ్చుతమ్మ" అని తల్లియొక్క మహత్వ కవిత్వ పటుత్వ సంపదలను వర్ణించారు. అమ్మ అంటే ఆయనకు అంత గౌరవం. అసలు పుస్తకం పట్టుకుంటూనే ఆయన "తల్లీ నిన్ను తలంచి పుస్తకము చేబట్టితిన్" అన్నాడు. "తల్లినిమించిన దైవము వేరే లేనే లేదురా, ఎందువెదకినా ఎందు చూచినా లేనే లేదురా, అని ఒక సినీ కవి కూడా అన్నాడు. అప్పుడప్పుడూ సినిమాల్లో మంచి పాటలే వస్తూ వుంటాయి.

ఇవాళ లేచిన వేళ బాగాలేదు. ఎడిటరుగారు మళ్ళీ చివాట్లు వేశారు. 'వెంకట్రాజుగారి తృతీయ కుమార్తె వివాహం' అనడానికి బదులు, 'వెంకట్రాజుగారి కుమార్తె తృతీయ వివాహం' అని పేపర్లో పడింది. "ఇటువంటి తప్పుడు రాతలు రాస్తే పత్రిక్కేమన్నా పరువుంటుందా? ఇప్పుడు ఆయన పరువునష్టం దావావేస్తే ఏమిటి చెయ్యడం?" అని గర్జించారు. అచ్చు తప్పులకు నేను బాధ్యుడిని కానని వాదించాను ఎందుకైనా మంచిదని. వెంటనే ఒరిజినల్ తీసి చూపించాడు. ఇక తప్పు ఒప్పుకోక తప్పిందికాదు. పరీక్షలు దగ్గరకు రావడంవల్ల ఎంతసేపూ బుర్ర అక్బర్ పాదుషా మీదనే పనిచేస్తోందని చెప్పాను. పరీక్షలయ్యే వరకు సెలవు పుచ్చుకోమన్నారు. బ్రతుకు జీవుడా అనుకున్నాను. ఉద్యోగం వూడిపోలేదు. జై వీరహనుమాన్. శ్రీరాముల వారి సహాయము కావలెను. వెంకట్రాజుగారి మూడోకూతురు కాబట్టి సరిపోయింది. ఏడో కూతురైనట్లుంటే 'వెంకట్రాజుగారి కుమార్తె సప్తమవివాహం' అని పడేది కదా.



సెలవుల్లో ఫుల్‌టైమ్ సబ్ ఎడిటర్‌గా పనిచేయాలి. జీతం రెట్టింపు చేయమని అడగాలి ఎడిటరుగారిని. కావాలంటే ఎడిటోరియల్స్ కూడా రాసి పెడతానని చెబుతాను.

మార్చి 19 :

పరీక్షలు ఇంకా నాలుగు రోజులే వున్న దృష్ట్యా చదువు తీవ్రతరం చేశాను.ఒక పేజీ చదువుతుంటే పది పేజీలు ఆలోచిస్తుంది బుర్ర. కర్ణుణ్ని తలుచుకుంటే కళ్ళవెంట నీళ్లు వస్తాయి. అంతటి మహా శౌర్యసాహస సంపన్నుడై వుండి కూడా ఆ యొక్క విధి ప్రాబల్యముచే దుష్టచతుష్టయంములో చేరిపోవడం, చివరికి అరుగురిచేత చంపబడడం విచారకరం. ఆ మహానీయునికి మనస్సులోనే శ్రద్ధాంజలి ఘటించాను. కర్ణుడికీ నెపోలియన్‌కూ పోలికలున్నాయి. రేపు పరీక్షలో ఈ పాయింటు విశదీకరించి రాయాలి.



నిన్న రాత్రి చదువైపోయిన తర్వాత ఆరుబైటపడుకుని వినీలాకాశంలోని మిలమిల తారకలను తిలకిస్తూ భారతీయ సంస్కృతిని గురించి దీర్ఘంగా యోచించాను. అది నానాటికీ పాశ్చాత్య ప్రభావపు చీడబట్టి క్షీణించిపోతున్నదనడంలో అతిశయోక్తి లేదు. అనాదినుంచి అనగా అలెగ్జాండరు కాలంనుంచి కూడా మన సంస్కృతి విదేశ ప్రభావములకు గురియై, కలుషితమై పోతూ వుండడం తలుచుకుంటే నాకు కళ్ళవెంట నీళ్ళు ఆగలేదు. నేను కన్నీళ్లు తుడుచుకుంటుంటే భాస్కర్రావు అడిగాడు 'ఏం కష్టం వచ్చిం'దని. అర్ధరాత్రి కూడా అతనికి నన్ను డిటెక్షన్ చెయ్యడమే పని. పోని అడిగాడు కదా అని చెబితే అతను బిగ్గరగా నవ్వేశాడు.

"ఇంకా వరలక్ష్మి జ్ఞాపకం వచ్చిందేమో ననుకున్నాను. నిజంగా నీ మైండు మీద పరిశోధనచేసి పిహెచ్.డి. పుచ్చుకోవాలోయ్" అన్నాడు. నా హృదయ వేదన ఆ పసివాడికెలా అర్థమవుతుంది?

పరీక్షలు కాగానే ప్రాచీన భారతీయ సంస్కృతీ పునరుద్ధరణకు కంకణం కట్టుకోవాలనుకున్నాను.

జర్నలిజంలో నిష్ణాతుణ్ణి కావడంవల్ల ఈ మధ్య మనస్సుల్లో ఆవిర్భవించే ఐడియాలన్నీ ఆటోమేటిక్‌గా సింగిల్‌కాలం, డబుల్‌కాలం హెడ్డింగులుగా మారిపోతున్నాయి. మరీ టాప్ ప్రయారిటీ ఐడియా అయితే బ్యానర్‌గా మారిపోతోంది.

'భారతీయ సంస్కృతీ

పునరుద్ధరణ కృషి'

(డబుల్ కాలం ఫార్టీయైట్ పాయింట్)

'శ్రీ రాంబాబుచే దీక్షా కంకణ ధారణ'

(డబుల్ కాలం ట్వంటీఫోర్ పాయింట్)

సైకో ఎనాలసిస్‌లో కొంత పురోగమించినట్లున్నాను.

('విజేత' మాసపత్రిక, నవంబరు 1977)

## మార్చి 21:

ఆదివారం. రేపటినుంచే పరీక్షలు. మళ్ళీ ఎప్పటికి వీలుపడుతుందో ఏమో ఒకసారి వర్లక్ష్మిని చూసొద్దామని మామయ్యగారింటికి వెళ్ళాను. ఆమెను చూస్తే ఇన్‌స్పిరేషన్ వచ్చి పరీక్షలు ద్విగుణీకృతోత్సాహంతో రాయగలుగుతానని ఆశించాను. కాని ఆమెను చూడగానే అనిర్వచనీయమైన ఆశాభంగం గలిగింది. అచ్చమైన ఆంధ్రుల ఆడపడుచై వుండి, పరికిణీ, వోణీ, లేదా చీర కట్టుకోవడంపోయి పంజాబీ డ్రస్సు వేసుకుంది. నయాపైసంత కుంకుమబొట్టు పెట్టుకోవడంపోయి, దోసగింజ మొడల్లో చిన్న తిలకంబొట్టు పెట్టింది. నాకు మనస్సు వికలమైపోయింది. డ్రస్సు సంగతి అలా వుంచుదాం. పోనీ నన్ను చూడగానే సంతోషంతో కళ్ళు మిలమిల మెరవాలా? సిగ్గుతో తలుపుచాటుకు పరుగెత్తాలా? ఊహూ.... ఏమీలేవు. 'అమ్మా... బావ వచ్చాడే' అని ఒక కేకపెట్టి, పుస్తకాలు తీసుకుని, బైటికి వెళ్ళిపోయింది. పరీక్షలు దగ్గరపడి నందున ఎవరో అమ్మాయితో కలిసి కంబైండు స్టడీస్ చేస్తోందిట.



ఇదివరకటి ఆ వినయం, ఒద్దిక ఏమీలేవు. అవి పంజాబీ డ్రస్సుకు మాచింగ్‌గా వుండవని వదిలేసిందేమో. ఆమె పంజాబీ డ్రస్సును మన సంస్కృతీ సంప్రదాయాల పతనావస్థకు ఒక సింబల్‌గా తీసుకున్నాను. మావయ్య తెగబోరు కొట్టేశాడు. రూముకు వచ్చిం తరవాత వర్లక్ష్మి చూపును ఎనలైజ్ చేయడానికి ప్రయత్నించాను. "ఆడవారి చూపులకు అర్థాలే వేరులే" అనుకున్నాను.

ఇవాళ తీవ్రంగా చదివాను. బడీ చౌడికి వెళ్ళి ఆంజనేయులు వారికి కొబ్బరి కాయ కొట్టివచ్చాను. ఫలితంగా ఆత్మవిశ్వాసం పెరిగింది. సుపీరియారిటీ కాంప్లెక్స్ వచ్చింది. పరీక్షల్లో అది అత్యవసరం.

## మార్చి 24 :

పరీక్షలు మహోధృతంగా రాస్తున్నాను. నేను తీసుకుంటున్న ఎడిషనల్ షీట్సుచూసి చంద్రశేఖర్రావుతో సహా, లెక్చరర్లతో సహా యావన్మందీ ఆశ్చర్య చకితులవుతున్నారు. ఇవాళ వరల్డ్ హిస్టరీ పేపరు 73 పేజీలు రాశాను. తనకి ఫస్టు మార్కు రాదని చంద్రశేఖర్రావుకి గుండెలో రాయిపడింది. ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్‌లో పడిపోయాడు. ఇంక వాడేం రాస్తాడు? ఒకటి రాయబోయి ఇంకోటి రాసి పేపరంతా ఖరాబు చేస్తాడు. నేను ఇంత చేటు ఏం రాస్తున్నానా అని వాడు నా పేపర్లోకి నిక్కి నిక్కి చూట్టం మొదలుపెట్టాడు. నా రాత వాడికెక్కడ అర్థమై ఏడుస్తుంది? సెకండ్ వరల్డు వార్ మీద కొశ్చెన్‌లో హిట్లరును దుర్యోధనుడితో కంపేర్‌చేస్తూ ఇరవై పేజీలు రాశాను. రూముకొచ్చిన తర్వాత పొరపాటుగా నోరుజారి ఈ టాప్ సీక్రెట్ కాస్తా సారధీ, భాస్కర్రావులకు చెప్పేశాను. “కాళిదాసు కవిత్వం కొంత మన పైత్యం కొంత అని, అటు వంటి వెర్రిరాతలు రాస్తే నువ్వు తప్పడం ఖాయం” అన్నాడు భాస్కర్రావు. “అసలు నువ్వు ఏంరాశావో అర్థమై ఏడిస్తేకదా మార్కులు వెయ్యడం. నీ దస్తూరి బ్రహ్మదేవుడిక్కూడా అర్థం కాదు. నేను చూశాను. నీ రాత లక్షణం” అన్నాడు సారధి. ఫస్టుమార్కు ఎక్స్ పెక్ట్ చేస్తున్న నాకు గుండెల్లో రాయి పడింది. నిజమే-న్యాయానికి రోజులు కావు. ప్రతివాడూ తనకు అర్థం కానిదంతా రబ్బిష్ అని వాదిస్తాడు. పరతత్వాన్ని కూడా అలాగే అంటున్నారు కదా? నా రాత అర్ధంకాక దిద్దేవాడు సున్నా మార్కులు వేస్తే నా గతేంకాను? కాని బొత్తిగా స్టఫ్ లేకపోతే ఇన్ని పేజీలు ఎలా రాశాడు అన్న వివేచన వుండదా దిద్దేవాడికి? పేజీకి అరమార్కు వేసినా 73 పేజీలకు 36.5 మార్కులు - అనగా పాస్ మార్కులు వస్తాయి. ఈ ఐడియా బాగానేవుంది. ఇక నుంచి నాకు అర్థం కాని కొశ్చన్‌లకి ఈ స్టయిల్లోనే సమాధానాలు రాస్తాను. నేటి నుంచి పరీక్షలై పోయే వరకు డైరీకి స్వస్తి చెప్పి, తద్వారా పొదుపు అయిన కాలాన్ని చదువుకు వినియోగిస్తాను. ఓం శ్రీరామ జయం.

## ఏప్రిల్ 4 :

నిన్నటితో పరీక్షలు జయప్రదంగా ముగిసినవి. ఎటుపోయి ఎటు వస్తుందో ఎందుకైనా మంచిదని అన్ని పేపర్లూ కూడా 70 పేజీలకి తగ్గకుండా రాశాను. అనగా పాస్ మార్కులు గ్యారంటీ.

“రాంబాబు కేమిటోయ్ బోర్న్ జీనియస్” అని వెటకారంగా భాస్కర్రావు సారధితో అన్నాడు. నాకు వినిపించేట్లు. “అవును మరే, ఇరవై ఏళ్ళకే అరవై యేళ్ళ మెంటల్ ఏజ్ సంపాదించడమంటే మాటలా?” అన్నాడు సారధి. వీళ్లు దొంగతనంగా పెట్టె తెరిచి నా డైరీ చూడ్డం మానలేదన్నమాట. నా డైరీ నుంచి ఎన్నో ఉన్నత విషయాలను గ్రహించడంపోయి

అవహేళన చేస్తున్నారు. నాకేం కోపం రాలేదు. పాపం వాళ్లు ఇంకా ఎడోలసెంట్ దశను అధిగమించ లేదు. మానసికంగా ఇంకా పరిణతి చెందలేదు. నా లాగా. డైరీ ఒక ఆకురాయి. అది మనస్సనే కత్తికి పదును పెడుతుంది. డైరీ రాస్తున్నకొద్దీ మనస్సుకు పదును పెరుగుతుంది. అది మరుగున పడిన మాణిక్యానికి మెరుగుపెట్టే సాన. మానవుని ఆధ్యాత్మిక, నైతిక, వైజ్ఞానిక ప్రమాణాలకు కొలబద్ద. అది అంతరంగాన్ని బహిరంగ పరుస్తుంది. డైరీ రాయడం మొదలు పెట్టినప్పటి నుంచే అమూల్యమైన ఐడియాలు నా మస్తిష్కం నుంచి లెక్కకు మిక్కిలిగా పుట్టుకొస్తున్నాయి. వీటిని ముందు తరాలకై గ్రంథస్తం చేయడం నా పవిత్ర కర్తవ్యంగా భావిస్తున్నాను. పూర్వం మహామహులందరూ ఆ విధంగా తమ మేధాసంపత్తిని నిక్షిప్తం చేయబట్టే నేడు మానవ నాగరికత ఇంత మహోన్నతదశకు వచ్చింది. లేకుంటే మానవుడు ఇంకా ఆదిమయుగం లోనే వుండేవాడు. భాస్కర్రావు, సారథుల అవహేళనలకు భయపడి నేను నా భావాలకు అక్షరరూపం ఇవ్వకపోవడం ముందు తరాలకు అపచారమే అవుతుంది. సమకాలికులు మెచ్చరే గదా అని చేమకూర కవి అన్నాడు. రేపట్నించి మళ్ళీ ఆఫీసుకు వెళ్ళాలి. జర్నలిజంలో ఉన్నత పథాలనందుకోవాలి. కాని, ఒక్కటే చిక్కు. ఎడిటరు గారికెందుకో నన్ను చూస్తే చచ్చేంత జెలసీ. ఎక్స్పిరిమెంట్స్ చెయ్యనివ్వడు.



## ఏప్రిల్ 7 :

మానవ జీవితాన్ని తల్చుకుంటే శోచనీయంగా వుంటుంది. జాతస్యమరణం ధ్రువం కదా. పుట్టిన ప్రతిప్రాణీ గిట్టక తప్పదు. అనంత మహాకాల ప్రవాహములో మానవ జీవితము నీటి బుడగతో సమానం. మూడు నాళ్ళ ముచ్చట. ఆ కాసేపటిలోనే బోలెడు డబ్బు సంపాదించాలనీ, కీర్తి సంపాదించాలని యావ, తాపత్రయం. ఏదో ఘనకార్యం చేశానని విర్రవీగటం. ప్రణాళికలు, కార్యక్రమాలు. తను ఏ క్షణంలో చచ్చిపోతాడో తనకే తెలియదు. మొదలుపెట్టిన పని పూర్తిచేసే దాకా బతుకుతాడన్న గ్యారంటీ లేదు. అయినా ఒకటే తాపత్రయం. అదే మాయ, మోహం. ఈ సత్యాన్ని గ్రహించినందు వల్లనే మునులు హిమాలయాలకి పోయి తపస్సు చేసుకుంటూ అక్కడే రాలిపోయారు. నాకూ అన్నింటి మీద



మమకారం వదిలిపోతోంది. ఈ బంధాలను తెంచుకుని పూరికి వెళ్ళిపోయి. బతికినన్నాళ్లు హాయిగా కందిపచ్చడి వేసుకుని కడుపునిండా భోంచేసి, వేపచెట్టు నీడన నులక మంచం వేసుకుని నిద్రపోతే అంతకంటే కావలసిందేమీ లేదనిపిస్తోంది. వేప చెట్టునుంచి పండుటాకు రాలినట్లే నేనూ ఎప్పుడో రాలిపోతాను. ఇంతోటి బతుక్కి వెధవ ఆదర్శాలు, లక్ష్యాలుదేనికి? డైరీలో పాత పేజీలు తిరగేస్తే నా అజ్ఞానానికి నాకే నవ్వొచ్చింది. చింపేద్దామా అనుకున్నాను. మానవుడి అజ్ఞాన మాయా మోహజాలానికి తార్కాణంగా ఆ పేజీలు చిరస్థాయి కావడం అవసరమని అలాగే వుంచేశాను. నాకు ఇంత చిరుతప్రాయం లోనే మోహపాశాలు విడిపోతుంటే అరవై ఏళ్ళ వాళ్ళకి ఎందుకు జ్ఞానోదయం కలగదా అని ఆశ్చర్యంగా వుంటుంది.

కేంద్ర రిజర్వు పోలీసులు నేడు సెక్రటేరియట్ వద్ద ఆందోళనకారులను నిర్మానుష్యంగా కొట్టారని రాసినందుకు ఎడిటర్‌గారు ముక్కచివాట్లు పెట్టారు. అందులో అతిశయోక్తి ఏమీలేదని స్వయంగా చూసినవాళ్ళే చెప్పారనీ వాదించాను. "అది సరే లేవయ్యా, నిర్దాక్షిణ్యంగా కొట్టారనో, అమానుషంగా కొట్టారనో ఏడవచ్చుగా. ఈ నిర్మానుష్యం ఏమిటి?" అన్నారు. ఆ రెండింటి భావార్థం ఒక్క మాటలో ఇమిడ్చాననీ, అది విసర్గసంధి కాబట్టి వ్యాకరణ రీత్యా కూడా తప్పులేదనీ శాయశక్తులా వాదించినా ఆయన కన్విన్స్ కాలేదు. తెలిసీ తెలియని నరునికి దెల్ప బ్రహ్మదేవునికి వశమే సుమతీ! వెధవ వ్యాకరణ పాండిత్యం కట్టిపెట్టి, నలుగురితో పాటు సింపుల్ లాంగ్వేజి ఏడవమన్నారు ఎడిటర్‌గారు. తనకంటే ఎక్కువ పాండిత్యం వున్న వాడంటే ఆయనకి చచ్చేంత జెలసీ. అయ్యో పైకి రావాలిసిన కుర్రాడు కదా, ఎంకరేజ్ చెయ్యాలన్న ఆలోచనే లేదు ఆయనకి.

## ఏప్రిల్ 10 :

లాభంలేదు - ఇక దేశంలో భారతీయ సంస్కృతి పూర్తిగా అడుగంటి పోయినట్లే కనిపిస్తోంది. మన వేషభాషల్లో, గృహోపకరణములలో, భోజనములో, పరిసరములలో ఎచ్చట జూచినా పాశ్చాత్య నాగరికతా ప్రభావమే కానవస్తున్నది. వేషంచూస్తే గొట్టం పాంటూ, కోన్‌బూట్లూ, పొడుగాటి చెంపలు. భాష చూస్తే ఇంగ్లీషు పద భూయిష్టము. గృహోపకరణములు - అనగా కుర్చీలు, సోఫాలు వగైరాలు - అన్నీ పాశ్చాత్య పద్ధతివే. భోజనం కూడా కాబేజ్, కారెట్, బీట్ రూట్, కాలిఫ్లవర్ వగైరా పాశ్చాత్య కూరలే. ఈ కూరలు కలుషిత హైందవ సంస్కృతికి ప్రతీకలు. చింతకాయ, మాగాయ, పొన్నగంటి కూర, బచ్చలి కూర, కొరివికారం, గోంగూర మున్నగునవి మన ప్రాచీన సంస్కృతికి మచ్చుతునకలు. మూర్తీభవించిన ఖనిజలవణములు, విటమినులు. ఈనాడు మనజాతి నిర్వీర్యమగుటకు కారణము వాటిని చిన్న చూపు జూచుటయే.

ఇక రోడ్డుమీదకొస్తే అన్నీ కార్లు, బస్సులు, ఆటోలు. పెద్ద పెద్ద శబ్దాలతో ప్రశాంతతను భగ్నం చేస్తూ, పెట్రోలు వాసనతో, దుమ్ముతో వాతావరణమును కలుషిత మొనర్చుతూ పోతూవుంటాయి. హా! ఏమి పతనావస్థ!! పూర్వము మనవారు ఏడు గుర్రముల రథములలో వాహ్యాళి కేగెడివారు. నా చిన్నతనంలో రెండెడ్ల గుడిసె బండీలో పయనించెడి వారము. ఆ ఉజ్జ్వల శకమిక అంతరించినది. చిన్నతనంలో మా వూళ్ళో కోతి కొమ్మచ్చి, త్రొక్కుడు బిళ్ళ, గోడెం బిళ్ళ, 'అలంకాలంకా చంద్రాబాలంకా' మున్నగు ఆటలు ఆడెడి వారము. ఉండ్రాళ్ళ తద్దెకి, అట్లతద్దెకి నేలాబండా, తుబేండ్ లెబేండ్ ఆడెడి వారము. ఈ కాలపు పిల్లలు వీధులలో క్రికెట్, హాకీ ఆడుచున్నారు. ఏమి చోద్యము! ఎట్టి హీనస్థితికి దిగజారిపోయినది మన సంస్కృతి!! నిజానికి యావత్ప్రపంచానికి భారతదేశమే తొలుత నాగరికతా భిక్ష పెట్టినది. మన వద్ద విజ్ఞానము సంగ్రహించిన పాశ్చాత్యులు ఇప్పుడు మనకే పాఠములు నేర్పుచున్నారు. మనవారు కూడా



వారిని ఆరాధించుట మన దౌర్భాగ్యము. నిజానికి క్రికెట్, హాకీ, వాలీ బాల్, ఫుట్‌బాల్ వంటి పాశ్చాత్య ఆట లన్నింటికీ మూలములు మన ఆటలే. ఉదా: క్రికెట్ మన గోడెం బిళ్ళనుంచి పుట్టినదే. ఆంగ్లేయులు తొలుత ఈస్టిండియా కంపెనీని స్థాపించిన రోజుల్లో ఈ ఆటనుచూసి ముగ్ధులై దానిని కొన్ని మార్పులతో ఇంగ్లాండులో ప్రవేశపెట్టి యుంటారు. దరిమిలా దానిని తమ సొంత ఆటగా ప్రపంచ వ్యాప్త ప్రచారం చేసుకున్నారు. బిళ్ళకు బదులు బంతిని, కర్రకు బదులు బ్యాట్‌ను ప్రవేశపెట్టారు. అలాగే వాలీబాల్, ప/ట్‌బాల్, బాస్కెట్ బాల్ ఆటలు రామాయణ కాలంలోనే వున్నవనడానికి దృష్టాంతములు కలవు. సీతామ్మవారు బాల్యంలో నెచ్చెలులతో కందుక క్రీడలాడినట్లు వర్ణింపబడినది. (చూ॥ బాలకాండ)

మనస్సు బాగాలేక సాయంత్రం ఆంజనేయులు స్వామి గుడికి వెడితే అక్కడ కూడా పాశ్చాత్య ప్రభావమే (విద్యుద్దీపములు) ఎదురైనది. దేవుడికో దణ్ణంపెట్టి, లెంపలేసుకుని వచ్చేశాను. హోటల్లో భోజనం చేయ మనస్కరించక అరటి పళ్ళు తిని, పాలు త్రాగి వచ్చాను. గాడ్ సేవ్ ది కంట్రీ. ఓం హనుమాన్!

('విజేత', డిసెంబరు 1977)



# రాంబాబు డైరీ

## ఆగస్టు 9 :

మేధావులు దంతపు మందిరాలలో (అనగా "ఐవరీ టవర్స్"లో) నివసించరాదనీ, శాస్త్ర విజ్ఞాన ఫలితాలను అట్టడుగు వర్గాలకు సైతం అందుబాటులోకి తీసుకురావాలనీ ఒక మంత్రి గారు ఉద్ఘాటించారు. అప్పుడే స్వాతంత్ర్యం సార్థకమవుతుందని ఆయన వక్కాణించారు. ఈ కృషిలో పత్రికల బాధ్యత గురుతరమైనదని ఆయన ఉద్బోధించారు. ఆయన చెప్పిన దాంట్లో ఏ మాత్రం అతిశయోక్తి లేదనడంలో సందేహం లేదు. అయితే జర్నలిస్టుగా, ఒక మేధావిగా నా వంతు కర్తవ్యాన్ని నిర్వర్తించడానికి ఎడిటర్ గారు అడుగడుగునా అడ్డు పడుతున్నారు. విప్లవాత్మక వ్యాసాలు రాస్తానంటే "ముందు సింపుల్ సెంటెన్సులు రాయడం నేర్చుకుని ఏడువు" అన్నారు ఇవాళ. ఇంగ్లీషులో వాక్యం ఎంత పొడుగ్గా ఉన్నా తెలుగులో దాన్ని చిన్న చిన్న సింపుల్ సెంటెన్సులుగా విడగొట్టుకుని రాయడం ప్రాక్టీసు చెయ్యమన్నారు. తథాస్తు. అంత వరకూ బాగానే వుంది. కాని ఆ తర్వాత మొదలెట్టాడు లెక్చరు. 'పొట్ట పొడిస్తే అక్షరమ్ముక్క లేని పోరగాళ్ళంతా జర్నలిస్టులై కూచ్చుంటారు. బొడ్డూడని కుర్రకుంకలు విప్లవం అంటూ గొంతు చించుకుంటారు. నెత్తురు మంటలు, కత్తుల పంటలు అంటూ కాయితాలు



ఖరాబు చేస్తారు. వాటిని వెయ్యక పోతే పత్రికల్ని తిట్టిపోస్తారు. ఈ వెధవ కాలేజీలకి వారానికి నాలుగురోజులు సెలవులు. 'కాలేజీ లేని టైములో ఆవారాలా తిరుగుతాడు. మీ ఆఫీసులో వేసుకుని కాస్త ట్రైనింగివ్వు' అని మీ నాన్న అడిగితే చిన్న నాటి క్లాస్ మేటు గదా అని మాట తీసెయ్యలేక పార్టయిమ్ ఉద్యోగం యిచ్చాను. నేర్చుకునేది లేదు చచ్చేది లేదు - పెద్ద వెటరన్ జర్నలిస్టులా బోడిపోజు..." అంటూ ఇంకేదో చాలా దండకం చదివాడు. ఇది నాకే కాదు. జర్నలిస్టు సమాజాని కంతటికీ పరువు తక్కువ అనడంలో సందేహంలేదు. ఈయనపై

ప్రెస్ కౌన్సిల్‌కు ఫిర్యాదు చేయాలి. లేదా హైకోర్టులో హెబియస్ కార్పస్ పిటిషను వెయ్యాలి.

అదీ కాకపోతే ఆయన ఆ మాటలు ఉపసంహరించుకొనే వరకు ఆమరణ నిరాహారదీక్ష సాగించాలి. దానివల్ల కూడా ఫలితం లేకపోతే నిరసనగా రాజీనామా ఇవ్వాలి. విప్లవం వర్థిల్లాలి! పత్రికా స్వాతంత్ర్యం జిందాబాద్!

## ఆగస్టు 15 :

రాష్ట్ర రాజకీయాలలో కనివిని ఎరుగని నాటకీయ పరిణామాలు సంభవించాయి. ఆర్థిక మంత్రి నాదెండ్లను ఎన్టీరామారావు బర్తరఫ్ చేశారు. అంతకుముందు ఎన్టీఆర్ అమెరికా నుంచి తిరిగి రాగానే నాదెండ్ల ఎదురు వెళ్ళి ఆయనను కౌగలించుకుని స్వాగతం చెప్పారు. కౌగలించుకున్న తమ్ముణ్ణి బర్తరఫ్ చేయడం వెన్నుపోటేనని కొందరు వ్యాఖ్యానించారు. ధృతరాష్ట్ర కౌగిలి అని మరి కొందరు వ్యాఖ్యానించారు. ఏమైనప్పటికీ అది వారిద్దరి అంతరంగిక వ్యవహారం.

ఇది ఇలా ఉండగా, ఎన్టీఆర్‌కు ఘనస్వాగతం వార్త విషయమై నాకూ ఎడిటర్ గారికీ వాగ్వాదం జరిగింది. "ముఖ్యమంత్రి ఎన్టీఆర్ నేడు తిరిగి వచ్చారు. ఆయన అమెరికా నుంచి విమానంలో ఇక్కడికి తిరిగి వచ్చారు. హృద్రోగ శస్త్రచికిత్సకై ఆయన అమెరికా వెళ్ళారు. ఆయన అక్కడ నెల రోజులున్నారు. బేగంపేట విమానాశ్రయంలో ఆయనకు ఘనస్వాగతం లభించింది" ఇలా చిన్న చిన్న సింపుల్ సెంటెన్సులు రాయడం తప్పయిపోయింది.

"ఏమిటీ వెధవ ఏడుపు. ఈ ఐదువాక్యాలూ కలిపి ఒక్క వాక్యంగా రాయచ్చు" అని కోప్పడ్డారు ఎడిటర్‌గారు. ఆయన బొత్తిగా మాట నిలకడలేని మనిషి అని తేలిపోయింది. "చిన్న వాక్యాలు ఏడవమని మీరే కదా చెప్పారు" అంటే "చిన్నా పెద్దా కొశ్చను కాదు. సింటాక్సు బాగుంటే ఎంత పెద్ద వాక్యమైనా తేలిగ్గా అర్థమవుతుంది. వాక్య నిర్మాణం విషయంలో శ్రద్ధ తీసుకోమని చెప్పాను"- అని వాదించాడు ఆయన. అంతటితో ఊరుకోక న్యూస్ ఎడిటర్ గారిని కూడా పిలిచి కోప్పడ్డారు. "ఇలాంటి ఇంపార్టెంటు వార్తలు ఇతనికిస్తారు దేనికండీ - ఏదో సంక్షిప్త వార్తలూ, ఫిల్లర్లూ ఇవ్వక" అని విసుక్కున్నారు. ఎప్పటికైనా సొంత పత్రిక పెట్టి 'సుజనమిత్ర'ని చిత్తు చేయాలని శపథం చేశాను. నేను చేరిన తర్వాత సుజనమిత్ర సర్క్యులేషన్ ఇరవై రెండు కాపీలు పెరిగింది. అయినా ఆయనకి కృతజ్ఞత లేదు. మిడిమేలపు దొరను గొల్చి మిడుగుట కంటెన్..

## ఆగస్టు 16 :

రామారావు బర్తరఫ్; నాదెండ్లకు పట్టాభిషేకం. ప్రజాస్వామ్యానికి చావుదెబ్బ. ఎన్టీఆర్‌ను అరెస్టుచేసి వ్యానులో తీసుకువెడుతున్న ఫొటో చూస్తే కన్నీళ్ళు ఆగలేదు. శ్రీరాముడు వనవాసమున కేగిన సీను, మాయద్యూతమున ధర్మజుడు ఓడిపోయిన సీను జ్ఞాపకం వచ్చినవి. నాదెండ్ల మూర్తీభవించిన దుర్యోధనుడులా కనిపించారు. ఆహా దుర్విధీ... ఎంతవారలైనా విధిచేతి కీలుబొమ్మలే కదా? ఈ విషయంలో వర్లక్ష్మి అభిప్రాయమేమిటో తెలుసుకోవాలి.



ఒక పక్క రాష్ట్రం ఇలా అట్టుడికిపోతుంటే ఆఫీసులో ముగ్గురు సబ్‌ఎడిటర్లు ఒకేసారి సెలవు పెట్టారు. ఎడిటర్‌గారు చాలా కోపంగా చిరాకుగా వున్నారు. పాపం ఆయన్ని చూస్తే జాలేసింది. ఈ సంక్లిష్ట తరుణంలో ఆయనకు నా పూర్తి మద్దతును పునరుద్ఘాటించాను. నేను ఒక్కణ్ణే నలుగురు సబెడిటర్ల పెట్టు అనీ, ఆయనకు కుడిభుజంగా నిలబడతాననీ, న్యూస్ ఎడిటర్ లేకపోయినా నేనే ఎడిషన్ తీసుకురాగలననీ భరోసా ఇచ్చాను. ఇంటికి వెళ్ళి గుండెమీద చేయివేసుకొని హాయిగా రెస్టు తీసుకోమని చెప్పాను. ఆయన అదోరకంగా నవ్వి "థాంక్యూ... నువ్వింక... వెళ్ళచ్చు" అన్నాడు.

## ఆగస్టు 17 :

"దేశమంతటా నిరసన వెల్లువ" అని హెడ్డింగు పెట్టాను. "అందరూ వాడేసి అరిగిపోయిన ఈ సన్నాసిమాట తప్ప ఇంకోటి దొరకలేదా?" అని విసుక్కున్నారు ఎడిటరు గారు. సరేనని "యాద్భారతావనిలో నిరసన స్రోతస్విని" అని రాసి తీసికెళ్ళా. సంతోషించడం పోయి చిత్తు బుట్టలో కుక్కాడు. "ఆ ఏడుపేదో నేనే ఏడుస్తాను. నువ్వుపో" అని కసిరాడు. ఈయనతో చచ్చేచావుగా ఉంది. ఎలా రాసినా తప్పే నంటాడు. కాస్సేపటికి మళ్ళీ ఆయనే పిల్చి "స్టేట్ పాల్టిక్స్ విషయంలో ఒళ్ళు దగ్గర పెట్టుకు రాయి" అని హెచ్చరించారు. "మనం నిష్పాక్షికంగా ఉండాలి. మనం ఫలానా పక్షం వాళ్ళం అనే ముద్ర పడకూడదు. బాలెన్సుడుగా రాయాలి" అని వివరించారు. ఈ విషయంలో మటుకు నేను ఆయనతో పూర్తిగా ఏకీభవిస్తున్నాను. "ఎన్టీఆరేమైనా మన మేనమామ, నాదెండ్ల కాకపోయారా? 'ఫలానా వర్గానికి చెందిన ఎమ్మెల్లే' అంటూ రాయకూడదు మనం. ఆ ఎమ్మెల్యే తమవర్గం వాడని వాళ్ళు చెప్పుకుంటున్నారంతే. నిజమో కాదో మనకు తెలీదు. అందుకని నాన్ కమిటల్‌గా రాయాలి. లేకపోతే గొడవలొస్తాయి" అని సలహా ఇచ్చారు ఎడిటర్‌గారు. ఎంత కోపిష్టి అయినా

ఒక్కొకప్పుడు ఆయన అమూల్యమైన పాఠాలు నేర్పుతూ ఉంటారు.

ఆఫీసునుంచి తిన్నగా మామయ్య గారింటికెళ్ళాను. వర్లక్ష్మిని చూడగానే "మరదలా నా హృదయంలో పొంగిపొరలే ప్రేమ వరదలా" అని ఆశువుగా పాడాలనిపించింది. కాని వర్లక్ష్మి భలేకోపం మీదుంది. నాదెండ్లని తెగ తిట్టిపోసింది. "ఇంత ఘోర అన్యాయం జరుగుతుంటే ఏం చేస్తున్నాయి మీ బోడి పత్రికలు" అని దుమ్మెత్తిపోసింది. నా వ్యక్తిగతాభిప్రాయం ఏమైనప్పటికీ బాధ్యతాయుత మైన పాత్రికేయునిగా నేను బాలెన్సుడుగా ఉండాలని చెప్పాను. ఈ సమస్యపై వ్యాఖ్యానించడానికి నా నిస్సహాయతను వ్యక్తం చేశాను. "అన్యాయాన్ని అన్యాయమని చెప్పలేక పోయిన తర్వాత దేనికి మీ పత్రిక తగలేసుకోనా" అని తీవ్రంగా విమర్శించింది. నంగి నంగిరాతలు మాని ఎన్టీఆర్‌కు అనుకూలంగా ఎడిటోరియల్ రాయకపోతే మహిళా సంఘం వాళ్ళచేత సుజనమిత్ర ఎదుట ధర్నా జరిపిస్తానని అల్టిమేటం ఇచ్చింది. అన్నంత పనీ చేసేట్టే ఉంది.

ఈ గడ్డు పరిస్థితులను విజయవంతంగా అధిగమించే శక్తి ప్రసాదించు భగవాన్!

## ఆగస్టు 18 :

నిన్నరాత్రి మామయ్య గారింటో భోంచేసి రూముకి వచ్చి ఆరుబైట డాబామీద పడుకొని అనర్గళంగా ఆలోచించాను. ఇటు ప్రాణాత్మకంగా ప్రేమించిన వర్లక్ష్మి, అటు దైవ సమానమైన పాత్రికేయవృత్తి. ప్రేమ కోసం బాహాటంగా ఎన్టీఆర్‌ను సమర్థిస్తూ, నాదెండ్ల వర్గాన్ని దుయ్యబట్టడమా, లేక వృత్తి ధర్మం కోసం ప్రేమను త్యాగం చేసి ఉభయపక్షాలను సమదృష్టితో వీక్షించడమా... ఎటూ తేల్చుకోలేక చాలాసేపు ఇదమిద్ధమైపోయాను.. చివరికి వృత్తి ధర్మానికి కట్టుబడాలని కృతనిశ్చయించుకున్నాను. విధ్యుక్తధర్మ నిరతిలో వ్యక్తిగత ప్రేమానురాగాలకు తావు లేదు. వర్లక్ష్మి దూరమై పోతున్నందుకు కళ్ళవెంట నీళ్ళు వచ్చాయి. కాని గుండెను రాయి చేసుకున్నాను. రాంబాబు జీవితచరిత్రలో ఇదొక అగ్నిపరీక్షా తరుణం.

అలా ఆలోచిస్తూ పడుకునేసరికి ఓ కల వచ్చింది. నేను ఓ పీఠంమీద ధర్మదేవత లాగా ఇరవై అడుగుల పొడుగున నుంచుని ఉన్నాను. నెత్తిమీద ముళ్ళకిరీటం ఉంది. కళ్ళకి గంతలు. కుడిచేతిలో కలం - ఎడం చేతిలో పెద్దత్రాసు. ఒక తక్కెడలో ఎన్టీఆర్, ఇంకో తక్కెడలో నాదెండ్ల. హెచ్చు తగ్గులూ లేకుండా త్రాసు సమానంగా తూగుతోంది. వర్లక్ష్మి "అన్యాయం, అక్రమం, కళ్ళులేని కబోది మీ చట్టం" అని విప్లవాత్మకంగా అరుస్తోంది. కోతి, చారుమతి మున్నగు వారు కూడా నినాదాలు చేస్తున్నారు. అయినా నేను చలించలేదు. కాస్సేపటికి త్రాసు లోని మనుషులు మాయమై, గుర్రం, గాడిదా ప్రత్యక్షమైనాయి.

ఒప్పందం ప్రకారం ఈ కలని సారధికి చెబితే అతను "యూ ఆర్ థింకింగ్ టూ మచ్ ఆఫ్ యువర్ సెల్ఫ్" అని వ్యాఖ్యానించాడు. "కన్నకొడుక్కి ఉరిశిక్ష విధించిన న్యాయమూర్తిలాగా నిన్ను నువ్వు ఊహించుకుంటున్నావు. అన్యాయాన్ని ఎదిరించలేని నీ చేతకాని తనాన్ని సమదృష్టి అనే ముసుగుతో కప్పుతున్నావు" అని విశ్లేషించాడు. సారధి నాకు చెప్పకుండా విరసంలోనో, ప్రజాస్వామ్య పరిరక్షణ సంఘంలోనో చేరిపోయినట్టున్నాడు. మనస్సు లోనే అతన్ని ఆశీర్వదించాను.

**ఆగస్టు 22 :**

ప్రజాస్వామ్యం ప్రమాదాన్ని ఎదుర్కొంటున్న ఈ తరుణంలో నేను డిగ్రీ, డాక్టరేటు అంటూ స్వార్థ పూరితంగా ఆలోచించడం సిగ్గుచేటు. స్వాతంత్రోద్యమ కాలంలో నాన్నగారు కూడా కాలేజి చదువుకు స్వస్తిచెప్పిన విషయం గమనార్హం.

రాష్ట్రపతితో ఎన్టీఆరూ, ఆయన మద్దతు దార్లని చెప్పబడుతున్న వారిభేటి.

అన్నగారు 19 నెలల్లో చేయలేకపోయిన సంచలనాత్మక వాగ్దానాలను నాదెండ్లగారు అధికారంలోకి వచ్చిన ఐదురోజుల్లోగా చేసి రికార్డు నెలకొల్పారు బహుశా ఆయనపేరు గినెస్ బుక్కులోకి ఎక్కవచ్చు. ఈ సందర్భంలో మేము ఆయన్ని మనసారా అభినందించకుండా వుండ లేక పోతున్నాము.

పాపం ఎడిటర్ గారికి ఒంట్లో బావుండటం లేదు. పైగా ఈ సమయంలోనే న్యూస్ ఎడిటర్గారు బాధ్యతారహితంగా సెలవు పెట్టాడు. "అన్నిటికీ నేనే చావాలి. జరం వచ్చి చస్తున్నా ఒకపూట ఎడిటోరియల్ రాసిపెట్టే దిక్కులేదు" అని ఎడిటరుగారు చిరాకు పడడడం వినిపించింది. చప్రున ఆయన గదిలోకి వెళ్ళి "రాంబాబు చచ్చాడనుకున్నారా? నా కంఠంలో ప్రాణం ఉండగా మీకు అటువంటి దైన్యస్థితి రానివ్వను. అత్యంత బాలెన్సుడుగా ఆణిముత్యం లాంటి ఎడిటోరియల్ రాసిపెడతాను. మీరు రెస్టు తీసుకోండి" అని అభయమిచ్చి నా సీట్లోకి వచ్చి కూర్చున్నాను. అరగంటలో అద్భుతమైన ఎడిటోరియలు రాసి ఆయన కరతలామలకములలో నుంచాను.




"తాను అన్నను వెన్నుపోటు పొడిచాడన్న అరోపణలో ఎంతమాత్రం నిజంలేదని శ్రీ నాదెండ్ల పునరుద్ఘాటించారు. నిజానికి ఆయన చెప్పేది నిజం కాదనడానికి అట్టే అస్కారం

లేదనే చెప్పవలసి ఉంటుందనడంలో సందేహంలేదు. అయితే ఆయన చర్యను వెన్నుపోటుగా ప్రత్యర్థులు అభివర్ణించడం బొత్తిగా అనుచితమనీ అనలేము. అన్నకు వ్యతిరేకంగా పార్టీలో తిరుగుబాటు లేవదీయడాన్ని ద్రోహంగా వారు భావించడంలో ఆశ్చర్యమేమున్నది? కాని, ఈ తిరుగుబాటుకు శ్రీ నాదెండ్ల చెప్పే కారణాలూ అత్యంత సమంజసంగానే ఉన్నాయి. పార్టీలో అంతర్గత ప్రజాస్వామ్యం కొరవడిందన్న విమర్శ సబబు కాదని అనలేము. ఏమైనప్పటికిన్నీ ఉభయులూ తమ అభిప్రాయ భేదాలను సంప్రతిపుల ద్వారా శాంతియుతంగా, సామరస్య పూర్వకంగా పరిష్కరించుకోవడం ఈ సంక్లిష్ట తరుణంలో పార్టీకి, రాష్ట్రానికీ కూడా ఎంతైనా శ్రేయస్కరం. ఇది ఇలా ఉండగా, శ్రీ ఎన్టీఆర్‌ను దేశద్రోహి అని శ్రీ నాదెండ్ల అభివర్ణించడం ప్రజాస్వామ్య ప్రియులను ఆశ్చర్యచకితులను చేయడం సహజం. అయితే శ్రీ నాదెండ్ల వంటి ఆరితేరిన రాజకీయవేత్త ఏ ఆధారమూ లేకుండానే అంతటి ఆరోపణ చేస్తారా అన్నది ప్రశ్న. ఏమైనప్పటికీ ఆయన తొందరపడి అటువంటి ఆరోపణ చేయకుండా ఉండవలసిందని మేము భావిస్తున్నాము. అన్నదమ్ముల మధ్య పొరపొచ్చాలు అంతమై, తిరిగి ఇద్దరూ ఒక తాటిపై నడుస్తారని మనసారా ఆశిస్తున్నాము."

ఇదీ నా ఎడిటోరియల్ సారాంశం. త్వరలోనే నన్ను లీడర్ రైటర్‌గా ప్రమోట్ చేస్తారని ఆశిస్తున్నాను. నాకు తెలిసి నంతమటుకు ఇంత బాలెన్సుడుగా మా ఎడిటర్‌గారు కూడా ఎప్పుడూ రాయలేదు.

## ఆగస్టు 23 :

"అటు శ్రీ నాగేండ్ల తన మద్దతుదారులని చెబుతున్న ఎమ్మెల్యేల జాబితాలోనూ, ఇటు శ్రీ ఎన్టీఆర్ తన మద్దతుదారులని చెబుతున్న ఎమ్మెల్యేల జాబితాలోనూ కూడా పేర్లున్నట్లు చెప్పబడుతున్న 37 మంది శ్రీ ఎన్టీ ఆర్‌తో పాటు రాష్ట్రపతిని కలుసుకున్న ఎమ్మెల్యేలని చెప్పబడుతున్నవారు ఢిల్లీలోని సూర్య హోటల్లో తీయించుకున్నట్లు చెప్పబడుతున్న ఫొటోలో ఉన్నట్లు పేర్కొంటూ ఒక వార్త, ఫొటో చేరాయి. అయితే ఆ ఫొటోలో ఉన్నట్లు పేర్కొనబడిన ఆ 37 మంది నిజంగా ఎమ్మెల్యేలు కారనీ, ఆ పేర్లు గల వారని చెప్పబడుచున్న ఎమ్మెల్యేలు తమ శిబిరంలో ఉన్నారనీ నాదెండ్ల వర్గంవారు ఆరోపించారు." ఎడిటరుగారు చెప్పినట్లు సింటాక్సు - అనగా వాక్యనిర్మాణం - బాగుంటే ఎంత సుదీర్ఘమైనప్పటికీ సులభ గ్రాహ్యంగా ఉంటుందనడానికి ఇదే నిదర్శనం.

## ఆగస్టు 24 :

రాంలాల్ రాజీనామా. ప్రత్యర్థి వర్గాల పరస్పరారోపణలతో తలదిమ్మెక్కిపోతోంది. కొద్దిరోజులపాటు ఈ రాజకీయాలనుంచి విశ్రాంతి తీసుకోవాలి.

## సెప్టెంబరు 6 :

"శ్రీ ఎన్టీఆర్‌చే మైసూరులోని ఒక హోటల్‌లో నిర్బంధించబడినట్లు ఆరోపించబడిన తన తండ్రిని విడుదల చేయించ వలసిందిగా తాను దాఖలు చేసినట్టు చెప్పబడుతున్న ఒక హెబియస్ కార్పస్ పిటిషన్‌ను పురస్కరించుకుని తన తండ్రిని విడుదల చేసి పదవ తేదీన కోర్టు ఎదుట హాజరు పరచాలని హైకోర్టు ఉత్తర్వు చేసిందన్న వార్తను రేడియోలో విని తాను దిగ్భ్రాంతి చెందినాననీ, నిజానికి అటువంటి పిటీషన్‌ను తాను దాఖలు చేయలేదనీ, సదరు పిటిషన్‌ను ఎవరో తన సంతకాన్ని ఫోర్జరీ చేసి దాఖలు చేసిఉంటారని భావిస్తున్నాననీ, ఈ సంగతి తాను టెలిగ్రాంద్వారా హైకోర్టుకు తెలియపరచాననీ సదరు మైసూరులో నిర్బంధంలో ఉన్నట్లు చెప్పబడుతున్న ఎమ్మెల్యే వెంకట్రామనాయుడు కుమారుడినని చెప్పుకుంటున్న ఒక 24 ఏళ్ళ యువకుడు శివునాయుడు - విజయనగరంలో విలేకరులకు చెప్పినట్లు ఇక్కడికి చేరిన సమాచారంవల్ల తెలిసింది."

త్వరలో ప్రమోషన్ వస్తుందని విశ్వసిస్తున్నాను. తథాస్తు.

## సెప్టెంబరు 11 :

"తీవ్ర అభిప్రాయభేదాలతో అసెంబ్లీ వాయిదా" అని బేనరు హెడ్డింగు పెట్టినందుకు చివాట్లు తగిలాయి. "సభలో అంత గొడవ జరిగి, బూతులు తిట్టుకుని, కొట్టుకున్నంత పనిచేస్తే అభిప్రాయ భేదాలంటావు. నీకేమైనా తలకాయుందా?" అని అరిచారు. 'సభలో రభస' అన్నందుకు లోగడ ఓ పత్రిక మీద సభాహక్కుల తీర్మానం పెట్టారు కదా. సుప్రీం కోర్టులో కేసు ఇప్పటికీ నడుస్తోంది కదా. సుప్రీం కోర్టుకు వెళ్ళే స్తోమతు సుజనమిత్రకి లేదు కదా. మనదేమో మరి బాలెన్సుడుగా రాసే గౌరవప్రదమైన పేపరుకదా. 'గొడవ' అనే పదాన్ని గౌరవప్రదంగా చెప్పాలంటే అభిప్రాయ భేదాలనే కదా రాయాలి. ఇంత వివరించినా ఎడిట గారు కన్విన్సు కాలేదు. తెలిసీ తెలియని నరు దెల్చ బ్రహ్మదేవుని వశమే!

## సెప్టెంబరు 13 :

వరుసగా మూడవ రోజు సభలో మైకుల పెరికివేత. బల్లల విరిచివేత. ఎన్టీఆర్‌పై చేయి చేతకు విఫలయత్నం. ఎన్టీఆర్ వర్గంచే మౌనం పాటింపు. తిరిగి సభ వాయిదా. యథాతథ పరిస్థితి కొనసాగింపు.



## సెప్టెంబరు 16 :

ప్రజాభీష్టానికి పట్టాభిషేకం. ఆనందం పట్టలేకపోయాను. ఈ స్వీట్ న్యూస్‌ని స్వీట్ హార్ట్‌కు తెలియజేయాలని స్వీట్ పాకెట్‌తో మావయ్య గారింటికి వెళ్తే వర్లక్ష్మి అప్పటికే రాజభవన్‌కి వెళ్ళిపోయింది.

వెల్లివిసిరిసిన ఆనందోత్సాహాలు. ఇది ప్రజావిజయం. నాదెండ్ల ఆక్రోశం. ప్రజాస్వామ్య పరిరక్షణ యజ్ఞానికి నన్ను నేను పునరంకితం చేసుకున్నాను.

**(హాస్యప్రియ 1984)**

## డిసెంబరు 20 :

రాత్రి భలే కల వచ్చింది. కాలేజీకి నడిచి పోతుంటే రోడ్డు మీద పావలా దొరికింది. అది తీసి జేబులో వేసుకుని నడుస్తుంటే కాసేపటికి ఒక చోట ఒక కవరు దొరికింది. దాని మీద ఏవో లెక్కలు వేసి, టోటల్ 394 రూపాయలు అని ఉంది. జనం ఎవరూ లేరు. తీసి చూస్తే దాని నిండా వందరూపాయల నోట్లు. లెక్క పెడుతుంటే ఎంతకీ తరగటం లేదు. కొన్ని వేలు లెక్కపెట్టాను. అన్నీ లెక్కబెడితేనే కదా మొత్తం ఎంతో తెలిసేది. ఎంత సేపు లెక్కబెట్టినా మొత్తం ఎంతో తెలియటం లేదు. అలా నోట్లు లెక్కబెడుతుండగానే భాస్కరరావు నిద్రలేపాడు శనిగాడిలాగా. "ఏం కొంప ముంచుకుపోయింది. లెక్క పూర్తయ్యేదాకా ఆగకూడదూ" అని చివాట్లు పెట్టాను. నా కల అంతా విని సారథి "నువ్వు భలే లక్కీ ఫెలోవోయ్. నీ కెప్పుడూ కలల్లో బోల్డు డబ్బులు దొరుకుతూ ఉంటాయి" అన్నాడు. "అవును మరి - వినయంగా తలవంచుకు వెళ్ళే వాళ్ళకే రోడ్డు మీద డబ్బులు దొరుకుతాయి. కళ్ళు నెత్తి కెక్కిన వాళ్ళకి ఎలా దొరుకుతాయి" అన్నాను - అన్యా పదేశాలంకారంతో భాస్కరరావుని దెబ్బకొడుతూ.

"తెల్లారుజామున వచ్చిన కలోయ్.నిజంమవుతుందనుకుంటా" అన్నాడు సారథి. భాస్కరరావు మాత్రం బిగ్గరగా నవ్వుతూ "బారెడు పొద్దెక్కితే తెల్లారు జామునంటావేమిటి? ఇది ఒట్టి పగటి కల" అన్నాడు. పైగా "మెలకువ వచ్చిన తర్వాత కూడా కలను తలచుకొని మురిసిపోయే వాడు మూర్ఖుడు" అంటూ వాదించాడు. నేను ఊరుకుంటానా? "వెర్రివాడా! కల జీవితంలో భాగం. జీవితంలో లేనిదేదీ కలలో కనిపించదు. రోడ్డు వాస్తవం. డబ్బు వాస్తవం. మనుషులకి డబ్బులు దొరకడం వాస్తవం. ఇందులో అవాస్తవికం ఏమీలేదు. కల అనగా వాస్తవం యొక్క ప్రతిబింబం మాత్రమే" అని ఉపన్యసించాను. నాతో వాదించలేక భాస్కరరావు టవలు బుజాన వేసుకుని స్నానానికి వెళ్ళిపోయాడు.

## డిసెంబరు 26 :

రాష్ట్రంలో రేపే పోలింగ్. అటు రాజీవ్, ఇటు ఎన్టీఆర్ పోటా పోటీగా ప్రచారం సాగించారు. ఎవరి ఆకర్షణ ఎంత పని చేస్తుందో చూడాలి. అన్న గ్లామర్ ఈ సారి బాగా తగ్గిపోయిందని రాజకీయ పండితులు అంటున్నారు. అందుకే అన్న కోర మీసం పెట్టి, క్రాఫింగ్ పెట్టి, బుష్ షర్టూ, పాంటూ వేసి రాజీవ్‌కు దీటుగా నలభై ఏళ్ళ యువకుడి లాగా కనిపిస్తూ తన గ్లామర్ చెక్కుచెదర లేదని నిరూపించుకున్నాడు.

ఎలక్షను సీజను... ఊపిరి సలపని పని. కాలేజీకి సెలవు పెట్టి సుజన మిత్ర లోనే పగలూ రాత్రీ. డైరీ రాసే తీరిక చిక్కడంలేదు.

## జనవరి 1 :

రాత్రి ఆంజనేయుల వారి గుళ్ళో కొబ్బరికాయ కొట్టి మావయ్యా వాళ్ళింట్లో ప్రసాదం ఇచ్చాను. వరలక్ష్మికి శుభాకాంక్షలు చెప్పాను. తరవాత భాస్కరరావు, బాబూరావు, సారథి లతో కలిసి రోడ్లు చక్కర్లు కొట్టాను. కోతీ వాళ్ళింట్లో ఇంకా లైట్లు వెలుగుతున్నాయి. గణేష్ గాడు హాపీ న్యూఇయర్ చెప్పాడు. కోతే చెప్పించి ఉంటుంది.

"ఉదయం" ఫెంటాస్టికల్‌గా ఉంది. తెలుగు జర్నలిజం చరిత్రలో కనివిని ఎరుగని ఎక్స్‌పెరిమెంట్సు చేశారు. మొన్న "ఉదయం" మార్కెటు లోకి వచ్చేనాటికి 2149 ఉన్న సుజనమిత్ర సర్క్యులేషను ఈ మూడ్రోజుల్లో తొమ్మిది తగ్గింది. క్రమక్రమేపి ఈ నెలాఖరుకి



ఇంకో నూటనలభై తగ్గి 2000 రౌండు ఫిగరవుతుందేమోనని ఎడిటరు గారు వర్రీ అవుతున్నారు. తెలుగు దినపత్రికలలో సుజనమిత్ర స్థానం పదహారు నుంచి పదిహేడుకి వెళ్ళిపోయిందే అని ఆయన బాధపడుతున్నారు. "జర్నలిజంలో మనం ముప్పైయేళ్ళు వెనకపడి ఉన్నాం. ఎక్స్‌పెరిమెంట్లు చెయ్యకపోతే లాభం లేదు" అని ఎప్పుడో చెప్పాను. ఫ్రంట్ పేజి అడ్డంతిప్పి పదకొండు కాలాలు కంపోజ్ చేయిద్దామని నెత్తీ నోరూ కొట్టుకుని చెప్పాను. నామాట విన్నారా? కుర్రవెధవ కింద తీసి పారేశారు. ఇప్పుడు అనుభవిస్తున్నారు. చేతులు కాలాక ఆకులు పట్టుకుంటే ఏం లాభం? ఇప్పటికైనా

మించిపోయింది లేదు. మూడో పేజీని తలకిందులు చేద్దామని సలహా ఇచ్చాను. లేకపోతే ఎడిట్ పేజీని ఐమూలగా కంపోజ్ చేయిద్దామని ఐడియా ఇచ్చాను. అసలు పేజి మేకప్పు పూర్తిగా నా కొదిలేసి గుండెలమీద చేతులేసుకుని నిద్రపొమ్మన్నాను. మోస్ట్ ఎట్రాషియస్‌గా తీర్చిదిద్దుతానని భరోసా ఇచ్చాను. ఎడిటరుగారు తలపట్టుకు కూర్చున్నారు. ఏది ఏమైనప్పటికీ 'ఉదయం' ముషీరాబాద్‌నుంచి వస్తోంది కనక మనకేం ఫరవాలేదని ధైర్యం చెప్పాను. ఆయన ఆశ్చర్యంగా తలెత్తి చూశారు. మనం మాస్ట్ హెడ్ మీద 'లార్జెస్ట్ సర్క్యులేటెడ్ తెలుగూ డైలీ పబ్లిష్‌డ్ ఫ్రమ్ చింతల్‌బస్తీ' అనే లైను తీసేయాల్సిన అవసరం లేదు కదా అన్నాను. ఆయన ఒక్కసారిగా 'యూ షటప్ గెటవుట్' అని గావు కేక పెట్టాడు. పోగాలము దాపురించిన వారు మిత్రులమాట మూర్కొనరు, కనరు, వినరుఅన్నారు ఇందుకే.

### జనవరి 5:

వచ్చేనెల మనతెలుగు గడ్డపై జరగబోతున్న చరిత్రాత్మకమైన ప్రపంచ హాస్య మహాసభలకి నన్ను 'సుజనమిత్ర' స్పెషల్ కరెస్పాండెంట్‌గా పంపమని ఎడిటర్ గారిని అడిగాను. హాస్యంమీద నేను అథారిటీ అన్న సంగతి అందరికీ తెలిసిందే కనక అద్భుతమైన కవరేజి ఇవ్వడం అట్టే కష్టం కాదని చెప్పాను. "1990 లో టింబక్టూలో జరిగే అపహాస్య మహాసభలకి తప్పకుండా పంపిస్తా. అప్పటికి నువ్వు వెటరన్ జర్నలిస్టువి అవుతావు కూడా" అని వెటకారంగా సమాధానమిచ్చాడు ఆయన. యువ రక్తాన్ని ప్రోత్సహించక పోవడం వల్లనే మన పత్రిక ఇలా కృశించి పోతోందని అనాలనుకున్నాను. 'ఉదయం'లో చేరిపోతానని బెదిరించాలనుకున్నాను. మళ్ళీ ఆయన ఇదివరకటిలాగే "అవశ్యం" అంటాడేమోనని భయం వేసి నిగ్రహించుకున్నాను. కాని మరీ ఊరుకుంటే లోకువైపోతాం గదా అని "సరే మీకు అవసరం లేకపోతే మాంచెస్టర్ గార్డియన్‌కి ఇస్తాను రిపోర్ట్" అని సర్రున వచ్చేశాను.

హాస్య మహాసభలకి అన్నగారే ప్రారంభోత్సవం చేస్తాడనుకుంటాను. యమగోలలో ఎంత హాస్యం చేశాడు ఆయన! ఎన్నికల ప్రచారం కోసం వేషం మార్చినట్లే హాస్యమహాసభల కోసం సందర్భోచితంగా ఆయన ఏదైనా తమాషా డ్రెస్ వేసుకొస్తే బావుంటుంది. తన అనర్గళ ప్రసంగాలతో తెలుగు ప్రజలకు ప్రేమాస్పదుడైన అన్నగారు మహాసభలో ఇంగ్లీషులో హాస్యయుతంగా ప్రసంగించి ప్రపంచ స్థాయిలో హాస్యాస్పదుడు కావాలని నా ఆకాంక్ష.

### జనవరి 11:

త్వరలో తెలుగుదేశం పేరును భారతదేశంగా మార్చాలనుకుంటున్నట్టు అన్నగారు

ప్రకటించారు. ఆయన తన దృక్పథాన్ని మరింత విస్తృత పరచుకోవడం హర్షణీయమే గాని తెలుగు వారి ఆత్మగౌరవం దెబ్బతింటుందేమోనని నాకు బాధగా వుంది. పేరు మార్చడం కంటే 'తెలుగుదేశం' పార్టీనే జాతీయస్థాయికి తీసుకుపోవాలని నా ఆకాంక్ష. మనదేశంలో తెలుగువాళ్ళు లేని రాష్ట్రం లేదు. అందుకని అన్ని రాష్ట్రాలలో తెలుగుదేశం శాఖలను ప్రారంభించి, అన్ని చోట్ల నుంచి పార్లమెంటుకు పోటీచేసి కేంద్రంలో తెలుగుదేశం ప్రభుత్వాన్ని ఏర్పాటుచేస్తే అద్భుతంగా ఉంటుంది. అంతేకాదు. అమెరికాలో కూడా ఎందరో తెలుగు వాళ్ళున్నారు. అందుకని అక్కడ కూడా మనవాళ్ళకి టిక్కెట్లిచ్చి పార్లమెంటుకి పోటీచేయించాలి. అన్నగారు అక్కడ కూడ చైతన్యరథం పై ప్రచారం చేయాలి. అల్టిమేట్‌గా అన్నగారు అచ్చ తెలుగులో అమెరికా అధ్యక్షుడుగా ప్రమాణ స్వీకారం చేయాలి. స్టాచ్యూ ఆఫ్ లిబర్టీ మోడల్లో చెయ్యి పైకెత్తి, ఉద్ఘోషిస్తున్న అన్నగారి విగ్రహాన్ని న్యూయార్క్‌లో ప్రతిష్ఠించాలి. అప్పుడే తెలుగుజాతి పౌరుషం దుర్నిరీక్ష్యమానంగా ఉంటుంది. అప్పుడే నా ఆత్మకుశాంతి.

## ఫిబ్రవరి 16 :

నార్ల అస్తమయం. హండ్రెడెండ్ యైటీ పాయింట్ యెయిట్ కాలమ్ బ్యానర్ చేద్దామని ఎంత చెప్పినా వినకుండా ఎడిటరు గారు ఫోర్‌కాలమ్ బాక్సు చేశారు. ఇది విశ్వాస ఘాతుకం, తెలుగు జర్నలిజానికి ద్రోహం అని శాయశక్తులా నిరసన వ్యక్తం చేశాను. సాటి జర్నలిస్టుగా, నా పరిధిలో యథాశక్తి ఆ మహనీయుని ఆత్మశాంతికై కృషి చేద్దామని కాగితాలు ముందేసుకుని కూర్చుంటే న్యూస్ ఎడిటరు గారు వచ్చి కాగితాలు లాక్కుపోయాడు. "నేనుండగా నీకు దేనికోయ్ అంత శ్రమ" అన్నాడు. మరణవార్త, జీవిత సంగ్రహం అంతా తనే రాసి జోహార్లు మాత్రం నాకు ఇచ్చాడు. "యాడ్ నార్ల" అని రాసి పంపమన్నాడు. ముఖ్యమంత్రి జోహార్లు, సాహిత్యవేత్తల నివాళులతో పాటు " రాంబాబు నీరాజనం" అని ట్వంటీ పాయింట్ హెడ్డింగ్‌తో యాడ్ మేటర్ రాసి పంపాను. తెలుగు జర్నలిజం ఆకాశం నుంచి



ధ్రువతార రాలిపోయిందనీ, పత్రికా విహాయస్సులో మధ్యందిన మార్తాండుడు అస్తంగతుడైనాడనీ, వటవృక్షం కూలిపోయిందనీ జోహారులర్పించాను. కంపోజిటరు నోరు మూసుకుని కంపోజుచేయక అది తీసుకొచ్చి న్యూస్ ఎడిటర్‌కి చూపించాడు. ఇహ మొదలు

రామ రావణ యుద్ధం. నీ బోడిజోహార్లు ఎవడు రాయమన్నాడు" అంటూ తోక తొక్కిన తాచులా లేచాడు ఆయన. అంతటితో ఊరుకోకుండా ఆ కాగితాలని చింపి బుట్టలో పారేశాడు. "ఇది నార్ల పట్ల తీరని అపచారం. జర్నలిస్టు సంప్రదాయాలకే గొడ్డలిపెట్టు. పత్రికా స్వాతంత్ర్యం అణచివేత" అని వాదించాను. దీనిపై యూనియన్‌కీ, ప్రెస్‌కౌన్సిల్‌కి ఫిర్యాదు చేస్తానని బెదిరించాను. అంతలో ఎడిటరు గారు గదిలోకి పిలిచి శాంతింపజేశారు. "మాంచెస్టర్ గార్డియన్ లాంటి పెద్ద పత్రికలో పనిచేయాల్సిన వాడివి, అనవసరంగా ఇక్కడ రాటై పోతున్నావ్. ఇదేదో మినీ దినపత్రిక. నీలాంటి ఇంటలెక్చువల్స్‌కి తగినది కాదు. వెంటనే రాజీనామా చేసి గార్డియన్‌లో స్పెషల్ కరస్పాండెంట్‌గా చేరిపో" అన్నాడు ఆయన. మొత్తం మీద ఇన్నాళ్ళకి ఆయన నన్ను సీరియస్‌గా గుర్తించినందుకు మనస్సులోనే జోహారులర్పించాను. 'సుజనమిత్ర' నా మాతృసంస్థ అనీ, దీనికి దూరం కాదలచుకోలేదనీ, దీనినే "గార్డియన్" స్థాయికి తీసుకువెళ్ళడానికి తుది రక్తపు బొట్టు వరకు పాటుపడతాననీ శపథం చేశాను. ఆయన ఎందుకో విచారంగా తల పట్టుకు్కూర్చున్నాడు. రూముకొచ్చిన తర్వాత ఇదంతా చెబితే సారధి, భాస్కర్రావు నవ్వేశారు. అప్పుడు కొంచం అనుమానం వేసింది ఎడిటరు గారు నర్మగర్భాలంకారం వేసి మాట్లాడారేమోనని.

## ఫిబ్రవరి 27 :

మొన్నటి వరల్డ్ హిస్టరీ స్లిప్ టెస్ట్‌లో నాకు 25 మార్కులు మాత్రమే రావడం అత్యంత శోచనీయం. నెపోలియన్‌ను ఎన్టీఆర్‌తో కంపేరు చేస్తూ, వాటర్లూకి ఫిలసాఫికల్ ఇంటర్ ప్రటేషను ఇస్తూ, జర్నలిస్టిక్ ఎనాలసిస్‌తో ఏకధాటిగా యాభై పేజీలు రాసిన నాలాంటి మేధావికే పాస్ మార్కు రాలేదంటే ప్రస్తుత విద్యావిధానం ఎంత నికృష్ట స్థితిలో ఉందో ఎవరికైనా అవలీలగా అర్థమవుతుంది. ఇంతకంటే ఘోరం ఏమిటంటే అక్కినేని ఎన్ని చిత్రాల్లో నటించాడో తెలీని లోకజ్ఞాన శూన్యుడు శంకరం గాడికి 65 మార్కులు వచ్చాయి. ఈ ఇన్‌జస్టిస్ గురించి లెక్చరర్ గారిని క్లాసులోనే నిగ్గదీసి నిర్దాక్షిణ్యంగా అడిగాను. పరీక్షా విధానాన్ని సమూలంగా సంస్కరించ వలసిన ఆవశ్యకత గురించి అసందిగ్ధయుతంగా వాదించాను. "అసలు నీ రాత అర్థమై చస్తే కదా" అన్నాడు ఆయన. "వెటరన్ జర్నలిస్టు రాత ఇంకెలా ఉంటుంది? నాలుగో క్లాసు కుర్రాడు కాపీ రాసినట్లుంటుందా? అయినా నా రాత అర్థం కాకపోతే మరి ఆ పాతిక మార్కులు మాత్రం ఎలా వేశారు?" అని వాదించాను.

"యాభై పేజీలు రాశావు కదా. ఏదో స్టఫ్ ఉండక పోతుందా వెటరన్ జర్నలిస్టువి కదాని యావరేజ్‌మీద పేజీకో అరమార్కు చొప్పున వేశాను" అన్నాడు ఆయన. పైగా "ఈరాత చూసి మీ పత్రికాఫీసులో వాళ్ళు ఎలా కంపోజ్ చేస్తారోయ్" అని సందేహం వ్యక్తం చేశాడు.

నిజానికి ఇదివరకోసారి ఎడిటరు గారు కూడా వార్నింగిచ్చారు - ఉద్యోగంలో ఉండదలచుకుంటే తిన్నగా అర్థమయేట్టు రాసి ఏడవమని. కంపోజిటర్లు మొత్తుకుంటున్నారట నా రాత అర్థంకావడం లేదని. నేనింకా పార్టు టైం సబెడిటర్ని కాబట్టి అలా కంప్లైయింట్ చేయడానికి సాహసిం చగలిగారు. ఎడిటర్నయి ఉంటే నోరు మూసుకుని కంపోజ్ చేసేవారు. జుట్టునెరిసి, కళ్ళజోడు పెట్టుకుని, కండువా వేసుకుంటే గాని మన సమాజం మేధావిని గుర్తించదు. అసలు ఈ రోగం ఈ వ్యవస్థలోనే వుంది. వెంటనే విప్లవ రచయితల సంఘంలో చేరకపోతే లాభం లేదు.

## మార్చి 7 :

ఇవాళ బ్యానర్ నేనే రాశాను. విజయ దుందుభి, జయపతాక లాంటి అరిగిపోయిన మాటలు లేకుండా కొత్తరకం హెడ్డింగు పెట్టమన్నారు ఎడిటరు గారు. "ఆంధ్ర, కర్నాటక, సిక్కింలలో మాత్రం ఉడకని రాజీవ్ పప్పులు" అని రాసి చూపించాను. 'ఓ మోస్తరు బ్రహ్మాండంగానే ఉందిగాని, మనది హాస్యపత్రిక కాదోయ్' అన్నాడు ఆయన. "పోనీ నువ్వు హాస్యప్రియలో అసోసియేట్ ఎడిటర్‌గా చేరకూడదూ. కావాలంటే స్ట్రాంగ్‌గా రికమెండ్ చేస్తాను. నీ ప్రతిభ అంతా ఇక్కడ బూడిదలో పోసిన పన్నీరై పోతోంది. అక్కడైతే బాగా రాణిస్తావు" అని సలహా ఇచ్చాడు కూడా.

ఈమధ్య తరచుగా ఆయన నన్ను మెచ్చుకోవడంలో ఏదో మోసం ఉందని అనుమానం. నాచేత రాజీనామా చేయించడానికి ఆయన కుట్ర చేస్తున్నట్టుంది.

ఇటీవల వరలక్ష్మి కనిపించడం లేదు. పరీక్షలు దగ్గర పడుతున్నాయికదా... రాత్రింబవళ్ళు ఏకగ్రీవంగా చదువుతున్నట్టుంది. నేను కూడా ఇక క్రమక్రమంగా ఆర్థిక, సాంఘిక, రాజకీయ, సాంస్కృతిక కార్యకలాపాలకు స్వస్తి చెప్పి పాఠ్య విషయాలపై దృష్టిని కేంద్రీకరించుట అత్యంతావశ్యకము. పరీక్షల అనంతరము ఈ కార్యక్రమాలను పునరుజ్జీవింప జేయవచ్చును.

ఓం తథాస్తు.

## మార్చి 15 :

శ్రీనాథుడు, పోతనాదుల కోవలో ప్రౌఢ కవిని కావాలని కంకణం కట్టుకున్నాను. నూనూగు మీసాల నూత్నయౌవనంలోనే మరుత్తరాట్చరిత్ర రాశాడు పెద్దన్నగారు. నేను ఇంత పెద్ద వయస్సులో ఇప్పుడు యతిగణ ప్రాసలు చూసుకుంటూ పద్యాలు రాయడం

మొదలుపెడితే ఎప్పటికి ప్రౌఢకవి నయ్యేను. అందుకని మినీ కవిగా ఇప్పటిదాకా వచ్చిన పేరును నిలబెట్టుకుంటూ, అదే సమయంలో ఛందోబద్ధక కవిత్వంలో అనర్గళ సాధన చేయడం అవసరం. "అట జని కాంచె భీముడంబరచుంబి సరత్ ఝురీలుటద దభంగ మృదంగతరంగ డడడాండడాండ" అంటూ ఎంత బ్రహ్మాండంగా రాశాడు బమ్మెర తిమ్మనామాచ్యుడు గారు. అటువంటి పద్యాలు రాస్తే అజరామరకంగా చరిత్ర గర్భంలో నిలిచిపోతాయి.

నిన్ను జూచి

తలను ఊచి

కన్ను గీటి

వలపు మీటి



అంటూ ఎన్ని మినీ కవితలు రాస్తే మాత్రం ఏం సార్థకం? ఇవి కాలప్రవాహంలో గడ్డి పరకల్లా కొట్టుకుపోతాయి. అయితే అఫ్‌కోర్స్ వీటివల్ల అర్జంటుగా కీర్తి వస్తుందనుకోండి.

హెవీ కవితకు సోపానం

మినీ కవితా గానం

రసాత్మకమైన ఒకే ఒక వాక్యం

మననం చేస్తే కాదా మినీ కావ్యం!

దీన్ని ఏదైనా ఉగాది ప్రత్యేక సంచిక్కి పంపించాలి. కృష్ణదేవరాయలైతే అక్షర లక్షలిచ్చే వాడనడంలో ఎంత మాత్రం సందేహంలేదు.

## మార్చి 22 :

తెలుగు ఉగాది. నవయుగాది. జర్నలిజం, రాజకీయాలు యమబోరు కొట్టేశాయి. నూతన సంవత్సరంలో నా మేధస్సును సుదూర వినూత్న. విహాయస పథాల వైపు మళ్ళించాలనుకుంటున్నాను. నా మనస్సు కొత్త వెలుగులను విరజిమ్మాలి. నా కలం కొత్త పరిమళాలను గుబాళించాలి.

తెల్లారుజామున ఐదున్నరకి ఆరుబైట డాబామీద రహస్యంగా బస్కీలు తీస్తోంటే లడ్డుగాడు బాల్కనీ లోంచి చూసి ఇహీ అని ఇకిలించాడు. వాడు అప్పుడే ఉగాది పచ్చడి తింటున్నాడు. కావాలా అన్నాడు. తల వూపాను. రంయ్‌మని వచ్చి ఉగాది పచ్చడి పెట్టాడు. నోట్లో పెట్టుకోగానే వరుసగా చేదు, పులుపు, తీపి తగిలాయి. అదే శుభసూచకం. తీపి తర్వాత చేదు దుర్భరం.

"కోతి చేసిందా పచ్చడి" అనడిగాను.

"కోతెవరు?" అన్నాడు లడ్డూగాడు.

"సారీ ... మీ అక్క" అన్నాను.

"ఆ... మా అక్కా... కోతా... ఆగు అక్కయ్యతో చెబుతాను" అంటూ పరిగెత్తాడు వాడు.

ఆ తర్వాత కాసేపటికి బాల్కనీ లోంచి కోతి గొంతు బిగ్గరగా వినిపించింది. "నేను కోతినైతే తను కుక్క, నక్క, దున్నపోతు, తోడేలు, ఎలుగ్గొడ్డు..." అంటూ సుదీర్ఘమైన జంతువుల జాబితా చదివింది.

ఓం శాంతి: శాంతి: శాంతి:

## మార్చి 24 :

'క్షామ నివారణకు తక్షణ చర్యలు' అని నిక్షేపం లాంటి హెడ్డింగు పెడితే మెచ్చుకోవడం పోయి ఎడిటరు గారు చివాట్లు పెట్టారు. అచ్చులో 'క్షా'కు ఒత్తు పడలేదుట. దానికి నేనేం చేయను? "మన ఫార్టీయైట్ పాయింట్‌లో 'క్ష' వత్తు అరిగిపోయిందని తెలీదూ? అయినా అటువంటి అపార్థాలు ఇచ్చే అక్షరాలు వాడేటప్పుడు కాస్త బుర్ర ఉపయోగించాలి. కరువు నివారణ అంటే సరిపోతుంది కదా. ఆ మాత్రం తెలివి లేకపోతే ఎందుకు పని కొస్తావు జర్నలిస్టుగా" అని శాపనార్థాలు పెట్టారు. "సంస్కృతం తెలుగు సంకరం చెయ్యొద్దని ఇదివరకు మీరేగా చెప్పింది? కరువు అనేది తెలుగు మాట కదా, ఆ రెండూ కలిపితే సంకరం కాదా?" అని ఎదురు వాదించాను. "ముందు సంస్కృతం తర్వాత తెలుగు ఉండకూడదు.



తెలుగు మాట తర్వాత సంస్కృత పదం చేర్చితే అభ్యంతరం లేదు - మర్రివృక్షము అనవచ్చుకాని వట చెట్టు అనకూడదు" అని సిద్ధాంతీకరించాడు ఆయన. 'మర్రివృక్షము' అని రాస్తే మన పేపర్లో 'మర్రి వృకము' అని పడుతుంది కదా? వృకము అంటే తోడేలు కదా అని వాదించేసరికి ఆయన నిరుత్తరుడై పోయాడు. 'నీ ఇష్టం వచ్చినట్టు ఏడు ఫో' అని కసిరాడు. న్యూసెడిటరు నాకు 'ప్రతివాది భయంకర' అని బిరుదు ఇచ్చాడు. టైపులు అరిగిపోతే కొత్త టైపులు తెప్పించుకోవాలి. గాని భాషనే మార్చేయాలంటే ఎలా? ట్వెల్వ్ పాయింట్‌లో 'ఠ' అనే అక్షరాలు లేవుట. అందుకని 'పాఠకులు' అనడం మానేసి 'చదువరులు' అని రాయాలిట. తెలుగు జర్నలిజం సంస్కరణకు నన్ను ఏక సభ్య సంఘంగా వేస్తే ఈ ఉదాహరణలన్నీ ఉటంకిస్తాను.

## మార్చి 27 :

ఇవాళ ఎకనామిక్స్ పేపరు ఎనభైతొమ్మిది పేజీలు రాశాను. నాకు ఎడిషనల్ షీట్సు ఇవ్వలేక ఇన్విజిలేటరుకు చేతులు నెప్పెట్టాయి. స్టాకు అయిపోతే మళ్ళీ తెప్పించడానికి ఏడు నిమిషాలు పట్టింది. ఆ ఏడు నిమిషాలు నాకు అదనంగా ఇవ్వాలని వీరోచితంగా పోరాడినా ఫలితం లేకపోయింది. నిరసనగా ఏడు నిమిషాలు ముందే పూర్తిచేసి పేపరు ఆయన మొహాన కొట్టాను. అందరూ అదిరిపోయారు. నాకు యూనివర్సిటీ ఫస్ట్ వస్తుందేమోనని కొందరు భయపడుతున్నట్టుంది. "టెక్స్ట్ బుక్ ఉన్నదున్నట్టు దించేసినట్టున్నావే' ' అన్నాడు శంకరంగాడు.

"టెక్స్ట్‌బుక్కులో ఉన్నది రాయాల్సిన ఖర్మ నాకేం బట్టింది? వర్జినాల్టీ లేకపోతే కదా బట్టీ కొట్టేది. ఎకనామిక్ ఇష్యూస్‌కి న్యూ ఇంటర్ ప్రెటేషన్ ఇవ్వాల్సిన నాలాంటి వెటరన్ జర్నలిస్టు పుస్తకంలో ఎవడో చెప్పింది రాస్తాడా?" అని ఉద్ఘాటించే సరికి నోరు వెళ్ళబెట్టేశాడు.

ఇదివరకు డైరీలో పరమచెత్తంతా రాసేవాణ్ణి. ఆకాశము మేఘావృతమయ్యేను. వర్షము కురియునేమో. దోసకాయలలో విటమినులు ఎక్కువగా నుండును. చైత్ర వైశాఖ మాసములు వసంతఋతువు, చెట్లుచిగిర్చి పూలు పూయును మున్నగు వాక్యములు రాస్తూ ఉండేవాడిని. ఇప్పుడు జర్నలిజము, విద్యావిధానము, కళలు, రాజకీయములు, ఆధ్యాత్మికత మున్నగు మోస్టు ఇంపార్టెంటు విషయములు మాత్రమే రాస్తున్నాను.

సారధి, భాస్కర్రావు నిర్నిరోధంగా చదువుతున్నారు. ఆ పసివారిని (మానసికంగా) చూస్తే జాలివేస్తోంది. వర్జినాల్టీ డెవలప్ చేసుకోవాలి గాని చదివితే ఏం వస్తుంది? అయినా వాళ్ళు చదవడంలో తప్పులేదు. మౌలిక ప్రతిభ (వర్జినాల్టీ) లోపించినప్పుడు చదవక తప్పదు కదా!

## ఏప్రిల్ 2:

పరీక్షల న్యూసెన్సు వదిలిపోయింది. ఎంతటి వారైనా 'వ్యవస్థ'ను గౌరవించక తప్పదనడానికి నేను పరీక్షలు వ్రాయడమే నిదర్శనం. లేకపోతే లెక్చరర్లకి పరీక్షలు పెట్టి మార్కులు వేయగల మేధాసంపత్తి ఉండి కూడా నేను పరీక్షలు రాయడమేమిటి?

పరీక్షలై పోయినా సారథి, భాస్కర్రావు ప్రయాణం కట్టలేదు. వాళ్ళ ఊళ్ళకు పోతే బోరు కొడుతుందిట. అందుకని ఏవో సమ్మర్ క్లాసులున్నాయనీ, పార్ట్‌టైమ్ ఉద్యోగాల కోసం ప్రయత్నిస్తున్నామనీ ఉత్తరాలు రాసి డబ్బులు తెప్పించుకుంటున్నారు. సారథి శాస్త్రీయ సంగీతం మీద పరిశోధన చేస్తున్నాట్ట. భాస్కర్రావేమో ఖండకావ్యం రాస్తాట్ట. సారథి ఎక్కణ్ణించో ఇన్‌స్టాల్మెంట్స్‌లో కాసెట్ రికార్డరు, కాసిని కాసెట్లు తెచ్చాడు. సంగీతం పుస్తకాలు చదువుతున్నాడు. రాగాలను గురించి లెక్చర్లు దంచుతున్నాడు. కొన్ని రాగాలు వింటుంటే బొమ్మలు కనిపిస్తాయట. నా కైతే ఎంతవిన్నా ఒక్క బొమ్మా కనిపించలేదు. కళ్ళు మూసుకుని వినమన్నాడు. కళ్ళు తెరిచినా కనిపించకపోతే కళ్ళు మూసుకుంటే ఎలా కనిపిస్తాయన్నాను. "నీదుంపతెగ, నీకసలు బుర్రకాయ లేదోయ్. రాగం వింటూ ఊహాలోకంలోకి వెళ్ళాలి. అప్పుడు ఒక్కొక్క రాగానికి ఒక్కొక్క దృశ్యం కనిపిస్తుంది" అని వివరించాడు. నిన్నరాత్రి భాస్కర్రావుకి 'మియాకి మల్హార్' రాగం వినిపించాడట. అది వర్షాకాలపు రాగంట. అది వింటుంటే భాస్కర్రావుకి మనస్సంతా మబ్బులు కమ్ముకుంటున్నట్టు, ఉరుములు, మెరుపులతో వర్షం కురుస్తున్నట్లు, పెనుగాలికి చెట్లు ఊగిపోతున్నట్లు, నెమళ్ళు డాన్సు చేస్తున్నట్లు కనిపించిందట. ఆఖరికి చినుకులు పడగానే వచ్చే మట్టి వాసన కూడా వచ్చిందిట. చిలవలు పలవలు కల్పించి తెగ కోతలు కోశాడు. సారథి ముందే ఆ రాగం లక్షణాలు చెప్పేటప్పటికి భాస్కర్రావు అలా ఊహించేసుకున్నాడు. అదంతా మనస్సు లక్షణమేగాని రాగ లక్షణం కాదని కుండబద్దలు కొట్టినట్లు చెప్పాను. నాకసలు కళాహృదయం లేదని వాళ్ళిద్దరూ తీర్మానించారు. "రాగం వింటుంటే తప్పనిసరిగా ఏదో ఒక ఫీలింగు వచ్చి తీరాలి. శిశుర్వేత్తి, పశుర్వేత్తి అన్నారు - ఏ ఫీలింగు రాలేదంటే వాడు పశువు కంటే హీనుడు" అన్నాడు సారథి.

ఏఏ తరహా వాళ్ళ మీద సంగీత ప్రభావం ఏఏ విధంగా ఉంటుందో అతను నమోదు చేస్తున్నాట్ట. నా రియాక్షను కూడా నమోదు చేస్తానన్నాడు. నా శాయశక్తులా, మనస్ఫూర్తిగా అతని పరిశోధనకు సహకరిస్తానని వాగ్దానం చేశాను. గది తలుపు లప్పీ వేసేసి చీకట్లో ఒక రాగం వినిపించాడు పావుగంట సేపు. అతను చెప్పిన దాంట్లో నిజం ఉందని ఒప్పుకోక తప్పలేదు. ఆ రాగం వింటున్నంతసేపూ రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి, ప్రధానమంత్రి మున్నగు

ప్రముఖులు ఎవరో దివంగతులైనట్లు, జాతి యావత్తూ దుఃఖ సాగరంలో మునిగి పోయినట్లు, ఏడు రోజులు సంతాప దినాలుగా ప్రకటించినట్లు, జాతీయ పతాకాలను అవనతం చేసినట్లు, దుకాణాలు మూసి వేసినట్టు ఫీలింగు వచ్చింది. అది 'బైరాగి' రాగంట. విషాదం, వైరాగ్యం కలిపిన అనుభూతి నిస్తుందట. సారథి ఇంకో రాగం వినిపించి ఎటువంటి దృశ్యం కనిపించిందో చెప్పమన్నాడు. వేసాకాలం మిట్ట మధ్యాన్నం చెమటలు పోస్తుంటే బామ్మగారు పడమటింటో గచ్చునేల మీద చెంగు పరచుకొని పడుకుని ఆవలిస్తూ, ఈగలు తోలుకుంటూ, విసన కర్రతో విసురుకుంటున్నట్లుగా ఉందోయ్" అని చెప్పాను.



"ఛీ... వెధవ వర్ణనా నువ్వూను. నీ లాంటి వాడికి సంగీతం వినిపించడమంత బుద్ధి తక్కువ ఇంకోటి లేదు" అని తిట్టిపోశాడు భాస్కర్రావు. అతనికి ప్రియుని కోసం విరహంతో వేగిపోతూ ఎదురు చూస్తున్న కావ్యనాయిక కనిపించిందిట ఆ రాగం వింటుంటే. అంతా వట్టి గ్యాస్. నాకు అతనిలా కోతలు కోయడం ఇష్టం లేదు. పరిశోధన వాస్తవంగా ఉండాలంటే అనుభూతిని యధాతథంగా చెప్పాలి గాని చిలవలు పలవలు కల్పించి చెప్పకూడదు. అయితే సారథి మాత్రం నా నిజాయితీని మెచ్చుకున్నాడు. నా అనుభూతికి, ఆ రాగ లక్షణానికి సంబంధం లేక పోలేదని కూడా అన్నాడు. ఎందుకంటే అది గ్రీష్మ రుతువులో మధ్యాహ్నం పూట పాడే రాగంట. నాకు కనిపించిందీ వేసాకాలం మధ్యాన్నం సీనే కదా. అది 'ముల్తానీ' రాగమని చెప్పాడు సారథి. మొత్తం మీద రాగ లక్షణాలు వింటుంటే ఇంటరెస్టింగానే ఉంది...

## ఏప్రిల్ 10:

తెలుగు సినిమా రంగంలోని లేటెస్టు ట్రెండ్స్ తెలుసుకోవడం కోసం ఈ మధ్య అక్కినేని, శోభన్, కృష్ణ, కృష్ణంరాజు మున్నగు వారి సినిమాలు బాగా చూస్తున్నాను. జర్నలిస్టుగా ఎనలిటికల్ వ్యూ పాయింట్‌తో చూస్తూ నోట్సు తీసుకుంటున్నాను. దీనిమీద ఒక సమగ్ర వ్యాసం రాయాలి. ప్రేమించడంలో అక్కినేనిదే అగ్రతాంబూలం. అరవై యేళ్ళ వయస్సులో కూడా ఇరవై యేళ్ళ కుర్రాళ్ళ కంటే బాగా ప్రేమిస్తున్నాడంటే నిజంగా చాలా గొప్ప విషయం. విషం తాగి చచ్చిపోతూ కూడా ప్రేమించడంలో ఆయన్ని మించిన వాళ్ళులేరు. హేట్సాఫ్. రూపాయి క్లాసులో వాళ్ళు రూపాయిలు విసురుతూ ఆయన ప్రేమకు జోహారులర్పించు

తున్నారంటే ఆశ్చర్యం లేదు. హీరోయిన్లలో జయప్రద ప్రేమించినట్లు ఇంకెవరూ ప్రేమించలేరు. మాట్లాడకుండా కళ్ళతోనే ప్రేమించేయగలదు. నిజంగా ఆమెది అమర ప్రేమ. ఇద్దరు ప్రియురాళ్ళలో ఎవరిని త్యాగం చెయ్యాలో తెలియక సతమతమై పోవడం శోభన్ స్పెషాలిటీ. విప్లవం చెయ్యాలంటే మాదాల రంగారావే చెయ్యాలి. నవ్వుతూ నవ్విస్తూ గొంతులు కోయడంలో గొల్లపూడి ఫస్టు.

## ఏప్రిల్ 21 :

మ్యూజిక్ క్రిటిక్‌గా పేరు తెచ్చుకోవాలని కంకణం కట్టుకున్నాను. జర్నలిస్టుని కనుక, చేతిలో 'సుజనమిత్ర' ఉంది కనుక ఈజీకూడా. హిందూస్తానీ సంగీతం మీద కాన్సన్‌ట్రేట్ చేద్దామనుకుంటున్నా. కర్నాటక సంగీతం కంటే ఇది తేలిక. హిందూస్తానీ వాళ్ళు కచేరీలో రాగం పేరు కూడా ఎనౌన్సు చేస్తారు. ఒక రాగానికి బదులు ఇంకో రాగం రాసే ప్రమాదం లేదు. ఈ మధ్య సోదర తెలుగు, ఇంగ్లీషు పత్రికలలోని మ్యూజిక్ రివ్యూలని స్టడీ చేస్తున్నా. ఆ మాత్రం నేను రాయలేక పోతానా అనిపిస్తోంది. కొంచెం దబాయింపు నేర్చుకోవాలి అంతే. రూములో సారధి ఎలాగూ పరిశోధన చేస్తున్నాడు. అతని పరిశోధన ఫలితాలని కూడా సంగ్రహించవచ్చు. మధ్య మధ్య ఇన్‌స్పిరేషను వచ్చినపుడు అతను ఇచ్చే లెక్చర్లని 'ఇవన్నీ నాకు ఇదివరకే తెలుసులేవోయ్' అన్నట్లుగా వింటుండాలి. వర్లక్ష్మి కూడా సంగీతం నేర్చుకుంటోంది కదా. తరచుగా మామయ్య గారింటికెళ్ళి వర్లక్ష్మి దగ్గర సంగీత రహస్యాలు తెలుసుకుంటూ ఉండాలి. ఈ హోల్ మొత్తం పరిజ్ఞాన మంతటినీ క్రోడీకరించుకొని సంగీత సమీక్షలు రాస్తూ ఉండాలి.

## ఏప్రిల్ 25 :

సారధి ఏదో లైబ్రేరీనుంచి హరిప్రసాద్ చౌరాసియా, శివకుమార్ శర్మ కాసెట్లు తెచ్చి వినిపించాడు. ఫర్వాలేదు బాగానే ఉన్నాయి, పైకొస్తారని చెప్పాను. "ఏడిశావ్. నీ బోడి సర్టిఫికెట్ ఎవడిక్కావాలి. వీళ్ళు టాప్ ఆర్టిస్టులు. అసలు ఎప్పుడైనా వీళ్ళ పేర్లు విన్నావా నువ్వు" అన్నాడు సారధి. "టాప్ ఆర్టిస్టులంటే అందరికీ తెలిసుండాలి గదా. వీళ్ళ సంగతి నాకు తెలీదంటే వీళ్ళు అట్టే గొప్పవాళ్ళు కాదన్నమాటేగా. అయినా ఇంతకంటే గొప్పవాళ్ళ సంగీతం విన్న వాళ్ళకి వీళ్ళ సంగీతం ఏం నచ్చుతుంది" అని వాదించాను.

"నువ్వు ఈ మధ్య తెగ కోతలు కోస్తున్నావోయ్. ఏవడో రోడ్డుమీద వాడి దగ్గర

చెల్లుతుంది గాని మా దగ్గర కూడా కోస్తానంటే ఎలా? నువ్వు ఎంత సంగీతం విన్నావో మాకు తెలీదా?" అన్నాడు భాస్కర్రావు. "ఈ కోత లేవో మీ ఎడిటరు దగ్గర కోస్తే ప్రమోషనో, ఇంక్రిమెంటో రావచ్చు" అని సలహా ఇచ్చాడు కూడా. అదీ నిజమే ననిపించింది. ట్రై చెయ్యాలి.



## ఏప్రిల్ 29 :

సారధికీ, భాస్కర్రావుకీ తెలీకుండా రహస్యంగా సంగీతం కాలేజీలో చేరిపోవాలని ప్రయత్నించాను సాయంకాలం. కాని వాళ్ళు ఎప్పుడు పడితే అప్పుడు చేర్చుకోరట. ఆగస్టు లోనో ఎప్పుడో అడ్మిషన్లు ఉంటాయట. అప్పుడు రమ్మన్నారు. అప్పుడు కూడా నాచేత పాడించి, వాళ్ళకి నచ్చితే చేర్చుకుంటారట. "నాకు ఇన్‌స్పిరేషన్ వచ్చినప్పుడు చేర్చుకోవాలిగాని, మీరు చేర్చుకుంటా నన్నప్పుడు నాకు మూడ్ ఉండొద్దూ? అసలే నాకు లక్ష యావగేషన్లు. అదీగాక మీకు నచ్చేంత బాగా పాడ గలిగితే నేను కాలేజీలో చేరడం దేనికి? ఇటువంటి రిజిడ్ రూల్సు వల్లనే శాస్త్రీయ సంగీతం పట్ల యువతరం వారికి ఆసక్తి తగ్గిపోతోంది" అని ఉపన్యసించి వచ్చేశాను.

## మే 7 :

నిన్న సాయంకాలం శివకుమార్ చౌరాసియా గారి సంతూర్ కచేరీకి వెళ్ళాను. గొప్పగా వాయించాడు. రాగాల పేర్లు ఎనౌన్సు చేసినప్పుడల్లా నోట్ చేసుకున్నా. సంతూర్‌కే శతతంత్రీ వీణ అని కూడా పేరు ఉందిట. అదంతా ప్రోగ్రాం పేపర్లో రాశారు. శివకుమార్ గురించి కూడా రాశారు ఆ పేపర్లో. ఇన్విటేషను రాకపోయినా కళాసేవ చేద్దామనే ఉద్దేశంతో టికెట్ కొనుక్కొని వెళ్ళాను. కచేరీ నుంచి తిన్నగా ఆఫీసుకి వెళ్ళి రివ్యూ రాసి న్యూసెడిటరుకి ఇచ్చి వచ్చాను. ఇవాళ 'సుజనమిత్ర'లో త్రీ కాలం ఫార్టీమైట్ పాయింట్ హెడ్డింగుతో బ్రహ్మాండంగా వచ్చింది రివ్యూ.

ఇవాళ ఆఫీసుకి వెళ్ళగానే ఎడిటరు గారు గదిలోకి పిలిచారు. అభినందించడానికేమో ననుకున్నాను. "ఆ బోడి రివ్యూ ఎవడు రాయమన్నాడు నిన్ను? తెలిస్తే రాయాలి. తెలీకపోతే నోరు మూసుక్కూచోవాలి. అంతా తెలిసినట్టు వెధవ డబాయింపు దేనికి? అన్నీ తప్పుల తడకలు! 'దుర్గా' రాగం లో గాంధారం మీదుగా నిషాదం మీదకి పోయిన తీరు అద్భుతంగా ఉందా? దుర్గా రాగంలో గాంధార నిషాదాలు ఎక్కణ్ణించి వచ్చాయి నీకు? నీ రివ్యూ చూసి

మా పెద్దబ్బాయి ఒకటే నవ్వడం. పొద్దున్నే ఆచారిగారు ఫోన్‌చేసి ఎవరండీ ఈ రాంబాబు, ఏమిటీ రాతలు అనడిగితే తల కొట్టేసి నట్లనిపించింది" అంటూ ముక్క చివాట్లు పెట్టాడు.

"మనిషికి పంచప్రాణాలు ఎలాగో సంగీతానికి సప్తస్వరాలు అలా కదా? సప్తస్వరాలు లేకుండా రాగాలెలా వస్తాయి? ఇది ఫండమెంటల్ థింగ్. నేను రాసినదాంట్లో తప్పేమిటి?" అని వాదించాను.

"ఔడవ, షాడవ రాగాల సంగతి ఎప్పుడయినా విన్నావా?" అనడిగాడు ఎడిటరుగారు.

"తెలీకపోవడమేం? బోలెడు సార్లు విన్నాను. ఆ రెండూ చాలా ప్రసిద్ధ రాగాలు కదా? రవిశంకర్ గారు ఔడవ రాగాన్ని గంటసేపు వాయించగా విన్నాను" అని దబాయించాను.

"నీ వెధవ కోతలు కట్టిపెట్టు. ఔడవ రాగం అంటే ఐదే స్వరాలున్న రాగం. షాడవ రాగం అంటే ఆరు స్వరాలున్న రాగం. 'ఔడవ షాడవ' అంటే ఆరోహణలో ఐదు, అవరోహణలో ఆరు స్వరాలున్న రాగం. ఏడు స్వరాలుంటే సంపూర్ణ రాగం అంటారు. అన్ని రాగాల్లో ఏడు స్వరాలు ఉండవు. 'దుర్గా' రాగం 'ఔడవ ఔడవ' రాగం. అందులో గాంధార నిషాదాలుండవు. రాగ లక్షణాల సంగతి సరే. కచేరీ చేసినాయన పేరయినా తిన్నగా రాశావా? శివకుమార్ చౌరసియా ఏమిటి నీ తలకాయ. ఆయన పేరు శివకుమార్ శర్మ. హరిప్రసాద్ చౌరసియా అనే ఆయన ఫ్లూటు వాయిస్తాడు. నువ్వు ఇంకో సారి సంగీతం గురించి రాశావంటే డిస్మిస్ చేస్తాను" అని వార్నింగిచ్చాడు ఆయన.

"మీకు ఇంత సంగీత జ్ఞానం ఉందని తెలిస్తే మీచేతనే తప్పులు దిద్దించి కంపోజుకి పంపించే వాడిని" అన్నాను.

"నువ్వు రాసింది దిద్దుకోవడం కంటే నేను రాసుకోవడం మంచిది" అన్నాడు ఆయన. తర్వాత న్యూసెడిటర్ని పిలిచి ఆయనని కూడా చివాట్లు పెట్టాడు. తనకి చూపించకుండా ఇటువంటివేవీ వెయ్యద్దని హెచ్చరించాడు.

ఇక ముందెప్పుడూ ఎడిటరు గారికి తెలిసిన విషయాలపై వ్యాసాలు రాయకూడదని తీర్మానించుకున్నాను.

రూమ్‌కి వచ్చేసరికి సారథి, భాస్కర్రావు నా రివ్యూని డిస్కస్‌చేస్తూ బిగ్గరగా నవ్వుతున్నారు. 'శివకుమార్ చౌరసియా సంగీతం వింటావుటోయ్' అంటూ సారథి ఒక కాసెట్ పెట్టాడు. శివ కుమార్ శర్మ సంతూర్, హరిప్రసాద్ చౌరసియా ఫ్లూటు కలిసి వాయించిన కాసెట్ అది. దీన్ని జుగల్ బందీ అంటారుట.

## మే 15 :

హోటళ్ళ ధరల విషయమై అన్నగారి ప్రభుత్వం జారీచేసిన ఆదేశాలపట్ల నిరసనగా హోటళ్ళ వారు ఇడ్లీ వడలను రద్దుచేశారు. ఊళ్ళో ఎక్కడా ఇడ్లీ వడ దొరకడం లేదు. సారా దుకాణాల వేలం మోడల్లో హోటళ్ళ వ్యాపారంలో కూడా ప్రభుత్వం వేలం పద్ధతిని ప్రవేశపెట్టాలి. లేకపోతే కిలో రెండు రూపాయల బియ్యం పథకంలాగా మధ్యతరగతి వారందరికి ఆకుపచ్చ కార్డు మీద రోజూ ప్లేటు పదిపైసలకే ఇడ్లీ వడ సప్లయి చేయాలి. అలా చేస్తే హోటళ్ళ వారు చచ్చినట్లు దిగి వస్తారు. అదీ కాకపోతే హోటల్ పరిశ్రమని పూర్తిగా జాతీయం చేయాలి. దీనిమీద ఎడిటోరియల్ రాద్దామనిపించింది కాని, ఎడిటరు గారికి అసలే నామీద జెలసీగా ఉంది కదాని మానేశాను. ఇలస్ట్రేటెడ్ వీక్లీ లాంటి పెద్ద పత్రిక్కిస్తే రెండొందల యాభై ఇస్తారు. ఐచ్చికంగా, ఉచితంగా రాసిస్తానన్నా వద్దంటాడు మా ఎడిటరు గారు. ఈయన గారు రి రయితేగాని నాకు జర్నలిజంలో ఉజ్వల భవిష్యత్తు ఉండదు. పోనీ ఆయనే నన్ను ప్రియశిష్యుడిగా స్వీకరించి, తన ఉత్తరాధికారిగా గ్రూమ్ చేస్తాడేమో కనుక్కోవాలి.

## మే 29 :

ఇవ్వాళ ఎలాగయితేనేం ధైర్యం చేసి ఎడిటరు గారిని అడిగేశాను - జర్నలిజంలో మెలకువలని నూరిపోయమని. ఆయన మొహం ప్రసన్నంగానే కనిపించింది. "ఇది ప్రత్యేకంగా అ ఆలు దిద్దించినట్లుగా నేర్పేది కాదోయ్. అన్ని పత్రికలూ చదువుతూ, ట్రెండ్సు ఫాలో అవుతూ, అబ్జర్వుచేస్తూ, సీనియర్లని అడిగి తెలుసుకుంటూ నేర్చుకోవల్సిందే. మేమంతా అలా కిందా మీదా పడి తన్నుకుంటూ నేర్చుకున్న వాళ్ళమే. ఆరోజుల్లో ఈ జర్నలిజం డిప్లొమా కోర్సులూ అవీ ఉన్నాయా ఏవన్నానా" అన్నాడు ఆయన. యువతరం జర్నలిస్టులు, ముందు తరాల జర్నలిస్టుల ప్రయోజనార్థం ఆయన సంపాదకీయాలన్నింటినీ పుస్తక రూపంలో



ప్రచురించాల్సిన అవసరం ఉందనీ, ఆ పుస్తకాన్ని జర్నలిజం పాఠ్యపుస్తకంగా నిర్ణయించడం కూడా ఎంతో అవసరమనీ ఉద్బాటించాను. ఆయన చాలా సంతోషించాడని నా అనుమానం. ప్రమోషను అడుగుదామా అని నోటి దాకావచ్చి మళ్ళీ వాయిదా వేసుకున్నాను. ప్రస్తుతానికి ఆశీస్సులు అడిగాను. నన్నొక మంచి జర్నలిస్టుగా తీర్చిదిద్దే గురుతర బాధ్యత ఆయన

భుజస్కంధాలమీద నున్నదని చెప్పాను. ఆయన వాత్సల్యంలో "నువ్వింకా ఎడోలసెంట్‌బోయ్. ఎడోలసెన్స్‌లో బుద్ధి కొంచెం తక్కువగా ఉంటుంది. ఇంకో రెండు మూడు సంవత్సరాలు పోతే కొంత మెచూరిటీ వస్తుంది. అప్పుడింక ఆటోమేటిక్‌గా నువ్వే మంచి జర్నలిస్టుగా ఇవాల్వు అవుతావు. సహజంగా నీలో స్పార్కు ఉంది. ఏదో నేర్చుకోవాలి, ఏదో సాధించాలి, గొప్ప పేరు తెచ్చు కోవాలి అన్న తపన ఉంది. అదే నిన్ను పైకి తీసుకుపోతుంది. తెల్లారేసరికి గొప్పవాడై పోవాలన్న తొందరపాటు మాత్రం మంచిది కాదు" అని ఆయన ఉపదేశించారు.

నా మేధస్సును ఆయన గుర్తించలేక పోవడం బాధాకరమే అయినప్పటికీ, మొత్తం మీద మనస్సు తేలికపడింది. నీటముంచినా పాలముంచినా ఇక ఆయనదే భారం. తన తర్వాత నన్ను ఎడిటర్ చేసే నైతిక బాధ్యత ఆయనదే.

## జూన్ 2 :

మావయ్య గారింటికి వెళ్ళాను. వర్లక్ష్మి సంగీతం పుస్తకాలు పరామర్శించాను. తను నాలుగేళ్ళ నించి కర్ణాటక సంగీతం నేర్చుకొంటోంది కదా - నాకేవయినా ట్యూషను చెబుతుందేమోనని ట్రై చేశాను. ఔడవ రాగాల గురించి అడిగాను. అబ్బో చాలా చెప్పింది. సంపూర్ణ షాడవ, ఔడవ సంపూర్ణ, సంపూర్ణ సంపూర్ణ - ఇలా బోలెడు. ఇది మనకి లాభం లేదని వదిలేశాను. ఇంతకంటే సినిమా, నాటకాలు మున్నగు నిర్వివాదాంశాలపై కృషి చేస్తే మంచిదనిపించింది. అదే చెప్పాను ఎడిటరుగారితో. ఆయన మంచి మూడ్‌లోనే ఉన్నారు. "సినిమా రివ్యూలు రాస్తే రాయిగాని అందులో మళ్ళీ ఫలానా సూపరింపోజ్ బాగుంది, ఫలానా సీక్వెన్స్‌లో మాంటేజ్ షాట్స్ బాగున్నాయి. ఎడిటింగులో లోపాలున్నాయి అని మాత్రం రాయకు" అని సలహా ఇచ్చారు. చచ్చాంరా బాబూ. ఈయనకి సినిమా టెక్నిక్ సంగతి కూడా బాగా తెలిసినట్లే ఉంది. మాంటేజ్, సూపరింపోజ్ అంటున్నాడు. వాటి సంగతేమిటో తెలుసుకొని గానీ ఈయనతో మాట్లాడకూడదు" అనుకున్నాను మనసులో. "శుభ్రంగా కథా సంగ్రహం, తారాగణం, సాంకేతిక బృందం పేర్లు రాసి, సంగీతం వీనులవిందుగా, నృత్యాలు కన్నుల పండుగగా ఉన్నాయని రాసెయ్యి" అని హితవు చెప్పాడు ఆయన. అలారాస్తే ఎవరితో గొడవ రాదని కూడా చెప్పాడు. మన ఫిలిం జర్నలిస్టు లందరూ ఇలా ఎందుకు రాస్తున్నారో ఇప్పుడు నాకర్థమయింది.

"సినిమా టెక్నిక్ గురించి తెలుసుకోవాలోయ్" అన్నాను సారథితో మాట వరసకి - దీనిసంగతి అతనికేం తెలుస్తుందిలే పసివాడు అని. "పుడోవ్కిన్ అనే రష్యన్ డైరెక్టర్ 'ఫిలిం టెక్నిక్ అండ్ ఫిల్మ్ యాక్టింగ్' అని ఓ పుస్తకం రాశాడు. ముందు అది చదువు, సినిమాకు

సంబంధించినంత వరకు అది పెద్ద బాలశిక్ష లాంటిది'
' అని సలహా ఇచ్చాడు సారథి. ద్రోహి నాతో పాటు
ఒకే రూములో ఉంటూ, నాతో పాటు ఒకే కాలేజీలో
చదువుతూ, నాకు తెలీకుండా రహస్యంగా అతను
ఇన్ని పుస్తకాలు ఎలా చదువుతున్నాడా, ఇంత విజ్ఞానం
ఎలా సంపాదిస్తున్నాడా అని ఆశ్చర్యంగా ఉంది. ఆ
పుడోవ్కిన్ గారి పేరు నేనెప్పుడూ విననయినా వినలేదు.
కష్ట సుఖాలలో, అజ్ఞాన విజ్ఞానాలలో పాలుపంచుకొని
ఆ మిత్ర ద్రోహికి తగిన శాస్తి చెయ్యాలనుకున్నాను.
అతనికి తెలీకుండా లైబ్రరీలకి వెళ్ళి సినిమా పుస్తకాలన్నీ
చదివేస్తాను. ఫిలిం సొసైటీలో కూడా చేరిపోతాను. ఆ
తర్వాత ఏ డైరెక్టరు దగ్గరో అసిస్టెంటుగా కూడా చేరిపోతాను. రెండు సినిమాలకి పనిచేసిన
తర్వాత నేనే ఒక ఎక్స్‌పెరిమెంటల్ ఆర్ట్ ఫిలిం తీస్తాను. దానికి అవార్డు వచ్చి పేపర్లో నా
పేరు చూసేవరకు సారథికి ఏ మాత్రం తెలియనివ్వకూడదు. అప్పుడు గాని నా కక్ష తీరదు.



## జూన్ 14 :

గుజరాత్‌లో పత్రికా స్వాతంత్ర్యాన్ని కాలరాస్తున్న సోలంకీ ప్రభుత్వానికి వ్యతిరేకంగా
స్థానిక జర్నలిస్టు లందరినీ కూడ గట్టుకొని ఉద్యమం ప్రారంభించాలనిపిస్తోంది. ముందుగా
ఈ ఊళ్ళో ఊరేగింపుకు నాయకత్వం వహించాలి. దీనితో పాటు సోలంకీపై ఇండియన్
కాన్‌స్టిట్యూషన్ సో అండ్ సో ఆర్టికల్ లోని సో అండ్ సో సెక్షన్ కింద హెబియస్ కార్పస్
పిటిషన్ దాఖలు చేయాలి. దీని మీద ఎడిటోరియల్ రాయకూడదా అని ఎడిటరు గారికి
సూచించాను. “అందుకు మీరే సమర్థులు. మీ ఎడిటోరియల్‌తో యువ జర్నలిస్టులకు స్ఫూర్తి
నివ్వండి” అని విజ్ఞప్తి చేశాను. ఆయన చిరునవ్వు నవ్వుతూ “నువ్వు భలేగా మాట్లాడతావోయ్.
తెలివిగల వాడివనుకోవాలో, తెలివి తక్కువ వాడివనుకోవాలో తెలీదు ఒక్కొక్కప్పుడు నీ
మాటలు వింటుంటే” అన్నారు.

## జూన్ 20 :

ప్చ్..... మనసంతా దిగులుగా ఉంది... గుండె అంతా గుబులుగా ఉంది... తెల్లారుతోంది. పొద్దుకూకుతోంది. చీకటి పడుతోంది. నక్షత్రాలు మిలమిలా మెరుస్తున్నాయి నీలాకాశంలో... ఈ జీవితానికి అర్థమేమిటో తెలీటం లేదు. దీని గమ్యం ఏమిటో తెలీటం లేదు. శూన్యం, అంతా శూన్యం... శూన్యం తప్ప మేరేమీ లేదు. అబద్ధం. అంతా అబద్ధం. అబద్ధం తప్ప మరేమీకాదు... లోకం శూన్యం. బతుకు అబద్ధం.

ఈ స్టయిల్లో మెంటైన్ చెయ్యాలి డైరీ. వేదాంత పరంగా... పొయట్రీలాగా మేధా వంతంగా. కొన్నాళ్ళు... కొన్నేళ్ళు.... పోయాక డైరీ ల్లోంచి ఇలాంటి వచన పొయట్రీ అంతా ఏరి ఒక సంపుటం వెయ్యచ్చు. "జీవన శిశిరం" అనో, ఇంకా సింపుల్‌గా "రాలిన ఆకులు" అనో, టైటిలు పెట్టవచ్చు. రచయితగా గొప్ప పేరు వచ్చే దాకానే ఈ స్టయిలు మెంటైన్ చెయ్యడం. పేరు వచ్చేసింతరవాత ఏం రాసినా ఫరవాలేదు. ఇదొరుకు నేను బెల్లంధర, చింతపండు ధర డైరీలో రాస్తే సారధి మున్నగువారు నవ్వి వేళాకోళం చేశారు. నిన్న లైబ్రీకి వెళ్ళి చూస్తే వీరేశలింగం పంతులుగారు కూడా డైరీలో బస్సు టికెట్టు ఖరీదు, సొదరు ఖర్చు వివరాలు రాసుకున్నారు. ఆయన గొప్పవాడు కాబట్టి అది సాహిత్యం అయింది. నేను కూడా ఎలాగైనా గొప్పవాణ్ణి అయితే నా చాకలి పద్దు కూడా ప్రింటు చేస్తారు ముందు తరాల వాళ్ళు.

## జూన్ 20 :

రాష్ట్ర గవర్నమెంటు బీరు, తదితర మద్యపానీయాలపై ఎక్సైజు సుకం 50 శాతం పెంచింది. నిజంగా హర్షణీయమైన చర్య. ధర పెరిగిందని తాగడం తగ్గిస్తారా మంచిదే. తగ్గించక పోతే మరీ మంచిది. గవర్నమెంటుకు ఆదాయం పెరుగుతుంది. ఈ అదనపు ఆదాయాన్ని సమాజ కల్యాణానికి - అనగా మద్యపాన దురాచార వ్యతిరేక ప్రచారానికి, విద్యా సౌకర్యాల అభివృద్ధికి, దేవాలయములు కట్టించుటకు, వితంతు వివాహములు జరిపించుటకు - ఉపయోగించవచ్చును.

మధ్యాన్న భోజన పథకం రద్దుచేశారు కదా. అందుకని వచ్చే ఏడాది నుంచి ఉచిత పాఠ్యపుస్తకాలు ప్రయోగాత్మకంగా ఇస్తారట. విద్యామంత్రిగారు మొన్న చెప్పారు. అది విఫలమైతే మళ్ళీ మధ్యాన్న భోజనం పెడతారట. ఇవాళేమో బడిపిల్లలకు ట్యూషను ఫీజు పెంచినట్లు ప్రకటించారు. ప్రతిపక్షాలవారు దీన్ని విమర్శించడంలో అర్థంలేదు. ట్యూషను ఫీజు పెంచక పోతే ఉచితంగా పుస్తకాలు ఇవ్వడం ఎలా?

## జూన్ 23 :



చరిత్రలో ఎన్నడూ కనివిని ఎరుగని మహాఘోర దారుణ బీభత్స ప్రమాదం. కనిష్కవిమానం అట్లాంటిక్ మహా సముద్రంలో కూలిపోయింది. పేలి కూలిపోయిందా, కూలి పేలిపోయిందా అనే విషయమై ఉన్నతస్థాయి దర్యాప్తు. అయితే ఇంత విషాద సంఘటన జరిగినా ఎడిటరు గారు కాఫీలో బిస్కట్లు నంచుకు తినడం అనౌచిత్యం.

బడ్జెట్ లోటు భర్తీకై గుప్తధనం పట్టివేత చర్యల పటిష్ఠీకరణకు చర్యలు తీసుకోవడం ముదావహం. బొంబాయిలో 15 రోజుల్లో ఆదాయం పన్ను దాడుల్లో రెండు కోట్లు ఆదాయం లభించింది. ఇట్టి దాడుల ముమ్మరీకరణకు బడ్జెట్‌లో హెచ్చు కేటాయింపులు చేయాలి. పట్టివేసిన సొమ్ములో అధికారులు దాచి వేసుకున్న సొమ్ము వెలికితీతకు కూడా కృషి జరగాలి.

సాయంకాలం మావయ్య గారింటికెళ్ళాను. ఎవరో ఒక అపరిచిత అజ్ఞాత వ్యక్తి, ఆజానుబాహుకుడు వర్లక్ష్మితో గడగడా ఇంగ్లీషు మాట్లాడేస్తున్నాడు. వర్లక్ష్మికూడా నదురూ బెదురూ లేకుండా టకటకా ఇంగ్లీషు మాట్లాడేస్తోంది. నా గుండెలో శూలాలు పొడిచినట్లనిపించింది. అచ్చమైన తెలుగింటి ఆడపడుచు అలా ఇంగ్లీషు మాట్లాడేయడం మన సంస్కృతికే తీరనిమచ్చ. దర్యాప్తుచేయగా ఆ వ్యక్తి ఇన్‌స్టిట్యూషన్ ఆఫ్ ఇంగ్లీష్ స్టడీస్‌లో లెక్చరర్ అనీ, వర్లక్ష్మికి ట్యూషను చెబుతున్నాడనీ తెలిసింది. పోనీ ఇంగ్లీషులో అంత పూర్ అయితే సొంత మేనబావనీ, వెటరన్ జర్నలిస్టునీ నేనున్నాను కదా. చక్కగా అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్లు షేక్‌స్పియర్ నవలల్ని అచ్చ తెలుగులో చెప్పేవాణ్ణి కదా. ఫీజు ఇస్తే తీసుకోను కాబట్టి, ఫ్రీగా చెప్పించుకోవడానికి మొహమాట పడ్డారనుకో. అయితే మాత్రం మరీ అలా సెంటు పూసుకొన్న హీరోలాంటి పర పురుషుణ్ణి ట్యూషనుకి పెట్టుకోవచ్చునా? వర్లక్ష్మి చిన్నపిల్ల. మావయ్యకైనా ఉండద్దూ?

## జూన్ 29 :

నమీబియాలో కీలుబొమ్మ ప్రభుత్వ స్థాపన పర్యవసనాలు తీవ్రంగా ఉండగలవని అత్యంత తీవ్ర పదజాలంతో దక్షిణాఫ్రికా జాత్యహంకార ప్రభుత్వాన్ని హెచ్చరిస్తూ ఎడిటోరియల్ రాయవలసిందిగా ఎడిటరుగారికి విజ్ఞప్తి చేశాను. ఆయన ఎందుకో బిగ్గరగా

నవ్వేశారు. నమీబియా పరిస్థితి ఆయనకంత నవ్వులాటగా ఉందా అని బాధపడ్డాను. "పెన్ ఈజ్ మైటియర్ దాన్ సోర్డ్ అన్నారు. అందులోనూ మీకలం కత్తి కంటే పదునైనది " అని ఉత్తేజపరచాను. ఆయన మళ్ళీ నవ్వేశాడు. ఎందుకో మరి కన్విన్సు కాలేదు. "యూ ఆర్ అండరెస్టిమేటింగ్ యువర్ పెన్ సర్" అనేసి వచ్చేశాను. ఆయన మనస్సులో సంతోషించే ఉంటాడు.

ఇది ఇలా ఉండగా, పోనీ ఇప్పటికైనా మామయ్యకు వివేకోదయమై ట్యూషను మాస్టర్ని మానిపించాడేమో చూద్దామని వెళ్ళాను. అతగాడు ఇంకా ధాటీగా లెక్చరిస్తున్నాడు ఇంగ్లీషులో. హాల్లో అతనూ, వర్లక్ష్మి ఇద్దరే ఉన్నారు. "హల్లో బావా... మీట్ మై టీచర్" అంటూ వర్లక్ష్మి అతణ్ని ఇంట్రడ్యూస్ చేసింది. అతను అందంగా, స్టయిలుగా ఉన్నాడు. కాని ఎందుకో నాకు అతని వరస నచ్చలేదు. ఇప్పటికి వందేళ్ళుగా ఇంగ్లీషు లిటరేచర్ ప్రపంచమంతటినీ ప్రభావితం చేస్తోందని తెగ కోసేస్తున్నాడు. "దూరపుకొండలు నునుపు అన్నట్లు మన సాహిత్యపు గొప్పతనాన్ని మీరు గుర్తించడంలేదు. చిలకమర్తి వారి 'సాక్షి', వీరేశలింగంగారి 'గణపతి' ఎంత గొప్ప నవలలు ! వాళ్ళు ఇంగ్లీషు ప్రభావంతో రాశారా?" అని వాదించాను. వెంటనే అతను "పొరపాటు, 'సాక్షి' రాసింది పానుగంటి, 'గణపతి' రాసింది చిలకమర్తి. వీరేశలింగంగారు రాసింది 'రాజశేఖర చరిత్రము'. స్పెక్టేటర్ ఇన్‌ఫ్లుయెన్స్ 'సాక్షి' మీదా, 'వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డ్' ఇన్‌ఫ్లుయెన్స్ రాజశేఖర చరిత్రమీదా ఉంది" అని ఖండించాడు. వీడి దుంపతెగ. వీడికి తెలుగు సాహిత్యం కూడా తెలుసు

"అది మీ ఆరోపణ. గ్రేట్ మెన్ థింక్ ఎలైక్. అంతమాత్రాన అది కాపీ అవుతుందా?" అని డబాయించాను.

"పానుగంటి, వీరేశలింగం స్వయంగా ఆ మాట ఒప్పుకుంటుంటే మధ్యలో మనం దేనికి ఆరోపించడం? అయినా కాపీ అనడం లేదు కదా నేను. ఇన్‌ఫ్లుయెన్స్ అనే అంటున్నాను" అని వాదించాడు అతను.

ఇంక అతనితో ఆర్గ్యుమెంటు అనవసరమని వచ్చేశాను. ఏమిటో... ఒక్కొక్క వెధవకి ఇన్నేసి విషయాలు ఎలా తెలుస్తాయో!

## జూలై 5 :

కేంద్రప్రభుత్వం రాష్ట్రాలకు ఓవర్ డ్రాఫ్టులను బంద్ చేయడం అభినందనీయం. వరల్డు బ్యాంకు కూడా ఇండియాకు అప్పులివ్వడం బంద్ చేస్తే మంచిది. అప్పిచ్చే వాళ్ళు

లేకపోతేనే దేశంగాని, రాష్ట్రాలు గాని స్వయం సమృద్ధి సాధించగలవు. అన్నగారు అప్పడాలమీద, ఆవకాయమీద పన్ను విధించినందుకు మధ్య తరగతివారు విమర్శించడం న్యాయం కాదు. మద్యపానీయాలపై ఎక్సైజు సుంకం పెంచితే "మధ్యతరగతి" వారు (అప్పుడప్పుడూ అసంకల్పితంగా అమూల్య మైన చమత్కారాలు దొర్లుతూ ఉంటాయి. అయినా అడవిని గాచిన వెన్న యేకదా!) శిరసావహించ లేదా? అలాగే ఆవకాయ ప్రియులు మాత్రం స్పోర్టివ్‌గా ఎందుకు తీసుకోకూడదు? ఎక్కువ గిరాకీ ఉన్న వాటిమీద పన్ను వేస్తేనే ఎక్కువ ఆదాయం వస్తుంది. యురేనియం మీదవేస్తే ఏం వస్తుంది? ఓవర్ డ్రాఫ్టులు లేనప్పుడు ఓవర్ టాక్సులు లేకపోతే ఎలా?

మొన్న న్యూసెడిటరు గారితో పోట్లాట జరిగినప్పట్నించీ ప్రూఫు రీడర్లు 'యాజ్ పర్ ఒర్జినల్' ఆందోళన సాగిస్తున్నారు. సబెడిటర్లు రాసే తప్పులని అలాగే వదిలేస్తామని పంతం పట్టారు. నేను మధ్యాన్న భోజనం అని రాయడానికి పొరపాటున ఆ స్పీడులో 'మిధ్యాన్న పథకం' అని రాస్తే అలాగే అచ్చయింది ఇవాళ. పైగా ఫార్టీయైట్‌పాయింట్ డబుల్‌కాలం హెడ్డింగు. ఆఫీసులో అడుగుపెట్టగానే ఎడిటరు గారి పిలుపు వచ్చింది. ఇవాళ చివాట్లు తప్పవు. జై వీరహనుమాన్ అనుకుంటూ వెళ్ళాను.




"జన్మానికి శివరాత్రి అని ఇన్నాళ్ళకొక మంచి హెడ్డింగు పెట్టావోయ్" అన్నాడు ఆయన. ఇది నిందాస్తుతో, లేక పోతే నర్మగర్భాలంకారమో అయుంటుందనుకున్నాను. "హాస్యప్రియ చదువుతున్న ప్రభావం కాబోలు - కాస్త చమత్కారం అబ్బుతోంది" అన్నాడు ఆయన.

కొంచెం ధైర్యం వచ్చింది. ఆయన హావభావాలు అనుమానాస్పదంగా లేవు.

" అది నిజంగా మిధ్యాన్న పథకమేనోయ్ గుడ్... అప్పుడప్పుడూ అటువంటి చమత్కారపు హెడ్డింగులు ఆలోచిస్తూ ఉండు" అని మెచ్చుకున్నారు. అప్పుడుగాని అందులో చమత్కారం అర్థం కాలేదు నాకు. ఇంకా నయం నేను పొరపాటుగా రాస్తే ప్రూఫ్‌రీడర్లు వదిలేశారని చెప్పానుకాదు. ఆ హెడ్డింగుని ఎడిటరు గారు మెచ్చుకున్నట్లు తెలిసి అందరూ మెచ్చుకున్నారు. న్యూసెడిటరు మాత్రం నా మొహం వంక అనుమానాస్పదంగా చూశాడు.

జూలై 7 :

సోలంకీనిష్క్రమణ. ముఖ్యమంత్రిగా అమర్‌సింగ్ ప్రమాణస్వీకారం. పత్రికా స్వాతంత్ర్యానికి అంతిమ విజయం. కత్తిపై కలం సాధించిన విజయం. నెత్తీ నోరూ కొట్టుకుని చెప్పాను ఎడిటరు గారితో సోలంకీ రాజీనామాకు డిమాండ్ చేస్తూ ఎడిటోరియల్ రాయమని. వింటేనా? నా సలహా విని రాసివుంటే ఈ క్రెడిటు ఆయనకి దక్కి వుండేదికదా! ఇప్పుడు పశ్చాత్తాపపడితే ఏం ప్రయోజనం?

శివ బాలయోగి గారి మీద హేతువాదులు ధ్వజమెత్తారు. వరుణ జపంచేసి బెంగుళూరులో వర్షాలు కురిపిస్తానని ప్రతిజ్ఞ చేసి ఓడిపోయాడట ఆయన. అందులో ఆయన తప్పేముంది? తన విధ్యుక్తధర్మం ప్రకారం ఆయన జపం చేశాడు. వర్షాలు కురవలేదంటే అది వరుణదేవుడి తప్పు. మ్రొక్కిన వరమీని వేల్పు గ్రక్కున విడువంగవలయు గదరా సుమతీ.

ఎప్పటికైనా 'సుజమిత్ర'కి ఎడిటర్ కావాలని మనస్సులో ప్రతిజ్ఞ చేసుకొన్నాను. ఎడిటరుగారు తలచుకుంటే అంతపనీ చేయగలరు. అందుకే ఆయనకు తలలో నాలుకగా మెసులుకుంటూ, ముఖ్యంగా ఎడిటోరియల్సు రాయడంలో ఆయనకు చేదోడువాదోడుగా ఉంటూ ఆయన విశ్వాసాన్ని చూరగొనాలి.

అక్షరాస్యత విషయంలో దేశం మొత్తంమీదే కేరళ ముందంజ వేసిందనడం నిర్వివాదాస్పదం. అక్కడ ఉన్నన్ని వార్తాపత్రికలు దేశంలో ఇంకెక్కడా లేవు. పత్రికల సర్క్యులేషను కూడా అక్కడున్నంత ఎక్కువగా ఇంకెక్కడా లేదు. కేరళలో వీధు లూడ్చే వాళ్ళు కూడా గ్రాడ్యుయేట్లే. కేరళలో వీధులూడుస్తున్న ఒక గ్రాడ్యుయేట్ యువతి ఫొటో పేపర్లో పడింది. అక్కడ నిరుద్యోగ సమస్య లేదనడానికి ఆ ఫొటోనే నిదర్శనం. మన రాష్ట్రం ఆ స్థాయి నందుకోవడానికి ఇంకెంత కాలం పడుతుందో! వీధులూడవడానికి గ్రాడ్యుయేషన్ మినిమమ్ క్వాలిఫికేషన్ ఎప్పుడవుతుందో ఇది కూడా అన్నగారి హయాంలోనే జరగాలి.

జూలై 12 :

సాగరమధన ఫలితంగా రెండో బ్లాక్ బాక్సు కూడా దొరికింది. 'ద్వితీయ కృష్ణ మంజూష లభ్యం' అని లక్షణంగా హెడ్డింగుపెడితే వెధవ పైత్యం అంటూ చివాట్లు పెట్టారు ఎడిటరు గారు. ఇదివరకేమో అన్నీ ఇంగ్లీషుపదాలు రాస్తున్నానని కోప్పడ్డారు. అందుకే నిక్షేపంలాంటి సంస్కృత పదాలు ఉపయోగించాను. ఆయనకి బొత్తిగా మాట నిలకడలేదు. "సంస్కృతమంటే

మీకు అంత ఇష్టంలేకపోతే పూర్తిగా తెలుగులో రెండో నల్లపెట్టె దొరికింది అని రాస్తాలెండి” అన్నాను. “రెండో బ్లాక్ బాక్స్ లభ్యం అని ఏడిస్తే చాలు. దౌర్భాగ్యపు ట్రాన్స్‌లేషనూ నువ్వూను’ ’ అన్నాడు ఆయన. ఎడిటరు కాబట్టి ఆయనేం చెప్పినా చెల్లుతుంది. లేకపోతే ఒక్క హెడ్డింగులో మూడు భాషల పదాలా?

మహాసాగర గర్భంలో 6700 అడుగుల లోతున మరమనిషి సహాయంతో గాలించి నల్లపెట్టెను బైటికి తీయడం అపూర్వం, అద్భుతం అని అందరూ పొగుడుతున్నారుగాని, నిజానికి మనవాళ్ళు ఈ పని ఎప్పుడో పురాణ కాలంలోనే చేశారు. మరమనిషికి బదులు తాబేలును ఉపయోగించి, మంథర పర్వతానికి ఆదిశేషుణ్ణి చుట్టి క్షీరసముద్రాన్ని మథించలా? సముద్ర గర్భంనుంచి అమృతం, విషం, అప్సరసలు, కల్పవృక్షం మొదలైనవాటిని బైటికి తీయలా? పాశ్చాత్యులకి ఇదంతా తెలీదు కాబట్టి వాళ్ళు గొప్పలు చెప్పుకోవడంలో ఆశ్చర్యం లేదు. కాని మనవాళ్ళు కూడా పొగడడం దేనికి? విష్ణుమూర్తి చేపావతారమెత్తి సముద్రం అడుక్కివెళ్ళి సోమకాసురుణ్ణి చంపలేదూ? ఫిలిం సొసైటీ వాళ్ళు చూపించిన వెస్ట్ జర్మనీ సినిమా చూశాను. అర్థంకాలేదుగాని అద్భుతంగానే ఉంది. గొప్ప కళాఖండం.

## జూలై 20 :

‘బాలయోగి నిర్యాణం’ అనే దానికి నిర్మాణం’ అనిపడింది. ‘తెలుగు గంగకు మిగులు జలాలు’ అనే దానికి ‘మిగులు గంగకు తెగులు జలాలు’ అని పడింది. ప్రూఫ్‌రీడర్లు యాజ్‌పర్ ఒర్జినల్ ఆందోళన తీవ్రతరం చేసినట్లుంది. ఎడిటోరియల్‌లో కూడా ముదావహం”అనేదానికి ‘మదావహం’ అని వడింది. ఎడిటరు గారు తన ఒరిజనలు తెప్పించుకుని చూసి మెదలకుండా ఊరుకున్నారు. అచ్చుతప్పుల సమస్యపై పట్టుదలకు పోకుండా ఉభయవర్గాలవారూ పరస్పర సంప్రతింపుల ద్వారా శాంతియుత పరిష్కారం కుదుర్చుకోవలసిన అవసరం ఎంతైనాఉంది.




అమెరికాలో సిక్కు టెర్రరిస్టుల శిక్షణ కట్టిపెట్టవలసిందిగా రీగన్‌కు గట్టిగా హెచ్చరించమని ఎడిటరుగారికి సలహా ఇచ్చాను. ఆయన నాతో ఏకీభవించలేదు. రేపు ఏ టైమ్సాఫిండియా వాళ్ళో రాస్తే అప్పుడు విచారిస్తాడు “రాంబాబు మాటవిని ముందే రాస్తే

క్రెడిట్ దక్కేదికదా" అని. అసలాయన నేను చెప్పేదానికి వ్యతిరేకంగా చేస్తాడు ఎప్పుడూ. అందుకని ఇహనుంచి నేను చెప్పదలచుకున్న దానికి వ్యతిరేకంగా చెబుతాను.

వర్లక్ష్మికి ఇంకా ఆంగ్లేయుడు పాఠాలు చెబుతున్నాడేమో చూద్దామని వెళ్ళాను. హామ్లెట్ గురించి లెక్చరు దంచుతున్నాడు. "హామ్లెట్ మీద కర్ణుడి ఇన్ఫ్లుయెన్స్ లేదని అనగలరా?" అని వాదించాను. "అనగలను" అని డబాయించాడు అతను. "దెన్ ఐకెన్ ఓన్లీ పిటీయూ" అన్నాను. "పోనీ పికాసో ఎక్స్ప్రెషనిస్టు పెయింటింగ్స్ మీద మీ అభిప్రాయం ఏమిటో చెప్పండి" అనడిగాను వాణ్ణి కొంచెం హడలకొడదామని. వర్లక్ష్మి వెంటనే "నాన్సెన్స్... ఇవాళ బావేదో కొత్త మాట నేర్చుకొచ్చాడు" అని మావయ్యని కేకేసింది. ఆంగ్లేయుడు చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు. వర్లక్ష్మి అన్నందుకు కాదు గాని వాడు సమాధానం చెప్పకుండా అలా నవ్వినందుకు మండుకొచ్చింది.

## జూలై 25 :

హమ్మయ్య.... పంజాబ్ సమస్య పరిష్కారమైపోయింది. ఇంక గుండెలమీద చెయ్యేసుకుని నిద్రపోవచ్చు. దేశం ఇంక శరవేగంతో పురోగమిస్తుంది. ఆఫీసుకు వెళ్ళగానే ఎడిటరు గారిని అభినందించాను. "మధ్యలో నాకు దేనికి? రాజీవ్‌గాంధికి టెలిగ్రాం పంపించు" అన్నాడు ఆయన. "పరిష్కార సాధనలో పత్రికల పాత్ర మాత్రం లేదుటండీ. కత్తికంటే కలం గొప్పదని నేను చెప్పానా లేదా?" అన్నాను.

"ఏడిసినట్లుంది నీ ఆర్గ్యుమెంటు. పోయి పని చూసుకో" అన్నాడు ఆయన.

ఇవాళ సుదీర్ఘంగా ఆలోచించి ఒక కొత్త సిద్ధాంతం కనుక్కున్నాను. అవతలి వాడికి తెలిసిన విషయాన్ని గురించి మనం ఎప్పుడూ మాట్లాడ కూడదు. అవతలి వాడికి ఏది తెలీదని మనకి గట్టిగా తెలుసో దాన్ని గురించి మనకి తెలీకపోయినా సరే అనర్గళంగా మాట్లాడవచ్చు. అందుకని అవతలి వాడికి ఏది తెలీదో అది తెలుసుకోవాలి ముందు. ఈ సిద్ధాంతాన్ని ముందు ప్రయోగాత్మకంగా ఎడిటరు గారిమీద, ఆంగ్లేయుడి మీద పరీక్షించి చూడాలి.

## జూలై 31:

నాకు పొట్టకోస్తే అక్షరమ్ముక్కరాదనీ, ఫ్రెండు కొడుకు కదా అనే పక్షపాతంతో ఎడిటరు నా తప్పులని కవరప్పింగ్ చేస్తున్నాడనీ ప్రూఫ్‌రీడర్లు దుష్ప్రాపగాండ చేస్తున్నారు. నాపై కక్ష సాధింపు చర్యలలో భాగంగా యాజ్‌పర్ వర్జినల్ ఉద్యమాన్ని ముమ్మరీకృతం

చేశారు. అయితే తానొకటి తలచిన దైవము వేరొండు తలచునుగదా. వారి ఉద్యమంవల్ల నాకు అసంకల్పితంగా లాభాలు వనగూడుతున్నాయి. కారంచేడు సంఘటనకు నిరసనగా రాష్ట్ర వ్యాప్త శాంతియుత బంద్ జరిగింది కదా. హెడ్డింగులో పొరపాటున 'కారంచేదు సంఘటన' అని రాశాను. ప్రూఫ్‌రీడర్లు దిద్దకుండా దాన్ని అలాగే వదిలేశారు. గ్యాలీ ప్రూఫ్‌లో దాన్ని చూసి ఎడిటర్‌గారు మెచ్చుకున్నారు. "ఈమధ్య అప్పుడప్పుడూ చమత్కారపు హెడ్డింగులు పెడుతున్నావు. గుడ్. కీపిటప్" అన్నాడాయన. అన్యాపదేశంగా అంటున్నాడేమోనని నాక్కొంచెం అనుమానాస్పదం కలిగింది. పొరపాటై పోయిందని




నేను చెప్పబోతుంటే ఆయన "ఇంక సుత్తి కొట్టకు. బావుందన్నాను కదా సంతోషించు. పో ' అన్నాడు. వచ్చేస్తోంటే మళ్ళీ ఆపి "కారంచేదు అనే మాటని కొటేషన్లో పెట్టించు. లేకపోతే అచ్చుతప్పనుకుంటారు జనం" అన్నాడు. అప్పుడర్థమయింది అందులో చమత్కారం. ఈ మధ్యనా మేధస్సు ట్యూబులైటు లాగా ప్రకాశిస్తోంది.

ఢిల్లీలో పట్టపగలు పార్లమెంటు సభ్యుడు లలిత్‌మకన్, అతని భార్య గీతాంజలిల దారుణహత్య. భారత రాజధానిలో అధికార పక్ష నాయకునికే భద్రతలేకపోతే కారంచేడు లాంటి గ్రామంలో హరిజనులకు భద్రత లేకపోవడంలో ఆశ్చర్యం ఏముంది? కాంగ్రెసు వారు రాజీవ్‌గాంధీని పొగుడుతూ అన్నగారిపై దుమ్మెత్తి పోయడం పచ్చి ఫాసిస్టు దృక్పథం అనడంలో అతిశయోక్తి ఇసుమంతైనా లేదు.

## ఆగస్టు 1:

ఇవాళ ఎడిటరు గారు నన్ను, న్యూసెడిటరునీ కలిపి ఏకగ్రీవంగా చివాట్లు పెట్టారు. చమత్కారపు హెడ్డింగుల్ని మెచ్చుకుంటున్నారు కదాని "కారంచేడుపై సుప్రీంకోర్టు జడ్జిచే విచారణకై జలగపట్టు" అని పెట్టాను. న్యూసెడిటరు 'జలగం' అని దిద్దబోయి కూడా ఎడిటరు గారు మెచ్చుకుంటాడేమోనని వదిలేశాడు. ఎడిటరు గారు ప్రూఫు చూసి పట్టుకున్నారు. "అంత పెద్ద నాయకుణ్ణి పట్టుకుని జలగ అంటావా. ప్రింటై వుంటే నా పరువు పోయి వుండేది"అంటూ దులిపారు.

సున్నా పెట్టడం మరిచిపోయానని డబాయించాను. ప్రూఫ్‌రీడర్లు దురుద్దేశపూర్వకంగా ఆ తప్పు వదిలేశారని చెప్పాను. దాంతో కథ అడ్డం తిరిగింది. "అదీ సంగతి. అలా చెప్పు.

ఇంతకు ముందు పెట్టిన చమత్కారపు హెడ్డింగులన్నీ పొరపాటున పెట్టినవేనన్నమాట" అన్నాడాయన. ఇప్పటిదాకా వచ్చిన మంచి పేరంతా పన్నీటిలో పోసిన బూడిద చందంబు అయింది.

"దక్షిణ ఢిల్లీలోని కల్కాజీ కాలనీ నుంచి ఒకరోజు ముందుగా దొంగిలించిన రెండు చక్రాల స్కూటరుపై వచ్చిన నున్నగా గడ్డం గీసుకున్న తమ ఇరవైలలో ఉన్న ఇద్దరు యువకులు అర్ధస్వయం చోదిత ఆయుధం నుంచి బుల్లెట్లను వెదచల్లిన తర్వాత తప్పించుకుని పారిపోయారు." అని లక్షణంగా అనువదిస్తే న్యూసెడిటరు తీసికెళ్ళి ఎడిటరు గారికి చూపించాడు. ఆయన పిలిచి తన ఆగ్రహాన్ని పునరుద్ఘాటించారు. మెడికల్ లీవ్ తీసుకుని సైకియాట్రిక్స్ దగ్గరకు పొమ్మన్నాడు. లూజైన స్క్రూలన్నీ బిగించుకుని రమ్మన్నాడు. ఇదివరకు తెలుగు నుడికారం కోసం నగిషీలు చెక్కిరాస్తుంటే "నీ వెధవ పైత్యం కట్టిపెట్టి ఆ ఇంగ్లీషులో ఉన్నదో తెలుగులో ఏడు" అని కసిరారు. సరే ప్రూఫ్‌రీడర్ల లాగా మనం కూడా యాజ్ పర్ వర్జినల్ పోతే మంచిదని ఇలా రాస్తే ఇదీ గొడవ. ఈ ఎడిటరు గారితో ఎలా వేగాలో తెలీక చస్తున్నాను.

కనిష్క ప్రమాదంపై దర్యాప్తు చురుగ్గా సాగుతోంది. టేపులో ప్రేలుడు శబ్దాలు వినిపించాయట. మొత్తం మీద ప్రేలుడు వల్లనే విమానం పేలిపోయిందని స్పష్టం చేశారు. చివరికి నా సస్పెక్షనే కరక్టయింది.

## ఆగస్టు 4:

అమెరికా విమానంపై ఆశనిపాతం.

130 మంది దుర్మరణం.



ఎడిటరుగారు నన్ను మరీ ఎడోలసెంటు లాగా ట్రీటింగ్ చేస్తున్నారు. పోనీ ఆయనంటే ఏదో పెద్దవాడనుకోవచ్చు. ఆఖరికి వర్లక్ష్మికూడా అలాగే చూస్తోంటే ఏమనుకోవాలి. అందుకని నిన్న రాత్రి కళ్ళు మూసుకుని అంతర్ముఖుడనై ఆత్మ విమర్శ చేసుకున్నాను. నా వేషభాషలలో ఏదో లోపం ఉన్నదనే నిర్ణయానికొచ్చాను. ఇక నుంచి సాంస్కృతికంగా కనిపించడం అవసరమనుకున్నాను. ఇవాళ లాల్చీ వేసుకుని ఆఫీసుకు వెళ్ళాను. వెళ్ళేముందు అద్దంలో

చూసుకుంటే ఆజన్మ జీనియస్ లాగా ఉన్నాను. ఎడిటరు గారు మాత్రం "ఈ అవతారం ఎప్పట్నించి" అన్నాడు. బహుశా జెలసీ ఫీలయి ఉంటాడు. సారథి, భాస్కర్రావు మెచ్చుకోలుగా నవ్వారు. "నీలో కొద్దిగా కళాకారుడి పోలికలు కనిపిస్తున్నాయోయ్" అన్నాడు సారథి. మావయ్యగారింటికి వెళ్ళి వర్లక్ష్మి రియాక్షను అబ్జర్వ్ చేద్దామనుకుంటే టైము లేక పోయింది.

## ఆగస్టు 15 :

ఐదేళ్ళుగా పట్టి పీడిస్తున్న అస్సాం సమస్య ఎట్టకేలకు పరిష్కారం. రాజీవ్ టోపీలో మరొక ఈక.

నాకు ఇంపార్టెంట్ ఐటములేవీ ఇవ్వవద్దని ఎడిటరు గారు ఆదేశించినట్లుంది. ఈ మధ్య న్యూసెడిటరు నాచేత సింగిల్ కాలాలే రాయిస్తున్నాడు. వాటిలో కొన్ని చిత్తుబుట్టలో వేస్తున్నాడు. ఎవరైతే మాత్రం ప్రతిభని ఎంతకాలం తొక్కి పెట్టగలరు? నాకు ఫారిన్ ఐటమ్స్ ఇస్తున్నారు. రాష్ట్ర రాజకీయాలైతే తప్పులొస్తే నాయకులు ఫోన్ చేసి అడుగుతారు. రీగనూ, గోర్బచెవ్, బోతా అయితే మనం ఏం రాసినా అడగరు గదా. అంతయూ మన మేలునకే. ఫారిన్ ఎఫెయిర్స్‌లో నిష్ణాతుణ్ణి కావాలని ప్రతిజ్ఞ చేశాను. నా పరిజ్ఞాన నిరూపణకై లేటెస్టు ఇండియా టుడే సౌజన్యంతో బ్రహ్మాండమైన వ్యాసం రాసి ఎడిటరు గారికిచ్చాను. దీనితోనైనా నాపై అపోహలు తొలగిపోతాయని ఆశించాను. కాని నాది అడియాశయమే అయింది. "ఇండియా టుడేలో ఆర్టికల్ కాపీ కొట్టి సొంత రచన లాగా పేరు పెట్టుకోడానికి సిగ్గులేదూ" అని చివాట్లు పెట్టాడు. ఆయన ఇండియా టుడే కూడా చదువుతాడని అనుమానించక పోవడం పొరపాటై పోయింది. అది పూర్తిగా కాపీ కాదనీ, నా సొంతం కూడా ఉందనీ వాదించాను. "అవును. ఇంగ్లీషు వ్యాసంలో అర్థంకాని భాగమంతా నీ సొంతమే మరి. ఆ ఒరిజనలు నేను చదివా కాబట్టి సరిపోయింది లేకపోతే వేసేసే వాళ్ళం. మన పరువు కాస్తా మంట గలిసేది" అని కసురుకున్నాడు ఆయన. ఆంగ్ల వ్యాసంతో ప్రభావితుణ్ణై రాశాననీ, కావాలంటే అడుగున బ్రాకెట్లో సౌజన్యంతో అని వెయ్యచ్చుననీ చెబితే కూడా ఆయన ససేమిరా కన్విన్సు కాలేదు. ఒక మంచి వ్యాసాన్ని ప్రచురించే అవకాశాన్ని 'సుజనమిత్ర' కోల్పోయింది కదాని బాధపడ్డాను. ఇంగ్లీషులోకి అనువదించి 'సండే అబ్జర్వర్' కో 'ప్రోబ్' కో పంపిస్తాను. ఎడిటరు గారి రోగం కుదిరిపోతుంది.

## ఆగస్టు 20 :

లాంగోవాల్ దారుణహత్య. దేశం ఏమైపోతోంది? ఎటుపోతోంది? రాజీవ్ గాంధీజీ అధికారంలోకి వచ్చినప్పట్నించి దేశంలో భద్రత లోపించింది. లాంగోవాల్ హత్య వెనకనున్న

ప్రచ్ఛన్న హస్తం పంజాబ్ ఒప్పందమేనని చెప్పక తప్పదు. సిక్కుల మధ్య విభేదాలను మరింత రెచ్చ గొట్టడానికే దోహదం చేసింది ఆ ఒప్పందం. రాజీవ్ పాలన లోనే భోపాల్ దుర్ఘటన జరిగింది. కనిష్క ప్రమాదం జరిగింది. ఎన్నో రాజకీయ హత్యలు జరిగాయి. జరుగుతున్నాయి. మన ఆంధ్రాలో ఇలాంటివి ఒక్కటి కూడా జరగలేదు. అఖిలభారత స్థాయిలో రామరాజ్యస్థాపన జరిగితేగాని దేశానికి మోక్షంలేదు. దీని మీద వ్యాసం రాసి ఏదైనా రైవల్ పత్రిక్కి పంపాలి.

## ఆగష్టు 24 :

అన్నగారు ఏది చేసినా స్పెషాలిటీగా చేస్తారు. ఇవాళ ఆయన తెలుగు వృక్ష సంక్షేమ కార్యక్రమం ప్రారంభించారు. హుస్సేన్‌సాగర్ పక్కన ఆయన, మంత్రులు, ఎమ్మేల్యేలు 190 మంది మొక్కలు నాటారు. రాజీవ్, ఇందిరాగాంధీ ఇత్యాదుల లాగా చేతికి మట్టి అంటకుండా ఒక మొక్క నాటి ఫోటో తీయించుకోవడం కాదు. ఎన్టీఆర్ తలపాగ చుట్టి, పంచె ఎగ్గట్టి పలుగుతో తవ్వి మొక్కలు నాటారు. తనే స్వయంగా వాటికి నీళ్ళు పోశారు. ముఖ్యమంత్రితో సహా మంత్రులు, ఎమ్మేల్యేలు ఎవరిగోతులు వారే తవ్వుకున్నారు. నేను ఈ మాట రాస్తే న్యూసెడిటరు తను చివాట్లు పెట్టడమే కాక ఎడిటర్‌కి కంప్లైయింటు చేశాడు. “ఆ ఐటం అతనికెందుకు ఇచ్చారండీ” అంటూ ఎడిటరు గారు న్యూసెడిటరునే కోప్పడ్డాడు. మన దృష్టిలో లోపం ఉంటే అన్నీ తప్పుగానే కనిపిస్తాయి.

మావయ్యగారింటికెళ్ళాను ఇంగ్లీషు యువకుడు ఇంకా వర్లక్ష్మికి పాఠాలు చెబుతూనే ఉన్నాడు. కర్ణాటక సంగీతం గురించి మాట్లాడి వాడిని హడలగొట్టేద్దామనుకున్నాను. లాల్గుడి వీణకీ, ఈమని వైలిన్‌కీ గల స్టైలిస్టిక్ డిఫరెన్సు తెలుసా అని అడిగాను. వాడు తెలీదని ఒప్పేసుకున్నాడు ఇన్నాళ్ళకి. ‘మీరే చెప్పండి’ అన్నాడు. లాల్గుడిలో మనోధర్మం ఎక్కువనీ ఈమనిలో ప్రకర్ష ఎక్కువనీ వివరించాను. అతను ‘ఓహో అలాగండీ’ అన్నాడు. లాల్గుడి వీణకి తబలా కాంబినేషను ఎవరైతే బావుంటుంది బావా?” అనడిగింది వర్లక్ష్మి. పెమ్మంగుడి అయితే బ్రహ్మాండంగా ఉంటుందని చెప్పాను.“ పెమ్మంగుడి నేనెప్పుడూ వినలేదండీ” అన్నాడు ఆంగ్లేయుడు. వర్లక్ష్మి బలవంతంగా నవ్వాపుకుంటున్నట్లు అనుమానం వచ్చింది నాకు. బహుశా వాడి సంగీత అజ్ఞానానికి నవ్వొచ్చి ఉంటుందనుకున్నాను.

ఇంటికొచ్చాక సారధితో ఈ మాట చెబితే అతను పగలబడి నవ్వాడు. “లాల్గుడి వీణ వాయించడం ఏమిటోయ్ నీ తలకాయ. లాల్గుడి వైలిను వాయిస్తాడు. ఈమని వీణ వీయిస్తాడు. పెమ్మంగుడి గాయకుడు. ఆయన తబలా వాయిస్తాడంటే మీ మరదలు నవ్వకేం చేస్తుంది?” అన్నాడు.

అవతలి వాళ్ళకి తెలీని దాన్ని గురించి మాత్రమే మాట్లాడాలన్న సిద్ధాంతం గొప్పదేగాని, దాని అమలులో వైఫల్యం సంభవిస్తూంటుంది అప్పుడప్పుడూ. అయితే ఫెయిల్యూర్ ఈజ్ ఎ స్టెప్పింగ్ స్టోన్ ఫర్ సక్సెస్ కదా. గొప్పవాళ్ళంతా ఎప్పుడో ఒకప్పుడు ఇలా నవ్వులపాలయిన వారే.

## సెప్టెంబరు 4:

అంతూలేని చూస్తే జాలేస్తోంది. ఆయనసలు అవినీతి పరుడు కానేకాదట. నిధులు దుర్వినియోగం చేశాడన్న ఆరోపణ పచ్చి అబద్ధమట. బొంబాయి హైకోర్టు జస్టిస్ మెహతా గారు తీర్పు చెప్పారు. అనవసరంగా పత్రికలన్నీ ఇన్నాళ్ళూ ఆ  ఖులే మీద నీలాప నిందలు వేశాయి.

నా రాతల్లో తప్పులు బోలెడు వస్తున్నాయట. చిత్రమైన, అపభ్రంశపు పదజాలం ఉపయోగిస్తున్నానుట. యాబ్సెంట్ మైండెడ్‌గా రాస్తున్నానుట. న్యూసెడిటరు గట్టిగా మందలించాడు. ఇంటలెక్చువల్స్‌కి యాబ్సెంట్ మైండెడ్‌నెస్ సహజమేకదా అన్నాను. విలక్షణంగా రాయడం కూడా మేధావుల లక్షణమే కదా అన్నాను. 'సబెడిటర్లు రాసే వాటిల్లో ఒత్తులు, పొల్లులు దిద్దేందుకే కదా ప్రూఫ్‌రీడర్లున్నది' అని వాదించాను. "నో ఆర్గ్యుమెంట్. నీకో నమస్కారం. నిన్ను కాదు అనాల్సింది. నిన్ను అపాయింట్ చేసిన వాళ్ళని అనాలి" అన్నాడు ఆయన.

## సెప్టెంబరు 10:

వీలైనంత తొందరగా కష్టాలు పడడం అవసరం. గాంధీ మహాత్ముడు, నెహ్రూ, తిలక్ మున్నగు మహనీయులందరూ ఎన్నో అష్టకష్టాలు పడ్డారు. కష్టాలు పడడం వల్లనే గొప్పవాళ్ళవుతారు ఎవరైనా. ఎంత కష్టపడితే అంత గొప్పతనం వస్తుంది. కష్టానికి, గొప్పతనానికి అనులోమ నిష్పత్తిలో సంబంధం ఉన్నది. నేను కూడా సాటి మిత్రుల జెలసీకి గురి యగుట, ఎడిటరుగారి ఆగ్రహమునకు గురి యగుట, భగ్నప్రేమ, హోటలు భోజనం మున్నగు కష్టాలు అనుభవించిన మాట నిజమే. ఈ మాత్రమైనా గొప్పవాడి నైనానంటే ఆ కష్టములే కారణములు. కాని ఈ కష్టములు చాలవు. ముందు ముందు జీవితములో ఎన్నో కష్టములు వచ్చును కదా అని ఔదాసీన్యము తగదు. ఆలస్యముగా కష్టములు పడితే ఆలస్యముగానే గొప్పవాళ్ళమవుతాము. అందుచేత అతి త్వరితముగా ఇతోధికముగా కష్టములు పడాలి. అతి తక్కువ కాలంలో అతి ఎక్కువ కష్టములు పొందుటకు సులభ మార్గము ఆలోచించాలి.

## సెప్టెంబరు 21 :

'సుజనమిత్ర' పత్రికా చరిత్రలో ఈ రోజు విశిష్టమైనది. సాయంత్రం ఎడిటర్ గారు సంపాదకవర్గ అత్యవసర సమావేశం ఏర్పాటు చేశారు. తెలుగులో నానాటికీ దిన పత్రికల సంఖ్య పెరిగిపోతూ 'సుజనమిత్ర' వంటి సన్నకారు పత్రికలకు సంకట పరిస్థితి ఏర్పడిందనీ, సాటి పత్రికల పోటీని ఎదుర్కొని నిలదొక్కుకోవడం కష్టతరమవుతున్నదనీ ఆయన ఆవేదన వ్యక్తం చేశారు. ఈ సంక్లిష్ట తరుణంలో సంపాదక వర్గ సభ్యులందరూ పత్రికను మరింత సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దడానికి ఇతోధికంగా కృషి చేయాలని ఆయన విజ్ఞప్తి చేశారు. ఎక్కువ పేజీలు అందించడంలో నైతేనేమి, ఎక్కువ వార్తల నందించడంలో నైతేనేమి, ఎక్కువ ఫోటోలను ప్రచురించడంలో నైతేనేమి పెద్ద పత్రికలతో మనము పోటీ చేయజాలము కనుక, నాణ్యత విషయంలో మరింత శ్రద్ధ వహిస్తూ 'సుజనమిత్ర'కు ఒక ప్రత్యేకతను సంతరింప జేయవలసిన ఆవశ్యకత ఎంతైనా కలదని ఆయన ఉద్ఘాటించారు. ఈ దృష్ట్యా పత్రికాభివృద్ధికి ఎవరైనా సలహాలు ఇచ్చేటట్లయితే సహృదయంతో పరిశీలించగలనని ఆయన వాక్రుచ్చారు కూడా.

సమావేశంలో అందరూ మౌనం వహించడంతో చిన్నవాడనైనప్పటికీ నేనే చొరవతీసుకున్నాను. నా శరీరంలోని తుది రక్తపు బొట్టు వరకూ 'సుజనమిత్ర' అభివృద్ధికై అత్యంత పాటు పడగలనని ఎడిటర్ గారికి హామీ ఇచ్చాను. ఆయన ఆనంద భాష్పాలు రాల్చడానికి బదులు ఆముదం తాగిన ముఖం పెట్టడంలోగల ఆంతర్యం అర్థం కాలేదు. నా చిత్తశుద్ధిని శంకిస్తున్నారేమోననే అనుమానంతో నా కృత నిశ్చయాన్ని నిర్ద్వంద్వంగా పునరుద్ఘాటించాను. కేవలము వార్తలు మాత్రమే కాకుండా పారితోషికము ఆశించకుండా ఉచితముగా నా మేధా సంపత్తినంతటినీ ధారపోసి సృజనాత్మక రచనలను సైతం అందించగలనని వాగ్దానం చేశాను. తదుపరి న్యూసెడిటరు గారు ప్రసంగిస్తూ, ప్రతి పేజీలోనూ మూడు నాలుగు హెడ్డింగులు రివర్సులో ముద్రించినచో ఆకర్షణీయముగా నుండునని సూచించారు. ఎడిటరు గారు ఆయన సూచనతో ఏకీభవిస్తూ, అది మంచిదే అయినప్పటికీ అపూర్వమేమీ కాదనీ, చాలా పత్రికలు ఆ విధంగా చేస్తున్నవనీ వక్కాణించారు. అందు మీదట నేను చర్చలో జోక్యం చేసుకుంటూ, దేశంలో ఎచ్చటనైనా నల్ల న్యూస్ ప్రింటు లభ్యమైనట్లయితే మొత్తం పత్రికను రివర్సులో ప్రింటు చేయవచ్చుననీ, ప్రపంచ



పత్రికారంగ చరిత్రలో అది అపూర్వ ప్రయోగం కాగలదనీ, ఒకవేళ నల్లన్యూస్ ప్రింటు లభ్యం కాకపోయినట్లయితే ఇప్పుడు కొన్ని హెడ్డింగులని రివర్సులో ప్రింటు చేస్తున్నట్లే పూర్తి పత్రికను రివర్సులో ప్రింటు చేయడానికి గల సాంకేతిక సాధ్యాసాధ్యాలను పరిశీలించడం అవసరమనీ సలహా ఇచ్చాను. దీనితో పాటు పేజి మేకప్పులో విప్లవాత్మకమైన మార్పులను సూచించాను. ఎనిమిదికి బదులు పదహారు కాలములుగా కంపోజు చేయించుట, పత్రికను అడ్డముగా తిప్పి పన్నెండు కాలములుగా కంపోజు చేయించుట, ఐమూలగా కంపోజ్ చేయించుట మున్నగు పద్ధతులను సూచించాను. ఈ ప్రయోగముల వల్ల మనపత్రిక కొక ప్రత్యేకమైన ఇమేజ్ లభించ గలదన్న ఆశాభావాన్ని వ్యక్తం చేశాను. ఎడిటరుగారు ఏమీ మాట్లాడలేదు. తలపట్టుక్కూర్చున్నారు. సమావేశంలో పలువురు ముసిముసి నవ్వులు నవ్వడం నా దృష్టికి వచ్చింది. తమను పోషిస్తున్న సంస్థ జీవన్మరణ సమస్యతో కొట్టుమిట్టాడుతుండగా వారు ఆ విధంగా నవ్వుకోవడం నాకు మిక్కిలి ఆవేదన కలిగించింది. ఎడిటరు గారు సమావేశాన్ని ముగిస్తూ, ప్రూఫ్‌రీడర్లు పట్టుదలకు పోకుండా యాజ్‌పర్ వర్జినల్ ఉద్యమానికి స్వస్తి చెప్పాలని విజ్ఞప్తి చేశారు. మన శ్రేయస్సు పత్రిక శ్రేయస్సుపైనే ఆధారపడి ఉందని ఉద్బోధించారు.

రూముకి వచ్చిన తర్వాత కూడా చాలాసేపు పత్రిక అభ్యున్నతికి ఎలా పాటు పడాలన్న విషయమే ఆలోచించాను. మొదటి పేజీలో ప్రచురణకు రోజూ ఒక మినీకవిత రాసిద్దామా అనిపించింది. ఎలాగైనా సరే ఎడిటరు గారి చేతులని బలపరచడం నా ధర్మం.

## సెప్టెంబరు 25 :

న్యూసెడిటరు గారు నాకు ఇంపార్టెంటు ఐటమ్సు ఇవ్వడంలేదు. పత్రిక అభివృద్ధి కొరకై తీసుకుంటున్న చర్యలలో భాగంగా ఆయన ఈ విధానాన్ని అనుసరిస్తున్నట్లు ప్రూఫ్‌రీడర్ల ద్వారా విశ్వసనీయంగా తెలిసింది. అయినా పత్రికలో తప్పులు పోతుంటే నాకెందుకని చూస్తూ ఊరుకోలేక పోతున్నాను. న్యూసెడిటరు గారు కాకలు తీరిన జర్నలిస్టు కదా. అయినా ఆయన ఇవాళ ఘోరమైన హెడ్డింగు పెట్టాడు. 'పంజాబ్‌లో శాంతియుతంగా 65 శాతం పోలింగ్' అని పెట్టాడు. అలా అంటే మిగిలిన 35 శాతం హింసాయుతంగా పోలింగ్ అయినట్లు తప్పు అర్థం వస్తుందని హెచ్చరించాను. అయినా ఆయన వినిపించుకోలేదు. ఆత్మ ప్రబోధాన్ని అనుసరించి నా ధర్మాన్ని నేను నిర్వర్తించానన్న తృప్తే మిగిలింది.

కేంద్ర మంత్రివర్గ పునర్వ్యవస్థీకరణ ఫలితంగా పి.వి.కి మానవ వనరుల అభివృద్ధిశాఖ లభించింది. నిజంగా ఇది ఆయనకు వ్యక్తిగత విజయం. యావత్తు మానవాళి ఇప్పుడు

ఆయన శాఖ పరిధి కిందకు వస్తుంది. ప్రధాని కంటే గురుతర మైన బాధ్యతాభారం ఇప్పుడాయన భుజస్కంధాలపైనున్నది. పివి పై రాజీవ్‌కు ఎంతటి గౌరవ విశ్వాసాలున్నవో దీనివల్ల వ్యక్తమవుతున్నది.

## అక్టోబరు 2:

గాంధీజీ ఆదర్శాలకు జాతి పునరంకితం కావాలని ప్రముఖ కాంగ్రెస్ నాయకులు ఉద్బోధించారు. గాంధీ గారి అడుగుజాడల్లో నడవాలని కూడా ఉద్ఘాటించారు. ఈ నాయకులకి అసలు మాట నిలకడలేదు. వీళ్ళే కిందటిసారి ఇందిరా గాంధీ జయంతి నాడు ఇందిరమ్మ అడుగుజాడల్లో నడవమన్నారు. రాజీవ్ జన్మదినం వస్తే ఆయన అడుగు జాడల్లో నడవమంటారు. ఇంతమంది అడుగుజాడల్లో నడవటం ఎలా సాధ్యం? బొత్తిగా కన్సిస్టెన్సీ లేకపోతే ఎలా? పోనీ ఈ ముగ్గురు గాంధీలతో వదలిపెడతారా? ఓసారి బోసు అడుగుజాడలంటారు. ఇంకోసారి పొట్టి శ్రీరాములు అడుగుజాడలంటారు. వీళ్ళని అన్నమాచార్య వర్ధంతికి పిలిస్తే అన్నమాచార్య అడుగుజాడల్లో నడవమంటారు. వీళ్ళు అనవసరంగా ప్రజలను కన్‌ఫ్యూజు చేస్తున్నారు.



ఇదే మాట భాస్కర్రావుతో అంటే అతను నాతో ఏకీభవించలేదు. అసలు కన్‌ఫ్యూజను అంతా నా బుర్రలోనే ఉందన్నాడు. సైకియాట్రిక్కు దగ్గరి కెళ్ళి మెదడుకి ఓవరాయిలింగు చేయించుకోమన్నాడు. అతడితో ఈ విషయము డిస్కస్ చేయుట నాదేతప్పు. అతడింకా అపరిణత మనస్కుడు.

## అక్టోబరు 9 :

సారధి నన్నుచూసి ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సుతో బాధపడుతున్నాడేమోనని అనుమానంగా ఉంది. ఎందుకంటే అతను నాకంటే మేధావి కావాలనే దురాలోచనతో రహస్యంగా మాక్సుముల్లర్ భవన్‌కు వెళ్ళుట, జర్మను ఎక్స్పెరిమెంటల్ ఫిల్ములు చూచుట, వెస్టరన్ మ్యూజిక్కు బుక్సు చదువుట మున్నగు పనులు చేస్తున్నాడు. ఇవాళ అతని షెల్ఫులో వెస్టరన్ మ్యూజిక్కు పుస్తకం కనిపిస్తే తిరగేశాను. షాష్టహోండులాగా, ఆల్జీబ్రాలాగా ఉంది. అది పాశ్చాత్య సంగీత గణితశాస్త్రం అయ్యుంటుందనుకున్నాను. ఇంతలో సారధి వచ్చి "అది శ్టాఫ్ నొటేషను. నీకు అర్థం కాదులే. అక్కడ పడెయ్యి" అన్నాడు. నాకు ఒళ్ళు

మండిపోయింది. వెంటనే ఎవరైనా ఆంగ్లోఇండియను ఆవిడ దగ్గర పియానో ట్యూషన్ చెప్పించుకుని ఆరునెలల్లో మాక్సుముల్లర్ భవన్‌లో కచేరీచేసి సారధి పొగరు అణిస్తే బావుండుననిపించింది. ఇదేవన్నా బ్రహ్మావిద్యా? అభ్యాసము కూసు విద్య అన్నారు. మనుజుల్ నేర్వగ రాని విద్యగలదే మనసార నేర్పించినన్ అనికూడా ఎవరో కవి అన్నట్టు జ్ఞాపకం. స్పర్థవల్ల విద్య పెరుగునుగదా. ఇదీ మనమంచికే ననుకున్నాను.

ముందు అర్జెంటుగా పాశ్చాత్య సంగీతపు ఫండమెంటల్ పాయింట్సు తెలుసుకోవాలి. ఎడిటర్ గారిని చిత్తు చేయడానికి పనికొస్తుంది. వరలక్ష్మిని ఇంప్రెస్ చేయాలన్నా అదే మంచి ఉపాయం. జర్నలిస్టు అన్నవాడు జాకాఫ్ ఆల్‌ట్రేడ్సు అయ్యుండడం మంచిదికదా. ఆఫీసులో నేను తప్ప ఇంకెవ్వరూ రాయలేని సబ్జక్టు కొన్ని ఉండాలి. అప్పుడు న్యూసెడిటరు చచ్చినట్లు కాళ్ళబేరానికొస్తాడు.

## అక్టోబరు 16 :

నిర్బంధ రిటైర్మెంటు అయిన ఉద్యోగులందరికీ పరిహారం పూర్తిగా ఇవ్వాల్సిందేనంటూ సుప్రీం కోర్టు అన్నగారిని మందలించింది. ఆరుకోట్ల మంది తెలుగువారు ఎన్నుకున్న ముఖ్యమంత్రి నిర్ణయాలలో సుప్రీంకోర్టు జోక్యం ప్రజాస్వామ్య వ్యతిరేకమని నా అభిప్రాయం. ఇటువంటి పరిస్థితి తిరిగి తలెత్తకుండా రాజ్యాంగాన్ని సవరించడం అవసరం.

సుప్రీంకోర్టు చర్యకు సంబంధించిన కాన్‌స్టిట్యూషనల్ ఇంప్లికేషన్స్ డిస్కస్ చేస్తూ ఆర్టికల్ రాశాను. అది ఎడిటర్ గారి కిస్తే ఎలాగూ వెయ్యడు. అందుకని దస్తూరీమార్చి, 'హిమకిరణ్' పెన్నేమ్‌తో పోస్ట్ చేస్తాను. నాకో పెన్నేమ్ ఉన్న సంగతి ఇంకా ఎడిటర్‌గారికి తెలీదు. రూము అడ్రసు ఇచ్చాను. దీనివల్ల వ్యాసం అచ్చుకావడమే కాక, డబ్బులు కూడా వస్తాయి.



ఇదిలా ఉండగా, వెస్టరన్ మ్యూజిక్కులో కొద్దిగా నిష్ణాతుణ్ణి అయ్యాను. సొనాటా, సింఫనీ, కన్సెర్టో మున్నగు మాటలు తెలుసుకున్నాను. హార్ప్, సెల్లో, వయోలా, శాక్సో ఫోన్ మున్నగు వాద్యాల పేర్లు తెలుసుకున్నాను. బెతోవెన్, మోజార్ట్, హైడెన్ మున్నగు మహనీయుల పేర్లు విన్నాను. మాక్సుముల్లర్ భవన్‌నుంచి సారథి తెచ్చిన బెతోవెన్ కాసెట్టు అతను లేనప్పుడు కొద్దిగా విన్నాను. గొడవగా ఉన్నట్టు అనిపించింది గాని మొత్తంమీద గొప్ప సంగీతమే ననడంలో సందేహం లేదు. నేనెక్కడ గొప్పవాణ్ణయిపోతానో అని బెంగ కాకపోతే సారధికి ఇప్పట్నించీ

ఇటువంటి సంగీతం దేనికి?

## అక్టోబరు 23 :

దసరా పండుగ కదాని మావయ్య గారింటికెళ్ళాను. తనకే కదా కర్ణాటక సంగీతం వచ్చునని వర్ణలక్ష్మికి కొంచెం గర్వం. మన ప్రాచీన సంస్కృతీ సంప్రదాయాలను పరిరక్షిస్తున్నందుకు ఆమెను ప్రశంసించక తప్పదన్నమాట నిజమే అయినప్పటికీ త్యాగరాజు వంటి మహా విద్వాంసులను విమర్శించడం మాత్రం సహించరానిది. నేను వెళ్ళేటప్పటికి రేడియోలో ఎవరో ఒకావిడ కర్ణాటక సంగీతం పాడుతోంది. నేను రేడియో దగ్గరే కూచ్చుని ఆహా... ఓహో అని సంగీతాన్ని ఆస్వాదిస్తూ ఉండగా వర్ణలక్ష్మి వచ్చి టప్‌మని రేడియో కట్టేసి వెళ్ళి పోయింది. నేను మళ్ళీ ఆన్‌చేసి తాళం వేస్తూ, తలకాయ ఊపుతుంటే తను వచ్చింది. "అబ్బబ్బ కర్ణ కఠోరంగా పాడుతుంటే ఎలా వింటున్నావు బాబూ" అంటూ విసుగ్గా ఆఫ్‌చేసి అక్కడే కూచ్చుంది నేను మళ్ళీ ఆన్ చేస్తానేమోనని కాపలాగా. "ఇది సంగీత కళాప్రపంచానికే తీరని అవమానం. నువ్వు కర్ణాటక సంగీతం నేర్చుకుంటూ ఒక సాటి కళాకారిణిని గౌరవించకపోవడం శోచనీయం" అని అధిక్షేపణ వ్యక్తం చేశాను. "వెధవ గొంతువేసుకుని అరుస్తోంటే కళా ప్రపంచం అంటూ ఏమిటో మాట్లాడతావు" అని విసుక్కుంది. "వ్యక్తిగతంగా ఆవిడ ఎలా పాడినప్పటికీ అది త్యాగరాజ కృతికదా, అయన్నైనా మనం గౌరవించాలి కదా' ' అన్నాను. అది త్యాగరాజ కృతి అని కనిపెట్టేసిన నా పరిజ్ఞానానికి వర్ణలక్ష్మి కొంచెం ఆశ్చర్య చకితురాలైనట్లుంది. త్యాగరాజనుత అని పాడుతోందికదా ఆవిడ. అందుచేత అది త్యాగరాజకృతే అయుంటుందని ఊహించాను.

"త్యాగరాజకృతి అయితే మాత్రం అలా అపస్వరాలు పాడుతుంటే ఎలా వినగలం" అంది వర్ణలక్ష్మి.

"ఆ.... త్యాగరాజకృతిలో అపస్వరాలా? త్యాగరాజ కృతిలో అపస్వరాలుంటాయని ఇంతవరకు ఏ మహావిద్వాంసుడూ విమర్శించలేదు. నువ్వు త్యాగరాజును విమర్శించేంత దానివయ్యావా?" అన్నాను ఆవేదనతో.

"నీతో వాదించడం శుద్ధ దండగ" అంటూ వెళ్ళిపోయింది వర్ణలక్ష్మి.

## అక్టోబరు 27 :

ఇవాళ ఆఫీసుకెళ్ళేటప్పటికి న్యూసెడిటరు వ్యాసాల కట్ట ముందేసుకుని కూచ్చున్నాడు.

వాటిల్లో హిమకిరణ్ పేరుతో నేను పోస్ట్‌చేసిన వ్యాసంకూడా ఉంది. అది నాలుగైదు పేజీలు చదివి "వీడెవడో క్రాక్‌లాగా ఉన్నాడు. ఇటువంటి ఐడియాలు మన రాంబాబు కొక్కడికే వస్తాయేమో ననుకున్నాను ఇన్నాళ్ళూ. అలాంటివాళ్ళు ఇంకా ఉన్నారన్నమాట" అన్నాడు ఆయన తన పక్కనున్న సబెడిటర్‌తో. నన్ను పిలిచి "ఇతగాడెవరో నీ స్టయిల్లోనే రాశాడు. చదివి బుట్టలో పారెయ్యి" అని ఇచ్చాడు. ఇంకా నయం చింపేశాడు కాదు. కాస్త చదివి బుట్టలో వేసినట్లు నటించి జేబులో పెట్టేసుకున్నాను. రేపు దీన్ని ఏ లార్జెస్ట్ సర్క్యులేటెడ్ డైలీకో, లేకపోతే మోస్ట్ పాపులర్ డైలీకో పంపుతాను.




ఇంట గెలిచి రచ్చగెలువు అనే నానుడి తెలుగువారికి వర్తించదు. తెలుగువారు రచ్చగెలిస్తే గాని ఇంట గెలవలేరు.

శీతోష్ణ సుఖదు:ఖేషు తధా మానావ మానయో: అన్నాడు గీతాకారుడు. అది సాధన చేయాలి. ఎడిటరుగారు నా టేబుల్ దగ్గరికి వచ్చి మరీ చివాట్లు పెట్టాడు.

"మీ నాన్నా ఉత్తరం రాశాడు - మావాడు ఏమన్నా ఇంప్రూవయ్యాడా అంటూ. ఏం ఇంప్రూమెంట్ నా శార్దం. రోజురోజుకీ పైత్యం ఇంప్రూవవుతోందని రాయాలి. ఇంపార్టెంటువి ఇస్తోంటే తగలేస్తున్నావని దొంగతనాలు, లారీప్రమాదాలు, శంకుస్థాపనలు ఇస్తోంటే వాటిల్లో కూడా తప్పులు రాస్తే ఎలా చచ్చేది? ఇంట్లో దొంగలు పడితే ముసలావిడ లేచి అలారం మోగించిందా? నీకేమైనా సెన్సుందా?" అంటూ దులిపాడు.

ఇంగ్లీషులో అలాగే ఉందనీ, యాజ్ పర్ వర్జినల్ రాశానని చెప్పాను. "రెయిజ్డ్ అలారం అంటే కేకలు పెట్టిందని అర్థం. అలారం టైమ్‌పీసు కాదు" అంటూ ఎడిటరు గారు కాసేపు న్యూసెడిటరు గారిని కూడా దుయ్యబట్టాడు. "ఇతను దౌర్భాగ్యంగా రాస్తాడన్న సంగతి తెలిసిందే కదా. జాగ్రత్తగా చెక్ చేసి పంపద్దుటండీ. పొద్దున్నే లేచి పేపర్లో ఇటువంటి తప్పుడు రాతలు చదివితే ఇంక తిండి కూడా సయించదు" అన్నాడు ఆయన.

తర్వాత కాస్సేపటికి ఎడిటరు గారి గదిలోకి వెళ్ళి మాట్లాడాను. "అనవసరంగా మీరు శ్రమపడి లేచిరావడం దేనికి సెక్షన్‌లోకి? కబురుచేస్తే నేనే వచ్చేవాణ్ణి కదా" అన్నాను.

జర్నలిజంలో ఆరితేరడానికి ముందు ఇంకా ఎన్నిచివాట్లు తినాలో ఏమో. బడీచాడీ

ఆంజనేయస్వామిని దర్శించుకుని చాలా రోజులైంది. అందుకే ఈ అవమానములు. రేపు సాయంత్రము వెళ్ళి ఒక కొబ్బరికాయ కొట్టవలెను.

## నవంబరు 4 :

ఇవాళ కాలేజీలో ఆస్మారామ్ గారు నన్ను ప్రశంసించారు. క్లాసులో లెక్చరిస్తూ ఆయన అమెరికాలో విద్యార్థులు స్వయంగా సంపాదించుకుంటూ చదువుతారని చెప్పారు. పెట్రోలు బంకుల దగ్గర, కారు గ్యారేజీల్లోనూ పనిచేస్తే గంటకి ఇన్ని డాలర్లు అని ఇస్తారట. ఆ డబ్బుని చదువు కోసం ఖర్చు పెడతారట. అక్కడ డిగ్నిటీ ఆఫ్ లేబర్ (శ్రమజీవన సౌందర్యం) ఎక్కువట. "మన రాంబాబు కూడా తల్లిదండ్రులపై ఎక్కువగా ఆధారపడకుండా ఒక చిన్న పత్రికలో సాయంత్రం పూట ఉద్యోగం చేస్తూ చదువుకుంటున్నాడు. అందరూ అతన్ని ఆదర్శంగా పెట్టుకోవాలి" అని ఆయన సలహా ఇచ్చాడు. పప్పుచారుమతి, ఆశాలత మున్నగు వారు నన్ను ప్రశంసా భావంతో చూశారు. అయితే నేను లేచి "మీరు నన్ను అపార్థం చేసుకుంటున్నార్ సార్. నేను డబ్బు కోసం ఉద్యోగం చెయ్యడంలేదు. జర్నలిజం పట్ల భక్తితో, ఆ వృత్తికి అంకితం కావడానికై చేస్తున్నాను" అని చెప్పాను. నార్ల అంతటి వాణ్ణి కావాలని ఆయన ఆకాంక్ష వ్యక్తం చేశారు.

గత శనివారంనాడు ఆంజనేయులు వారిని దర్శించుకోవడం మంచిదే అయింది. కాలేజీలో తెలుగు సాంస్కృతిక సంఘం సంయుక్త కార్యదర్శిగా నన్ను ఎన్నుకున్నారు. త్వరలో జరుగబోతున్న విచిత్ర వేషధారణ పోటీలకు ముఖ్య అతిథిగా ఎడిటర్ గారిని ఆహ్వానించాలని సూచించగా అందరూ అంగీకరించారు.

## నవంబరు 6 :

ప్రముఖ నటుడు సంజీవకుమార్ మనకిక లేరు. విశ్వవిఖ్యాత నటసార్వభౌముని తర్వాత చెప్పుకోదగ్గ గొప్ప నటులలో ఆయన ఒకడనడంలో అతిశయోక్తి లేదని చెప్పక తప్పదు. ఆయన లేని లోటు తీరదని అన్నగారు విచారం వ్యక్తం చేయడమే ఇందుకు తార్కాణం.

వీరు మన కులంవారు, వీరు మన బంధువులు, వీరు మన మిత్రులు అనే పక్షపాతం లేకుండా ధర్మాన్ని, న్యాయాన్ని తు.చ తప్పకుండా అమలు జరిపే ఆదర్శ రాజయోగిగా అన్న గారి పేరు తెలుగుదేశ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖింపబడుతుందనడంలో ఇసుమంతైనా అనుమానం లేదు. మహానటుడుగా ఆయన ఎన్నో త్యాగాలు చేశాడు.

న్యాయమూర్తిగా, పోలీసు అధికారిగా తన సొంత కుటుంబ సభ్యులకు సైతం శిక్ష విధించిన నిప్పులాంటి మనిషి ఆయన. దేశ రక్షణకై ప్రాణాలకు తెగించి పోరాడిన వీరాధివీరుడు ఆయన. అలనాడు హరిశ్చంద్రుడుగా సత్యవాక్పరిపాలనకై భార్యాపుత్రులను సైతం విక్రయించిన ధర్మమూర్తి ఆయన. కర్ణుడుగా తన చర్మాన్ని కోసి ఇచ్చిన మహాదాత ఆయన. తెరపైనే కాదు- నిజజీవితంలో కూడా తాను ఆదర్శమూర్తిననీ, కర్మయోగిననీ నిరూపించుకున్నాడు ఆయన. కోట్లాది రూపాయల సంపాదనను తృణప్రాయంగా విసర్జించి, ధర్మసంస్థాపనార్థం సన్యాసియై ప్రజాసేవకు జీవితాన్ని అంకితం చేశారు. అలనాడు సూటు, బుష్‌కోట్లు వేసుకున్న నా అందాల అభిమాన హీరోని ఇలనాడు సన్యాసిగా చూస్తుంటే నా కళ్ళు అశ్రువులను వర్షిస్తున్నాయి.

పార్టీ కార్యకర్తల నుంచి, అభిమానులనుంచి ఎన్ని వత్తిడులు వస్తున్నప్పటికిన్నీ ఆయన తన అల్లుళ్ళను మంత్రివర్గంలోకి తీసుకోకుండా పార్టీని పటిష్టం చేసే బాధ్యతా భారాన్నే వారిపై మోపాడు. ఇప్పుడు తమ అనుంగు సోదరుడైన అక్కినేని స్టూడియోలోని ఏడు ఎకరాల స్థలాన్ని స్వాధీనం చేసుకోవడానికి ఆయన ఉత్తర్వు చేశాడు. 35 సంవత్సరాలుగా తనకు చేదోడు వాదోడుగా నిలచిన తమ్మునిపై ఇటువంటి చర్యతీసుకోవడానికి ఆయన ఎంతగా గుండెరాయి చేసుకుని ఉంటాడో, ఎంత అంతర్మథనం చెందాడో! న్యాయం ముందు ఎవరైనా ఒకటే కదా. ధర్మదేవత వలె కళ్ళకు గంతలు కట్టుకుని పాలన చేస్తున్న అన్నగారికి జోహారులు.



ఇరవై రూపాయలు పెట్టి కోటీలో పేవ్‌మెంట్ మీద డ్రాయరు కొన్నాను. రూముకి వచ్చాక భాస్కర్రావు చూసి అది వట్టి నాసి రకందని ఆక్షేపించాడు. అతను ఛస్తే నేను చేసిన పనిని మెచ్చుకోడు. ఇదివరకు ఐదు రూపాయలు పెట్టి కొంటే చవకబారుదని విమర్శించాడు. సరే కదాని ఇవాళ ఇరవై రూపాయలు ఇచ్చి కొంటే దీన్ని ఆక్షేపిస్తున్నాడు. ఇంత ఖరీదైన డ్రాయరు చవక బారుది ఎలా అవుతుంది? పైగా సారధి కూడా భాస్కర్రావుతో ఏకీభవిస్తున్నాడు. ఇరవైకాదు వలభై ఇచ్చికొన్నా వీళ్ళు ఇలాగే అంటారు. తాము కొన్నదైతే పదిహేను రూపాయలైనా మంచిదంటారు.

## నవంబరు 10 :

అన్నగారికి వ్యతిరేకంగా అక్కినేనికి మద్దతుగా చలనచిత్రకారులు కొందరు ఉద్యమం

లేవదీసేట్లు ఉన్నారు. కులాభిమానానికి, సోదరప్రేమకు అతీతంగా అన్నగారు న్యాయదృష్టితో వ్యవహరిస్తుంటే అభినందించడం పోయి వీరు కుటిల బుద్ధితో విమర్శిస్తున్నారు. చిత్రసీమకు కృష్ణార్జునుల వంటి ఎన్టీఆర్‌కు ఏఎన్నార్‌కు, మధ్య అపార్థబీజాలు నాటుతున్నారు. అన్నగారితో తనకు ఎటువంటి విభేదాలు లేవనీ, తన వివాదమల్లా రాష్ట్ర ప్రభుత్వంతో మాత్రమేననీ స్వయంగా అక్కినేని గారే మొన్న ప్రెస్ కాన్ఫరెన్సులో స్పష్టీకరించిన సంగతి ఈ సందర్భంలో గమనార్హం. సాయంత్రం మావయ్య గారింటి కెళ్ళినప్పుడు వర్లక్ష్మికీ, నాకూ ఈ విషయమై వాగ్యుద్ధం జరిగింది. తను అక్కినేనిని తీవ్రంగా వెనకేసుకు వచ్చింది.

స్టూడియోలో కొంత భూమిని సక్రమంగా వినియోగించుకోలేదన్న సాకుతో అక్కినేని గారిపై అసూయతో అన్నగారు ఈ చర్య తీసుకున్నారనీ, ఇది ఖచ్చితంగా అధికార దుర్వినియోగం తప్ప మరేమీ కాదనీ వాదించింది. పిచ్చిపిల్ల! సన్యాసికి అసూయయా? కాషాయ వస్త్రాలు ఎప్పుడైతే కట్టారో అప్పుడే ఆయన అసూయ, బంధుప్రీతి, ద్వేషము, కోర్కెలు, స్వార్థము మున్నగు మాయా మోహ భేషజాలము నంతటినీ విసర్జించి కర్మసన్యాసి అవతారము దాల్చారు. అక్కినేని గారు గొప్పవారే గాని ఇంకా లౌకికమైన లంపటములలో పడికొట్టుకుంటున్నారు. నా ఆస్తి, నా స్టూడియో నేను కష్టపడి దీన్ని వృద్ధిచేశాను అని సంకుచితముగా అర్జునుని వలె ఆలోచిస్తున్నారు. కర్మఫలత్యాగము గూర్చి ఆయన అన్నగారి నుంచి నేర్చుకోవలసింది ఎంతో ఉన్నది.

అన్నగారు లక్షలాది రూపాయల ఆదాయమునిచ్చే తన స్టూడియోను పాలక పక్షమైన తెలుగుదేశం కార్యకలాపాలకే అంకితం చేశారు. ఇదంతా వర్లక్ష్మికి వివరంగా బోధించాను. అయినా తను కన్విన్సు కాలేదు. స్టూడియోను పార్టీ కార్యాలయంగా మార్చడం దుర్వినియోగం కాదా అని అజ్ఞానంతో వాదించింది. తెలుగు ప్రజాజీవితం నుంచి అవినీతిని పారద్రోలి, రామరాజ్యాన్ని స్థాపించడానికి తెలుగుదేశం పార్టీ ఆవిర్భవించిందనీ, అట్టి పార్టీ కార్యకలాపాలకు స్టూడియోను వినియోగించడం అంటే దానిని ఆరుకోట్ల ఆంధ్రుల సేవకు అంకితం చేయడమేననీ అరటిపండు ఒలిచి పెట్టినట్లు విశదీకరించాను. అయినా ఇంత పెద్ద విషయాన్ని అర్థం చేసుకోగల మానసిక పరిపక్వత వర్లక్ష్మికి రాలేదు. "అంతా మోసం, దగా, కుళ్ళుబోత్తనం' ' అంటూ బాల్య సహజమైన ఆవేశంతో వాదించింది. ఆగస్టు సంక్షోభంలో (నాదెండ్ల ఎపిసోడులో) అన్నగారిని ఎంతో స్టౌంచిగా సపోర్టు చేసిన వర్లక్ష్మి ఇప్పుడు ఆయన్ని తీవ్రంగా దుయ్యబట్టడం శోచనీయం. క్షణక్షణముల్ జవరాండ్ర చిత్తముల్ అన్నారు అందుకే. అక్కినేని గారు ఈ వ్యవహారాన్ని కోర్టులో తేల్చుతానన్నారు. అగ్రనటులిరువురి మధ్య

చట్టసంబంధమైన పోరాటం సాగినప్పటికీ వ్యక్తిగతంగా అన్నదమ్ముల అనుబంధాన్ని ప్రపంచంలో ఏ శక్తీ విడదీయజాలదని ఆశిస్తున్నాను.

## నవంబరు 16 :

కాలం యాంత్రికంగా గడచి పోతోంది. ఎటువంటి మార్పు లేకుండా రోజులు గిరగిర తిరిగి పోతున్నాయి - ఫ్లాట్ బెడ్ రోటరీ మీద పేపర్లు అచ్చువేసినట్లే. ఎడిటరుగారు గదిలోకి పిలిచి చివాట్లు వేస్తే "ఇందాకనే కదా చివాట్లు పెట్టారు. అప్పుడే ఒక రోజు గడిచి పోయిందా ఓరి బాబోయ్ అనిపిస్తోంది.

న్యూసెడిటరు గారి మీద కంప్లెయింట్సు ఎక్కువై పోయాయి. ఆయన దుర్బుద్ధితో తమకు అనింపార్టెంటు వార్తలు ఇస్తున్నారని ఎవరికి వారే ఎడిటరు గారికి కంప్లెయింటు చేస్తున్నారు. ఆరు గంటలు ఏదో ఒకటి రాసి మీ దారిని మీరు పోక ఏమిటయ్యా ఈ కీచులాటలు అని ఎడిటరు గారు యావచ్ఛక్తులా మందలించినా నిష్ఫలితమే అయింది. అందుచేత ఈ ఫిర్యాదుల వల్ల ఉత్పన్నమైన పరిస్థితి నెదుర్కోడానికై న్యూసెడిటరు బఫే పద్ధతి పెట్టారు. అనగా సార్టింగు అయిపోయాక రాయవలసిన ఐటములన్నింటినీ పేకలాగా కలిపేసి ట్రేలో పడేస్తున్నారు. ఆ ఐటముల మీద బ్యానర్ అనీ, బాక్సు అనీ, త్రీ కాలం అనీ, సింగిల్ కాలం అనీ, ఫిల్లర్ అనీ నోట్ చేసి ట్రేలో పడేస్తున్నారు. ఎవరిక్కావాల్సినవి వారు తీసుకొని రాసుకోవచ్చు. దీనికే ఆయన బఫే పద్ధతి అని పేరు పెట్టారు. తత్ఫలితంగా రేప్ కేసులు, అశ్లీల చలన చిత్రాలు, యాభైసార్లు పెళ్ళి చేసుకున్న ఎనభై ఏళ్ళ వృద్ధుని యవ్వన రహస్యం మున్నగు రసవత్తర ఐటములన్నీ గబ గబా శంకరయ్యగారు తీసేసుకుంటున్నారు. బ్యానర్లు, బాటములు, ఫోర్ కాలములు శేషగిర్రావు లాగేసుకుంటున్నాడు.

రోదసీ పరిశోధనలు, వైద్య శాస్త్ర రంగంలో అద్భుత ప్రయోగాలు మున్నగునవి చక్రధర్ తీసుకుంటున్నాడు. పార్ట్ టైము గాణ్ణి కదా, కాలేజీ అయ్యాక వస్తా కదా అందుకని నాకు బొగ్గు ఉత్పత్తి, వ్యాగన్ల కొరత, ప్రత్తి పంట విస్తీర్ణం ఇత్యాది ఐటములు మిగులుతున్నాయి. అయితే లక్కీగా సంగీతం, డాన్సు మొదలైనవి కూడా దొరుకుతున్నాయి. అవి రాసే అర్హత నాకు మాత్రమే ఉందని అందరూ గ్రహించి ఉంటారు. అంతయూ మన మేలునకే. అయినా ఎందుకైనా మంచిదని సందేహ నివృత్తికై చక్రధర్‌ను అడిగాను.."అమ్మో ..... సంగీతం జోలికి పోతే ఎడిటరుగారి చేత చివాట్లు తినాలి. అది నీకే చెల్లింది. అందుకే మేమెవ్వరం అటువంటి వార్తల జోలికి పోము" అన్నాడు. కళలను గురించి రాయడానికి

నేను తప్ప ఇంకెవ్వరూ లేరన్నది నిర్వివాదాంశం. 'సుజన మిత్ర' సాంస్కృతిక ప్రతినిధిగా విజిటింగ్ కార్డులు కొట్టించు కోవాలి త్వరలో.



## నవంబరు 21 :

చెప్పేవాడికి వినేవాడు లోకువ. ఎడిటరుకు సబెడిటరు లోకువ. తనకేదో కాస్త సంగీతం తెలుసు కదాని ఎడిటరు గారు తెగ డబాయించి పారేస్తాడు నాలాంటివాడి దగ్గర. బొత్తిగా మాట నిలకడలేదు ఆయనకి. ఆ మధ్య ఓసారి ప్రముఖ గాయకుడు భీంసేన్ జోషీ పేరు వస్తే పండిత్ అని ముందు తగిలించమన్నారు. విద్వాంసులందరికీ పండిత్ అనడం సంప్రదాయమని చెప్పారు. తర్వాత ఓరోజు పండిత్ బిస్మిల్లాఖాన్ అని రాస్తే 'పండిత్ ఏమిటోయ్ నీ తలకాయ' అని ఆక్షేపించాడు. బిస్మిల్లా గారు భీంసేన్‌జోషీ కంటే తక్కువ్వాడనా మీ ఉద్దేశం అని నిగ్గదీశాను.

ఆయన నవ్వుతూ "ముస్లిం విద్వాంసులకి ఉస్తాద్ అని పెట్టాలి" అని వివరించాడు. పోనీలే ఏదో పెద్దవాడు చెప్పాడని ఊరుకున్నాను. ఆయన చెప్పిన సంప్రదాయం ప్రకారమే ఇవాళ ఉస్తాద్ చిన మౌలానా సాహెబ్ అని రాస్తే దీన్నీ ఆక్షేపించాడు. నాకు ఒళ్ళు మండిపోయింది. ఇది కేవలం స్వవచో విఘాతం అని వాక్రుచ్చాను. "చిన మౌలానా కర్ణాటక సంగీతం వాడు. ఉస్తాద్ అనేది హిందూస్తానీ సంగీతంలో ముస్లిములకే వాడతారు" అని సమర్థించుకున్నాడు. "అయితే రేపు ఏ లక్ష్మి శంకర్ వార్తో, ప్రవీణ్ సుల్తాన్ వార్తో వస్తే వాళ్ళకి ఏం బిరుదు తగిలించమంటారు?" అని అడిగాను. "రక్షించావు ముందే అడిగావు. పండిత్ లక్ష్మిశంకర్ అనీ, ఉస్తాద్ పర్వీన్ సుల్తానా అని రాయకు. ఊరికే శ్రీమతి అని పెట్టు చాలు. ప్రవీణ్ కాదు పర్వీన్ అని రాయి" అని చెప్పాడు.

యావద్భారత సంస్కృతి అంతా ఒక్కటేననీ, ఈ విధంగా మత, ప్రాంతీయ, లైంగిక విభేదాలను పాటించడం దురదృష్టకరమని నిరసన వ్యక్తం చేసి వచ్చేస్తుంటే "దౌర్భాగ్యపు భాషా నువ్వూను. లైంగిక అని నా దగ్గరంటే అన్నావు. ఇంకెక్కడా వాగకు. లింగభేదం అనాలి' ' అని కోప్పడ్డారు. కళారంగంలోని ఈ వివక్షతా విధానం దక్షిణాఫ్రికా ప్రభుత్వపు ఎపార్తీడ్ పాలసీని తలపిస్తున్నది.

ఇదిలా ఉండగా న్యూసెడిటరు గారు కూడా తల తిక్కకు సంబంధించినంత వరకు ఎడిటరు గారితో పోటీపడుతున్నారు. ఆడవాళ్ళ పేర్లకు ముందు శ్రీమతి అని తప్పవిసరిగా

పెట్టాలని కోప్పడుతున్నట్లుగా చెప్పాడు. ఆ మధ్య దేవుళ్ళని గురించి రాసేటప్పుడు శ్రీ వెంకటేశ్వరస్వామి అనీ, శ్రీ సింహాచల నృసింహస్వామి అనీ రాయాలని బోధించారు. సరే కదాని ఇవాళ శ్రీమతి పద్మావతీ ఆలయం, శ్రీమతి కామాక్షి ఆలయం అని రాస్తే బిగ్గరగా అందరూ వినేట్లుగా తిట్టారు. ఆడ దేవుళ్ళకి శ్రీమతి అని పెట్టకూడదట. శ్రీ అనే అనాలిట. ఈ రూల్సు ఎవరు పెట్టారో తెలీదు. మన హిందూ సంప్రదాయాలను సమూలంగా సంస్కరించడం ఎంతైనా అవసరం.

ప్రభుత్వమే దురుద్దేశ పూర్వకంగా ధరలను పెంచేస్తున్నదని అపోజిషను వాళ్ళు తీవ్రంగా విమర్శిస్తున్నారు. ధరలు తగ్గించడం కోసమే పెంచుతున్నామని మంత్రిగారు వాదిస్తున్నారు. రైతులకు గిట్టుబాటు ధరలు లభింప జేయడానికే వ్యవసాయోత్పత్తుల ధరలు పెంచారట. దీనివల్ల రైతులు సమధికోత్సాహంతో ఇతోధికంగా పండిస్తారట. దానివల్ల ఉత్పత్తులు పెరిగి ధరలు తగ్గుతాయట. అంతవరకు కరక్టుగానే ఉంది. కాని ధరలు పడిపోతే మళ్ళీ మద్దతు ధరలు చెల్లిస్తారు కదా. దాని వల్ల మళ్ళీ ధరలు పెరుగుతాయి కదా. ఏమిటో ఇదంతా ఒక విష సర్కిలు. అటు రైతులకు గిట్టుబాటు ధరలు లభింప జేస్తూ, ఇటు ప్రజలకు సరసమైన ధరలకు




లభింపజేస్తూ, అదే సమయంలో ప్రభుత్వానికి నష్టం లేకుండా దళారీలకు లాభం చేకూర్చడం సాధ్యం కాదా? దీని మీద తక్షణం ఆర్థిక వేత్తల సెమినారు నిర్వహించడం అవసరం. ఎడిటరు గారికి చెప్పాలి ఎడిటోరియల్ రాయమని.

అసలు ఈ ఐడియా ఇద్దామని ఎడిటరు గారి గదిలోకి వెళ్ళాను కూడా. కాని ఆయన ఎవరో పెద్దమనిషితో సాహిత్య విషయాలు డిస్కస్ చేస్తున్నారు. ఆ పెద్దమనిషి సాహితీవేత్త అయ్యుంటాడు. లాల్చీ, పైజామా వేసుకున్నాడు. ఆదివారం సాహిత్యానుబంధం నిర్వహించడానికి సరైన సబెడిటరు లేడని ఎడిటరు గారు ఆవేదనతో అంటున్నాడు ఆ సాహితీవేత్తతో. "చెంత నేనుండగా చింత మీకెందుకు. మాట మాత్రం అని ఉంటే ఆ బాధ్యత నేను తీసుకొని ఉండేవాణ్ణి కదా. ఏదోమీరూ, న్యూసెడిటరుగారూ తంటాలు పడుతున్నారు కదాని ఊరుకున్నాను ఇన్నాళ్ళూ" అన్నాను. "ఏడిశావ్... నీకు సాహిత్యం సంగతేం తెలుసు? అన్నిట్లో వేలు పెడతానంటావు సర్వజ్ఞుడిలాగా" అని కసిరాడు ఎడిటరుగారు. "అదేమిటండీ అలా అంటారు. మాదిరెడ్డి సులోచనారాణిగారి కథలు, యద్దనపూడి రంగనాయకమ్మగారి నవలలు మున్నగునవి పుంఖానుపుంఖాలుగా చదివాను'

' అని దబాయించాను. ఎందుకోమరి ఇద్దరూ ఏకగ్రీవంగా నవ్వారు. "ముందు ఫిల్లర్లు, సింగిల్ కాలాలూ రాయడం నేర్చుకో. సాహిత్యసేవ తర్వాత చేద్దువుగాని" అన్నాడు ఎడిటరుగారు.

## డిసెంబరు 1 :

గుండెపోటుతో అపస్మారక స్థితిలో ఆస్పత్రికి చేర్చబడినట్లు చెప్పబడుతున్న కళాప్రపూర్ణ డాక్టర్ అక్కినేని నాగేశ్వరరావు గారిని అన్నగారు కలుసుకొని పరామర్శించారు. ప్రభుత్వ బాధ్యతలతో ఏ మాత్రం తీరిక లేకుండా ఉన్నప్పటికీ అన్నగారు హుటాహుటిని విమానంలో మద్రాసు వెళ్ళి సోదరుని ఆరోగ్యాన్ని పరామర్శించారంటే ఆయనది ఎంత దయార్ద్ర హృదయమో కదా! అన్న దమ్ముల అనుబంధాన్ని ప్రపంచంలో ఏ శక్తీ విడదీయజాలదు. అనుమానపు తెరలు తొలగిపోతాయి. దుష్టుల ఆట కట్టుతుంది.

ఇన్నాళ్ళూ నా సహజ శక్తి సంపత్తులను తెలుసుకోలేకపోయాను రాములవారి లాగా, హనుమంతులవారి లాగా. వారికి కూడా నాలాగానే ఇతరులు చెబితే తప్ప వారి గొప్పతనం తెలీదు. నేను గొప్ప సహజ హాస్యగాడినని ఇప్పటికి తెలుసుకో గలిగాను భాస్కర్రావు చెబితే. ఇన్నాళ్ళూ కొద్దిగా అనుమానంగానే ఉండేది ఏమిట్రా అందరూ నన్ను చూసి నవ్వుతూ ఉంటారు అని. భాస్కర్రావు, సారధి సరేసరి. వర్లక్ష్మి, పక్కింటికోతీ, కాలేజీ ఫ్రెండ్సూ అందరూ నవ్వుతూ ఉంటారు. సైకోఎనాలసిస్సులో ఎక్స్పర్ట్ గదాని ఇవాళ భాస్కర్రావుని అడిగాను ఏకాంతంగా.



అసలు సంగతి అతను చెప్పాడు. జోకులలో రెండు రకాలున్నాయట. సంకల్పిత జోకులు, అసంకల్పిత జోకులు. నవ్వించడంలో రెండింటికీ సమానమైన శక్తి ఉందట. నావి రెండో తరహా జోకులుట. అవతలి వారిని నవ్వించాలనే ఉద్దేశంతో కాక, మామూలుగా, సీరియస్‌గా మాట్లాడినా గాని నవ్వొస్తుందన్నమాట. అప్రయత్నంగా, అనగా ఎఫర్ట్‌లెస్‌గా నవ్వించడం అన్నమాట.

మొదటి తరహావారు ప్రయత్న పూర్వకంగా, జోకువేసి, నటన చేసి నవ్విస్తారు. రెండో తరహా వారిది సహజమైన హాస్యం అన్నమాట. అసలు నన్ను చూస్తేనే నవ్వొస్తుందట. బహుశా చార్లీచాప్లిన్‌గా అయ్యుంటుంది. అసలు భాస్కర్రావు ఇంత డీప్‌గా ఎలా స్టడీ చేశాడో ఈ సబ్జక్టు. ఇంతాచేసి అతను

నా కంటే ఏడాదే పెద్ద. "ఒక్క మాటలో చెప్పాలంటే - మొదటి తరహా వాళ్ళ ప్రవర్తన హాస్య భరితంగా ఉంటుంది. రెండో తరహా వాళ్ళ ప్రవర్తన హాస్యాస్పదంగా ఉంటుంది. అంతే తేడా" అంటూ అరటిపండు ఒలిచిపెట్టినట్లు చెప్పాడు. కొంచెం ఇతోధికంగా కృషి చేస్తే అతను సైకోథెరపాలజీ క్లినిక్కు పెట్టుకోవచ్చు చదువైపోగానే. సారథి నాకంటే ఏడాది చిన్న. అయినా అతనుకూడా భాస్కర్రావు సావాసం పట్టి మేధావి అయిపోతున్నాడు అచిరకాలంలో. మరి నన్ను చూసి అందరూ నవ్వుతూ ఉండగా ఎడిటరు గారు ఎందుకు విసుక్కుంటారని భాస్కర్రావుని ప్రశ్నించాను. "ఆయనకి సెన్సాఫ్ హ్యూమర్ లేదోయ్" అని తకీమని చెప్పాడు. అదీ అసలు సంగతి. ఎడిటరు గారి దగ్గర జోకు వెయ్యడం చెవిటికి శంఖం ఊదినట్లే.

## డిసెంబరు 5 :

పొరుగు రాష్ట్రాల అభ్యంతరాలు తీరాకనే కేంద్రం తెలుగుగంగకు అనుమతిస్తుందట. అపరభగీరథుడనే పేరు అన్నగారికి దక్కకుండా చేయడానికి రాజీవ్‌గాంధీ గారు కంకణం కట్టుకొన్నట్లుంది. అందుకే ఎన్టీఆర్, హెగ్డే, ఎమ్జీఆర్‌ల మధ్య మిత్రభేదం కల్పిస్తున్నారు. ఇది ఇలా ఉండగా, నిర్బంధ రిటైర్మెంటు యోచనకు స్వస్తి చెప్పినట్లు అన్నగారు నిర్ద్వందంగా ప్రకటించారు. అనగా ఇరవై ఐదేళ్ళు సర్వీసు పూర్తి అయిననూ, అసమర్థులయిననూ ఉద్యోగము లలో ఉంచుతారన్నమాట. ఇది ఎంతయూ హర్షణీయము. భారత రాజ్యాంగం ప్రకారం ఉద్యోగం చేసుకొనే హక్కు ప్రతి పౌరునికి ఉన్నది. వికలాంగులకు ఇచ్చుచున్నట్లే అసమర్థులకు సైతము ఉద్యోగము లివ్వవలసినదే. వారు మాత్రము భారత పౌరులు కారా? షె.కు, షె.జా, వె.బ.త. లకు వలెనే అసమర్థులకు కూడా ఉద్యోగములలో రిజర్వేషన్లు అవసరము.

"ఢిల్లీలో విషవాయులీకేజీ: లక్షలాది మందికి అస్వస్థత" ఎయిట్ కాలం సెవెంటీటూ పాయింటు. భారత రాజధానీ నగరం లోనే ప్రజల ధనమాన ప్రాణము లకు రక్షణ కల్పించలేక పోవడం ద్వారా కేంద్ర ప్రభుత్వం రాష్ట్రాలలో భద్రతా రాహిత్యమును విమర్శించే నైతిక హక్కును కోల్పోయింది. ప్రధాని నివాసము వద్ద ప్రధాని ప్రాణములకే భద్రత లేనప్పుడు కారంచేడులో హరిజనులకు భద్రత లేదని ఆక్షేపించుటలో అర్థము లేదు. నిజమునకు రాష్ట్రముల లోనే హెచ్చుభద్రత గలదు. ఉదాహరణకు ముఖ్యమంత్రులు బులెట్ ప్రూఫు కోట్లు లేకుండా నిర్భయముగా తిరుగ గలుగుచున్నారు. అట్లే పార్లమెంటు సమావేశములలో

సైతం ఇటీవల కనివిని ఎరుగని అత్యంత గందరగోళములు తరచుగా జరుగుతున్నవి. లంకలో తమిళులను ఊచకోత కోస్తుంటే రాజీవ్ మిన్నకుండుట శోచనీయము. తారకరాముడే ప్రధాని పదవిలో ఉంటే లంకకు తెలుగు సేతువును నిర్మించి తమిళులను కాపాడి అమృత లింగమునకు పట్టాభిషేకము చేసి ఉండెడి వాడు.

## డిశంబరు 15 :

కాలేజీనించి కాలినడకన వస్తోంటే సుల్తాన్ బజార్‌లో బట్టలు వేలం పాడుతున్నారు. నేను వెళ్ళేటప్పటికి సిల్కు షర్టింగు పాడుతున్నారు. నేనూ పోటీగా పాడడం మొదలు పెట్టాను. నా ధాటికి ఎవరూ ఆగలేకపోయారు. పక్కన ఒకాయన 'అది ఆర్టు సిల్కండీ' అన్నాడు. 'అందుకే కదా పాడుతున్నది' అన్నాను. డెబ్భయ్ రూపాయలకి లక్కీగా దొరికింది. తర్వాత మళ్ళీ ఇంకో షర్టింగ్ వేలం మొదలు పెట్టాడు. 'పాడండి సార్' అన్నాడు వాడు. షర్టింగ్ కొన్నాను కదా.. పాంటింగ్ ఉంటే పాడతానన్నాను. వాడి దగ్గర పాంటింగ్‌లు లేవుట. సూటింగ్ లున్నాయన్నాడు. సూటింగ్‌లు నాకు దేనికని వచ్చేశాను. రూముకి వచ్చి షర్టింగ్ పీసు చూపిస్తే సారధి అది వట్టి దగా, మోసం అన్నాడు. అది సిల్కుకాదు ఆర్ట్ సిల్కు అన్నాడు. "తెలుసులేవోయ్ పెద్ద. అక్కడ ఒకాయన చెప్పాడు కూడా. ఆర్ట్ సిల్కు కదా అనే కొన్నాను కళాత్మకంగా ఉందని. కళాహృదయం లేనివాళ్ళకి ఆర్ట్ సిల్కుఎలా నచ్చుతుందిలే" అన్నాను. సారధి, భాస్కర్రావు ఒక్కటే నవ్వడం. సారధి నవ్వితే కేర్ చేసేవాణ్ణి కాదు గాని భాస్కర్రావు కూడా నవ్వుతున్నాడంటే ఇదేదో అసంకల్పిత జోకు అయ్యుంటుందనుకున్నాను.

## డిసెంబరు 23 :

జలగం, కాసు, విజయ భాస్కరరెడ్డి, మండలి, రోశయ్య, రాజశేఖరరెడ్డి, ఆపద మొక్కులవాడు, కలియుగ ప్రత్యక్ష దైవము, అరచేతిలో వైకుంఠము చూపించువాడు అయిన తిరుమలేశుని సందర్శించి ఏకగ్రీవంగా ప్రార్ధనలు సల్పినారట. అన్నగారి ప్రభుత్వమునకు ఏమి ముప్పు వాటిల్లునో కదా. వారిలో కొందరైనను తలనీలాలు సమర్పించియే యుందురు. నా వామనేత్ర మదురుచున్నది. నా మనస్సేలనో కీడును శంకించుచున్నది.

కోటీశ్వరుల ఇండ్లపై దాడులు జరుపుట హర్షణీయమే ననుటలో సందేహము ఏ మాత్రము లేదని చెప్పక తప్పదు. అయితే ఫాలో అప్పుగా ఆ దాడులు జరిపిన అధికారుల ఇండ్లపై కూడా దాడులు జరుపుట అత్యావశ్యకము. కోటీశ్వరులు ఇప్పుడు అధికారుల దాడుల కంటే బందిపోటుల దాడులే మేలని తలపోయుచున్నారు. ఏలననగా బందిపోటుల

దాడులలో ధనము మాత్రమే పోవును. అధికారుల దాడులలో ధనముతో పాటు పరువు కూడా పోవుటయే గాక కారాగార క్లేశము కూడా ప్రాప్తించును. గుప్త సంపదలను పసిగట్టుటలో, ధైర్యసాహసములలో అధికారులు బందిపోటులను ఆదర్శముగా పెట్టుకోవలయును.

ఈ మధ్య శానా సంవత్సరాలుగా వర్షాకాలంలో ఎండలు, శీతాకాలంలో వర్షాలు మామూలై పోయాయి గదా. మన సర్కారు జిల్లాల్లో పంటలు పండడం లేదనీ, పండితే అకాల వర్షాలవల్ల పాడైపోతున్నాయనీ ఏడుస్తూ కూచోకపోతే శుభ్రంగా శీతాకాలంలో దుక్కి దున్ని విత్తనాలు జల్లుకుంటే వర్షాకాలం నాటికి పంట చేతి కొస్తుందిగదా. మన రైతులకి బొత్తిగా శాస్త్రీయ దృక్పథంలేదు.

## డిసెంబరు 30 :

హమ్మయ్య.... పాకిస్తాన్‌లో సైనిక పాలన అంతమొందింది. జియాగారు ఇస్లామిక్ ప్రజాస్వామ్యాన్ని ప్రవేశపెట్టారు. ప్రపంచంలో అనేక రకముల ప్రజా స్వామ్యములున్నవి. రాచరిక ప్రజాస్వామ్యము, నియంతృత్వ ప్రజాస్వామ్యము, గైడెడ్ డెమోక్రసీ అనగా నడిపిత ప్రజాస్వామ్యము, ఇస్లామిక్ ప్రజాస్వామ్యము మొదలగునవి. మొత్తానికి ఏదో ఒక ప్రజాస్వామ్యము వెలసినది. కడు ముదావహము.

కాంగ్రెస్ శత వార్షికోత్సవమును పురస్కరించుకొని రాజీవ్‌గాంధీ, గారు అవినీతికి ఆలవాలమైన ప్రస్తుత రాజకీయ వ్యవస్థను తీవ్రంగా దుయ్యబట్టారు. తన సొంత పార్టీవారిని ఇంత తీవ్రంగా తిట్టిన నాయకుడు మనదేశంలో ఇప్పటివరకు నభూతోనభవిష్యతి. భ్రష్ట వ్యవస్థకు భరత వాక్యం పలుకుతానని ఆయన భీష్మ ప్రతిజ్ఞ చేశారు. కాంగ్రెస్ ఉత్సవాలలో కనీవిని ఎరుగని తొక్కిసలాట జరిగింది. ఈ కుమ్ములాటలో గాయపడిన వారిలో జర్నలిస్టు దంపతులు కూడా ఉన్నారని రాసినందుకు న్యూసెడిటరు గారు తను చివాట్లు పెట్టింది చాలక ఎడిటరు గారికి కంప్లెయింటు చేశాడు. "లక్కీగా కంపోజ్ కాకముందే పట్టుకున్నాను కాబట్టి సరిపోయింది. పేపర్లో వచ్చేసి వుంటే పరువుపోయి వుండేది" అని అరిచాడు ఆయన. 'కపుల్ ఆఫ్ జర్నలిస్ట్స్' అన్న ఇంగ్లీషు మాటకి జర్నలిస్టు దంపతులని రాస్తే ఇంత రాద్ధాంతం. ఇద్దరు జర్నలిస్టులని రాయాలిట. కపుల్ అనే మాటలో ఇంత శ్లేష ఉంటుందని ఎలా తెలిసి

ఏడుస్తుంది. మొత్తానికి ఇంగ్లీషంత దౌర్భాగ్యపు భాష ఇంకోటి లేదని మరోసారి నిర్ద్వంద్వంగా రుజువయింది. ఇదివరకో సారి కెమెరామెన్ దంపతులు అని రాశాను. మరి అప్పుడు తిట్టలేదు. న్యూసెడిటరు చూడలేదో ఏమో.

## జనవరి 1 :

నూతన సంవత్సరంలో సాంస్కృతికంగా ఉన్నతోన్నతపథాలకు ఎదగాలని కంకణం కట్టుకోవడానికి కృతనిశ్చయం చేసుకున్నాను.




ఈ అనంత మహాకాల ప్రవాహంలో మనిషి జీవితమొక బుద్బుదం. ఈ బుద్బుదంలో ఒక సంవత్సరమనగా నెంత?

పక్కింటి కోతి చాలా రోజులుగా కనిపించడం లేదన్న సంగతి ఎవరో వెన్ను చరిచినట్లు హఠాత్తుగా జ్ఞాపకం వచ్చింది. నిజంగానే కనిపించడం లేదా? లేక కనిపిస్తుంటే కూడా నేను నా ఆలోచనా లోకంలో ఉండి తనని గమనించడం లేదా అని సందేహంగా ఉంది. ఈ రెండోదే నిజమైతే నా ఔదాసీన్యమునకు తానెంతో దురపిల్లి ఉంటుంది. ఈ మధ్య మేధావిగా పరిణతి నొందుతున్నకొద్దీ ఇటువంటి లౌకిక విషయములపై ఆసక్తి తగ్గిపోవుచున్నది. ఏమైననూ సున్నితమైన స్త్రీ హృదయములను కించపరచుట ఉచితము కాదు. లడ్డూ గాడికి చాక్లెట్ ఇచ్చి కూడా కొన్ని యుగములైనట్లుగా అనిపించుచున్నది.

పొద్దున్న మావయ్యగారింటికి వెళ్ళి వరలక్ష్మికి శుభాకాంక్షలు అందజేశాను.

## జనవరి 14 :

సంక్రాంతి పండుగ సందర్భంగా కాలేజీలో తెలుగు సాంస్కృతిక సంఘం ఆధ్వర్యాన జరిగిన విచిత్ర వేషధారణ, ఏకపాత్రాభినయం పోటీలకు ప్రధాన న్యాయ నిర్ణేతగా వ్యవహరించి, బహుమతి ప్రదానం చేయవలసిందిగా ఎడిటరు గారిని ఆహ్వానించాము. ఆయన సంతోషంగా అంగీకరించి కార్యక్రమంలో పాల్గొన్నారు. కవిగా, రచయితగా, జర్నలిస్టుగా, సాంస్కృతిక కార్యకర్తగా కాలేజీలో నాకున్న పలుకుబడిని, ప్రతిష్టని ఆయన ఈ పాటికి గుర్తించే ఉంటారు. ఇకనుంచి ఆఫీసులో నన్ను ఇతోధికంగా గౌరవిస్తారని ఆశిస్తున్నాను. అయితే బహుమతుల

నిర్ణయంలో ఆయన బొత్తిగా పక్షపాతంతో వ్యవహరించడం శోచనీయం.

బుడబుక్కలవాడి వేషం వేసిన వెంకటేశ్వర్రావుకి ప్రైజు ఇచ్చి, ఏకపాత్రాభినయంలో దుర్యోధనపాత్ర పోషించిన సుబ్బారావుకి ప్రైజు ఇవ్వకపోవడం లోనే ఎడిటర్‌గారి ద్వంద్వనీతి బైటపడింది. రామదాసు జైలుసీను చేసిన కుటుంబరావుకి బహుమతి ఇచ్చారు. వెంకటేశ్వర్రావుకి ప్రైజు ఇచ్చేటప్పుడు అతను ప్రతిభావంతుడైన కళాకారుడని ఎడిటరు గారు పొగిడారు. నిజంగా బుడబుక్కలవాడే స్టేజిమీదకి వచ్చాడా అన్నంత సహజంగా ఉన్నాడట అతను. బుడబుక్కలవాడి వేషభాషలని గొప్పగా ఇమిటేట్ చేశాడని తెగ మెచ్చుకున్నాడు ఆయన. మరి సుబ్బారావు కూడా దుర్యోధన పాత్రలో స్వయంగా అన్నగారే స్టేజిమీదికి వేషం వేసుకొచ్చారా అన్నంత గొప్పగా చేశాడు కదా. అతని కెందుకివ్వలేదు? ప్రోగ్రాం అయ్యాక ఆ సంగతే నిలదీసి అడిగాను ఆయన్ని. "చీప్ ఇమిటేషనోయ్. ఒరిజినాల్టీ లేదు. రామదాసు పాత్రలో కుటుంబరావు ఒరిజినాల్టీ చూపించాడు" అన్నాడు ఆయన. బుడబుక్కలవాణ్ణి ఇమిటేట్ చేస్తే అది గొప్ప కళట. అన్నగారిని ఇమిటేట్ చేస్తే అది కళ కాదుట. ఇది ద్వంద్వనీతి కాకపోతే మరేమిటి? రాజకీయంగా అన్నగారంటే ఎడిటర్‌గారికి గిట్టకపోవచ్చు. అంత మాత్రాన అన్నగారిని ఇమిటేట్ చేయడం తప్పనడం బొత్తిగా అన్యాయం. విచిత్ర వేషధారణని, ఏకపాత్రాభినయాన్ని ఒకే కొలబద్దతో కొలవకూడదని ఎడిటరుగారు తన నిర్ణయాన్ని సమర్థించుకొనబూనడం అపహాస్యాస్పదం.

ప్రోగ్రాము అయ్యాక మావయ్య గారింటికి వెళ్ళి భోజనాల దగ్గర ఈ సంగతే చెప్పాను. మావయ్య నవ్వేసి ఊరుకున్నాడు. మావయ్య ఎప్పుడూ అంతే. వర్లక్ష్మిమాత్రం "యువర్ మైండ్ ఈజ్ ఆల్వేస్ ఔటాఫ్ ట్రాక్. సమ్‌థింగ్ ఫండమెంటల్లీ రాంగ్ విత్ యువర్ పెర్‌సెప్షన్" అని ఇంగ్లీషులో వ్యాఖ్యానించింది. నేనేమీ సమాధానమివ్వలేదు. రూముకొచ్చి పెర్‌సెప్షన్ అనే మాటకి డిక్షనరీలో చూసిన తర్వాత అర్థమయింది ఆమె భావం. సోక్రటీసు గారిని ఆయన వైఫ్ కూడా ఇలాగే అనేదిట. అసలు అటువంటి వైఫ్ వల్లనే ఆయన అంత గొప్ప థింకర్ అయ్యాడు. వర్లక్ష్మి వ్యాఖ్యానాలు కూడా దీర్ఘకాలికంగా నా అభివృద్ధికి దోహదం చేయగలవని ఆశించవచ్చు.

## జనవరి 22 :

ఎడిటర్ గారి ప్రోత్సాహ రాహిత్యమువల్ల జర్నలిజం పట్ల ఆసక్తి బొత్తిగా చచ్చిపోతోంది. ఒక్కనాడైనా 'శబాష్ రాంబాబూ' అన్నాడా నోరు తెరిచి. అక్షర లక్షలు చేసే హెడ్డింగులు ఎన్ని పెట్టాను. ఆయన హృదయం స్పందిస్తేగా! "అరసికాయ కవిత్వ నివేదనం శిరసి మాలిఖ" అని మొత్తుకున్నా డు అందుకే వెనుకటికి నాలాంటి మహాకవి. నేనింకా ఆయన

కంటికి ఎడోలసెంట్ చోక్రా లాగా కనిపిస్తున్నాను. నా విలువ ఆయనకి తెలీటం లేదు. కొన్నాళ్ళు సెలవు పెడితే గాని తెలిసిరాదు ఆయనకి. ప్రస్తుతం న్యూసెడిటరుగారు, శంకరయ్య గారు కూడా సెలవులో వున్నారు. ఇదే మంచి అదను. రేపొద్దున్న ఇంటికి వెళ్ళి అడుగుతాను సెలవు. ఆయనకి గుండె అదిరిపోవాలి. చేరినప్పట్నించి ఒక్క పది రూపాయలన్నా ఇంక్రిమెంటు ఇవ్వలేదు కృతఘ్నుడు. తెలుగులో కొత్త పత్రికలు బోలెడు వస్తున్నాయనీ చీఫ్‌సబ్‌గా ఆఫర్లు వస్తున్నాయనీ కూడా చెబుతాను. నా తడాఖా చూపిస్తాను. జై వీరహనుమాన్. అన్నట్టు హనుమంతులవారికి కొబ్బరికాయ కొట్టి చాలా రోజులయింది. అనతికాలం లోనే కొట్టాలి.

## జనవరి 23 :

పొద్దున్న ఎడిటర్ గారింటికి వెళ్ళాను సెలవు అడగడానికి. ఉపోద్ఘాతంగా ఒంట్లో బావుండటం లేదనీ, అత్యంత నీరసంగా ఉంటోందనీ చెప్పాను. సెలవు సంగతి ఇంకా ఎత్తనే లేదు. ఆయనే లంకించుకున్నాడు. "అవునోయ్ మరి ఆరోగ్యం పాడవదూ. ఓ పక్క చదువూ, ఇంకో పక్క ఉద్యోగమూ. ఉద్యోగమైనా ఏదో కాసేపు కాలక్షేపం చేసిపోయేదా ఏమన్నానా? దిక్కుమాలిన చాకిరి ఆయెను. చదువు పూర్తవకుండా ఈ వయస్సులో ఉద్యోగం ఏమిటోయ్ కుర్రాడికి అని మీ నాన్నతో కూడా చెప్పాను. వింటేనా? పరీక్షలు కూడా దగ్గర కొస్తున్నట్లున్నాయి. బాగా చదువుకో. బి.ఏ. పాసయ్యేదాకా ఆఫీసుకు రాకు. వెధవ్వుద్యోగం ఎక్కడికి పోతుంది. అసలు నిజానికి నీకున్న తెలివితేటలకి 'సుజనమిత్ర'లాంటి చిన్న పేపర్లో పనిచేయడం ఏమిటోయ్. మాకంటే ఎలాగూ తప్పదు. వైసైపోయింది. నీకేమిటోయ్ జెమ్‌లాంటి వాడివి. బోల్డు కొత్త పత్రికలొస్తున్నాయి. నువ్వు 'ఊ' అంటే చీఫ్ సబ్బుగా కళ్ళకద్దుకుని తీసుకుంటారు. కావాలంటే నేను రికమెండ్ చేస్తాను. పో.... పోయి రెస్టు తీసుకో" - అంటూ లెక్చరు దంచారు. ఈయన థాట్ రీడింగ్‌లో నిష్ణాతుడా అని ఆశ్చర్యం వేసింది. రియలిస్టిక్‌గా మాట్లాడుతున్నాడా సర్రియలిస్టిగ్గా మాట్టాడుతున్నాడా అని సందేహం కూడా కలిగింది. రెండు రోజులు సి.ఎల్. తీసుకుందామనుకుంటే ఈయన రెండు నెల్లు

తీసుకోమంటున్నాడు. అట్నించి అటే పంపించేయాలని కూడా చూస్తున్నాడు. ఎందుకొచ్చాన్రా ఈయన దగ్గరికి అనుకున్నాను. సమయస్ఫూర్తిగా "అబ్బే ఈ మాత్రం నీరసానికి సెలవు దేనికండీ. ఇవాళ ఒక్కరోజూ ఓ అరగంట ముందుగా వెళ్ళిపోదామని మీ పర్మిషను కోసం వచ్చాను. రేపు ఇంకో అరగంట ఎక్కువసేపు పనిచేస్తాను. పైగా న్యూసెడిటర్ గారు, శంకరయ్య గారు సెలవులో ఉండగా నేను సెలవు తీసుకోవడం మాత్ర సంస్థకి వెన్నుపోటు కదండీ. అందులోనూ నేను డ్యూటీ ఈజ్ గాడ్ అని భావించేవాడిని. నేను అలా చేస్తానా?" అన్నాను. "సరే నీ ఇష్టం. ముందు ఆరోగ్యం చూసుకో. చదువు సంగతి చూసుకో" అన్నాడు. బతుకు జీవుడా అని అక్కడినించి బైటపడ్డాను.

ఇది ఇలా ఉండగా, ఎడిటరు గారు హిపోక్రేట్ అనడానికి మరొక నిదర్శనం ఇవాళ లభించింది. నేనూ, ఎడిటరు గారూ వరండాలో కూచ్చుని మాట్లాడుకుంటుంటే ఓ బుడబుక్కలవాడు వచ్చాడు డబడబ లాడించుకుంటూ. ఆ జానపద కళాకారుణ్ణి మనసారా మెచ్చుకోవడంపోయి ఎడిటరు గారు "ఛీ.... పో బైటికి. పొద్దున్నే న్యూసెన్సు" అంటూ తరిమేశారు. అచ్చమైన బుడబుక్కలవాడు వస్తే పదిపైసలన్నా వెయ్యకుండా తరిమేసి, స్టేజిమీద నకిలీ బుడబుక్కల వాడికి వెండికప్పు ప్రెజెంటు చెయ్యడం ద్వంద్వనీతి అవునా కాదా? ఓ పక్క ఒరిజినాలిటీ ముఖ్యమని చెబుతూ ఒరిజినల్ జానపద కళాకారుణ్ణి నిరాదరించి, ఇమిటేషను చేసినవాణ్ణి గొప్ప కళాకారుడని మెచ్చుకోవడం హిపోక్రసీ అవునా కాదా? మేధావివర్గం వారే ఇలా నిరాదరిస్తే బుడబుక్కల కళ ఎలా వర్ధిల్లుతుంది? మన సంస్కృతి, సాంప్రదాయం ఏమైపోతాయి? మళ్ళీ ఈ పెద్దమనిషే జానపద కళల సంరక్షణ గురించి ఎడిటోరియల్సు రాస్తాడు. నేనేమీ మాట్లాడలేదు. మౌనంగా, మనస్సులోనే ఆ బుడబుక్కల కళాకారుని పట్ల సానుభూతి వ్యక్తం చేశాను.

## ఫిబ్రవరి 1 :

కంచే చేనుమేసినట్లు ప్రభుత్వమే పెట్రోలియం ఉత్పత్తుల ధరలు పెంచడం పట్ల సర్వత్రా నిరసన ధ్వనులు వినవస్తున్నాయి. ఈ చర్యవల్ల దేశంలో అనావృష్టి ఏర్పడి, కరువురక్కసి విలయతాండవం చేసే ప్రమాదం ఉన్నది. కిరసనాయిలు, గ్యాస్ ధరలు పెరగడంవల్ల సామాన్య ప్రజలు వాటికి తిలోదకాలు ఇచ్చి కట్టెలపై ఇతోధికంగా ఆధారపడతారు. కట్టెలకొరకై చెట్ల నరికివేత పెరుగుతుంది. క్రమంగా అడవులు నశించిపోతాయి. తత్ఫలితంగా వర్షాలు తగ్గిపోతాయి: పంటలు పండక కరువు ఏర్పడుతుంది. విదేశాలనుంచి పెక్కువేల కోట్ల రూపాయల విలువగల ఆహార ధాన్యాలను దిగుమతి చేసుకోవలసి ఉంటుంది. కేవలం వందకోట్ల రూపాయల అదనపు వనరుల సమీకరణకై

ప్రభుత్వం పెట్రోలియం ఉత్పత్తుల ధరలు పెంచడం వల్ల దేశం కొన్నివేల కోట్ల రూపాయల విదేశ మారక ద్రవ్యాన్ని నష్టపోవలసి వస్తుంది. ఈ ఐడియాతో ఎడిటోరియల్ రాస్తే బావుంటుందని సలహా ఇవ్వడానికి వెడితే ఎడిటరుగారు ముక్కు చివాట్లు పెట్టారు. "రోడ్ల వెడల్పీకరణ ఏమిటోయ్? రోజురోజుకూ పైత్యం ప్రకోపిస్తోందేమిటి?" అన్నాడు. నగర సుందరీకరణ పథకంలో భాగంగా రాష్ట్రప్రభుత్వం రోడ్ల వెడల్పీకరణను ముమ్మరతరం చేసిందని రాశాను. అందులో తప్పేమిటో అర్థం కావడంలేదు. "దౌర్భాగ్యపు సమాసాలూ నువ్వూ" అంటూ గొణిగాడు ఆయన. ఇంకో ఐటం తీసి "పాత బస్తీలో మత విద్వేషాగ్ని విషకోరలు చాచడం ఏమిటి నీ తలకాయ. అగ్ని విషకోరలతో చాచడం ఏమిటోయ్" అన్నాడు. అగ్నిని పాము కోరలతో పోల్చాననీ, మరీ ప్రోజాయిగ్గా రాస్తే బావుండదని ఉత్ప్రేక్షాలంకారం వాడాననీ చెప్పాను. "డోంట్ ఆర్గ్యూ. గెటవుట్" అంటూ ఆ రెండు ఐటములూ చించి బుట్టలో వేశాడు. న్యూసెడిటరుగారు సెలవు పెట్టినప్పట్నించి నా ఐటములు ఈయన స్వయంగా చూస్తున్నాడు. రోజూ చివాట్లే. న్యూసెడిటరుగారు ఎంత మంచివాడో ఇప్పుడు అర్థమవుతోంది.

జర్నలిజంలో నాకు ఓనమాలు దిద్దించింది ఎడిటరు గారే కదా. ఇవాళ నేను ఇంతటి వాణ్ణి అయ్యానంటే ఆయన చలవే కదా. ఆయన చెప్పిన సూత్రాల ప్రకారం రాస్తున్నా తప్పులు పడతాడు ఆయన. రెండు సంస్కృత పదాలతో సమాసం చెయ్యచ్చు. రెండు తెలుగు పదాలతో చెయ్యచ్చు. ఒక తెలుగు పదాన్ని ఇంకో సంస్కృత పదంతో చేర్చినా ఫరవాలేదు. కాని సంస్కృత పదానికి పక్కన తెలుగు పదాన్ని చేర్చి సమాసం చేయకూడదు. ఇదీ ఆయన నేర్పిన పాఠం. ఉదాహరణకి మామిడి పండు అనచ్చు. లేదా చూతఫలము అనచ్చు. మామిడి ఫలము అన్నా ఫర్వాలేదు. కాని చూతపండు, చూతకాయ అనకూడదు. ఇదీ ఆయన చెప్పినదే. ఈ సూత్రప్రకారం వెడల్పు అనే తెలుగుమాట, ఈకరణ అనే సంస్కృతం మాట కలిపి వెడల్పీకరణ అని ఎందుకనకూడదు - నిగ్గదీసి అడిగేవాడు లేకగాని. కమ్యూనిస్టేతర (కమ్యూనిస్ట్ + ఏతర) అనేది దౌర్భాగ్యపు సమాసం కాదా? మరి దాన్ని ఎడిటోరియల్లో కూడా రాస్తున్నారే! ఇదొరుకు ఓసారి ఈమాటే అడిగితే. 'శ్రవణ సుభగత్వం' ముఖ్యమని వాదించాడు ఆయన. అంటే చెవికి ఇంపుగా ఉండాలట. అందరూ వాడేస్తుంటే అలవాటై పోతుందని కూడా ఆయనే అన్నాడు. వ్యవహార పదంబులు యథాతథంబులుగా గ్రాహ్యంబులు అని చిన్నయ సూరిగారు చెప్పినట్లు గుర్తు. వెడల్పీకరణని అలవాటు చేస్తే శ్రవణ సుభగంగానే ఉంటుంది. ఆ మధ్య శంకరయ్య గారు రైళ్ళ డీసిలీకరణ అని రాస్తే ఎడిటరుగారు కోప్పడ్డారు. ఆ మాట పేపర్లో అచ్చయిపోయింది కూడా.

యద్యదా చరతి శ్రేష్ఠః అని గీతలో చెప్పినట్లు 'సుజనమిత్ర'లో వాడారు కదాని

ఇతర పత్రికల వాళ్ళూ వాడారు ఆ మాటని. వాళ్ళు వాడారు కదాని శంకరయ్య గారు మళ్ళీ రాస్తే ఎడిటరుగారు చూసి కూడా కోప్పడలేదు. రేపో ఎల్లుండో ఆయన కూడా రాస్తాడు. గాబట్టి వ్యవహారిక భాషలో ఇది తప్పు అనే అర్హత ఎవ్వరికీ లేదు. దీన్ని కొంచెం ఎలాబరేట్ చేసి వ్యాసం రాసి ఏదైనా పెద్ద పత్రిక్కి పంపాలి.

## ఫిబ్రవరి 8 :

సాయంత్రం కాలేజీ ఫంక్షన్‌లో భాస్కర్రావు కవిత్వం చదివాడు. సారథి పాట పాడాడు. జనం కరతాళధ్వనులు చేశారు. ఆ ప్రశంసలన్నీ తనకే నన్నట్టు భాస్కర్రావు గర్వంగా పోజు పెట్టాడు. ఎందుకంటే సారధి పాడినది భాస్కర్రావు పాటే. తర్వాత నేనొక పరిశోధనా వ్యాసం చదివాను. స్టూడెంట్సు నవ్వుతూ చప్పట్లు కొట్టారు. నేను తీసుకున్న సబ్జెక్టు సీరియస్‌దే. అయినా ఎందుకు నవ్వారో. అసంకల్పిత జోకు లేవైనా ఉన్నాయో ఏమో. ఏమైనప్పటికీ మొత్తానికి సారధి, భాస్కర్రావుల కంటే బాగా రంజింపజేశాను సభాసదులని. చివరికి పప్పు చారుమతి కర్ణాటక సంగీత కచేరి చేస్తోంటే స్టూడెంట్లు ఈలలు కొడుతూ గోల చేశారు. అయినా అమ్మాయి పాట ఆపక పోయేసరికి అందరూ లేచి వెళ్ళి పోయారు. నేను మాత్రం శ్రద్ధగా



విన్నాను. ప్రతి పాటకీ చప్పట్లు కూడా కొట్టాను. "అంత భయంకరంగా అపస్వరాలు పాడుతుంటే ఎలా వింటున్నావోయ్. లే పోదాం" అంటూ సారధి సతాయించడం మొదలెట్టాడు. నేను అతనితో ఏకీభవించలేదు. సగంలో లేచి వెళ్ళి పోవడం సాటి కళా జీవిని అవమాన పరచడమేనని చెప్పాను. మన ప్రోగ్రాముకు అమ్మాయి తప్పట్లు కొట్టినప్పుడు అమ్మాయికి తప్పట్లు కొట్టవలసిన నైతిక బాధ్యత మనకు ఉన్నదని అతనికి బోధించాను. అయినా అతను ససేమిరా కన్విన్సు కాలేదు. "అమ్మాయి ఎన్ని అపస్వరాలు పాడితే మనకు దేనికి? సాహిత్యం గొప్పగా ఉందా లేదా? కర్నాటక సంగీతం సాహిత్య ప్రధానమైనదని నువ్వేనా అన్నది? ఇప్పుడు ప్లేటు ఫిరాయిస్తున్నావా?" అని కోప్పడి అతన్ని కూచ్చోబెట్టాను.

"నిధి చాలా సుఖమా లేక రాముని సన్నిధి చాలా సుఖమా? నిజముగ తెలుపుము మనసా" ఆహా ఎంత గొప్పగా అన్నాడు త్యాగరాజులవారు! పాటైపోగానే తప్పట్లు కొడదామని సారధి చెయ్యి విడిచి పెట్టేసరికి అతను గబుక్కున లేచి బైటికి పరుగెత్తాడు. నేను మాత్రం సీట్లోంచి లేవలేదు. తర్వాత చారుమతి వెరైటీ కోసం "మనసున మల్లెల మాలలూగెనే" అందుకుంది.





"ఓహో ఏమిపాట" అంటూ తప్పట్లు కొట్టేసరికి అమ్మాయి కళ్ళు కృతజ్ఞతా పూర్వకంగా మెరిశాయి. చారుమతి భానుమతిని ఇమిటేట్ చెయ్యకుండా వర్జినాలిటీతో ఇంప్రువైజ్ చేసి పాడింది. ఆహా. మల్లీశ్వరి.... ఎంత గొప్ప కళాఖండం! దేవులపల్లి రాఘవాచారిగారు ఏం రాశారు! అందులో ప్రతి పాటా అనర్ఘ రత్నమే కదా? 'పిల్లి బావకు పెళ్ళంట కోతుల తోటా విడిదంట' సాటిలేని మేటిపాట. పెండ్యాల రాజేశ్వరరావుగారి మ్యూజిక్కు నభూతితో నభవిష్యతి! కచేరి అయ్యే సరికి హాల్లో నేను, చారుమతి, మైకు అబ్బాయి తప్ప ఇంకెవ్వరూ లేరు. నా కళా హృదయానికి చారుమతి జోహారులర్పించి ఉంటుందనడంలో అతిశయోక్తి లేదు. బైటికి రాగానే సారధి పట్టుకున్నాడు. "నీ దుంపతెగ ఎల్లా విన్నావయ్యా అంత మంచిపాటని అల్లా ఖూనీ చేస్తుంటే" అన్నాడు. "మంచిపాట అని ఓ పక్కన పొగుడుతూనే ఎలా విన్నానంటావేమిటి? స్వవచో విఘాతం, లేక ఆత్మ వైరుధ్యం అంటారు దీన్నే" అన్నాను.

రూముకొచ్చి ఆరుబైట వెల్లికిలా పడుకుని ఆకాశంలోకి చూస్తుంటే మల్లీశ్వరి మధుర స్మృతులు మనసున మాల లూగించాయి. ఆహా...శ్రీ కృష్ణదేవరాయల కాలంలో మరదళ్ళు ఎంత ప్రేమగా ఉండే వారు? అది స్వర్ణయుగమని ఊరికే అన్నారా? ఈ కాలపు అమ్మాయిలైతే బావ అనైనా లేకుండా ఇంగ్లీషు మాట్లాడేస్తారు. మల్లీశ్వరిని చూసి వరలక్ష్మి నేర్చుకోవలసింది ఎంతైనా ఉంది.

ఫిబ్రవరి 25 :

భరతనాట్య రాణి రుక్మిణీదేవి గారు మనకిక లేరు. ఆవిడంత గొప్ప నర్తకి ఈ శతాబ్దంలోనే లేరుట. ఆవిడ పోయిన తర్వాత గాని ఆ సంగతి తెలీలేదు మనకి. కిందటి వారం జిడ్డు గారు పోయినప్పుడూ అంతే. చచ్చిపోయినప్పుడు గాని ఈ డైలీ పత్రికలు వాళ్ళని గురించి రాయవు. జర్నలిస్టుగా కళారంగానికి ఉడతాభక్తితో సేవచేద్దామంటే ఎడిటరు గారు బొత్తిగా ఛాన్సు ఇవ్వడంలేదు. కర్ణాటక సంగీతాన్ని గురించి, హిందూస్తానీ గురించి రాస్తే తోలు వచ్చేస్తానని బెదిరించాడు ఇదివరకే. అందుకని పోనీ వెస్టర్న్ క్లాసికల్ గురించి రాద్దామనుకున్నాను. సారథి అప్పుడప్పుడూ బెతోవెన్, మోజార్ట్ల గురించి చెబుతూ ఉంటాడు కదా. సింఫనీ, సొనాటా, మేజర్ స్కేలు, మైనరు స్కేలు అనే పారిభాషిక పదాలు కూడా విన్నాను.

అందుకని ఎడిటరుగారిని అదరగొట్టేద్దామని సంకల్పించాను. నిన్న మాక్స్ ముల్లర్ భవన్‌లో కచేరీ జరిగితే వెళ్ళాను. ప్రోగ్రాం షీటులో చూస్తే బెతోవెన్, మోజార్ట్ల పేర్లు కనిపించాయి. ఆహా నా అదృష్టం పండింది కదా అనుకున్నాను. కచేరీకి సారథి రాలేదు పూర్ ఫెలో. బెతోవెన్, మోజార్ట్ల అద్భుత కచేరీ అని హెడ్డింగు పెట్టి సమీక్ష రాసి న్యూసెడిటరుకిస్తే ఆయన తిన్నగా తీసుకెళ్ళి ఎడిటరుగారి చేతిలో పెట్టాడు. ఎడిటరుగారు కబురు చేస్తే వెళ్ళాను. "బెతోవెన్, మోజార్ట్ గొప్పగా వాయించారేవిటోయ్" అంటూ ప్రారంభించాడు ఆయన.

'ఓ... పరమాద్భుతంగా వాయించారండి. మీరు వచ్చి ఉండాల్సింది' అన్నాను. "మొత్తానికి లక్కీ ఫెలోవోయ్. పద్ధెనిమిదో శతాబ్దపు మహామహులు ఇరవయ్యో శతాబ్దంలోకి వచ్చి వాయిస్తే వినే మహాభాగ్యం కలిగింది" అన్నాడు. చచ్చాంరా దేవుడా అనుకున్నాను. అక్కణ్ణించి ధారా వాహికంగా పావుగంట సేపు దులిపాడు. బెతోవెన్, మోజార్ట్ త్యాగరాజు కాలపువాళ్ళుట. నిన్నటి కచేరీలో వాళ్ళ కంపోజిషన్సు ఇంకెవరో వాయించారట. ప్రోగ్రాం కాయితంలో ఇంకేవో పేర్లు కనిపించాయి గాని వాళ్ళెవరో పక్కవాద్యగాళ్ళేమోననుకున్నాను. ఫోర్ వర్క్స్ బై బెతోవెన్, త్రీవర్క్స్ బై మోజార్ట్ అని క్లియర్‌గా ఉంటే చదివి, అంత గొప్పవాళ్ళు స్వయంగా వచ్చి సిటీలో కచేరీ చేస్తుంటే సమీక్ష రాయకపోతే బావుండదని ఇన్విటేషన్ లేకపోయినా ఇనీషియేటివ్ తీసుకుని వెళ్ళాను. కొంచెం ఆలస్యంగా వెళ్ళాను. అప్పటికే పరిచయాలు అయిపోయాయి. అందుకని వాళ్ళలో ఒకరు బెతోవెన్, ఇంకోరు మోజార్ట్ అనుకున్నాను. ఈ మాటే కన్విన్సింగ్‌గా చెప్పాను ఎడిటర్‌గారికి. ఇలాంటి పిచ్చి రాతలు రాస్తే నాన్నగారితో చెప్పి ఎర్రగడ్డ పిచ్చాస్పత్రిలో చేర్పిస్తానన్నాడు. సమీక్షని చించి బుట్టలో వేశాడు.

బైటికి రాగానే న్యూసెడిటరుగారు అడిగారు "మెచ్చుకున్నారా ఎడిటరుగారు?" అంటూ.



"కొంచెం అభిప్రాయభేదం వచ్చింది. అందుకే వెయ్యద్దను కున్నాం" అని చెప్పాను. "అవును. కీర్తి శేషులు వచ్చి కచేరీ చేయడం అంటే కాంట్రవర్షియల్‌గా ఉంటుంది కదా మరి" అన్నాడాయన. ఓరినీ ఈయన క్కూడా తెలుసునన్న మాట. తెలిసే ఎడిటరుగారికి చూపించాడన్న మాట.

మార్చి 10 :

సాయంత్రం మావయ్యగారింటికి వెళ్ళాను. 'సుజన మిత్ర' ఉద్యోగానికి రాజీనామా ఇద్దామనుకుంటున్నానని మావయ్యతో చెప్పాను.

"అసలు నీకు అపాయింట్ మెంటు ఎప్పుడిచ్చారు?" అని అడిగాడు ఆయన.

"అపాయింట్‌మెంట్ లెటర్ లేక పోయినా అప్రెంటిస్ సబ్ ఎడిటరుగా పని చేస్తున్నాగదా. ముగ్గురు అప్రెంటిసులలో నేనే సీనియర్ మోస్ట్‌ని" అని చెప్పాను.

"రాజీనామా దేనికి? ఏదైనా గొడవ జరిగిందా" అనడిగాడు మావయ్య.

'సుజనమిత్ర'లో అంతర్గత ప్రజాస్వామ్యం కొరవడిందని చెప్పాను. కాంగ్రెస్ (ఐ)లో ఇంటర్నల్ డెమోక్రసీకి తిలోదకాలిచ్చారని ఓ పక్క రాజీవ్‌గాంధీని విమర్శిస్తూ ఎడిటోరియల్సు రాస్తూనే ఎడిటర్ గారు, ఆయన మద్దతుదారులు ఆఫీసులో నియంతృత్వ పోకడలు పోతున్నారని చెప్పాను.

ఆఫీసులో జరిగిన వ్యవహారమంతా వివరించాను. "అగ్రరాజ్యాలు ఆయుధపు పందాలకి స్వస్తి చెప్పాలని రాజీవ్‌గాంధి విజ్ఞప్తి చేసినట్లు రాస్తే న్యూసెడిటరు తప్పు పట్టాడు. ఆయుధ పోటీ అని రాయాలట. పందెం అని రాయకూడదట. డిక్షనరీ తీసి చూపించాను. అయినా ఒప్పుకోలేదు ఆయన. హార్స్ రేసెస్ అంటే గుర్రప్పందాలనే రాస్తున్నాం కదా అని వాదించాను. ఆయన కోపంగా 'నో ఆర్గ్యుమెంట్ తప్పంటే తప్పే. ఆయుధ పోటీ అని రాయి' అన్నాడు. సరేనని ఊరుకున్నాను. హుస్సేన్‌సాగర్‌లో మిడిల్ ఏజ్డ్ మాన్ శవం దొరికిందని వార్త వస్తే మధ్యయుగం నాటి మనిషి శవం దొరికిందని రాశాను. అది చూసి నానా చివాట్లు పెట్టాడు. మధ్య వయస్కుడి శవం అని రాయాలట. ఇది వరకోసారి సందేహం వచ్చి అడిగితే ఆయనే స్వయంగా చెప్పాడు మిడిల్ ఏజెస్ అంటే మధ్యయుగం అని. తను చెప్పినట్టు రాస్తే కూడా తప్పని చివాట్లు పెడతాడు. బొత్తిగా మాట నిలకడలేదు ఆయనకి. అధికారం ఉంది గదా అని నిరంకుశంగా ప్రవర్తిస్తున్నాడు. ఆయనకి ఎడిటరు గారి సపోర్టు. మిడిమేలపు దొరను గొల్చి మిడుగుట కంటెన్ గ్రక్కున విడువంగ వలయు గదరా సుమతీ అన్నారు కదా. అందుకే రిజైన్ చేయాలనుకుంటున్నాను" అని చెప్పాను. మావయ్య, వర్లక్ష్మి ఏకగ్రీవంగా నవ్వడం మొదలు పెట్టారు.

"మీ ఎడిటరు, న్యూసెడిటరు నీతో ఎలా వేగుతున్నారు బావా" అంది వర్లక్ష్మి. నా ఆవేదన తనకి నవ్వులాటగా ఉంది. నేటి మరదలే రేపటి సతీమణి కదా. నా కష్టనష్టాలతో తాదాత్మ్యం చెందడం పోయి అలా వేళాకోళం చెయ్యడం బాధాకరంగా ఉంది.

అత్తయ్య మాత్రం సానుభూతి ప్రకటించింది. "ఇది కాకపోతే బోలెడు పత్రికలు ఊళ్ళో. ఆ బియ్యే కాస్తా పూర్తి చేశావంటే ఎవళ్ళో ఒకళ్ళు కళ్ళకద్దుకుని తీసుకుంటారు నిన్ను" అని ధైర్యం చెప్పిందావిడ. ఆవిడ ఎప్పుడూ నాతో ఏకీభవిస్తూ ఉంటుంది. అయితే పాపం ఆవిడకి ఇంత ఇంటలెక్చువల్ విషయాలు అర్థం కావు. అర్థమైతే ఇంకెంత మెచ్చుకునేదో!

మార్చి 21 :

టీచర్ల సమ్మె కారణంగా ఇంటర్మీడియట్ పరీక్షల్లో మూకుమ్మడి కాపీలు జరిగాయని పలువురు రాజకీయ నాయకులు ఆందోళన వ్యక్తం చేశారు. నిజానికి ఇందులో ఆందోళన చెందవలసిందేమీ లేదు. విద్యావిధానంలో, పరీక్షా విధానంలో సమూల సంస్కరణలు తీసుకురావాలని చాలా కాలంగా ఆలోచిస్తున్నది కదా మన ప్రభుత్వం. పరీక్షల్లో ఓపెన్ బుక్ సిస్టమ్ ప్రారంభించాలన్న యోచనకూడా ఉన్నది కదా. అటువంటి సంస్కరణలకు ఈ మూకుమ్మడి కాపీలు నాంది కాగలవనడంలో



సందేహం లేదు. భాస్కర్రావు నాకో పాయింటు అందిస్తే నేను భాస్కర్రావుకో పాయింటు అందిస్తాను. పాయింటు తీసుకున్నా దాన్ని డెవలప్ చేసి ఎస్సే రాయాల్సింది నేనేగదా. అందులో నా ప్రతిభ వెల్లడవుతుంది కదా. పైగా ఇలా పరస్పర సంప్రతింపుల ద్వారా పరీక్షలు రాయడం వల్ల విద్యార్థుల మధ్య సహకార భావం పెంపొందుతుంది. హింసా ప్రవృత్తి తగ్గుతుంది. పరీక్షలు శాంతియుతంగా జరుగుతాయి. ఇన్విజిలేటర్ల ఆవశ్యకత ఉండదు. ఖర్చు తగ్గుతుంది.

నా చిన్నతనంలో సమ్మె చేయడం కార్మికులకు, విద్యార్థులకు మాత్రమే జన్మహక్కుగా ఉండేది. ఇప్పుడు టీచర్లు కూడా చేయడం హర్షణీయం. ఇంకా కొన్నాళ్ళకి మంత్రులు కూడా చేస్తారేమో. సమ్మెలు ప్రజాస్వామ్యానికి ప్రతీకలు. ప్రజాస్వామ్యం పరాకాష్ఠ నందుకొంటే ప్రధాని, రాష్ట్రపతి కూడా సమ్మె చేస్తారు.

నిజానికి ప్రజాస్వామ్యంలో ప్రైవేటు రంగానికి తావులేదు. విద్యాకళా సాంస్కృతిక రంగాలను సైతం జాతీయం చేయుట అవసరం. ఇప్పుడు ఏడాదికోసారి ఉగాదికి గవర్నమెంటు కవి

సమ్మేళనాలు జరుగుతున్నాయి కదా. కుటుంబ నియంత్రణం, ప్రణాళికా ప్రగతి మున్నగు వాటిపై గవర్నమెంటు డాన్సు ప్రోగ్రాంలు, గవర్నమెంటు పాటకచేరీలు, గవర్నమెంటు నాటకాలు జరుగుతున్నాయి కదా. వీటిని ఇంకా విస్తృత పరచి అల్టిమేట్‌గా ఆయా కళలను పూర్తిగా ప్రభుత్వరంగం కిందికి తీసుకురావాలి. పత్రికలను కూడా జాతీయం చేయాలి. 'సుజనమిత్ర'తో సహా. అప్పుడు ఎక్స్‌ప్లాయిటేషను ఉండదు. నిరంకుశ ధోరణులుండవు. అన్నగారిపై పిచ్చిపిచ్చి విమర్శలకు వీలుండదు. మేమంతా గవర్నమెంటు జర్నలిస్టులమైపోతాము. గవర్నమెంటు జీతాలు వస్తాయి. ప్రమోషన్లు, ఇంక్రిమెంట్లు ఆటో మేటిగ్గా వస్తాయి.

మార్చి 28 :

బొంబాయి ఏర్‌పోర్టులో కస్టమ్స్ అధికారులు ఒక విదేశీయుడినుంచి ఐదు లక్షల రూపాయలు విలువగల కథానాయికను స్వాధీనం చేసుకున్నారు. న్యూసురాసి, 'విమానాశ్రయంలో కథానాయిక పట్టివేత' అని హెడ్డింగు పెట్టి కంపోజ్ కిచ్చి వచ్చాను. న్యూసెడిటరు సీట్లో లేడు. అందుకని తిన్నగా ప్రెస్సుకి పంపేశాను. రూం కొచ్చి ఏడు గంటల న్యూసు వింటే అందులో గంజాయి పట్టివేత అని చెప్పారు. 'ఔరా ఆకాశవాణి న్యూసు బులెటిన్ల స్థాయి ఎంత దిగజారిపోయింది' అని విచారించాను. ఆ మాటే భాస్కర్రావుతో అన్నాను. "చూశావుటోయ్. ట్రాన్స్ లేషన్ ఎంత దౌర్భాగ్యంగా ఉందో. విదేశీయుడు వెంటబెట్టుకొచ్చిన హీరోయిన్ని పట్టుకుంటే గంజాయి పట్టివేత అని చెబుతున్నారు" అన్నాను.

"నీ బొంద. నీ ఇంగ్లీషూ సరే, నువ్వూ సరే. హీరోయిన్ కాదు హెరాయిన్. అంటే గంజాయి. కొంపదీసి కథానాయికను పట్టుకున్నారని రాశావేమిటి?" అన్నాడు భాస్కర్రావు.

'చచ్చాంరా దేవుడా' అనుకున్నాడు. "అబ్బెబ్బే ఓ అప్రెంటిస్ రాశాడోయ్. హీరోయిన్ అంటే ఏమిటండీ అనడిగాడు. కథానాయిక అని చెప్పాను. ఈ అప్రెంటిస్‌లతో వెధవ తలనొప్పోయ్" అన్నాను.

తర్వాత టీ తాగివస్తానని చెప్పి రోడ్డుమీద పడి ఆటో ఎక్కాను. ఫైనల్ ప్రూఫులోనైనా పట్టుకుని పేపర్లోకి ఎక్కకుండా చూడాలని రొప్పుకుంటూ ఆఫీసుకి వెళ్ళాను. న్యూసెడిటరు కంట బడకుండా తిన్నగా ప్రెస్సులోకి వెళ్ళాను. కాని అప్పటికే ఎడిషను ప్రింటైపోయింది. హడావిడిగా పేజీలు తిరగేశాను. గంజాయి అనే పడింది. "హీరోయిన్ కోసం వెతుకుతున్నారా? న్యూసెడిటరు గారు లాస్ట్ మినిట్‌లో పట్టేసుకున్నారు లెండి" అన్నాడు చీఫ్ ప్రూఫ్ రీడరు. రేపు ఆఫీసులో కనిపిస్తే కంపల్సరీ రిటైర్మెంట్ చేయించేస్తాడు. కొన్నాళ్ళు మొహం చాటు వేయడం మంచిది. పరీక్షల వంకతో లీవ్ పెట్టాలి ఓ వారం పది రోజులు.

నేను రాసే సంగీతం సమీక్షలు పేపర్లోకి ఎక్కకుండా చూడాల్సిందని న్యూసెడిటరు దగ్గర్నించి ప్రూఫ్ రీడర్ల దాకా అందరికీ ఎడిటరు గారు ఆజ్ఞలు జారీ చేసినట్లు విశ్వసనీయంగా తెలియవచ్చింది. పోనీ జనరల్ న్యూసే రాద్దామంటే ఈ వెధవ ఇంగ్లీషుతో చచ్చే చావుగావుంది. రిపోర్టింగ్ లైనులోకి పోతే బావుండేట్టు ఉంది. ఇన్వెస్టిగేటివ్ రిపోర్టింగ్ అయితే బెస్టు. అరుణ్‌షౌరీలాగా అదరగొట్టేయ్యచ్చు. అంతులే లాంటి వాళ్ళని, లేకపోతే ఋగ్వేదాన్ని, ఖురాన్‌నీ, గురుగ్రంథ సాహెబ్‌ను సమన్వయపరస్తూ ఆర్టికల్స్ రాయచ్చు.

ఏప్రిల్ 8 :

పదిరోజుల తర్వాత ఇవాళ ఆఫీసులో అడుగు పెట్టాను. నేను రావడం కిటికీలోంచే చూశాడు కాబోలు వెంటనే పిలిపించాడు ఎడిటరుగారు. ఇంకా ఈయన మరిచిపోయినట్టులేదు. జై వీరాంజనేయ అనుకుంటూ వెళ్ళాను.

'కూచ్చో' అన్నాడు. ఇదివరకెప్పుడూ ఆయన కూచ్చోమనలేదు. ఏదో మూడిందనుకున్నాను.

"నువ్వసలు జర్నలిజంలో ఉండదలుచుకున్నావా?" అనడిగాడు. "జర్నలిజానికి నా జీవిత శేషాన్ని అంకితం చెయ్యాలని కృత నిశ్చయంతో ఉన్నాను" అని చెప్పాను.

"పడికట్టు పదాలు బాగానే వంటబట్టాయి. రాసేవన్నీ తప్పుల తడకలు" అన్నాడు. "జర్నలిజంలో ఉండదల్చుకుంటే నేను చెప్పే ముఖ్య సూత్రాలు శ్రద్ధగా విను. వింటే చాలదు. ఆచరణలో పెట్టాలి. ఇంకో రెండు మూడు నెల్లు చూస్తాను. నీలో ఇంప్రూమెంట్ కనిపించకపోతే మీ నాన్నకి ఓ కార్డు రాసి పడేసి నిన్ను పంపించేస్తాను. ఎల్లకాలం నిన్ను భరించడం నా వల్ల కాదు" అన్నాడు.



ఆ తర్వాత పాయింట్ నంబర్ వన్, టూ అంటూ చెప్పుకొచ్చాడు. "ఫస్టు పాయింటు నీకు తెలీని దాన్ని తెలిసినట్టుగా దబాయించకు. పాఠకులంతా వెర్రి వెంగళప్పలని అనుకోకు. నీ దబాయింపు రాతలు చూసి వాళ్ళు నిన్ను మేధావిగా గుర్తిస్తారనుకోవడం మానెయ్యి. నువ్వు పాఠకులనే కాదు, నన్నే దబాయించాలని చూస్తుంటావు. చివరికి ఫూలయ్యేది నువ్వే. నువ్వు ఫూలైనా ఫర్వాలేదు. కాని మన పేపరు పరువుపోతుంది. అందుకని నీకు తెలీని దాన్ని తెలీదని ఒప్పేసుకో. అందరికీ అన్ని విషయాలు తెలియక పోవడంలో తప్పులేదు. నాకు తెలీని విషయాలు సవాలక్ష ఉన్నాయి. మనకు తెలీని వాటిని గురించి రాయాల్సివచ్చినప్పుడు తెలిసిన వాళ్ళని అడిగి రాయాలి. అడగడంలో నామోషీ ఏం లేదు. ఏదైనా పదానికి అర్థం తెలీకపోతే డిక్షనరీ తీసిచూడు. చూసినా

అర్థం కాకపోతే అప్పుడు పక్కవాళ్ళని అడుగు. అంతేగాని ఊహించి రాయకు".

"పాయింట్ నంబరు టూ – ఇంగ్లీషులో ఉన్నది మనకి అర్థమైతే చాలదు. అవతలి వాడికి అర్థమైయ్యేట్టు రాయాలి. అంటే ఏం చెబుతున్నామనేదే కాక ఎలా చెబుతున్నామనేది కూడా చాలా ముఖ్యమన్నమాట. నువ్వు ఏం చెప్పాలనుకుంటున్నావో పాఠకుడికి అర్థం కాకపోతే చెప్పి ప్రయోజనమేమిటి? వాక్య నిర్మాణం సరళంగా, అరటి పండు వల్చి చేతిలో పెట్టినట్టుండాలి. అనువాదం మాటకి మాట పేర్చినట్టు ఉండకూడదు. స్వేచ్ఛానువాదం చెయ్యాలి. అయితే ఒరిజనల్లోని స్పిరిట్ పోకుండా చూడాలి. కాస్త చమత్కారం, కొంచెం ఇమాజినేషన్ ఉండాలి. అన్ని మాటలూ డిక్షనరీలో ఉండవు. ఇంగ్లీష్ భాషా స్వరూపం రోజు రోజుకీ మారిపోతోంది. మోడ్రన్ ఎక్స్‌ప్రెషన్స్ ఎప్పుడూ అబ్జర్వ్ చేస్తూ ఉండాలి. వాటిని తెలుగులోకి తేవడానికి కొంచెం ఊహా శక్తి అవసరం. ఇప్పటికి ఈ రెండు సూత్రాలూ జాగర్తగా పాటించు. నీ పెర్ఫార్మెన్స్ చూసి తర్వాత మళ్ళీ చెబుతాను" అన్నాడు ఆయన.

"ఇలా విడమరచి చెప్పేవాళ్ళు లేకనే ఇంతకాలం అజ్ఞానంలో ఉండిపోయాను. ఇక నుంచి మీ అడుగుజాడల్లోనే నడుస్తాను" అని చెప్పాను.

"మీతో డిస్కస్ చేయకుండా ఏ సబ్జెక్ట్ మీదా ఏమీ రాయను. సంగీతం, నృత్యం మున్నగు విషయాలపై మీతో డిస్కస్ చేయడానికి అప్పుడప్పుడూ ఓ పావుగంట అవకాశం ఇవ్వండి" అని వినయపూర్వకంగా అభ్యర్థించాను.

"అయాం ఆల్వేస్ ఎవైలబుల్ టూ యూ" అని హామీ ఇచ్చాడు ఆయన.

బతుకుజీవుడా అని బైటపడ్డాను. ఓ పెద్ద గండం గడిచింది. ఉద్యోగం ఊడిపోతుందనుకున్నాను. పెద్దవాడు చెబుతుంటే ఎదురు వాదించడం బావుండదని ఊరుకున్నాను గాని ఆయన అభిప్రాయాలతో ఎంత మాత్రం ఏకీభవించలేకపోయాను. అసలు జర్నలిజమంటేనే దబాయింపు అని నేననుకుంటుంటే ఈయన అది పనికి రాదంటాడేమిటి? మొదటి పాయింటులోనేమో ఊహించి రాయద్దన్నాడు. రెండో పాయింటులో ఇమేజినేషన్, ఊహాశక్తి అవసరమన్నాడు. అది స్వవచో విఘాతం కదా. మనకు అర్థమైతే చాలదు అవతలి వాడికి అర్థమయ్యేట్టు చెప్పగలగాలి అన్నాడు. ఆయన చెప్పింది నాకు అర్థమై చావలేదే! అది ఆయన తప్పా, నా తప్పా? ఏమిటో ఆయన థియరీ అంతా కన్‌ఫ్యూజనిస్టిక్‌గా ఉంది. – ఇంప్లిమెంటేషనరీగా లేదు.

ఏప్రిల్ 16 :

ఎడిటరు గారు చెప్పిన రెండు సూత్రాలను పాటించడానికి శాయశక్తులా కృషి చేస్తున్నాను.

మాట మాటకీ మాటిమాటికీ డిక్షనరీ చూస్తున్నాను. పక్కవాళ్ళని, లేదా న్యూసెడిటరుగారిని పదే పదే సంప్రదిస్తున్నాను. అందరూ విసుక్కుంటున్నప్పటికీ మొత్తం మీద ఎడిటరుగార్తో చివాట్లు తినకుండా రోజులు నెట్టుకొస్తున్నాను. ఇందులో సాధక బాధకాలు చాలా వున్నాయి. అడుగడుగునా సందేహాలే. నాకు తెలీనిది తెలీదని తెలుసుకుంటే గదా తెలుసునను కుంటున్న వాడిని అడిగి తెలుసుకునేది? ఆ తెలుసుననుకుంటున్న వాడు తెలుసుననుకుంటున్నది కరెక్టో కాదో ఎలా తెలుస్తుంది? పైగా శంకరయ్య గారిని ఏదడిగినా "అది ఆ కాంటెక్స్టును బట్టి ఉంటుంది" అంటాడు. దాంతో మరీ సందేహాలు ఎక్కువవుతున్నాయి. ఉదాహరణకు హార్స్ అంటే గుర్రము అని నా అభిప్రాయము. ఎందుకైనా మంచిదని శంకరయ్య గారి నడిగితే "అది ఆ కాంటెక్స్టును బట్టి ఉంటుంది అన్నాడాయన. "గుర్రము అనవచ్చు. అశ్వము అనవచ్చు. హయము అనవచ్చు. ఆ కాంటెక్స్టును బట్టి ఇంకేదైనా అనవచ్చు" అని వివరించాడు. పార్లమెంటులో హార్స్ ట్రేడింగ్ అనే మాటవస్తే 'పార్లమెంటులో గుర్రాల వ్యాపారానికి స్వస్తి చెప్పించిన చర్య' అని రాశాను. ప్రూఫ్ రీడరుకి అనుమానం వచ్చి న్యూసెడిటరుకి చూపించాడు. ఆయన ఒకటే చివాట్లు. హార్స్ అంటే గుర్రమే గాని హార్స్ ట్రేడింగ్ అంటే మాత్రం గుర్రాల వ్యాపారం కాదుట. పార్టీలు ఫిరాయించడంట. ఈ లెక్కన డాగ్ అంటే కుక్క అనీ, క్యాట్ అంటే పిల్లి అనీ రాయడానికి క్కూడా భయంగా ఉంది. ది క్యాట్ ఈజ్ ఔట్ అని ఓ వాక్యం వచ్చింది. పిల్లి బైటపడిందని రాయబోయి న్యూసెడిటరు గారిని అడిగాను. బండారం బైటపడిందని రాయమన్నాడు ఆయన. అడగడం మంచిదైంది. లేకపోతే చివాట్లు తగిలేవి. ఇంగ్లీషంత దిక్కుమాలిన భాష ఇంకోటిలేదు. పిల్లికీ, బండారానికి ఏమైనా సంబంధం ఉందా? కాని ఆశ్చర్యమేమిటంటే ఇవన్నీ వీళ్ళకి ఎలా తెలుస్తున్నాయా అని.

## ఏప్రిల్ 24 :

"తనంత దావలచి వచ్చిన జుల్కన గాదె యేరికిన్". అందుకే వర్లక్ష్మికి నేనంటే అంత చులకన. ఆమె ఎటెన్షన్ డ్రా చేసి నా వైపు తిప్పుకోవడానికి ఒక వశీకరణ సూత్రం కనుగొన్నాను. అసలు తనవంక చూడకూడదు. చూసినా నిర్లక్ష్యంగా 'నీతల్లో జేజేమ్మలాంటి వాళ్ళని చూశాను నువ్వో లెఖ్ఖా' అన్నట్లుగా చూడాలి. "అసలు నేను మీ ఇంటికి వచ్చేది మామయ్యకోసం గానీ నీ కోసం కాదు" అన్నట్లుగా బిహేవ్ చెయ్యాలి. బోలెడు మంది అమ్మాయిలు నన్ను ప్రేమిస్తుంటే నేను కేర్ చెయ్యడం లేదన్న ఇంప్రెషన్ కలిగించాలి. మూడు రకాల ఆడ దస్తూరీలతో సుప్రియ, మాధురి, మందాకిని పేర్లతో నాకు ప్రేమలేఖలు రాసుకుని వర్లక్ష్మి టేబుల్ మీద మరిచిపోయి రావాలి. అవి చదువుకుని వర్లక్ష్మి కుళ్ళి కుళ్ళి ఏడవాలి. అప్పుడుగాని తనకి నా ప్రేమ విలువ తెలీదు. అసలు

ఈ ప్రపంచంలో మనం కోరుకునేది దక్కదు. వద్దు మొర్రోమంటే తగులుకుంటుంది. ఇకనుంచి వర్లక్ష్మిని ప్రేమించకుండా ఉండడం అకుంఠితంగా సాధన చేద్దామనుకుంటున్నాను. ఈ పథకంలో ఫస్టు స్టెప్పుగా సాయంత్రం మావయ్యగారింటి కెళ్ళాను. వర్లక్ష్మి జీన్సు డ్రస్సులో కనిపించింది. రెండు జెళ్ళు వేసుకుంది. మొహాన బొట్టు లేదు. మొదట గుర్తు పట్టలేదు. ఎవరో అనుకున్నా. తీరా చూస్తే వర్లక్ష్మి. మొదటే గుర్తు పట్టి ఉంటే చూసేవాణ్ణే కాదు. ఎవరో అనుకోవడం వల్ల ఎవరబ్బా అని చూడాల్సి వచ్చింది. ఎలాగూ చూడక తప్పింది కాదు గనక నిర్లక్ష్య భావంతో గోడనో,



స్తంభాన్నో చూసినట్లు చూడడానికి ప్రయత్నించాను. అయితే నేను నిర్లక్ష్యంగా చూసినట్టు తనకి తెలీలేదు. ఎందుకంటే తను నన్ను ఓ మనిషిలా చూస్తేగా. సరే ఇదంతా ఇంకా ప్రయోగాత్మక దశలో ఉంది గదా సరిపెట్టుకున్నాను. అసలు మాట్లాడ కూడదనుకున్నాను. కాని మొహన బొట్టు కూడా పెట్టుకోకుండా బైటికి వెళ్ళబోతుంటే నాలోని హైందవ సంప్రదాయ వాది చూస్తూ ఊరుకోలేకపోయాడు. "జీన్సు వేసుకుంటే వేసుకున్నావు. బొట్టు, కాటుకా అయినా పెట్టుకోవచ్చుగా" అన్నాను నోరు తెరిచి.

"ఇంకా నయం. కాళ్ళకి పసుపు రాసుకుని గజ్జెల పట్టాలు పెట్టుకోమన్నావు కాదు" అంది నావంక చూడకుండానే హడావిడిగా దేనికోసమో వెతుక్కుంటూ.

"చీర కట్టుకున్నప్పుడు బొట్టూ కాటుకా పెట్టుకుంటావుగా" అన్నాను. "అవును ఆ డ్రస్సుకు అవి మాచింగ్‌గా ఉంటాయి" అంది. "అయితే బొట్టు పెట్టుకునేది సంప్రదాయం కోసం కాదన్నమాట. మాచింగ్‌గా ఉంటేనే పెట్టుకుంటావన్నమాట" అన్నాను.

"కరెక్ట్. నాకేం సెంటిమెంట్లు గింటిమెంట్లు లేవు" అంటూ వెళ్ళిపోయింది.

పోనీ అత్తయ్య అయినా కోప్పడి చెబుతుందేమో ననుకుంటే ఆవిడా మెదలకుండా ఊరుకుంది.

ఇదివరకు రెండు మూడుసార్లు వర్లక్ష్మి ఎన్.సి.సి. డ్రస్సులో కనిపిస్తేనే మనస్సు చివుక్కుమంది. అయినా దేశ స్వాతంత్ర్య పరిరక్షణకై మనం కొన్ని సెంటమెంట్లని త్యాగం చెయ్యక తప్పదనుకుని విశాల హృదయంతో సరిపెట్టుకున్నాను. రుద్రమదేవి అనుంగు ముద్దు బిడ్డగా, భావి భారత వీరనారీమణిగా గుర్తించి మనస్సులోనే అభినందించాను. కాని ఈ జీన్సు ఏమిటి? ఇది వెర్రితలలు వేస్తున్న పాశ్చాత్య హిప్పీ కల్చర్‌కు మచ్చుతునక. అసలు ఆడపడుచులు యుద్ధానికి వెళ్ళినా మిలట్రీ డ్రస్సు అవసరం లేదు. రుద్రమదేవి చీరకట్టి, బొట్టు, కాటుకా పెట్టుకునే కత్తి బట్టి

కదన రంగానికి వెళ్ళింది. అయితే ఇప్పుడు కత్తులు లేవు గాబట్టి, తుపాకీకి చీర మాచింగ్‌గా ఉండదని మిలట్రీ డ్రస్సు కంపల్సరీ చేసి ఉంటారు. గవర్నమెంటు రూలు కదా తప్పదు. కాని ఈ జీన్సుకు జస్టిఫికేషను లేదు.

తనకి ఇంగ్లీషు బాగా వచ్చునని వర్లక్ష్మికి అహంకారం. తనకంటే బాగా ఇంగ్లీషు టకటక లాడించేస్తే గాని తను నన్ను గుర్తించదు. సో హియరాఫ్టర్ ఐ మస్ట్ ట్రై మై బెస్ట్ టు స్పీక్ ఓన్లీ ఇన్ ఇంగ్లీష్ యాజ్ ఫార్ యాజ్ పోజబుల్ అన్లెస్ ఇటీజ్ అదర్‌వైజ్ నాట్ ఎస్సెన్షియల్లీ నెసెసరీ. ఆర్ ఐ మస్ట్ స్టార్ట్ లవింగ్ ఎ ఫారిన్ గర్ల్ హూ స్పీక్ ఇంగ్లీష్ ఓన్లీ సోదట్ ఐ కుడ్ బి ఏబుల్ టూ లెర్న్ ఇంగ్లీష్ క్విక్లీ అండ్ టీచ్ ఎ లెసన్ టు వర్లక్ష్మి. గాడ్ బ్లెస్ మీ.

మే 5 :

పరీక్షల న్యూసెన్సు వదిలిపోయింది గనక ఈ వేసాకాలం సెలవల్లో జర్నలిజంపై కాన్‌సన్‌ట్రేట్ చెయ్యాలనుకుంటున్నా. కాని ఈ దిక్కు మాలిన ప్రొఫెషన్‌లో దినదినగండంగా ఉంది. ఇంగ్లీషే దౌర్భాగ్యపు భాష అనుకుంటే తెలుగూ అలాగే ఏడిసింది. ఇంకెలా చచ్చేది? 'అనంతపురంకు కేంద్ర బృందం' అని శ్రీకాలం ఫార్టీయైట్ పాయింటు హెడ్డింగు పెట్టినందుకు న్యూసెడిటరు పావుగంట సేపు చివాట్లు పెట్టాడు. ఆ హెడ్డింగులో బూతు అర్థం ధ్వనిస్తోందట. ఇంకెప్పుడూ హిందూపురంకు, రామచంద్రపురంకు అనే హెడ్డింగులు పెట్టద్దన్నాడు. అనంతపురానికి అని రాయాలిట. నర్సీపట్నంకు అని రాయచ్చుట. భీమవరంకు అని రాయకూడదట. 'జర్నలిస్టువై యుండి ఆ మాత్రం కామన్‌సెన్స్ లేకపోతే ఎలా' అంటూ దులిపాడు. ఇంకెప్పుడూ 'రం' పక్కన 'కు' చేర్చవద్దని సివియర్ వార్నింగ్ ఇచ్చాడు. జర్నలిస్టుల కోసం ఒక ప్రత్యేక వ్యాకరణ సూత్ర స్వయం బోధిని అవసరమని ఆయనకు సూచించాను. "వ్యాకరణం కాదు. ప్రతి పత్రిక్కీ ఒక స్టైయిల్ షీటు వుంటుంది. డూస్, అండ్ డోంట్సు అందులో ఉంటాయి. మన పత్రిక్కే లేదు. ఇన్నాళ్ళూ అటువంటిది లేకుండానే నెట్టుకొస్తున్నాం. నీ లాంటి వాళ్ళుంటే అది తప్పకుండా ఉండాల్సిందే" అన్నాడాయన. పనిలో పనిగా ఆయన బూతు అర్థం ధ్వనించే ప్రమాదం గల మరికొన్ని ప్రయోగాలు ఉదాహరించి, అవెప్పుడూ రాయద్దని చెప్పాడు. బడ్డింగ్ జర్నలిస్టుల ప్రయోజనార్థం వాటిని గ్రంథస్థం చేయడం అవసరమే గాని అశ్లీల భీతిచే వాటిని విడుచుచున్నాను.

మధ్యాహ్నం ఎడిటరు గారు పిలిస్తే ఏదో కొంప మునిగిందిరా దేవుడా అనుకుంటూ వెళ్ళాను. "ఇంకో అరగంటలో మన ఆఫీసుకి ఐదారుగురు చైనీస్ గెస్ట్సు వస్తున్నారు. వాళ్ళకి ఏవైనా స్నేక్స్, టీ అరేంజ్ చెయ్యి. ఎకౌంటెంట్‌కి చెప్పాను. ఇప్పుడే వెళ్ళి డబ్బు తీసుకో. సమయానికి అటెండర్ బాయ్ లేకుండా పోయాడు - సారీ. కుర్రాడివి కదాని నీకు చెబుతున్నాను" అన్నాడాయన.

ఎకౌంటెంట్ దగ్గరికి వెడితే ఆయన ఓ వంద రూపాయల నోటు ఇచ్చాడు. ఎదురు మాట్లాడితే ఎడిటరు గారికి కోపం వస్తుందని ఊరుకున్నాను గాని ఇప్పుడు పాముల్ని ఎక్కణ్ణించి పట్టుకు రావాల్రా దేవుడా అంటూ తలపట్టుక్కూచున్నాను. చైనా వాళ్ళు పాముల్ని మహా ఇష్టంగా తింటారన్న సంగతి తెలిసిందే. ఆంధ్రులకి ఆవకాయ, గోంగూర ఎలాగో చైనా వాళ్ళకి పాములు అలా. కాని వేరే దేశాలకి వచ్చినప్పుడు కూడా పాముల ఫలహారం కావాలంటే ఎలా? హైదరాబాదులో పాముల కూర ఎక్కడ దొరుకుతుంది? నా అవస్థ చూసి న్యూసెడిటరు ఏం జరిగిందని అడిగాడు. "ఈ చుట్టు పక్కల ఎక్కడైనా చైనీస్ హోటల్ ఉందా సార్" అని అడిగాను. దేనికని అడిగాడాయన. చైనా అతిథులు వస్తున్నారనీ, ఏవైనా స్నేక్స్ అరేంజ్ చెయ్యమన్నారనీ, చైనా హోటల్లో అయితే పాముల కూర దొరకచ్చుననీ చెప్పాను. ఆయన బిగ్గరగా నవ్వి "స్నేక్స్ కాదయ్యా బాబు శ్నాక్స్ అయ్యుంటుంది. బలేవాడివే నువ్వు" అన్నాడు. నేనూ నవ్వేశాను అర్థం కాకపోయినా. "చంపేశారు శ్నాక్సా? స్నేక్స్ అనుకున్నానండీ. ఆచెప్పేది క్లియర్‌గా చెప్పచ్చు కదా" - అన్నాను. ఇంతకీ ఏం తీసుకురావాలో తెలీలేదు. నా సీటులోకి వెళ్ళి కూచ్చుని ఎవరూ చూడకుండా డిక్షనరీ తిరగెయ్యడం మొదలెట్టాను. స్పెల్లింగ్ ఏమిటో అసలు? "ఇంకా ఇక్కడే కూర్చున్నావేమిటి? వాళ్లు వచ్చే టైమవుతోంది. శ్నాక్స్ అంటే ఏమిటో డిక్షనరీలో చూస్తున్నావా? మెయిన్ రోడ్డు మీదకి వెళ్లి ఇరానీ హోటల్లో సమోసాలో, మిక్చరో తీసుకురా. లేకపోతే ఏదైనా మిఠాయి షోపులో కరకరలాడేవి ఏవైనా



తీసుకురా" అని సలహా ఇచ్చాడు. హమ్మయ్య మొత్తం మీద పాముల వేట తప్పింది కదాని సంతోషించాను. వీటినే ఆక్యుపేషనల్ హెజార్డ్స్ లేక వృత్తి పరమైన కష్టాలు అంటారు.

మే 12 :

పొద్దున్న ఎమ్మెల్యేగారి కూతురు పెళ్ళికి వెళ్ళాం. ఎడిటరుగారు కూడా వచ్చారు. పలువురు మంత్రులు, పుర ప్రముఖులు వచ్చారు. "వివాహ వార్త ఓ ముక్క రాసి పడెయ్యి వోయ్ హాఫ్ స్టిక్కు మేటరు చాలు. ట్వంటీ పాయింట్ హెడ్డింగు పడెయ్యి" అని చెప్పాడు ఎడిటరు గారు. సరేనన్నాను. ఆఫీసుకొచ్చాక మళ్ళీ "జాగర్తగా రాయి. అసలే అయోమయం గాడివి. ఇదివరకోసారి పరంధామయ్యగారి తృతీయ కుమార్తె వివాహం అని రాయడానికి పరంధామయ్య గారి కుమార్తె తృతీయ వివాహం రాశావు. అలా రాశావంటే కొంపలు మునుగుతాయి. యాక్యురసీ ముఖ్యం"

అని హెచ్చరించాడు. సరేనని నెల్లూరు వాస్తవ్యులు ప్రకాశరావు గారి కుమారుడు వెంకట్రావుకీ, ఎమ్మెల్యే గారి కుమార్తె రేవతికీ వివాహం అయిందని సింపుల్‌గా రాశాను. ఎడిటరు గారికి చూపించుదా మనుకుంటుండగా సందేహం వచ్చింది. ఇందులో యాక్యురసీ లోపించినట్లు అనిపించింది. ఎందుకంటే అబ్బాయికి వేరే, అమ్మాయికి వేరే వివాహం అయినట్లుగా అర్థం వస్తోంది. ఇద్దరికీ ఒకరితో ఒకరికి వివాహమైనట్లు స్పష్టంగా తెలియడం లేదు. అందుకని వెంకట్రావుకీ, రేవతికీ పరస్పరం వివాహమయిందని రాసి ఎడిటరుగారకి చూపించాను. ఆయన "ఈ పరస్పరం ఏమిటోయ్ నీ తలకాయ" అన్నాడు. సరే అయితే సాదాగా ఫలానా వారి అబ్బాయిని ఫలానా వారి అమ్మాయికిచ్చి ఘనంగా వివాహం జరిపించారని రాసేస్తాను అని చెప్పాను. "అబ్బాయిని అమ్మాయికిచ్చి చెయ్యడం ఏమిటోయ్? నీకు మతేమన్నా పోయిందా? అమ్మాయిని అబ్బాయికిచ్చి చేస్తారు. చిన్న వివాహ వార్త రాయులేని వాడివి ఎందుకు పనికొస్తావోయ్" అని చివాట్లు పెట్టాడు. తరవాత 'ప్రముఖులు ఆశీర్వదించారని కూడా ఓ ముక్క రాయి' అని సలహా ఇచ్చాడు. ఆయన చెప్పిన ప్రకారం అమ్మాయిని అబ్బాయికిచ్చి వివాహం జరిపించారని రాసి, విచ్చేసిన ప్రముఖులంతా తలంబ్రాలు పోసి వధువును ఆశీర్వదించారని ఓ ముక్క కలిపాను. అది చదివి ఆయన ఫైరైపోయాడు. "నిన్ను నిజంగా ఎర్రగడ్డకు పంపించాల్సిందే. బియ్యే చదువుతున్నావు. ఇరవయ్యేళ్ళు వచ్చాయి. అక్షింతలకీ, తలంబ్రాలకీ తేడా తెలీదా నీకు?" అన్నాడు. "ఆ రెండూ పర్యాయ పదాలే కదండీ. రెండూ పసుపు కలిపిన బియ్యమే కదా. పూజారి గారు వాటినే అందరికీ ఇస్తారు వధూ వరుల నెత్తి మీద పోసేందుకు. పెళ్ళి కొడుకూ, పెళ్ళి కూతురు వాటినే ఒకళ్ళ నెత్తి మీద ఒకళ్ళు చల్లుకుంటారు" అని చెప్పాను. "నీ మొహం లాగా ఉంది. నువ్వూ సరే, నీ భాషా సరే. అన్నీ పసుపు కలిపిన బియ్యమే అయినా వధూవరులు నెత్తి మీద పోసుకుంటే తలంబ్రాలు అంటారు. వచ్చిన పెద్దలు చల్లితే అక్షింతలు అంటారు. పెళ్ళి జరిపించే బ్రాహ్మడు పూజారి కాదు. పురోహితుడు" అని వివరించాడు ఆయన. "ఓహో... సందర్భానుసారంగా ఒకే వస్తువుకు వేర్వేరు పేర్లుంటాయన్న మాట. అనుభవం లేదు కదండీ... అందుకని తలంబ్రాల సంగతి తెలీదు" అని చెప్పాను. నెత్తి మీద ఉండేవి, మూతి మీద ఉండేవి వెంట్రుకలే అయినా నెత్తి మీద ఉంటే జుట్టు అంటాం, మూతి మీద ఉంటే మీసం అంటాం. తలంబ్రాలూ, అక్షింతలూ కూడా అంతేనన్నమాట. ఇంతకీ నేను వరలక్ష్మి నెత్తిమీద వేసేవి అక్షింతలో, తలంబ్రాలో మరి? అక్షింతలు అనే మాటకి ఇంకో కొత్త అర్థం కూడా ఇవాళే తెలిసింది. ఎడిటరు గారి రూమ్‌లోంచి బైటికి రాగానే శంకరయ్య గారు "అక్షింతలు పడ్డట్టున్నాయే" అన్నాడు.

మే 27 :

కాలేజీ లేదు కదా ఆఫీసులో ద్విగుణీకృతోత్సాహంతో పని చేద్దామనుకుంటే వీల్లేకుండా న్యూసెడిటరు గారు నా చేతులు కట్టి పడేశారు. ఈ మధ్య బొత్తిగా ఐటమ్స్ ఇవ్వడం మానేశారు. ఎంత చిన్న ఐటం ఇచ్చినా తప్పులు రాస్తున్నానుట. దిద్దుకోలేక చస్తున్నాట్ట. నేను రాసినవి దిద్దుకోవడం కంటే తను రాసుకోవడం మంచిదిట. అందుకని సబెడిటర్లతో పాటు ఆయన కూడా ఐటమ్స్ రాస్తున్నాడు. "న్యూసెడిటరై ఉండి మీరు రాయడమేమిటి? రాంబాబు చచ్చాడను కున్నారా? నేనుండగా మీకు దేనికి ఈ శ్రమ? ఆ ఐటం ఇలా ఇవ్వండి. అరటి పండు వల్చి చేతులో పెట్టినట్లు రాసిస్తాను" అంటే కూడా నిర్మొహమాటంగా "నో థాంక్స్" అంటున్నాడు. ఏ మాత్రం మెత్తబడడం లేదు.




అయినా రాసే చెయ్యి, కూసే నోరు ఊరుకోవు కదా. ఆఫీసులో ఊరికే కూర్చుంటే బావుండదని మినీ కవితో, పరిశోధనాత్మక వ్యాసమో రాస్తుంటే ఆయన అనుమానంగా ఓరజూపు చూస్తుంటాడు. తనకి తెలీకుండా ఏదైనా కంపోజ్‌కి పంపిస్తానేమోనని వెయ్యి కళ్ళతో కాపలా కాస్తున్నాడు. రాంబాబు పంపించే ఏ ఐటమూ కంపోజ్ చెయ్యద్దని ప్రెస్సులో కూడా చెప్పేశాడు అందరికీ. మరీ అవసరమై ఏదైనా నా చేత రాయిస్తే దానిమీద తను ఎర్రపెన్నుతో 'ఓకే' అని రాస్తాననీ, అప్పుడు కంపోజ్ చెయ్యచ్చుననీ చెప్పాడు వాళ్ళకి. మొన్న నేను సీరియస్‌గా రాసుకుంటుంటే నా పక్కనించి వెడుతూ 'ఏమిటది?' అనడిగాడు. "ఇండియా టుడే వాళ్ళు అడిగితే స్టేట్ పొలిటికల్ సిట్యుయేషన్ మీద ఓ ఆర్టికల్ రాస్తున్నాను" అని చెప్పాను. నా ప్రతిభా వ్యుత్పత్తులను తగు విధంగా వినియోగించు కొనకపోవడం ద్వారా 'సుజనమిత్ర' ఎంతగా నష్టపోతున్నదో గుర్తించినట్టున్నాడు. ఇవాళ ఒక ఐటం ఇచ్చాడు. ఈ సువర్ణావకాశాన్ని సద్వినియోగ పరచుకోవాలనే ఉద్దేశంతో "సువర్ణాక్షరాలతో ఎన్టీఆర్ చరిత్ర రచన" సిక్స్ కాలం సెవెంటీ యైట్ పాయింట్ హెడ్డింగ్ పెట్టి బ్యానర్ అని రాసి పంపించాను. న్యూసెడిటరుగారు దాన్ని తిన్నగా ఎడిటరు గారి గదిలోకి పంపాడు. ఎడిటరు గారు నన్ను పిలిపించారు. ప్రశంసించడానికేమో ననుకున్నాను. 'ఏమిటి వెధవ పైత్యం' అన్నాడు ఆయన. "దీన్ని బేనర్ చెయ్యమని ఎవడు చెప్పాడు నీకు? తాటికాయంత అక్షరాలతో ఈ హెడ్డింగేమిటి?" అనడిగాడు. ఆ వార్త ఇంపార్టెన్సు, సిగ్నిఫికెన్సు ఆయనకి అర్థం కాలేదని వివరంగా చెప్పాను. మహిళలకు ఆస్తి హక్కు

ప్రసాదించడం ద్వారా ఎన్టీఆర్ చరిత్ర సృష్టించారనీ, చరిత్రకారులు ఆయన చరిత్రను సువర్ణాక్షరాలో రచిస్తారనీ విద్యామంత్రిగారు తన ఉపన్యాసంలో ప్రకటించారు. అన్నగారి చరిత్రను సువర్ణాక్షరాలతో రచింపచేసే ప్రతిపాదన ఉన్నట్లు ఇంతకు ముందు ఎవ్వరూ చెప్పలేదు. ఇది కొత్త పాయింటు. అందుకనే బేనర్ చేస్తే మంచిదని సలహా ఇచ్చాను.

"ఆఫీసులో సబ్స్ అంతా సెలవులు పెట్టేసి నిప్పచ్చరంగా ఉంటే – పోనీ రాంబాబు కిచ్చి చూడరాదా ఎన్నని రాసుకుంటారు మీరు మాత్రం అని న్యూసెడిటరుకి నేనే సలహా ఇచ్చాను. ఇవ్వక ఇవ్వక ఓ ఐటం ఇస్తే ఇలా తగలేస్తావు నువ్వు" అంటూ విసుక్కున్నాడు ఎడిటరుగారు.

"పోనీ దానికంత ఇంపార్టెన్సు లేదనుకుంటే సింగిల్ కాలం ట్వంటీ పాయింటు చెయ్యండి. బట్ టు మారో ఇఫ్ అదర్ బిగ్ పేపర్స్ మేక్ ఇట్ ఏ బేనర్ దెన్ యూ షుడ్ నాట్ బ్లేమ్‌మీ. ఐ విల్ నాట్ బీ రెస్పాన్సిబుల్ ఫర్ ఎనీ కాన్సెక్వెన్సెస్" అని ఇంగ్లీషు టకటక లాడించి వచ్చేశాను.

జూన్ 8 :

నిస్సారమైన ఈ దిక్కుమాలిన డైలీ జర్నలిజంలో పడి ముక్కుపచ్చలారని వయస్సులో ఎంతో జీవన మాధుర్యాన్ని కోల్పోతున్నానేమోనని అనుమానంగా ఉంది. ఎస్పెషల్లీ వర్లక్ష్మి నిర్లక్ష్యమునకు గురి కాబడుతున్నాను. వర్లక్ష్మే కాదు – పక్కింటి కోతి, వాళ్ళ చెల్లెలు కూడా ఈ మధ్య జీన్సే వేసుకుంటున్నారు యమ స్టయిలుగా. నేనేమో భారతీయ సంస్కృతి అనుకుంటూ చాదస్తపు పెద్దమనిషిలా కనిపిస్తున్నాను. ఇలా ఉంటే వర్లక్ష్మికి నేను మాచింగ్ ఎలా ఉంటాను? నేను వెంటనే అల్ట్రా మాడర్నిస్టిక్‌గా తయారవకపోతే వర్లక్ష్మికి ఏ డిస్కో జీన్సుగాడినో లౌ చేస్తుంది. చేతులు కాలాక ఆకులు పట్టుకుంటే లాభం లేదు. పాశ్చాత్య వేషధారణ నా కాన్షన్స్‌కి విరుద్ధమే అయినప్పటికీ ప్రేమ కోసం త్యాగం చెయ్యక తప్పదు. పెళ్ళయిన తరవాత నెమ్మదిగా ఐ విల్ మౌల్డ్ హర్ ఎకార్డింగ్ టు హిందూ కల్చర్ గ్రాడ్యువల్లీ. సారథి కూడా ఎందుకో జీన్సు మొదలెట్టలేదు – నా అదృష్టం కొద్దీ. అతను ముందు మెదలెడితే నేను అతన్ని ఇమిటేట్ చేస్తున్నానని అనుకునేవారు. అందుకని అతనికంటే ముందుగా కొనుక్కోవాలనుకున్నాను.



అతని దగ్గర ఇప్పుడు డబ్బులు కూడా లేవు. నా దగ్గర నాన్నగారు పంపిన డబ్బు నాలుగొందలు ఉంది. సారథిని తీసుకుని షాపింగ్‌కి వెళ్ళాను.

షాపులోకి వెళ్ళాక జీన్సు చూపించమన్నాను. సారధి ఆశ్చర్యపోయాడు. "నీకిప్పుడు జీన్సు దేనికోయ్" అన్నాడు.

"నీకు తెలీదులే గ్రాడ్యుయెల్‌గా స్టయిలు మార్చెయ్యాలి" అన్నాను.

అతను చాలా జెలసీ ఫీలై వుంటాడు. అతనింకా ఎవర్నీ లౌ చేస్తున్నట్లు లేదు. లౌ చేస్తే ఈ పాటికి అతను జీన్సు వేసేవాడు. షాపువాడు ఏవో జీన్సు చూపించాడు. చౌకబారుగా కనిపించాయి. అవన్నీ కాటన్‌వి. పాలియెస్టర్‌వి లేవా అనడిగితే లేవా అనడిగితే లేవన్నాడు. పోనీ నైలెక్స్ – టెరీపాలీ, షిఫాన్, ఆర్గండి, టూబైటూ, త్రీబైఫోర్, రెయాన్ లాంటి ఖరీదైన జీన్సు చూపించమన్నాను. షాపువాడు, సారధి ఏకోన్ముఖంగా నవ్వడం మొదలెట్టారు ఎందుకో. ఈ మొహానికి అంత కాస్ట్లీవి దేనికనుకున్నారో ఏమో! జీన్స్ అంటే ఇవే. ఇలాగే ఉంటాయని చెప్పాడు షాపువాడు. సారధి కూడా ఆ మాటే అన్నాడు. సరే ధర చెప్పమన్నాను. రెండొందల యాభై అన్నాడు. గుండె గుభేలుమంది.

"ఈ ముష్టి లాగూకి ఇంత ధరా" అన్నాను సారధితో – షాపువాడికి వినిపించకుండా.

"అంతేనోయ్. వాటి ధరలు అలాగే ఉంటాయి. అయినా జనానికి అవంటే క్రేజు. అందుకే అన్నాను నీకు దేనికోయ్ అని. కావాలంటే కొనుక్కో. నష్టమేం లేదు. కొన్నాళ్లు కిందపడి దేకి, బాగా మాపేసి, బండకేసి బాది, వెలిసిపోయాక తీసుకొచ్చి ఇస్తే వీళ్ళే రెండొందలకి కొనుక్కొంటారు" అని చెప్పాడు అతను.

ఏం చేసుకుంటారోయ్ అనడిగితే వాటిని మూడొందలకి అమ్ముతారని చెప్పాడు. వాటిని ఫేడెడ్ జీన్స్ అంటారట. అవి ఎంత వెలిసిపోతే అంత మంచిదిట. ఈ లెక్కన మనకి యాభై రూపాయలకే వచ్చినట్టువుతుంది. షాపువాడు "షలై గివ్ ఏ పేర్ ఆఫ్ జీన్స్" అనడిగాడు.

"నో... ఐ డోంట్ వాంట్ ఏ పేర్. జస్ట్ వన్ జీన్ ఈజ్ ఎనఫ్" అన్నాను. మళ్ళీ షాపు వాడు, సారథీ నవ్వడం మొదలెట్టారు.

"అవునోయ్ రెండు జీన్లు దేనికి? ప్రస్తుతానికి ఒక జీను చాలు" అన్నాను.

"నీ మొహంలా ఉంది. జీను కాదు జీన్సు అనే అంటారు"అన్నాడు సారధి.

అంటే అది నిత్య బహువచనం అన్నమాట. సరే మొత్తం మీద ఒకటి కొన్నాను (ఇద్దరం ఒక క్లాసే అయినా, ఒక రూములోనే ఉంటున్నా నాకు తెలీనివి సారథికి ఎలా తెలుస్తాయో అర్థం కావడం లేదు.)

జీన్స్ వేస్తే టక్ చెయ్యాలి. టక్ చేస్తే బూట్లు వెయ్యాలి. బూట్లు వెయ్యాలంటే మేజోళ్ళు కావాలి. బూట్లున్నాయిగాని మేజోళ్ళలో ఒకటి ఎలిక కొరికేసింది. బూట్లు తొడుక్కుంటే

కనిపించదు గాని మామయ్య గారింటికి వెళ్లినప్పుడు విప్పితే వర్లక్ష్మి చూసిందంటే పరాభవమై పోతుంది. అందుకని ఒకటి కొందామని బాటా షాపుకి వెళ్ళాను.

"డూ యూ హావ్ మేజోడ్స్?" అనడిగాను.

షాపువాడు తెల్లమొహం వేసి 'వాట్?' అన్నాడు. సారథి మళ్ళీ నవ్వడం మొదలెట్టాడు. అతనికి ప్రతీదీ నవ్వే.

షాపువాడు "వై ఆర్యూ లాఫింగ్, వాట్సది మేటర్" అనడిగాడు సారథిని.

"అవునోయ్ ఎందుకు నవ్వుతావు" అనడిగాను.

"నీ దౌర్భాగ్యపు ఇంగ్లీషు చూసి... మేజోడ్స్ ఏమిటోయ్ నీ తలకాయ్? సాక్స్ అనలేవూ" అన్నాడు అతను.

"అవునూ రెండూ ఒకటేగా" అన్నాను.

"ఓ... యూ వాంట్ సాక్స్" అంటూ అంటూ షాపువాడు మేజోళ్ళు చూపించాడు. వాటిల్లో నల్లవి చూపించి ధర అడిగాను. పద్దెనిమిది రూపాయలు చెప్పాడు.

"ఇటీజ్ వేరీ టూ మచ్" అన్నాను.

ధర తగ్గించనన్నాడు షాపువాడు. సరేనని తొమ్మిది రూపాయలిచ్చి "గివ్ మి వన్ సాక్" అన్నాను.

సారథి నోటికి కర్చీఫ్ అడ్డం పెట్టుకుని నవ్వుకుంటూ బైటకి వెళ్ళిపోయాడు. షాపువాడూ నవ్వుతూ "నో నో యూ కాంట్ హావ్ వన్. టేక్ ది పేర్" అన్నాడు.

ఒకటి చాలు మొర్రో అంటుంటే ఈ బలవంతం ఏమిటి?

"అయామ్ ఆల్రెడీ హావింగ్ యే బ్లాక్ పేర్. బట్ వన్ సాక్ ఈజ్ బిటెన్ బై యే రాట్. సో ఐ వాంట్ ఓన్లీ వన్ సాక్" అని చెప్పినా కన్విన్స్ కాలేదు షాపువాడు. "దీసీజ్ నథింగ్ బట్ ఎక్స్ప్లాయిటేషన్" అంటూ బైటికొచ్చేశాను.



ఈ పెద్ద షాపుల వాళ్ళకిదే రోగం – పేవ్ మెంట్ మీద కొనుక్కోవడం మంచిదనుకున్నాను. బైట సారథి ఇంకా నవ్వుతూనే ఉన్నాడు. పేవ్ మెంట్ మీద బేరం ఆడితే జత తొమ్మిది రూపాయలు చెప్పాడు. అంటే బాటా ధరలో సగం అన్నమాట. బాగానే ఉందనుకుని నాలుగున్నర ఇచ్చి సాక్ ఇవ్వమంటే వాడూ జత తీసుకోమని దబాయించడం మొదలెట్టాడు. వద్దు పొమ్మని వేరే వాళ్ళ దగ్గరికి వెళ్ళాను. వాళ్ళూ అదే మాట. వెధవలు... అందరూ కూడబలుక్కుని ఒకే కట్టుగా ఉంటారు. జనాన్ని దోచుకునేందుకు.

"నీకసలు బుద్ధి ఉందిటోయ్? నీ కెవడైనా ఎప్పుడైనా ఒక మేజోడు అమ్మాడా?" అన్నాడు సారథి.

"ఏడిసినట్టుంది. ఇది వరకెప్పుడూ నాకు ఒక మేజోడు అవసరం కాలేదు. ఇప్పుడు ఎలిక ఒక మేజోడునే కొరికేసింది. రెండోది కూడా కొరికి ఉంటే జత తీసుకునే వాణ్ణి" అన్నాను.

"నీ అంత ఫూల్ ఎవడూ ఉండడోయ్. ఈ భూప్రపంచంలో ఎవడూ ఒక సాక్ అమ్మడు, కొనడు. సాక్ అని ఎవడూ అనడు. సాక్స్ అనే అంటారు. రేపు యిల్లాగే ఒక బూటు కొంటానని బైల్దేరతావు. ఎలిక రెండు బూట్లూ ఒకేసారి కొరుకుతుందని గ్యారంటీ ఏముంది?" అన్నాడు సారథి.

ఓహో... జీన్స్ లాగే సాక్స్ కూడా నిత్య బహువచనం అన్నమాట అనుకున్నాను. సరే మొత్తానికి... అవసరం లేకపోయినా తొమ్మిది రూపాయలిచ్చి రెండు మేజోడ్సు కొన్నాను – ఈ సారెప్పుడైనా ఎలిక రెండో మేజోడు కొరక్క పోతుందా అని.

జూన్ 18 :

అన్నగారి ప్రభుత్వం ప్రవేశపెట్టిన తెలుగు మహిళా బహిర్భూమి పథకం పై జైపాల్ గారు చేసిన విమర్శలో సామంజస్యం లేకపోలేదు. అది సంకర సమాసం. ఆంధ్ర మహిళా బహిర్భూమి అనైనా ఉండాలి, లేదా తెలుగు ఆడబడుచుల మరుగుదొడ్లు అనైనా ఉండాలి. అంతా తెలుగు మయంగా ఉండాలని అన్నగారి అభిమతం కావున రెండోదే సముచితం.

ఎట్టకేలకు ఇవాళ జీన్సుకు ప్రారంభోత్సవం చేశాను. ప్రారంభోత్సవ సూచకంగా దానికి కొంచెం పసుపు పెట్టాను. బ్లూ జీన్సులో గులాబీ రంగు షర్టు టక్ చేసి కొత్త మేజోళ్ళతో సహా హైహీల్ బూట్స్ వేసుకున్నాను. అన్ని ఉన్నాక కళ్ళజోడు లేకపోతే బావుండదని సుల్తాన్ బజార్ పేవ్ మెంట్ మీద స్పెక్ట్స్ (ఇదీ నిత్య బహువచనమే) కొన్నాను. ఎనభై రూపాయలు చెప్పాడు. నిజానికి అది షాపులో అయితే నూట యాభై ఉంటుంది. కాని పేవ్ మెంట్ మీద ఎప్పుడూ చెప్పిన ధరలో సగానికే అడగాలని సారథి చెప్పిన సూత్రం జ్ఞాపకం వచ్చి నలభైకి ఇవ్వమని అడిగాను. వాడు డెబ్బయికి ఇస్తానన్నాడు. తర్వాత అరవై అన్నాడు. నేను చస్తే నలభై కంటే పైసా ఎక్కువ ఇవ్వన్నాను. చివరికి వాడు నష్టమైనా సరే బోణీ మీదే నంటూ నలభై కిచ్చాడు. పాపం వాణ్ణి ఎక్స్ప్లాయిట్ చేశానేమోనని గిల్టీగా ఫీలయ్యాను. రూముకొచ్చి సారథికి చూపిస్తే అతను "ఎంతకి కొన్నావ్ – పది రూపాయలా" అనడిగాడు. ఎనభై రూపాయలది నలభైకి బేరమాడి కొన్నానని చెబితే అతను "శుద్ధ దండగ. పది రూపాయల కంటే ఎక్కువ చెయ్యదు" అన్నాడు. "నువ్వెప్పుడూ ఇటువంటి దిక్కుమాలిన సరుకే కొంటావేమిటోయ్" అని చివాట్లు పెట్టాడు కూడా.

"పోనీలేవోయ్. ఏదో... చూట్టానికి బాగానే ఉంది స్టయిలుగా. వెలిసిపోయిన జీన్స్‌కి మూడు వందలు ఇస్తే తప్పు లేదుగాని దీనికి నలభై ఇస్తే తప్పా? ఇవాళ ఓ బీదవాడికి 30 రూపాయలు దానం చేశాననుకుంటా" అన్నాను.

అప్పుడే రూముకొచ్చిన భాస్కర్రావు నా డ్రస్సు చూసి "భలే ఫన్నీగా వున్నావోయ్" అని మెచ్చుకున్నాడు. మాచింగ్‌గా ఒక మంచి టోపీ కూడా పెట్టుకోమని సలహా ఇచ్చాడు. కాని ఒకేసారి అంత స్టయిలు పనికిరాదనీ, స్టెప్ బై స్టెప్‌గా మార్చాలనీ చెప్పాను.

కాఫీ తాగుదామని హోటల్‌కి వెడితే అక్కడ వర్లక్ష్మి కనిపించింది. ఎవరో పంజాబీ, సింధీ అమ్మాయిలతో కలిసి ఇంగ్లీషు మాట్లాడుతూ బిరియానీ తింటోంది.

నన్ను చూసి "హాయ్ బావా.. ఏమిటి వేషం? ఎవరో అనుకున్నా. గుర్తే పట్టలేదు. భలే తమాషాగా ఉన్నావ్" అంది నవ్వుతూ. కూర్చోమని కుర్చీ చూపించింది. "బిరియానీ తింటావా? తెప్పించనా?" అంది.

"శుభ్రమైన వైదికుల ఇంట్లో పుట్టి బిరియానీ నువ్వు తింటున్నది చాలక నన్ను కూడా తినమంటున్నావా?" అన్నాను.

"భలేవాడివే బావా! తింటే తప్పేమిటి? ఆఫ్టరాల్ దిసీజ్ వెజిటబుల్ బిర్యానీ. కమాన్ హావిట్. యూవిల్ లైకిట్" అంది.

"ఇవాళ వెజిటబుల్ బిరియానీ తింటావు. రేపు నాన్ వెజిటబుల్ బిరియానీ తింటావు. ఇందులో ఏముంది ఆఫ్టరాల్ చికెన్ బిరియానీ అంటావు" అన్నాను.

"సరే నీ కిష్టం లేకపోతే ఆవడలు తిని మజ్జిగ తాగు" అంది.

"సాయంత్రం మీ ఇంటికి వద్దామనుకున్నాను" అన్నాను.

'రా' అంది.

'ఇంక దేనికి?' అన్నాను అప్రయత్నంగా, అసంకల్పితంగా. అలా అన్నందుకు రూము కొచ్చిన తర్వాత రెట్రాస్పెక్టివ్ ఎఫెక్టుతో చింతించాను. "నిన్ను చూడడానికేగా మీ ఇంటికొచ్చేది. నువ్వు ఇక్కడే కనిపించావు. ఇంక దేనికి రావడం?" అనేది నా మాటల్లో అంతర్లీనంగా ధ్వనించింది. అయితే కాన్వెంటులో చదువుకున్నది కాబట్టి ఈ నర్మ గర్భాలంకారం మొదలైన అలంకారాలు తెలిసి ఉండవు.

ఏది ఏమైనప్పటికీ తను బిరియానీ తింటున్న దృశ్యం నా మనస్సును కలచివేసింది. కాన్వెంటు చదువులతో మన తెలుగు కల్చరు కలుషితమై పోతోంది. శుభ్రంగా పరికిణీ ఓణీ కట్టుకుని, బొట్టూ కాటుకా పెట్టుకుని, పులిహోరా, బొబ్బట్లూ తినవలసిన తెలుగింటి ఆడపిల్ల జీన్సు వేసుకుని బిరియానీ తినడమా?

జూలై 2 :

"ఈ మధ్య నీ అసంకల్పిత జోకులు అట్టే బ్రిలియంటుగా ఉండటం లేదోయ్" అన్నాడు భాస్కర్రావు నిన్న రాత్రి.

"వాటెబౌట్ సంకల్పిత జోక్స్?" అని అడిగాను.

"నీ జన్మలో ఎప్పుడైనా సంకల్పిత జోక్స్ వేశావేమిటి?" అన్నాడు.

పరువు నష్టం దావా వేద్దామన్నంత కోపం వచ్చినా క్షమించి వదిలేశాను.

ఏది ఏమైనప్పటికీ మొత్తం మీద బ్రిలియెన్సీ తగ్గుతున్నట్లు ఈ మధ్య నాకూ అనుమానంగానే ఉంటున్నది. అందుకే బ్రిలియంటైన్ నెత్తికి రాసుకోవాలని చాలాసార్లు అనుకున్నాను. కాని బజారుకి వెళ్ళి నప్పుడల్లా మతిమరపువల్ల బ్రిలియంటైన్ కొనలేకపోతున్నాను. బ్రలియంటైన్ వాడితేగాని ఈ మతిమరుపు తగ్గదనుకుంటాను.

ఎట్టకేలకు ఇవాళ సుల్తాన్ బజార్లో షాపుకి వెళ్ళి బ్రిలియంటైన్ అడిగాను.

షాపువాడు 'ఏ బ్రిలియంటైన్?' అని ఎదురు ప్రశ్న వేశాడు.

"ఐ వాంట్ బ్రిలియంటైన్ దట్సాల్" అని చెప్పాను. వాడు మళ్ళీ అదే ప్రశ్న రెట్టించి అడిగాడు. వాడికి అర్థం కాలేదేమోనని అరటి పండు వల్చి చేతిలో పెట్టినట్టు "ఫర్ రైటింగ్ టుది హెడ్" అని చెప్పాను. ఏదో అసంకల్పిత జోకు వేస్తే నవ్వినట్టు నవ్వడం మొదలు పెట్టాడు. నేను చఱ్రున బైటికొచ్చేశాను.

ఇంకో షాపుకి వెళ్ళి "డు యూ హావ్ కోకో నట్ ఆయిల్?" అనడిగాను.

"ఉచ్ కోకోనట్ అయిల్ అని అడిగాడు వాడు.

'ఈ షాపులవాళ్ళకి ఎంత పొగరా' అనుకుని "థాంక్యూ ఐ డోంట్ వాంట్ ఎనీథింగ్" అని వచ్చేశాను.

అసలు సారథిని వెంట తీసుకు వెడదామనుకున్నాను మొదట. కాని నాతో పోటీగా తను కూడా బ్రిలియంటైన్ వాడతాడేమోనని అతన్ని తీసుకువెళ్ళలేదు. ఆయుర్వేదం షాపులో 'జీవకళ' మాత్రం తెచ్చుకున్నాను. ఆ షాపువాడు పాపం మంచివాడు. "ఏ జీవకళ" అని అడగలేదు. సారథికి, భాస్కర్రావుకి తెలీకుండా జీవకళని పెట్టెలో దాచేశాను. వాళ్ళు చూడకుండా ఆ టానిక్కు వాడాలి.

షాపువాళ్ళ పొగరు గురించి సారథికి చెబితే అతను "యూ ఆర్యే బిగ్ ఫూల్" అన్నాడు. "మార్కెట్లో బోలెడు బ్రిలియంటైన్లు ఉన్నాయి. నువ్వు వాడే బ్రాండ్ పేరు చెప్పద్దూ" అన్నాడు.

"బ్రిలియంటైన్ అంటే బ్రిలియంటైన్ ఇవ్వాలి. నేను ఏది వాడితే వాడికి దేనికి? దటీజ్ నన్

ఆఫ్ హిజ్ బిజినెస్. దటీజ్ ప్యూర్లీ మై వోన్ ప్రైవేట్ ఎఫైర్" అన్నాను.

"యూ ఆర్ నాటోన్లీ ఏ ఫూల్ బాటాల్సో ఏ క్రాక్" అన్నాడు.

"కొబ్బరి నూనె అడిగితే ఏం కొబ్బరి నూనె అని అడగటంలో అర్థం ఏమిటి? కందిపప్పు అడిగితే ఏం కందిపప్పు అని అడుగుతావా?" అని వాదించాను.

"అవునోయ్! నీకు టాటాస్ కోకో నట్టాయిల్ కావాలో పారాషూట్ కావాలో వాడికి ఎలా తెలుస్తుంది?" అన్నాడు సారథి.

"నెత్తికి రాసుకునేందుకు ఏ కొబ్బరి నూనె అయితే ఏమిటోయ్" అన్నాను.

అసలు ఈ యావత్ప్రపంచం నన్ను అపార్థం చేసుకుంటున్నదా అని అనుమానంగా ఉంది. ఈ జనాభా ఆలోచనా సరళి లోనే మౌలికంగా ఏదో లోపం ఉన్నదనిపిస్తోంది. ఒకప్పుడు ఈ ప్రపంచం శ్రీరామకృష్ణ పరమహంసను సైతం పరమౌశుంఠగా జమకట్టింది. నేననగా ఎంత?

జూలై 13 :

షరా మామూలే. తప్పులు రాస్తాననే భయంతో న్యూసెడిటరుగారు నాకు ఐటమ్సు ఇవ్వడం లేదు. కాని ఎప్పుడైనా పొరపాటున కరెక్టుగా రాస్తానేమోనని ప్రయోగాత్మకంగా వారానికి ఒకటో రెండో ఐటమ్సు ఇస్తున్నారు. విటల్ సమస్యలపై దృష్టిని కేంద్రీకరించాలని కేంద్ర మంత్రిగారు వక్కాణించారని రాస్తే న్యూసెడిటరు గారు ముక్క చివాట్లు పెట్టారు. నేనేం సొంత కవిత్వం రాయలేదని వర్జినల్ తీసికెళ్ళి చూపించాను. "వైటల్ ప్రాబ్లమ్స్" అంటే 'అతి ప్రధానమైన సమస్యలు' అని అర్థంట.

"వర్జినల్లో హెచ్ లేదు కదా – విటల్ అని ఎందుకు రాశావు?" అని కోప్పడ్డారు.




టెలి ప్రింటర్లో అనేక అక్షరాలు మిస్సవుతుంటాయి. అవన్నీ సరిదిద్దుకుంటూ పోవాలని ఆయనే చెప్పాడు ఇదివరకోసారి. 'హెచ్' మిస్సయిపోయిందేమోనని దిద్దుకుని రాస్తే ఇదీ తంటా.

ఏమైనప్పటికీ డైలీ జర్నలిజం నాకు అచ్చిరాలేదని చెప్పక తప్పదు. ఎలాగైనా ప్రొప్రయిటరు గార్ని ఇన్ఫ్లుయెన్స్ చేసి 'సుజనమిత్ర'కి అనుబంధంగా

ఒక వీక్లీ పెట్టించి దానికి ఎడిటర్ని కావాలి. 'హిమ కిరణ్' పేరుతో, 'రాంబాబు' పేరుతో ఇదివరకు అచ్చయిన నా మినీ కవితలు, విప్లవ కవితలు చూపిస్తే ఆయన ఇంప్రెస్ కావచ్చు. కాకపోతే నెలకి వెయ్యి రూపాయల జీతానికి హాస్యప్రియలో హానరరీ సబ్ఎడిటరుగా చేరిపోతానని బెదిరిస్తాను.



అసలు బియ్యే అయిపోగానే నేనే ఒక మినీ పత్రిక పెట్టాలి. అందులో అన్నీ మినీ కవితలు, మినీ కథలు, మినీ సీరియల్సు, మినీ రివ్యూలు ఉంటాయి. పది పంక్తులకి మించని మినీ ఎడిటోరియల్ ఉంటుంది. విప్లవాత్మకంగా మినీ (పాకెట్) సైజులో ఉండే ఆ పత్రికకు మినీ ధర (పదిపైసలు మాత్రమే) నిర్ణయిస్తాము. దేశం మొత్తం మీద తొలి మినీ పత్రికను ప్రారంభించిన ఘనత నాకే దక్కుతుంది. ముందు తరాల చరిత్రకారులు నన్ను మినీ పత్రికా పితామహునిగా గుర్తిస్తారు. అప్పుడు ఎడిటరు గారు మొహం జెలసీతో ఎలా మాడిపోతుందో చూడాలి. "మనమే వీక్లీ పెట్టి రాంబాబును ఇన్‌ఛార్జి చేసి ఉంటే ఇతను ఇంతటివాడు అయ్యేవాడు కాదు గదా" అని పశ్చాత్తాపంతో దహించుకుపోతాడు. చేతులు కాలాక ఆకులు పట్టుకుంటే ఏం లాభం!

మినీ పత్రిక సక్సెస్ అయితే అప్పుడు ఒక మినీ డైలీ కూడా స్టార్ట్ చెయ్యవచ్చు. దానికి అప్పుడే బోల్డు బోల్డు ఐడియాలు వస్తున్నాయి. నభూతో నభవిష్యతి అన్నట్లుగా విచిత్ర హెడ్డింగులతో, విపరీత కంపోజింగ్ టెక్నిక్కులతో దాన్ని తీర్చి దిద్దాలి. ఆఖరి పేజీని మొదటి పేజీగా చేసుకుని ఉర్దూ పత్రికలాగా వెనకనుంచి ముందుకు చదువుకునేట్లు పేజీ మేకప్ చెయ్యాలి. హెడ్డింగులు చైనీస్ భాషలాగా నిలువుగా కంపోజ్ చెయ్యాలి. మేటర్ మాత్రం అడ్డంగా కంపోజ్ చేయించాలి. తమాషాకి కొన్ని బాక్సయిటములు 'దడిగాడు వానసిరా' లాగా వెనకనుంచి కంపోజ్ చేయించాలి. తెలుగు జర్నలిజంలో నవశకాన్ని ప్రారంభించాలి. కాని ఈ ఐడియాలు బైటికి పొక్కకుండా టాప్ సీక్రెట్‌గా ఉంచాలి. నా హిట్ లిస్ట్‌లో మొదటి టార్గెట్ 'సుజనమిత్ర'. లార్జెస్ట్ సర్క్యులేటెడ్ డైలీ పబ్లిష్డ్ ఫ్రమ్ చింతల్ బస్తీ అని వేసుకుంటున్నారు కదా. అందుకని నేనూ చింతల్ బస్తీలోనే పత్రిక పెట్టి 'సుజనమిత్ర' ఆ మాటని ఉపసంహరించుకునేటట్లు చెయ్యాలి.

జూలై 24 :

కాలేజీలో క్లాసులు లేవు. ఆఫీసులో పనిలేదు. అన్నగారి రిజర్వేషన్ల విధానానికి వ్యతిరేకంగా

విద్యార్థులు ఆందోళన ముమ్మరం చేస్తున్నారు. విద్యార్థుల వైఖరితో నేను ఎంత మాత్రం ఏకీభవించలేకపోతున్నాను. అయినా తప్పనిసరిగా అందరితో పాటు బస్సుల్లో తిరుగుతూ నిరసన నినాదాలు చేస్తున్నాను. బీసీలకు రిజర్వేషన్లు పెంచరాదనడంలో అర్థం లేదు. కావాలంటే వారితో సమానంగా మాకూ 71 పర్సంటు రిజర్వేషన్లు కావాలి అగ్రకులజులు కోరవచ్చు. ఇంకా సైంటిఫిగ్గా చెప్పాలంటే 52 పర్సంటు అని చెప్పబడుతున్న బీసీలకు 71 పర్సంటు గనుక, ఆ దామాషా ప్రకారం 48 పర్సంటు అని చెప్పబడుతున్న అగ్రకులజులకు 67 పర్సంటు కావాలని ప్రతిపాదించవచ్చు. లేదా తమని కూడా బీసీల జాబితాలో చేర్చవలసిందని కోరవచ్చు. అలా శాంతియుతంగా కోరితే అన్నగారు తప్పక అంగీకరిస్తారు. అంతేగాని ఆవేశకావేషాలు తగవు. అసలే ఒకపక్క విద్యార్థిలోకం అశాంతితో రగులుతుంటే మరోపక్క పోస్టు గాడ్యుయేట్ల సమస్య తల ఎత్తుతోంది. ప్రభుత్వోద్యోగాలలోనూ, ప్రైవేటు ఉద్యోగాలలోనూ పోస్టు గ్రాడ్యుయేట్లకు ప్రాధాన్యం ఇస్తున్నారు. ఏ పత్రికలో అడ్వర్టయిజ్ మెంట్లు చూసినా 'ఓన్లీ పోస్ట్ గ్రాడ్యుయేట్స్ షుడ్ అప్లయ్' అని ఉంటుంది. కాలేజీల్లో సీట్ల కొరత దృష్ట్యా పోస్టు ద్వారా చదువుకునే సౌకర్యాలు కల్పించడం మంచిదే. కాదని ఎవరూ అనరు. కాని పోస్టు ద్వారా చదువు కున్న వాళ్ళే గ్రాడ్యుయేట్లు అయినట్లు, కాలేజీలకి వెళ్ళి చదువుకున్న వాళ్ళు గ్రాడ్యుయేట్లు కానట్లు పరిగణించడం అన్యాయం. ఉద్యోగాలన్నీ పోస్టు గ్రాడ్యుయేట్లకే ఇస్తే రెగ్యులర్ గ్రాడ్యుయేట్లంతా ఏం కావాలి? ఈ వివక్ష యిలాగే సాగితే కాలేజీ సీట్లకి గిరాకీ తగ్గిపోతుంది. అందరూ పోస్టలు ట్యూషనుకే ఎగబడతారు. అప్పుడు కాలేజీ లన్నింటినీ మూసివేయాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. అందుచేత ప్రభుత్వం దూరదృష్టితో ఈ విధానానికి స్వస్తి చెప్పడం అవసరం. నా చేతుల్లో సొంత పేపరు ఉంటే దీని మీద ఎడిటోరియల్ రాసేసి ఉండేవాణ్ణి.

ఇది ఇలా ఉండగా, అన్నగారి ప్రభుత్వం ఇక నుంచి రాష్ట్రమంతటా పాలిథిన్ కవర్లలో సారా లభింప చేయదలచినట్లు తెలియవచ్చింది. అనగా కల్తీలేని, స్వచ్ఛమైన, ఆరోగ్యదాయకమైన సారా ప్రజలందరికీ అందుబాటులోకి వస్తుందన్న మాట. మిక్కిలి హర్షణీయం. అగ్మార్క్ కూడా వేయిస్తే మంచిది. ప్రజలు 'ప్రసాదు' (ప్రభుత్వ సారా దుకాణాలు)కు వెళ్ళవలసిన అవసరం లేకుండా పాలకార్డుల మోడల్లో సారా కార్డులు కూడా ప్రవేశపెడితే డోర్ డెలివరీ సౌకర్యం కూడా ఏర్పడుతుంది. అన్నగారు తీసుకుంటున్న అభివృద్ధి చర్యలలో ఇది విప్లవాత్మకమైనదని చెప్పక తప్పదు.

ఆగస్టు 4 :

ఇవాళ ఎడిటరుగారు తన గదిలోంచి బైటకొచ్చే సరికి నేను గోళ్ళు కొరుక్కుంటూ కనిపించాను.

ఆయన వెంటనే న్యూసెడిటరు దగ్గరికి వెళ్ళి "రాంబాబు మొఫసిల్ వార్తలేమైనా రాయగలడేమో ట్రై చేసి చూడకూడదూ" అని సలహా ఇచ్చాడు. "ఇంగ్లీషు వార్తలిస్తే తగలేస్తాడన్నమాట నిజమే కాని తెలుగులో వచ్చే జిల్లావార్తలు, కరప్రతాలు, స్టేట్ మెంట్లు రాయలేకపోతాడా? కాస్త ఎడిట్ చేసి, హెడ్డింగు పెట్టలేకపోతాడా?" అన్నాడు.

"అలాగే... రేపట్నించి ట్రై చేద్దాం" అని సమాధానమిచ్చాడు న్యూసెడిటరు.

తర్వాత ఎడిటరుగారు నా దగ్గరికొచ్చి "నీకిది లాస్ట్ ఛాన్స్. ఈ పనికూడా చెయ్యలేకపోతే పంపించేస్తాను" అని హెచ్చరించాడు. "గ్రామాల నుంచి వార్తలు పంపే కరస్పాండెంట్లు దౌర్భాగ్యపు భాష రాస్తూ ఉంటారు. వత్తులు, పొల్లులు, కొమ్ములు ఉండవు. అనవసరంగా ఇంగ్లీషు మాటలు వాడుతూ ఉంటారు. అన్నీ జాగర్తగా చూసుకుని తిరగరాసి నీటుగా హెడ్డింగు పెట్టి కంపోజ్ కివ్వాలి" అని వివరించి చెప్పారు.

సరేనన్నాను. పాపం ఇప్పటికే ఆయన చాలాసార్లు లాస్ట్ ఛాన్సు ఇచ్చారు. కనీసం ఈ లాస్ట్ ఛాన్సు నైనా సద్వినియోగపరచుకుని నా ప్రతిభా పాటవాలను నిరూపించుకోవాలని కంకణం కట్టుకున్నాను.

సాయంత్రం నాకూ, సారథికి మధ్య మళ్ళీ భాషా వివాదం చెలరేగింది. "కొంచెం షాపింగ్ చెయ్యాలి తోడువస్తావా?" అనడిగాడు.

" సారీ నేను మార్కెటింగ్ చేసుకోవాలి రాలేను" అన్నాను. "ఏం మార్కెటింగ్?" అని తెల్లమొహం వేసి అడిగాడు.

'మోండా మార్కెటింగ్' అని చెప్పాను.

"ఏం అమ్ముతావు అక్కడ?" అనడిగాడు.

"అమ్మడం ఏమిటి నీ తలకాయ. కొనుక్కోవాల్సిన వస్తువులున్నాయి అక్కడ" అని చెప్పాను. ఒకటే నవ్వడం మొదలుపెట్టాడు. మార్కెటింగ్ అంటే అమ్మడం అని అర్థంట. నాకు చిర్రెత్తికొచ్చింది.

"షాపింగ్ అంటే షాపుకి వెళ్ళి కొనడం కదా. మార్కెటింగ్ అంటే మార్కెట్‌కి వెళ్ళి కొనడం అని ఎందుకు అర్థం చేసుకోకూడదూ. దీనికో అర్థం, దానికో అర్థం ఎలా ఉంటాయి?" అని చెడా మడా వాదించాను. ఇంగ్లీషంత దౌర్భాగ్యపు భాష ఇంకోటి ఉండదని నిర్ద్వంద్వంగా ప్రకటించాను.

"అసలు షాప్ అనేది నౌన్. దాన్ని షాపింగ్ అని వెర్బ్ చెయ్యడం ఏమిటి?" దుకాణానికి వెళ్ళి కొనడాన్ని "దుకాణించుట" అంటే ఊరుకుంటారా భాషావేత్తలు. 'మార్కెటించుట' అంటే ఊరుకుంటారా? అసలే అపభ్రంశపు ఇంగ్లీషు భాషని పత్రికల వాళ్ళు ఇటువంటి ప్రయోగాలతో

మరీ భ్రష్టు పట్టిస్తున్నారు'' అని ఆగ్రహం వ్యక్తం చేశాను.

సారథి నిరుత్తరుడైపోయాడు. అసలు ఇన్నాళ్ళూ ఆఫీసులో అన్ని చివాట్లు తిన్నానంటే అది నా దోషం కాదు భాషా దోషమే అని నిర్థారించుకున్నాను.

ఆగస్టు 17 :

'మదర్ డైరీ' అంటే 'తల్లి పాల కేంద్రము' అని రాసినందుకు ఇవాళ నాకూ, న్యూసెడిటర్‌కీ హోరా హోరీ యుద్ధం జరిగింది. ఓ పదిరోజులుగా తెలుగులో వచ్చే జిల్లావార్తలు ఎడిట్ చేసి, తిరగరాసి ఇస్తున్నాను కదా. రోజూ ఏదో ఒక గొడవ వస్తూనే ఉంది. ఇవాళ పతాక స్థాయికి వచ్చింది. విలేఖరులు ఏమైనా ఇంగ్లీషు మాటలు వాడితే వీలైనంత మటుకు వాటిని తెలుగులోకి మార్చమని ఆయనే చెప్పాడు ఓసారి. విలేఖరి 'మదర్ డైరీ' అని రాస్తే శుభ్రంగా 'తల్లి పాల కేంద్రము' అని నేను అనువదించినందుకు పెద్ద రాద్ధాంతం చేశాడు. డైరీ అంటే పాల కేంద్రమనేది నిర్వివాదాంశం కదా. మరి మదర్ డైరీ అంటే తల్లి పాల కేంద్రం అంటే తప్పేమిటి? ప్రధాన పాలకేంద్రమని రాయాలిట. లేకపోతే 'మదర్ డైరీ' అనే ఉంచాలిట. 'మదర్' అంటే 'ప్రధాన' అనే అర్థం ఏ నిఘంటువులో ఉందో చూపమని సవాలు చేశాను.




"నిఘంటు అర్థం కాదు కామన్ సెన్స్ ఉండాలి. అసలు తల్లి పాల కేంద్రం అనేది ఒకటుంటుందని ఎలా తట్టింది నీ బుర్రకి'' అని విసుక్కున్నాడు ఆయన.

ఈ మధ్య కేంద్ర ప్రభుత్వం, పోషకాహార శాస్త్రజ్ఞులు కూడా తల్లి పాల శ్రేష్ఠత్వాన్ని గురించి పదే పదే ఉద్ఘాటిస్తున్నారు కదా. అందుకని తల్లి పాల కేంద్రాలను నెలకొల్పుతారేమో ననుకోవడంలో విడ్డూరం ఏముంది? అని వాదించాను. ఇదే అదను అనుకొని అదే ఊపులో ఆంగ్ల భాషా దౌర్భాగ్యత్వాన్ని గురించి అనర్గళంగా ఉపన్యసించి రంయ్‌మని ఆఫీసులోంచి బైటికి దూసుకొచ్చేశాను. రెండు మూడు రోజులు కాజువల్ లీవ్ తీసుకుంటే బావుండేటట్టుంది.

ఆగస్టు 21 :

తల్లి పాల కేంద్రం ఉరఫ్ మదర్ డైరీ సంఘటనానంతరం ఆఫీసుకు వెళ్ళడం వల్ల అవాంఛనీయ పరిణామాల నెదుర్కోవలసి వస్తుందనే అనుమానంతో వారం రోజులు ఏక పక్షంగా

(యూనిలేటరల్‌గా) సెలవు తీసుకుని ఇవాళే మళ్ళీ డ్యూటీకి వెళ్ళాను. ఎడిటరు గారు నన్నుచూసి 'ఏమైపోయావు ఇన్నాళ్ళూ' అనడిగారు. అనివార్య కారణాల వల్ల హాజరు కాలేక పోయానని చెప్పాను.

ఈ వారం రోజులూ నేను లేని లోటు ఫీలై ఉంటారు. లేకపోతే అలా ఎందుకడుగుతారు? పాపం నా కోసం బెంగపెట్టుకున్నారో ఏమో ఆపేక్ష గానే మాట్లాడారు. "జర్నలిజంలో స్థిరపడదలచుకుంటే ఏదో ఒక సబ్జక్టును స్పెషలైజ్ చెయ్యరాదుటోయ్. నీకు సంగీతం, సాహిత్యం, సినిమా వగైరాలంటే చాలా మోజు ఉన్నట్టుంది. పోనీ అవైనా బాగా స్టడీ చెయ్యరాదూ. ఆఫీసుకు ఎసెట్టుగా ఉంటావు. నేను కూడా ఎంకరేజ్ చేసి, ప్రమోట్ చేస్తాను" అన్నాడాయన.

ప్రస్తుతం నేను ఆ మార్గంలోనే ఉన్నాననీ, అన్నమయ్య గారి జావళీలని డీప్‌గా స్టడీ చేస్తున్నాననీ చెప్పాను.

"ఓహో అలాగా. మరి నారాయణ తీర్థుల వారి వర్ణాలని స్టడీ చేయడం లేదా?" అనడిగాడు ఆయన. వాటిని పైపైన అలవోకగా పరిశీలించానని చెప్పాను.

"అవునూ. ఆ మధ్య బితోవెన్ సింఫనీలని గురించి ప్రస్తావించినట్టున్నావు. నైన్త్ సింఫనీ విన్నావుటోయ్" అనడిగాడు ఆయన.

"నైన్తేవిటి.... థర్టీన్త్ సింఫనీ కూడా విన్నాను. అది నైన్త్ కంటే మరీ అద్భుతంగా ఉంటుంది" అని జవాబిచ్చాను.

ఆయన నవ్వుతూ "మొత్తానికి నీలాంటి వాడు ఒకడుండాలోయ్ ఆఫీసుకి" అని ప్రశంసించాడు.

రూము కొచ్చాక ఈ సంగతి సారధికి చెబితే అతను "ప్రశంసాకాదు నీ మొహం కాదు. నీ వెధవ కోతలన్నీ ఆయన నమ్మాడనుకున్నావా?" అన్నాడు.

"అన్నమయ్య జావళీలూ రాయలేదు. నారాయణ తీర్థులు వర్ణాలూ రాలేదు. అన్నమయ్య రాసినవి సంకీర్తనలు, నారాయణ తీర్థులు రాసినవి తరంగాలు. బీతోవెన్ కంపోజ్ చేసినవి మొత్తం తొమ్మిది సింఫనీలే. నువ్వు థర్టీన్త్ సింఫనీ వినడమేమిటి నీ తలకాయ. పైగా ఈ కోతలన్నీ మీ ఎడిటర్ దగ్గరా?" అంటూ దులిపాడు అతను.

నిజమే. ఎడిటర్ దగ్గరేకాదు – సారథి దగ్గర కూడా ఇలాంటి విషయాలు మాట్లాడకూడదు. అంతగా అవసరమైతే న్యూక్లియర్ సైన్స్ గురించో, స్పేస్ టెక్నాలజీ గురించో, బయో ఇంజనీరింగ్ గురించో మాట్లాడితే సరిపోతుంది. అసలు ఎవరి దగ్గర ఏ విషయంపై డబాయించడం నిరపాయకరమో ఒక లిస్టు తయారు చేసుకోవడం అవసరం. అయితే నావి బొత్తిగా 'వెధవ కోతలు' అని కొట్టేయడం మాత్రం అనుచితం, అసమంజసం.

ఆగస్టు 27 :

కాంటెంపరరీ సినిమా ట్రెండ్స్ అబ్జర్వ్ చేయడానికై ఈ మధ్య తెలుగు, హిందీ, ఇంగ్లీషు సినిమాలు, కమర్షియల్ ఫిల్మ్స్, రియలిస్టిక్, సర్రియలిస్టిక్, ఇంప్రెషనిస్టిక్ మున్నగు ఫిల్ములని స్థాలీ పులాక న్యాయంగా రకానికొకటి చొప్పున చూస్తున్నాను. హిందీ మెయిన్ స్ట్రీమ్ అంటున్నాడు సారధి. నామోషీగా ఉంటుందని అదేమిటని అడగలేదు. మొత్తం మీద ఆ రకం కూడా ఒకటి చూడాలి.

హిందీలో మీనాక్షి శ్రేషాద్రి జంట జోరు ఎక్కువగా ఉంది. వాళ్ళిద్దరూ కలిసి నటించిన చిత్రాలు బాగా హిట్టయి నట్టున్నాయి. ఎప్పుడూ కలిసే నటించాలని కాంట్రాక్టు కుదుర్చుకున్నట్లున్నారు. మీనాక్షి ఉంటే పక్కన శేషాద్రి పేరుండాల్సిందే శంకర్ జైకిషన్‌లాగా. మచ్చుకి ఒకటి చూద్దామని వెళ్ళాను నిన్నరాత్రి. అందులో మీనాక్షితో డాన్సులు, డ్యూయెట్లు అన్నీ మిధున్ చక్రవర్తే చేశాడు. శేషాద్రి ఏం వేషం వేశాడో తెలీలేదు. పక్కన కూర్చున్న కుర్రాడిని అడిగితే అసందర్భంగా నవ్వాడు. సమాధానం మాత్రం చెప్పలేదు. శేషాద్రి బహుశా ఏదో సైడు రోలు వేసి ఉంటాడు. మొత్తానికి మీనాక్షి మాత్రం చాలా అందంగా ఉంది. హిందీ తారలందరిలో ఆమె అత్యంత అందవతి అనిపించింది.




ఇదిలా ఉండగా, జర్నలిజానికి సంబంధించి ఎన్నో ఇన్నోవేటివ్ ఐడియాస్ వస్తున్నాయి. కాని ఎంకరేజ్‌మెంట్ లేక పోవడం వల్ల నా ప్రతిభ అడవిని గాచిన వెన్నలా అయిపోతోంది. ఈ ఐడియాలని ఏదైనా రైవల్ పత్రిక్కి ఇస్తే కళ్ళ కద్దుకుని తీసుకుంటారు. కాని, మాతృ సంస్థకి ద్రోహం చేయడం ఇష్టం లేక నా ఐడియాలని నేనే దిగమ్రింగుతున్నాను. అణచివేతకు గురియవుతున్న భారతీయ సైంటిస్టుల దైన్యస్థితే నాకూ ఎదురవుతున్నది. 'సుజన మిత్ర'కి బ్రెయిన్ డ్రెయిన్ బెడద గురించి ఎడిటర్ గారిని హెచ్చరించడం అవసరం.

అసలు ఎడిటర్‌గారి కళ్ళు తెరిపించడానికి ఒక బ్రహ్మాండమైన ఉపాయం తట్టింది. అనతికాలంలో ప్రారంభించబోతున్న ఒక దినపత్రికకి నన్ను అసిస్టెంటు ఎడిటర్‌గా రమ్మని ఆహ్వానిస్తూ ఎవరో లెటర్ రాసినట్లు నేనే దస్తూరి మార్చి రాయాలి ఆఫీసు అడ్రస్సుకి. కవరు మీద 'కాన్ఫిడెన్షియల్' అని పెద్ద అక్షరాల్లో రాయాలి. పి.ఏ. శర్మగారు దాన్ని తప్పకుండా ఎడిటర్ గారికిస్తాడు. ఎడిటర్ గారు చింపి చదివి, ఏమీ ఎరగనట్లుగా మళ్ళీ అతికించేసి నేను లేనప్పుడు నా టేబుల్ మీద పెట్టించేస్తాడు. "మీ లాంటి బహుముఖ ప్రజ్ఞా వంతుడి సేవలను సుజనమిత్ర

వారు వినియోగించుకోలేకపోవడం అత్యంత విషాదకరం. విరాటుని కొలువులో ధర్మరాజు లాగా మీరు ఆ చిన్నపత్రికలో రాటై పోవడం మాకు చాలా బాధగా ఉంది. మేము అతి త్వరలో ప్రారంభించే భారీ దినపత్రికకు మీరు అసిస్టెంట్ ఎడిటర్‌గా వస్తే సంతోషిస్తాము. మీరు కోరిన జీతం ఇవ్వగలము" అని రాసి అడుగున వీరపనేని చిన వెంకట్రావనో, అంకమనేని కోటేశ్వర్రావు అనో సంతకం చెయ్యాలి. అప్పుడు గాని ఎడిటర్ గారికి కనువిప్పు కాదు.

వర్లక్ష్మిని చూసి ఏండ్లును, పూండ్లును అయినట్లు ఉంది. ఈ జీవన ఎడారిలో ఒయాసిస్సు ఆమె.

సెప్టెంబరు 7 :

వార్తలన్నీ పూర్తిగా చదివే తీరిక, చాలామంది పాఠకులకు ఉండదనీ, హెడ్డింగులు చదివేసి వదిలేస్తారనీ, అందుచేత వార్తలోని సారాంశం అంతా హెడ్డింగులోకి తీసుకురావాలనీ న్యూసెడిటరుగారు సలహా ఇచ్చారు కదా అమధ్య. అక్షరాలా ఆయన సలహా ప్రకారమే ఇవాళ "చింతకాయలపల్లి గుడి దొంగలను పట్టుకున్నారు" అని హెడ్డింగు పెట్టాను. అది చూసి ఆయన "వేళాకోళమా, వెక్కిరింతా? ఇదేం హెడ్డింగు" అంటూ మండిపడ్డాడు. అంతటితో ఊరుకోకుండా దాన్ని ఎడిటరు గారికి పంపించాడు.

ఎడిటరు గారు నన్ను పిలిపించి "ఇది వాక్యమా, హెడ్డింగా?" అనడిగారు. విషయంతా హెడ్డింగు లోనే ఉంటే ఇంక వార్త రాయడం దేనికని కూడా అన్నారు. న్యూసెడిటర్ గారి సలహాను పురస్కరించుకొని అలా పెట్టాననీ, నిజానికి వ్యక్తిగతంగా అటువంటి హెడ్డింగులు నాకు ఇష్టం లేదని చెప్పాను. హెడ్డింగు ఎప్పుడూ సజెస్టివ్‌గా ఉండాలనీ, లోపల ఏముందో చదవాలనే ఆసక్తి రేకెత్తించేదిగా ఉండాలనీ ఆయన సలహా ఇచ్చారు.

'నేను పూర్తిగా మీతో ఏకీభవిస్తున్నాను. కాని న్యూసెడిటరు గారి సలహా పాటించకపోవడం అవిధేయత అవుతుంది. కనుక అలా హెడ్డింగు పెట్టాను" అని చెప్పాను. "నేనైతే మీరు చెప్పినట్టు 'పట్టుకున్నారు' అని ఒక్క ముక్క రాసి ఊరుకునే వాణ్ణి. పాఠకులు ఎప్పుడు, ఎవరిని, ఎందుకు అనే ఉత్కంఠతో వార్త చదువుతారు. 'దాని గతి అంతేనా?', 'అది అంతే', 'గొంగళి ఇంకా అక్కడే' మున్నగు హెడ్డింగులు సజెస్టివ్‌గానే కాక సస్పెన్సివ్‌గా కుడా ఉంటాయి" అని సోదాహరణోపన్యాసం ఇచ్చాను.

"ఇక చాలు. నా ప్రాణం తియ్యకు. బైటకు పో" అన్నాడు ఆయన. మహాతిక్క మనిషి. ఇంక లాభం లేదు కాన్ఫిడెన్షియల్ లెటర్ రాయాల్సిందే.

"యూ ఆర్ అన్నెసెసెరిలీ వేస్టింగ్ యువర్ టైమ్ ఆన్ జర్నలిజం. కాలేజీ చదువు పాడు

చేసుకుంటున్నావు. చివరికి రెంటికీ చెడ్డ రేవడివవుతావు'' అని హెచ్చరించాడు భాస్కర్రావు.

"పోనీ నీకు అంతగా ఇంట్రెస్టు ఉంటే బి.ఏ. కూడా చేసి ఆ తర్వాత జర్నలిజం లోకి దిగరాదుటోయ్. తొందరేముంది'' అని సలహా ఇచ్చాడు సారథి.

జర్నలిజంలో నా పురోగతికి కాలేజీ చదువు అడ్డం వస్తోందని నేను బాధపడుతుంటే, కాలేజీ చదువుకి జర్నలిజం అడ్డం వస్తోందని హెచ్చరిస్తారేం వీళ్ళు? అసలు కాలేజీ మానేసి సుజనమిత్రలో ఫుల్ టైమర్‌గా పనిచేస్తూ పోస్టు ద్వారా గ్రాడ్యుయేట్ అయితే బాగుంటుందని అనిపిస్తోంది. కాని నాన్నగారు కాళ్ళు విరక్కొడతానంటారేమోనని భయంగా ఉంది. కాలేజీ గ్రాడ్యుయేట్ల కంటే పోస్టు గ్రాడ్యుయేట్లకు ఉజ్జ్వల భవిష్యత్తు ఉందని నాన్నగారిని ఎలాగైనా కన్విన్స్ చేయాలి. జర్నలిజం కోసం వెటరన్స్ ఎందరో ఎన్నో త్యాగాలు చేశారు. భోజనం మానేసి కేవలం టీలు, సిగరెట్లు తాగి




తెల్లవార్లూ పనిచేసిన వారున్నారు. పిల్లల చదువులనీ, భార్యల ఆరోగ్యాన్ని త్యాగం చేసిన వారున్నారు. వారి ముందు నేనెంత! ఉడతాభక్తిగా నేనూ వర్లక్ష్మిపట్ల నా ప్రేమను త్యాగం చేయక పోలేదు. కాలేజీలో మార్కులు తక్కువొస్తున్నాయంటే అదీ త్యాగ ఫలితమే కదా. కాని ఎడిటరు గారు గుర్తిస్తే తప్ప ఈ త్యాగం సార్థకం కాదు.

సెప్టెంబరు 16 :

జాతీయం, అంతర్జాతీయం వార్తలైతే ఇంగ్లీషులోంచి అనువదించుకోవాల్సి వస్తుంది గనుక, ఇంగ్లీషులో నేను చాలా పేదవాడిననే ఉద్దేశంతో నా చేత జిల్లా వార్తలు మాత్రమే రాయిస్తున్నారు కదా. అయినా ఇంగ్లీషు బెడద తప్పడం లేదు నాకు. మొఫసిల్ కరెస్పాండెంట్లు కొందరు తమ ఇంగ్లీషు పాండిత్యం వెలగబెడుతూ టెలిగ్రాములు పంపుతూ ఉంటారు. అసలు అంతర్జాతీయ వార్తలు కూడా ప్రాంతీయ భాషల్లోనే టెలిప్రింటర్లపై రప్పించడానికి ఒక పక్క ప్రయత్నాలు జరుగుతుంటే మరోపక్క మొఫసిల్ కరస్పాండెంట్లు ఇంగ్లీషులో వార్తలు పంపడం శోచనీయం. మనవాళ్ళకి ఈ ఇంగ్లీషు భాషా దాస్యం ఎప్పటికి పోతుందో అర్థం కావడం లేదు. రాష్ట్రంలో అన్నగారి రాజ్యం మరో పదేళ్లు చల్లగా ఉంటే ఇంగ్లీషును పూర్తిగా నిషేధించవచ్చు.

ఇంతకీ జరిగిందేమిటంటే, వంకాయలపాడు గ్రామ సమీపంలో కాలవగట్టుపై ప్రకృతి మాత పిలుపునకు ప్రతిస్పందిస్తున్న ఒక నడివయస్సు వ్యక్తిని లారీ ఢీకొనగా అతడు అక్కడికక్కడే స్వర్గస్థుడైనాడని రాశాను. పత్రికలో అచ్చయి వచ్చేసింది కూడా. దాని మీద ఆఫీసులో పెద్ద

రాద్ధాంతం. ఎడిటరు గారు పిలిచి 'ఏమిటి వెధవ పైత్యం' అని అడిగాడు. సొంత పైత్యం పెట్టానని ఆరోపిస్తారనే అనుమానంతో ఎందుకైనా మంచిదని ఇంగ్లీషు వర్జినల్ దాచిపెట్టాను. అది తీసుకొచ్చి ఎడిటరు గారి ముందు పెట్టాను.

"నువ్వు అది చూపించక్కర్లేదు. ఇంగ్లీషులో ఏముంటుందో నాకు తెలుసు. ఆన్సరింగ్ కాల్స్ ఆఫ్ ది నేచర్ అని ఉంటే నీ కవిత్వం ఏమిటి మధ్యలో" అన్నాడు ఆయన.

"సింపుల్‌గా ప్రకృతి పిలుపునకు జవాబిస్తుండగా అనే రాద్దామనుకున్నానండి. కాని మరీ పేలవంగా ఉంటుందనీ, ప్రకృతి పక్కన ప్రతిస్పందన అనే మాట వాడితే అను ప్రాస కలిసొస్తుందనీ అలా రాశానండి. భాషా సౌందర్యం కోసం ప్రయత్నించాలని ఇదివరకు ఓసారి మీరే చెప్పారండి" అన్నాను.



"నీ తలకాయ. ఆన్సరింగ్ కాల్స్ ఆఫ్ ది నేచర్ అంటే కాలకృత్యాలు తీర్చుకోవడం. ప్రకృతి సౌందర్యాన్ని ఆస్వాదించడం కాదు. నీకు తెలీకపోతే ఎవడినైనా అడగాలి గాని చేతికొచ్చినట్లు రాసేయడమేనా" అని చివాట్లు పెట్టాడు ఆయన.

"తనకి తెలీదన్న సంగతి తెలిస్తే కదా ఇంకెవరినైనా అడిగేది" అన్నాడు పక్కనున్న న్యూసెడిటరు.

"అతను రాశాడు సరే. మీరేం చేస్తున్నారు? జాగ్రత్తగా చూసి పంపద్దూ. ఇవాళ మన పేపరు చూసి ఎంత మంది నవ్వుకుని ఉంటారు? అప్రతిష్ఠ కదుటండీ. ఇతనికి పొట్ట కోస్తే ఇంగ్లీషు ముక్క రాదని తెలుసు కదా. ఇంగ్లీషు ఐటం ఇతనికెందుకిచ్చారు" అంటూ న్యూసెడిటర్ని దులిపాడు ఎడిటరు గారు.

"మొఫసిల్ వార్తల్ని ఇతనికి ఇవ్వడం మొదలెట్టాక వాటిని ఇంకెవరూ ముట్టుకోవడం లేదండి. ఇది రాంబాబు డిపార్ట్‌మెంటు అంటున్నారు. ఛస్తున్నాం వీళ్ళతో" అంటూ రయ్యమని వెళ్ళిపోయాడు న్యూసెడిటరు.

"మా ప్రాణం తియ్యకపోతే ఆ మహోజ్వల భారీ దినపత్రికలో చేరిపోకూడదూ" – అంటూ కాన్ఫిడెన్షియల్ లెటర్ అందించాడు ఎడిటర్ గారు. నేను అది తీసి చదువుతుంటే "ఎవడా వీరపనేని కోటేశ్వరరావు?" అనడిగాడు ఆయన.

"ఏమోనండి. ఎవడో నా ఫాన్ అయ్యుంటాడు" అన్నాడు.

"అయితే అర్జెంటుగా రేపు వెళ్ళి వాడి పేపర్లో చేరిపో" అని సలహా ఇచ్చాడు ఆయన.

"నేనలా అభిమానుల పొగడ్తలకు ఉబ్బి పోయేవాణ్ణి కాదండి. ఈ సుజనమిత్రతలో ఉండి నేను మీ దగ్గర నేర్చుకోవల్సింది ఇంకా ఎంతో ఉంది" అన్నాను.

"చచ్చాం. అయితే ఇప్పట్లో వదలవన్నమాట" అన్నాడు ఆయన తలపట్టుకుని.



ఏప్రిల్ 1 :

డైరీ వ్రాసి చాలా కాలమైనది. ఏండ్లును పూండ్లును అయినట్లున్నది. ఒకానొక వైరాగ్య భావముతో వ్రాయుట మానివేసితిని. ఎందుకు వ్రాయవలెను? ఎవరి కోసం వ్రాయవలెను? ఏ మహాప్రయోజనము సాధించుటకు వ్రాయవలెను? ఈ అనంత మహావిశ్వములో నరజాతి యొక నలుసు వంటిది. అట్టి నరజాతి యందు రాంబాబు స్థానమెంత? ఆ నలుసు నందు కోటి కోట్లవ వంతు. ఇంత మాత్రమునకు తానొక మేధావినకొనుట, తన డైరీ ద్వారా తోటి మానవుల నుత్తేజితుల జేయగలనని తలపోయుట ఎంత అవివేకము? అందులకే నరజాతి చరిత్ర సమస్తం ఏమున్నది గర్వకారణం అన్నాడు మహాకవి శ్రీనివాస శాస్త్రిగారు. అది అటుండనిండు.

"ఏమోయ్ ఈ మధ్య డైరీ రాయడం మానేశావ్? మాకు బొత్తిగా కాలక్షేపం లేకుండా పోయింది?" అన్నాడు భాస్కర్రావు.

"ది రీజన్ ఈజ్ ప్యూర్లీ పర్సనల్. ఇట్ హాజ్ నథింగ్ టూ డూ విత్‌ది ఔట్ సైడ్ వరల్డ్" అని చెప్పాను.

"మా సంగతి అలా ఉంచు. పాఠకుల కోసమైనా నువ్వు మళ్ళీ రాయడం అవసరం" అన్నాడు సారథి.

"నేను లేనప్పుడు పెట్టెతీసి దొంగచాటుగా నా డైరీ చదవడమే కాకుండా దాన్ని కాపీ చేసి పత్రిక్కి పంపించడం మిత్రద్రోహం కాదా? సెన్సార్ చేయవలసిన భాగాలను సైతం యధాతథంగా ప్రచురణకివ్వడం వెన్నుపోటు కాదా?" అన్నాను.

"మై లైఫ్ ఈజ్ యాన్ ఓ పెన్ బుక్ అన్నావు కదోయ్. మళ్ళీ సెన్సారింగ్ అంటావేమిటి?" అన్నాడు సారథి.

ఏది ఏమైనప్పటికీ ప్రజాభీష్టానికి తలయొగ్గి మళ్ళీ రాయక తప్పడం లేదు. కాని వర్లక్ష్మి నా డైరీ చదివిన దాఖలా లేవీ ఇప్పటిదాకా కనిపించలేదు. ఆమె చదివి వుంటే నన్నొక ఇంటలెక్చువల్‌గా గుర్తించి ప్రేమించే అవకాశాలు ఇతోధికంగా మెరుగుపడి ఉండేవి.

ఏప్రిల్ 3 :

అసలు డైరీ రాయడంలో కొన్ని ప్రాక్టికల్ ప్రాబ్లమ్స్ కూడా ఉన్నాయి. కాలేజీ అయ్యాక తిన్నగా సుజనమిత్రకి వెడతా కదా. అక్కడ మూడు గంటలో నాలుగ్గంటలో పనిచేసి, హోటలు కెళ్ళి భోంచేసి తిరిగొచ్చే సరికి, తొమ్మిదో, తొమ్మిదిన్నరో అవుతుంది కదా. అప్పుడింక రాసేందుకు ఓపికెక్కడుంటుంది? నిద్ర ముంచుకొచ్చేస్తుంది. భోంచేస్తే నిద్దరొస్తుందని భోంచెయ్యకుండా రాతకి కూచ్చుంటే ఆకలేస్తుంది. తింటే నిద్ర, తినకపోతే ఆకలి.

నిద్రకు, ఆకలికి ఒక విచిత్రమైన సంబంధం ఉన్నది. దీన్ని గురించి చాలా కాలంగా పరిశోధిస్తున్నాను. ఒక్కొక్కసారి రెండూ ఏకకాలంలో వస్తాయి. నేను ముందంటే నేను ముందని పోటీపడతాయి. అటువంటి సమయాల్లో దేనికి ప్రిఫరెన్సు ఇవ్వాలో తెలియదు. నిద్ర ముంచుకొచ్చేస్తూ ఉంటుంది. సరేనని పడుకుంటే ఆకలేస్తుంది. కడుపులో పేవు లరుస్తుంటే నిద్ర ఎలా వస్తుంది? సరే లేచి వెళ్ళి హోటల్లో భోంచేసి వద్దామనుకుంటే నీరసం. లేచేందుకు ఓపిక ఉండదు. ప్రాణం పోతున్నట్టు ఉంటుంది. అందుకని దీనికొక నివారణోపాయాన్ని ఆలోచించాను. ఆస్పత్రుల్లో రోగికి రక్తం ఎక్కించడానికి రక్తం బాటిలు తలకిందులుగా వేలాడగట్టి, దాంట్లోంచి ట్యూబు పెడతారు గదా. అలాగే రూములోపైకప్పునుంచి ఓ పెద్ద పాల బాటిలు తలకిందులుగా వేలాడదీసి, అందులోంచి పొడుగాటి ట్యూబు మంచం దాకా వచ్చేట్టు ఏర్పాటు చేయాలి. ట్యూబు చివర పాలపీక తగిలించాలి. ఆ పాలపీక నోట్లో పెట్టుకుంటే నిద్రాభంగం లేకుండా ఆకలేసినప్పుడల్లా పాలు తాగుతూ ఉండవచ్చు. గ్లూకోజు నీళ్ళయితే మరీ మంచిది. వైరైటీకోసం బాటిల్లో ఒక రోజు ఆరెంజి జ్యూసూ, ఇంకోరోజు పైనాపిల్ జ్యూసూ కూడా పోయవచ్చు. ఆకలి వల్ల రచనా వ్యాసంగానికి అంతరాయం కలగకుండా ఉండేందుకు కూడా ఈ పాలపీక పథకాన్ని అమలు జరపవచ్చు. కాని ప్రస్తుతం ఇది ఆచరణ సాధ్యం కాదు. నాతోపాటు రూములో సారథి, భాస్కర్రావు కూడా ఉంటున్నారు కదా. వాళ్ళు ఊరంతా చాటింపు వేస్తారు. నేను ఒక్కణ్ణే విడిగా రూము తీసుకున్నప్పుడు ఆ ఎక్విప్‌మెంటును ఇన్‌స్టాల్ చెయ్యాలి. ప్రస్తుతం ప్రయోగాత్మకంగా దిండు కింద వేరుశనగ పప్పులు



పెట్టుకుని అర్ధరాత్రి ఆకలేసినప్పుడు చప్పుడు కాకుండా నములుతున్నాను. కాని ఈ రహస్యం సారధికి, భాస్కర్రావుకి తెలిసిందంటే చస్తాను. దినదినగండంగా ఉంది. భాస్కర్రావైతే "స్వార్థపరుడా! ఒక్కడివే దొంగతనంగా తింటున్నావా... మిత్రద్రోహి, తేనె పూసినకత్తి, పయోముఖ విషకుంభం" అంటూ దండకం చదువుతాడు.

ఈ కష్టాలన్నీ తలుచుకుంటే అసలు ఈ జన్మకి శాంతి, సుఖం ఉన్నాయా అని పిస్తుంది.

ఏప్రిల్ 5 :

జీవిత ధ్యేయాన్ని గురించి రాత్రంతా తీవ్రంగా ఆలోచించాను. అత్యున్నతమైన పదవులను అందుకోవాలని కొందరి ధ్యేయం. మహా రచయితలుగా, కళాకారులుగా లేదా జర్నలిస్టులుగా కీర్తి ప్రతిష్టలు గడించాలని మరికొందరి ఆకాంక్ష. విపరీతంగా ధనం సంపాదించి సుఖాలు అనుభవించాలని ఇంకొందరి ఆశ. మొత్తం మీద అందరూ ఎండమావుల కోసం పరుగెత్తే వాళ్ళే. పోనీ వాళ్ళల్లో కొందరు లక్ష్యాలను సాధించగలిగినా అనుభవించేందుకు వయసూ ఉండదు. తీరికా ఉండదు. పరుగెత్తి పాలు తాగేకంటే నిలుచుండి నీళ్ళు తాగడం మేలు. అందుకే ఇంక పరుగెత్తడం మానేయాలనే నిర్ణయానికొచ్చాను. నేను జర్నలిజాన్ని గాఢంగా ప్రేమించినా అది నాపై శీతకన్ను వేసిందికదా. అందుకని బియ్యే కాగానే సుజనమిత్రకి గుడ్‌బై. జర్నలిజానికి గుడ్ బై. ఎమ్మేలకీ, డాక్టరేట్లకీ గుడ్‌బై, సిటీ లైఫ్‌కి గుడ్‌బై. పరీక్షలయి పోయాక బండెక్కేస్తాను. మళ్ళీ ఛస్తే జన్మలో సిటీ పొలిమేర తొక్కను. గాంధీ గారు ఏనాడో చెప్పారు. 'బ్యాక్ టూ విలేజ్' అని. బామ్మ చేసిన కందిపచ్చడి కలుపుకుని, చారెడు నెయ్యి వేసుకుని భోంచేసి, ఎండవేళ వేప చెట్టుకింద నులక మంచం మీద పడుకుని కునుకుతీస్తే... ఆహా... ఆ శాంతి, ఆ తృప్తి... సుజనమిత్రకి ఎడిటర్నయితే వస్తుందా?

బామ్మచేతి కందిపచ్చడి తలుచుకునే సరికి గత స్మృతులు ముసురుకున్నాయి. అసలు ఆ పల్లెటూరి లైఫే వేరు, ఆ తిండే వేరు, ఆ తృప్తే వేరు. చిన్నప్పుడు బామ్మ దాలిగుంటలో పిడకల మీద పాలకుండ పెట్టి కాచేది. ఆ పాల రుచే వేరు. గ్యాస్ స్టౌమీద కాచే పాలకి ఛస్తే రాదు ఆ రుచి. కట్టెల పొయ్యి మీద కాస్తే ఫరవాలేదు. కాని పిడకలే శ్రేష్టం. అందులో మళ్ళీ గేదె పేడ పిడకల మీద కాచిన దానికి, ఆవు పేడ పిడకల మీద కాచిన దానికి రుచిలో తేడా వుంటుంది. ఆవు పేడ పిడకలే బెస్టు. రథసప్తమికి అమ్మ తులసికోట దగ్గర గొబ్బి పిడకల మీద పరమాన్నం వండేది. చిక్కుడు ఆకుల్లో పెట్టి ఇచ్చేది తినడానికి. ఆ రుచి మళ్ళీ జన్మలో ఎరుగను. ఈ హోటళ్లల్లో చేసే సేమ్యాపాయసం దానిముందు బలాదూరు.

భీష్మేకాదశికి జిల్లేడాకులు వంటిమీద పెట్టుకుని తలనిండా స్నానం చేసేవాళ్ళం. ఏమిటో... ఆ రోజులే వేరు. అన్నట్లు కుక్కల పండగ అని ఒకటుండేది. ఆ పండక్కి అమ్మ చెక్క రొట్టె చేసేది. దాన్ని తప్పేల రొట్టె అనీ, కుక్కల రొట్టె అనీ, కొయ్యరొట్టె అని కూడా అనేవాళ్ళం. ప్రతి



ముక్కా సగం కొరికి కుక్కలకు వేసి మిగతాది తినేవాళ్ళం. ఆ రొట్టె అంటే నాకు ఎంత ఇష్టమో. ఈ వెధవ నాజుకు గులాబ్ జాములూ, రసగుల్లాలు ఎందుకు పనికొస్తాయి దానిముందు! అట్లతద్ది అట్లు! ఆహా... అవి తినని బతుకెందుకు? తెల్లగా మల్లెపూవుల్లా ఉండేవి. పల్చగా ఉల్లిపొరల్లా ఉండేవి. ఒక అట్టు అంతా నాలుగు మడతలు పెట్టి కిళ్ళీలాగా నోట్లో పెట్టుకు నమిలెయ్యవచ్చు. వర్లక్ష్మి లాంటి పట్నం పిల్లకేం తెలుసు వాటి మజా. జీన్సు వేసుకు తిరగడమే గొప్ప అనుకుంటారు.

ఇంక నా నిర్ణయానికి తిరుగులేదు. పరీక్షలయ్యాక ఒక్కక్షణం ఇక్కడుండను. నిక్షేపం లాంటి పొలాలు పెట్టుకుని ఈ సిటీలో బతికే ఖర్మ నాకేమిటి? నీరకాయ్ పంచెకట్టుకుని, తలపాగా చుట్టుకుని పొలం పనులు చేసుకుంటాను. గాంధీ మార్గంలో నడవాలి. ప్రకృతి వైద్యం పాటించాలి. లేదా ఆయుర్వేదం. ప్రాణం మీదకి వచ్చినా ఇంగ్లీషు టాబ్లెట్లు మాత్రం మింగను. ఇంజక్షన్లు చేయించుకోను. రాట్నం వడికి, ఆ నూలుతో నేసిన పంచెలే కట్టుకుంటాను. మిల్లుబట్ట కట్టరాదు. ఇదే నా శపథం. పల్లె రమ్మంటోంది. పొలం అహ్వానిస్తోంది. కోయిల కొసరి కొసరి పిలుస్తోంది.

అలా ఆలోచిస్తూ ఆలోచిస్తూ నిద్రపోయా. రాత్రంతా ఏవేవో కలలు. తెల్లారేసరికి మరచి పోయా... రెండు మూడు సీన్లు సగం సగంగా జ్ఞాపకం ఉన్నాయి. నేను పంచె పైకి ఎగ్గట్టి, నాగలి బుజాన పెట్టుకుని పొలానికి వెడుతున్నాన్ట. తరవాత గొడ్లకి మేత వేస్తున్న దృశ్యం. మళ్ళీ వంటింటి సీను. వర్లక్ష్మి పొయ్యిమీద రాచ్చిప్పలో పులుసు కాస్తోంది. "ఏమే ఇంకా వంట కాలేదుటే" అంటున్నాను నేను. వర్లక్ష్మి నించుని పొడుగాటి కవ్వం చిలుకుతూ ఉంటుంది 'గుమ్మ డేడే గోపిదేవి' పాటపాడుతూ. చంటి వాడు వాళ్ళమ్మ కొంగుపట్టుకుని 'అమ్మా వెన్న పెట్టవే' అని గారాలు పోతున్నాడు. అంత వరకే జ్ఞాపకం ఉంది.



ఏప్రిల్ 20 :

పరీక్షలు వీలైనంత ఇతోధికంగా రాస్తున్నాను. బాబూరావు, సుబ్బారావు తదితరులు బాగా బట్టీ కొట్టి రాస్తున్నారు. వెంకట్రావు, సత్యారావు మున్నగువారు క్లాసుల్లో లెక్చరర్లు చెప్పిన నోట్సు ఆధారంగా రాస్తున్నారు. వాళ్ళు రాసే దాంట్లో వాళ్ళ సొంతం ఐదు శాతం కూడా ఉండదు. ఆ విజ్ఞానం అంతా ఆ బుక్సు రాసిన వాళ్ళది, లెక్చరర్లది. నేను మాత్రం అంతా స్వయం ప్రతిభతో రాస్తున్నాను. పుస్తకాల్లో ఉన్నది, లెక్చరర్లు చెప్పింది ఛస్తే రాయదలుచుకోలేదు. సారధి, భాస్కర్రావు ఎలా రాస్తున్నారో తెలీదు. వాళ్ళు చెప్పరు. కాని వాళ్ళు కూడా నాలాగానే ఇంటలెక్చువల్‌గా రాస్తున్నారని నా అనుమానం. పరీక్షల్లో కూడా ఇంగ్లీషు సినిమాలు చూసే సాహసం వాళ్ళిద్దరికి మాత్రమే ఉందంటే అతిశయోక్తి కాదు. ఏది ఏమైనప్పటికీ ప్రయత్నం మనవంతు. ఫలితం దైవాధీనం. పరీక్ష రాసి కాలేజి నుంచి తిరిగి వచ్చేటప్పుడు బడీచౌడీలో ఆగి అంజనేయులు వారికి శ్రద్ధాంజలి ఘటించి కొబ్బరి కాయ కొట్టి వచ్చాను ఎందుకైనా మంచిదని.

వర్లక్ష్మి కీ పరీక్షలే. తను బట్టీ కొడుతుందా? సొంతంగా రాస్తుందా? పాసైతే కొబ్బరికాయ కొడతానని మొక్కుకుంటుందా? ఏ దేవుడికి మొక్కుకుంటుంది? అనే విషయాలని పరిశోధించాలి. ఏమిటో? ఇన్నాళ్ళూ నేనీ సంగతులు ఆలోచించనే లేదు. తను యావరేజి స్టూడెంటా? బ్రిలియంట్ స్టూడెంటా? ఎక్స్ట్రా కరిక్యులర్ యాక్టివిటీస్‌లో పాల్గొంటుందా? చిన్నప్పుడు మా వూళ్ళో స్కూల్లో స్త్రీలకు విద్య అవసరమా? కాదా?, పల్లె గొప్పదా, పట్టణం గొప్పదా? కత్తి గొప్పా, కలం గొప్పా?, వ్యవసాయం గొప్పా, పరిశ్రమలు గొప్పా? మున్నగు విషయాలపై డిబేటింగు పెట్టేవారు. స్త్రీలకు విద్య అనవసరమనీ, పల్లెలే గొప్పవనీ నేను వాదించేవాడిని. ఇప్పుడు ఆ మాటంటే నన్ను అభివృద్ధి నిరోధకుడనీ, ఫ్యూడల్ వ్యవస్థకు ప్రతినిధిననీ అంటారుగాని స్త్రీలకు విద్య శుద్ధ అనవసరం. స్త్రీ విద్య వల్లనే మన సంస్కృతి భ్రష్టమై పోయిందనటంలో సందేహం లేదు. కస్తూరిబా గాంధి ఏం చదువుకుంది? అయినా ఆవిడ ఎంత గొప్పది? మన స్త్రీలు ఆవిడనే ఆదర్శంగా పెట్టుకోవాలి. ఆవిడలాగా ఖద్దరునే ధరించాలి. నేను కూడా ఖద్దరు లోకి మారిపోదామనుకుంటున్నాను. ఖాదీ ఎంపోరియంలో రిబేటు ఇస్తున్నారు. గాంధీ గారు ఏ సిద్ధాంతం కోసమైతే ఖద్దరును ప్రచారం చేశారో ఆ సిద్ధాంతానికి నన్ను నేను పునరంకితం చేసుకుంటున్నాను. వర్లక్ష్మికి కూడా శాయశక్తులా చెప్పి చూస్తాను. ఒక వేళ జీన్సు పట్ల మరీ అంత మోజు అయితే ఖద్దరు జీన్సు కుట్టించుకోవడానికి గల అవకాశాలను పరిశీలించవలసిందిగా విజ్ఞప్తి చేయదలచుకున్నాను.

మే 1 :

నేడే మేడే. కార్మికోద్యమ చరిత్రలో రెడ్ లెటర్ డే. బడుగు జర్నలిస్టుల ఉద్యోగ భద్రతకై పాత్రికేయులను సంఘటిత పరచవలసిన అవసరం ఎంతైనా ఉంది. ఊరేగింపులో పాల్గొని, ఒక ఎర్రబ్యాడ్జి, ఒక నల్ల బ్యాడ్జీ పెట్టుకుని ఆఫీసుకు వెళ్ళాను. ఎర్రబ్యాడ్జి కార్మిక హక్కులకు ప్రతీక. నల్ల బ్యాడ్జి నన్ను ఉద్యోగంలోనుంచి తొలగించడానికి ఎడిటరు గారు చేస్తున్న కుట్ర పట్ల నిరసనకు ప్రతీక. నన్ను ఎలాగైనా వదిలించుకోవాలని ఎడిటరుగారు చాలా కాలంగా కుట్ర చేస్తున్నారు.




మళ్ళీ మొన్న మరొక విఫలయత్నం చేశారు. కంపెనీ రూల్సు మారాయనీ, కనీసం గ్రాడ్యుయేట్ అయిన వాళ్ళని మాత్రమే తీసుకోవాలని యజమానులు నిర్ణయించారనీ, అందుచేత నేను ఉద్యోగ విరమణ చేసి, బియ్యే పాసయ్యాక మళ్ళీ వచ్చి చేరవచ్చుననీ చెప్పారు. ఇంత కాలం నా నుంచి సేవలు పొంది ఇప్పుడు ఇలా పొమ్మనడం అక్రమం, అన్యాయం, దారుణం అని వాదించాను. ఇది కార్మిక హక్కుల అణచివేత చర్య, ఎక్స్‌ప్లాయిటేషన్ అన్నాను. "బియ్యే పాసయ్యాక వస్తే మళ్ళీ చేర్చుకుంటాను కదుటోయ్" అన్నాడు ఆయన. కాని ఆయన దుశ్చింత నాకు అర్థం కాకపోలేదు. అసలు నేను బియ్యే పాసయ్యే అవకాశం లేదనీ, అందుచేత ఇక మళ్ళీ చేర్చుకోవాల్సిన అవసరం రాదనీ ఆయన ఆలోచన. బచావత్ అవార్డు ప్రకారం అప్రెంటిసుకి కూడా అరవై శాతం వేతనం ఇవ్వాల్సి వస్తుంది కనుక ఇప్పటి నుంచే వదిలించుకోవాలని చూస్తున్నారని దీనిపై యూనియన్ ద్వారా ఫైట్ చేయదలచుకున్ననీ చెప్పాను. గ్రాడ్యుయేషన్ మినిమమ్ క్వాలిఫికేషన్ అయితే శంకరయ్య గారిని కూడా తీసెయ్యాల్సిందే అన్నాను.

"ఆయనకి జర్నలిజంలో పాతికేళ్ళ అనుభవం ఉంది. ఆయనకీ నీకూ సాపత్య మేమిటి? పైగా ఆయన ఎన్నో సంవత్సరాలుగా ఇక్కడ పనిచేస్తున్నారు ఎలా తీసేస్తాం?" అన్నారు ఎడిటరు గారు.

"మరి నేనూ కొంతకాలంగా ఇక్కడ పనిచేస్తున్నాను కదా? ఎలా తీసేస్తారు? కటాఫ్ ఇయర్ ఎలా నిర్ణయిస్తారు? ఈ విషయం ట్రిబ్యునల్ తేల్చాల్సిందే" అన్నాను.

ఎడిటరు గారు తలపట్టుకు కూచున్నాడు. ఆస్ప్రోమాత్ర మింగి, ఫ్లాస్క్ లోంచి కాఫీ పోసుకుని తాగాడు. ఈయన్ని టాకిల్ చెయ్యడం కష్టమేం కాదుగాని, ఉత్తరం రాసి నాన్న గారిని

పిలిపిస్తారేమోనని భయం. యూనియను, ట్రిబ్యునలు, వేజ్ బోర్డు, హక్కులు, బ్యాడ్జీలు అంటే చర్మం వల్చేస్తానంటారు ఆయన. గాంధీ మార్గంలో ఆయన ఒకప్పుడు స్వాతంత్ర్యం కోసం పోరాడారు గాని, స్వాతంత్ర్యం రాగానే పోరాట తత్వాన్ని కోల్పోయారు.

మే 10 :

ఇవాళ బస్సులో ఒక డెబ్బేయ్యేళ్ళ ముసలాయనతో వాగ్యుద్ధం సంభవించింది. హర్షధ్వానాల మధ్య నా వాదనాపటిమతో ఆయనపై ఘనవిజయాన్ని సాధించాను. బస్సులో నాతో పాటు చాలామంది కాలేజీ కుర్రాళ్ళున్నారు. బోల్డుమంది అమ్మాయిలూ ఉన్నారు. కుర్రాళ్ళు జోకులు వేసుకుంటూ నవ్వుకుంటున్నారు. ముసలాయన పైఎంసియే స్టాప్ దగ్గర బస్సెక్కాడు. మగవాళ్ళ సీట్లన్నీ నిండి పోయాయి. ఒక కాలేజీ గరల్ ప్కన ఖాళీ ఉంటే అక్కడ కూచున్నాడు ఆయన. ఇంతలో ఓ కుర్రాడు ఇంకో అమ్మాయి పక్కన ఖాళీ ఉంటే కూచ్చోబోయాడు. అమ్మాయి కాస్త మొహం చిట్లించింది. ఇంక ఆ ముసలాయన ఉపన్యాసం మొదలెట్టాడు. ఈ కాలపు కుర్రాళ్ళకి బొత్తిగా సభ్యత, సంస్కారం లేకుండా పోయాయన్నాడు. ఆడవాళ్ళను గౌరవించడం తెలీదన్నాడు. సమాజంలో రౌడీ తనం పెరిగి పోయిందన్నాడు. ఇంకా చాలా అన్నాడు. వినగా వినగా నాకు ఒళ్ళు మండి పోయింది.

"ఇంతకీ మీరు ఏ కాంటెక్స్ట్‌లో ఈ విమర్శలు చేస్తున్నారు?" అనడిగాను.

"తెలీడంలా? ఖాళీగా ఉంది గదా అని అలా అమ్మాయిల పక్కన కూచ్చోవడమేనా?" అన్నాడు ఆయన.

"మరి మీరు అమ్మాయి పక్కనే కూర్చున్నారు కదా?" అనడిగాను.

"నేనూ మీరూ ఒకటేనా? నా వయస్సెంత, మీ వయస్సెంత? నేను ముసలాణ్ణి. డెబ్బయ్యేళ్ళవాణ్ణి."

"డెబ్బయ్యేళ్ళ ముసలివాళ్ళకే అమ్మాయిల పక్కన కూర్చోవాలనిపిస్తుంటే కుర్రవాళ్ళకి అనిపించడంలో ఆశ్చర్యం ఏముంది? తమరు పెద్దలు. మావంటి కుర్రకారుకి ఆదర్శంగా ఉండవలసింది పోయి మీరే అమ్మాయిల పక్కన కూర్చోవడం తగునా? యద్యదా చరతి శ్రేష్ఠంతు అని కృష్ణ భగవానుడు గీతలో చెప్పలేదా?" అన్నాను. బస్సులో కుర్రాళ్ళంతా గొల్లున నవ్వారు.

"అయామ్ టాకింగ్ సీరియస్లీ, దీసీజ్ నాట్ ఎ లాఫింగ్ స్టాక్" అన్నాను.

ముసలాయన ఉక్రోషంతో "నన్ను ఇంత మాటంటారా? ఈ పిల్ల నా కూతురు లాంటిది. తండ్రి లాంటి వాణ్ణి పక్కన కూచ్చోవడం తప్పా?" అన్నాడు.

"తప్పని మీరే అన్నారు. నేను అనలేదు కదండీ. పెద్ద వారు కనుక మీకు ఆమె కూతురు

లాంటిది. చిన్న వాడు కనుక ఆ అబ్బాయికి ఆమె సోదరి వంటిది. సోదరి పక్కన కూచ్చోవడం తప్పా?''

"హియర్ హియర్'' అని తప్పట్లు కొట్టారు కుర్రాళ్ళు.

"ఇది శుద్ధ వితండవాదం తప్ప ఇంకేం కాదు. అతను నిజంగా సోదరీ భావంతోనే కూర్చుంటున్నాడా?'' అన్నాడు ముసలాయన.

"అది మనం చూసే తీరును బట్టి ఉంటుంది. యతో బుద్ధిస్తతో దృష్టిః అన్నారు కదా ఉపనిషత్తులో. పెద్దలు... తమకి తెలియనిదేముంది?'' అన్నాను.

ముసలాయన ఇంక మాట్లాడలేదు. ఆ అమ్మాయి పక్కకి జరిగి 'యూ మే సిట్ హియర్' అని ఆ కుర్రాడికి చోటిచ్చింది. కుర్రాడు కూచ్చోగానే ముసలాయన మొహం వాడిపోయింది.



తనలో తనం గొణుక్కుంటూ నెక్స్ట్ స్టాప్‌లో దిగిపోయాడు. పాపం ఆయన మాజీ స్వాతంత్ర్య యోధుడి లాగే ఉన్నాడు ఖద్దరు బట్టలు వేసుకుని. నేను సంస్కృతంలో కొటేషను ఇచ్చేటప్పటికి ఆయన డంగై పోయినట్టున్నాడు. భారతీయ సంస్కృతి ఇంకా నా వంటి కొలది మంది యువకులలో సజీవంగా ఉన్నదనే వాస్తవాన్ని ఆయన గుర్తించి ఉంటాడు. ఇంతకీ "యతోబుద్ధి స్తతోదృష్టిః'' అనే సుభాషితం నిజంగా ఏదైనా ఉపనిషత్తులో ఉందా? ఎవరైనా ప్రాచీన మహాకవి రచించాడా? లేక ఆదికవి వాల్మీకి నోటి నుంచి 'మానిషాద' శ్లోకం వచ్చినట్లు ఈ మహావాక్యం నా నోటి నుంచి అప్రయత్నంగా ఆశువుగా వచ్చిందా? ఇది నా బుద్ధి లోంచే వచ్చిందని నా అనుమానం. నేను ఉపనిషద్వాక్యం అనేసరికి ముసలాయన నిజమేననుకున్నాడు. లేకపోతే ఇంత ముక్కు పచ్చలారని కుర్ర వాడి నోటి నుంచి అంత గొప్ప సూత్రం వస్తుందని ఎలా అనుకుంటాడు? వాక్యం రసాత్మకం కావ్యం అనీ, నానృషిఃకురుతే కావ్యం అనీ తెలుగు లెక్చరర్ మూర్తిగారు చెప్పిన విషయాలు ఈ సందర్భంలో గమనార్హం. ఋషి తుల్యుల నోటి నుంచి మాత్రమే ఇటువంటి మహావాక్యాలు అసంకల్పితంగా వస్తాయని ఆయన చెప్పాడు.

ఇంతకీ యతో బుద్ధిస్తతో దృష్టిః అంటే కరెక్టు అర్థం ఏమిటో? యతో దృష్టిస్తతో బుద్ధిః అంటే ఎలా ఉంటుంది? మూర్తి గారిని అడిగి తెల్సుకోవాలి.

జూలై 2 :

అందరికీ లోకువై పోయా. ఎడిటర్‌గారికీ, వర్లక్ష్మికీ, సారధికీ, ఆఖరికి బొడ్డూడని లడ్డూ గాడికి కూడా లోకువై పోయా. నన్ను చూస్తే అందరికీ నవ్వులాటగా ఉంది. జోకు వెయ్యకుండానే నవ్వుతారు. అలాగని నిజంగా జోకు వేస్తానా చస్తే నవ్వరు అదేమిటో మరి. ఊరికే నన్ను చూస్తేనే అసంకల్పిత ప్రతీకార చర్యలాగా నవ్వొస్తుందో ఏమిటో. "నవ్వే వాళ్లంతా తనని చూసే నవ్వుతున్నారనుకోవడం ఇన్ఫీయారిటీ కాంప్లెక్స్ లక్షణం" అని ఆ మధ్య ఏదో మాటల సందర్భంలో భాస్కర్రావు అన్నాడు. నర్మగర్భంగా నన్ను గురించే అని ఉంటాడు. అతని మొహం. నాకున్నది సుపీరియారిటీ కాంప్లెక్సని నేననకుంటుంటే ఇన్ఫీరియారిటీ అంటాడేవిటి? ఇన్ఫీరియారిటీ అన్నది నా డిష్నరీ లోనే లేదు. నేను బోర్న్ జీనియస్సుననే విషయంలో నాకెప్పుడైనా సందేహం ఉంటేగదా!

కాని... ది పిటీ ఈజ్... సమ్ థింగ్ రాంగ్ విత్ మై ఫేస్ ఇట్ సీమ్స్ – నా మొహం నా అంతర్గత మేధస్సును ప్రతిబింబించడం లేదు. ఇంక ఎంత జీనియస్సైనతే మాత్రం ఏం లాభం? అడవిని గాచిన వెన్నయే గదా. సో... ఇంక తటపటాయిస్తూ కూచ్చుంటే లాభం లేదు. గెడ్డం పెంచక తప్పదు. ఇప్పటికే చాలా కాలాతీతమయింది. ఈ వెధవ గడ్డం తొందరగా పెరిగి చావదు. నా ఈడు వాళ్లంతా నాలుగు రోజుకోసారి గీసుకుంటుంటే నేను వారానికోసారి గీసుకుంటున్నాను – అట్టే మాయకపోయినా. గెడ్డం గీసి అప్పుడే వారం అయింది. ఇంకో వారం అయితే గాని భగ్న



ప్రేమికుడి లుక్ రాదు. గెడ్డం గురించి ఈ మధ్య నిశితంగా స్టడీ చేశాను. భగ్నప్రేమికుడి తర్వాత ఓ అర సెంటి మీటరు పెరిగితే ఇంటలెక్చువల్ లుక్కు వస్తుంది. సెంటీమీటరు దాకా పెరిగితే విప్లవకవి లుక్కొస్తుంది. ఇంప్రెషనిస్టిక్, ఎక్స్‌ప్రెషనిస్టిక్, యాబ్‌స్ట్రాక్ట్ మోడ్రన్ పెయింటిస్ట్ కూడా ఈ కోవలోకే వస్తాడు. రెండు నుంచి ఐదారు సెంటీమీటర్ల దాకా గెడ్డం పెరిగితే నక్సలైట్ కళ వస్తుంది. కనీసం ఎనిమిదంగుళాలు పెరిగితేగాని చిన్మయానంద కళ రాదు. (ప్రస్తుతపు పెరుగుదల రేటు ప్రకారం ఇంకో మూడు నాలుగు సంవత్సరాలకి గాని నాకు ఆ కళ, తేజస్సు వచ్చే అవకాశం లేదు). గాబట్టి ఇకపై గెడ్డం గీయరాదని ప్రతిజ్ఞ చేశాను.

జూలై 8 :

మార్నింగ్ వాక్ మహిమ గురించి సారథి లెక్చరు దంచాడు. సూర్యోదయాత్పూర్వం ప్రకృతి మనోహరంగా ఉంటుందట. ఆకాశం నిర్మలంగా ఉంటుందిట. ఆ గాలి పీల్చుకుంటే ఊపిరి తిత్తులకి చాలా మంచిదట. ఎదురింటి ఇంజనీరుగారు రోజూ మార్నింగ్ వాక్‌కి వెడతార్ట మూడు కిలోమీటర్లు.

"డబ్బున్నవాళ్ళతో మనకి పంతేమిటోయ్. దర్జాగా కార్లో వాకింగ్‌కి వెడతారు. మనలాంటి మిడిల్‌క్లాసు వాళ్ళు కాళ్ళీడ్చుకొంటూ నడిచి వెళ్ళాలి" అన్నాను.

సారథి సందర్భశుద్ధి లేకుండా నవ్వాడు. ఎందుకు నవ్వుతున్నాడో చెప్పి ఏడవకూడదూ.

"నువ్వు రాకపోతే మా నెయ్యి. రేపణ్ణించీ నేను వాకింగ్‌కి వెడతాను" అన్నాడు.

జ్ఞాపకాలున్నూ, అనుభవాలున్నూ రాద్దామని సంకల్పం కలిగింది. కాని చిన్ననాటి జ్ఞాపకాలను ఎంత జ్ఞాపకం చేసుకుందామన్నా జ్ఞాపకం రావడం లేదు. విస్మృతి పథంలో పడిపోయిన మధుర స్మృతులను తిరిగి స్మృతి పథంలోకి తీసుకువచ్చే ప్రయత్నంలో కృతకృత్యుణ్ణి కాలేకపోతున్నాను. కనీసం ఇక ముందైనా జ్ఞాపకాలను జ్ఞాపకం పెట్టుకోవడం మరచిపోకూడదు.

జూలై 10 :

నేను ఊహించినట్లే గెడ్డం భగ్న ప్రేమికుని స్థాయికి వచ్చింది. అద్దంలో చూసుకుంటే ప్రేమాభిషేకంలో అక్కినేని పోలికలు కనిపించాయి. శాలువా ఒక్కటే తక్కువ. నాలుగైదు రోజుల్లో వర్లక్ష్మిని చూసి రావాలి. సముచితంగా ఉంటుంది. శాలువా కొనుక్కుందామంటే డబ్బుల్లేవు. వచ్చే నెల బడ్జెట్‌లో శాలువాకు ఓ వంద రూపాయలు కేటాయించాలి. కాని నో యూజ్. వచ్చే నెలకి గెడ్డ స్థితి రివల్యూషనరీ పొయెట్ స్థాయికి వచ్చేస్తుంది. శాలువా మాచింగ్‌గా ఉండదు.

జూలై 13 :

'సుజనమిత్ర'లో ప్రజాస్వామిక విలువలు కొరవడుతున్నాయి. నేను పెట్టే హెడ్డింగుకీ, మేటర్‌కీ పొంతన ఉండడం లేదని న్యూసెడిటరు గారు చివాట్లు పెట్టారు. తప్పులు చేయడం మానవ సహజం కనుక, నేనూ మానవుణ్ణే కనుక తప్పులు చేయడంలో ఆశ్చర్యం లేదనీ, అయితే నాలాగే తప్పులు చేసే ఇతరులను ఆయన ఆ విధంగా చివాట్లు పెట్టడం లేదనీ నిరసన వ్యక్తం చేశాను. సమానమైన తప్పుకు సమానమైన శిక్ష అనే సూత్రాన్ని నిష్పాక్షికంగా అమలు జరపాలని వాదించాను. ఇతరులు చేసే తప్పులని తన దృష్టికి తీసుకొస్తే అలాగే చేస్తానని హామీ ఇచ్చాడు.

వెంటనే నేను శంకరయ్య గారు రాసిన ఓ ఐటం తీసి చూపించాను. హెడ్డింగులో "నేడే ఒప్పందంపై సంతకాలు" అని ఉంది. లోపలేమో 'రేపు ఒప్పందంపై సంతకాలు జరుగుతాయి' అని ఉంది. ఇది కాంట్రడిక్షన్ కదా అని అడిగాను. అది తప్పుకాదని వాదించాడాయన. డేట్ లైన్‌లో ఆరో తేదీ ఉంది. సంతకాలు ఏడో తేదీ జరుగుతాయి. అందుకని మేటర్‌లో 'రేపు' అనడం కరక్టేనట. కాని పాఠకుడు పేపరు చదువుకునేది ఏడో తేదీ కదా. అందుకని హెడ్డింగులో నేడు అనడం కూడా కరక్టేనట. ఆయన వాదానికి అర్థం లేదు. "పాఠకులు హెడ్డింగు, మేటరు రెండూ ఒక్కసారే కదా చదువుకునేది. పైన ఒక రకంగా కింద యింకోరకంగా చెప్పడంలో ఔచిత్యం ఏమిటి?" అని వాదించాను. అయినా ఆయన కన్విన్స్ కాలేదు. అధికార పక్షాన్ని సమర్థించే స్పీకరు లాగా ఆయన శంకరయ్య గారినే వెనకేసుకొచ్చాడు. 'సుజనమిత్ర'లో డెమొక్రటైజేషన్ కోసం పోరాటం సాగించవలసిన అవసరం ఉంది.

హనుమంతులవారి సహాయం కావలెను.

జూలై 15 :

సారథి రోజూ తెల్లవారు జామున లేచి రహస్యంగా వాకింగ్‌కి వెడుతున్నాడు. లాఠీ చేత్తో పట్టుకుని. నేను నిద్ర లేచేసరికి తిరిగొచ్చేస్తున్నాడు ఏమీ ఎరగనట్టుగా. నిన్న పొద్దున్న రోజూ కంటే పెందరాళే లేచాను. దాంతో రెడ్ హేండెడ్‌గా పట్టుబడ్డాడు.

"మిత్రద్రోహీ. ఈ రహస్య వ్యవహారం ఎంత కాలంగా సాగుతోంది?" అని నిగ్గదీశాను.

"రహస్యం ఏమిటి నీ తలకాయి. నేను తిరిగొచ్చే టైముకి కూడా కుంభకర్ణుడి లాగా గుర్రుపెడుతూ ఉంటావు" అన్నాడు.



సరే అతని రోగం కుదర్చాలనుకున్నాను. ఇవాళ అతనికంటే ముందుగా బ్రహ్మ ముహూర్తంలో లేచి వాకింగ్‌కి బయల్దేరాను. రోడ్డుమీద అంతా చీకటిగా ఉంది. కుక్కలు మొరుగుతూ వెంటబడ్డాయి. చేతులో లాఠీ లేదు. వాటిని తప్పించుకునేందుకు పరుగెత్తుతుంటే గూర్ఖా పట్టుకున్నాడు.

లక్కీగా అతను తెలిసినవాడే. ఒకటో తారీకు వచ్చి రూపాయి తీసుకుపోతూ ఉంటాడు. గుర్తు పట్టి కుక్కలని లాఠీతో తరిమేశాడు. రోడ్లన్నీ చెత్తా చెదారంతో గలీజుగా ఉన్నాయి. ప్రకృతి సౌందర్యం లేదు, పాడూ లేదు. లారీలు జంయ్‌మని దూసుకు పోతూ డీసిల్ పొగ వదులుతున్నాయి. తెల్లారుజామున కూడా వాతావరణ కాలుష్యమే. కొంత దూరం పోయే సరికి పారిశుధ్యం పనివారు ఎదురయ్యారు. వాళ్ళు రోడ్డు ఊడుస్తుంటే దుమ్మంతా నా మొహానే. బహుశా నగర పొలిమేరలు దాటితేగాని ప్రకృతి సౌందర్యం కనిపించదేమోననుకున్నాను. ఏడెనిమిది కిలోమీటర్లు నడిచి సిటీ లిమిట్సుకు వెళ్ళాను. అక్కడ ప్రకృతి దృశ్యాల సంగతి ఎలా ఉన్నా ప్రకృతి పిలుపులకు ప్రతిస్పందిస్తున్న (ఆన్సరింగ్ కాల్స్ ఆఫ్ ది నేచర్) పురజనులు రోడ్డు కిరువైపులా దర్శన మిచ్చారు. అప్పటికే కాళ్ళు లాగడం మొదలు పెట్టాయి. తిరుగు ముఖం పట్టి అతి కష్టం మీద రెండు కిలోమీటర్లు నడిచి, అక్కణ్ణించి ఆటో ఎక్కి రూముకి చేరాను. సారధి నన్ను మిస్‌లీడ్ చేశాడనడంలో సందేహం లేదు. నయవంచకుడు. తెల్లారుజామున లేచి లంగోటి బిగించి ఆరుబైట డాబామీద పద్మాసనం వేసుకుని ధ్యానం చెయ్యడం అంత ఉత్తమం ఇంకోటి లేదు.

జూలై 25 :

సాయంత్రం అద్దంలో చూసుకుంటే మొహం నీరసంగా, దిగులుగా, పరధ్యానంగా, వైరాగ్యంగా కనిపించింది. గెడ్డం సత్ఫలితం ఇస్తున్నట్టే ఉంది. లాండ్రీకి వేద్దామనుకుంటున్న మాసిన లాల్చీ వేసుకుని, జుట్టు కాస్త చెరిపేసుకుని మావయ్య గారింటికి బయల్దేరాను. "ఆ మాసిన బట్టలతో, పిల్లి గెడ్డంతో ఎక్కడికి బయల్దేరావు? వెళ్ళేదేదో షేవ్ చేసుకు వెళ్ళరాదూ" అన్నాడు భాస్కర్రావు శకునపక్షి లాగా. వెధవగోడు. ఆగిపోదామనికున్నాను. కాని మూఢ నమ్మకాలు మంచివి కావని తెగించి వెళ్ళాను. కాని మూఢ నమ్మకాలలో నిజం లేకపోలేదని రుజువయింది. మావయ్య ఇంట్లో లేడు. అత్తయ్య వంట చేసుకుంటోంది. వర్లక్ష్మి వరండాలో కూర్చుని ఏదో పుస్తకం సీరియస్‌గా చదువుకుంటోంది. నా వైపు తల తిప్పనైనా లేదు. నన్ను చూసి ఆందోళనగా 'అదేమిటి బావా అలా ఉన్నావు? ఒంట్లో బాగాలేదా? మనస్సు బాగాలేదా?' అని అడుగుతుందనుకున్న నాకు ఆశాభంగమే ఎదురయింది. తను నిజంగానే నన్ను చూసి ఉండకపోతే, నేను వచ్చిన సంగతి తెలీక అలా చదువుతూ కూర్చుందని అనుకునే వాణ్ణి. కాని చూసీ చూడనట్లుగా కూర్చుంది. అనారోగ్య సూచకంగా దగ్గినా నావైపు చూడలేదు. నా దగ్గు విని అత్తయ్య వచ్చి "అదేమిటోయ్ అలా ఉన్నావు? ఒంట్లో బాగాలేదా?" అని పరామర్శించింది. అత్తయ్యే నయం. "మావయ్య ఇప్పుడే వస్తారు కూచ్చో" అని చెప్పి ఆవిడ కాఫీ తీసుకురావడానికి లోపలికెళ్ళింది. వర్లక్ష్మి అంత

సీరియస్‌గా చదువుతున్న పుస్తకం ఏమిటా అని దగ్గరికి వెళ్ళి తొంగి చూశాను. అది చలం మ్యూజింగ్సు.

"అయ్య బాబోయ్! చలం పుస్తకాలు చదువుతున్నావా?" అన్నాను ఆశ్చర్యంగా.

"ఏం చదివితే?" అన్నది తల తిప్పకుండానే.

"ఆయన బూతు పుస్తకాలు రాయడంలో అందె వేసిన చెయ్యి అని విన్నానే".

"ఆయన బూతు బూతు కోసమే రాసినా చౌకబారు రచయిత కాదు" అంది.

"అదేలే. విప్లవాత్మకమైన బూతు రాస్తాట్ట కదూ".

"నువ్వు చదవలేదా?"

"అబ్బే అటువంటి పుస్తకాలు నేనెందుకు చదువుతాను?"

"ఏం చెడిపోతావని భయమా?"



"నాకు భయం దేనికి? మానసిక పరిపక్వత పొందిన నాలాంటి వాళ్ళు ఏ పుస్తకం చదివినా ఫర్వాలేదు. కాని నీలాంటి ఎడోలసెంట్స్ చదవడం డేంజరు కదూ?"

"ఇలాంటి పుస్తకాలు చదవకపోతే మానసిక పరిపక్వత ఎలా వస్తుంది? హి ఈజ్ ఎ గ్రేట్ రైటర్. మ్యూజింగ్సు ఫస్ట్ పార్ట్ ఇస్తాను. తీసుకెళ్ళి చదువు. నీ మెంటల్ హొరైజన్ పెరుగుతుంది" అంటూ లోపలకి వెళ్ళి బుక్కు తీసుకొచ్చి ఇచ్చింది. "జాగర్త... మళ్ళీ తొందరగా తెచ్చి ఇవ్వాలి" అంది.

అత్తయ్య ఇచ్చిన కాఫీ తాగి అక్కణ్ణించి బయల్దేరాను. నేను అడక్కుండా వరలక్ష్మి పుస్తకం ఇవ్వడంలో ఉద్దేశం ఏమై ఉంటుంది? తొందరగా తెచ్చి ఇవ్వాలన్నది. అంటే మళ్ళీ త్వరగా రమ్మని పిలుపా? 'జాగర్త' అని ఎందుకు అంది? లోపల ఏమైనా లెటరు పెట్టిందేమోనని చూస్తే లేదు. లెటరు లేకపోతే పోనీ... 'ఐ లవ్ యూ' అని మూడంటే మూడు ముక్కలున్న చిన్న చీటి అయినా దొరుకుతుందేమోనని పుస్తకమంతా తిరగేసి చూశాను. అంత భాగ్యమా?

అద్దంలో చూసుకుంటే చాలా నిర్వేదం కలిగింది. ఎవరికోసం ఈ గెడ్డం? ఎవరికోసం ఈ లాల్చీ? ఎవరికోసం ఈ జీవితం? ఎవరికోసం? ఎవరికోసం? ఇంతే. ఇక ఇంతే... మనిషి బతుకింతే... మనసు గతి ఇంతే...

జూలై 29 :

వర్లక్ష్మి సాహిత్యాభిరుచిని, ఆమె ఆలోచనా స్రవంతిని అవగాహన చేసుకోవడానికై మ్యూజింగ్స్ చదువుతున్నాను. ఆమె ఏయే పుస్తకాలని గ్రేట్ అని మెచ్చుకుంటుందో ఆయా పుస్తకాలన్నీ సేకరించి చదవాలని నిర్ణయించుకున్నాను. ఆమె సాహిత్యాభిప్రాయాలతో ఏకీభవించుట ద్వారా, ఆమె అభిమాన నవలా నాయకుని వలె తయారగుట ద్వారా ఆమె మనస్సును చూరగొనాలని నిశ్చయించుకున్నాను. పెళ్ళయిన తర్వాత నెమ్మదిగా దశల వారీగా ఆమెను శరత్ నవలా నాయికగా మార్చుకోవచ్చును. అసలు అతివల తీరే అంత. కాలేజీలో చదివేటప్పుడు జీన్సు వేసుకుంటారు. సైకిలు తొక్కుతారు. పెళ్ళయిన తర్వాత చీర కట్టుకుని పమిట నిండుగా కప్పుకుంటారు. బొట్టూ, కాటుకా పెట్టుకుని, జడనిండా మల్లెపూలు తురుముకుంటారు. ఎన్ని సినిమాల్లో చూడలేదు ఈ వరస! అందుచేత వర్లక్ష్మి విషయంలో ఆందోళన చెందనవసరం లేదు.

మిగతా విషయాల విషయం ఎలా ఉన్నా స్త్రీ సౌందర్యం విషయంలో మటుకు చలం అభిప్రాయంతో పూర్తిగా ఏకీభవించకుండా ఉండలేకపోతున్నాను. ఈ స్కూళ్ళు, ఈ పంతుళ్ళు, పాఠ్య పుస్తకాలు చేస్తున్నంత అపకారం ఇంతా అంతా కాదని ఆయన తీవ్రంగా దుయ్యబట్టాడు. ఈ విషయంలో కూడా ఆయనతో ఏకీభవించక తప్పదు. చలం పుస్తకం చదువుతుంటే దేవుడి మీద భక్తి పెరిగి పోతుంది. దేవుడంత మంచి వాడింకొకడు లేడు. దేవుడు శీతోష్ణ సుఖదుఃఖానికి, దూషణ భూషణలకీ అతీతుడు. చలం లాంటివాడు ఎన్ని బూతులు తిడుతున్నా దేవుడు ఏమీ అనడు. ఇంకోడైతే పళ్ళూడ గొట్టేవాడు. 'కొబ్బరికాయ కొడతానని ప్రామిస్ చేశావుగదా ఎందుకు కొట్టలేదు' అని ఎవణ్ణీ నిలదీసి అడగడు దేవుడు. తన నగలన్నీ దోచుకు పోతున్నా, తన ముక్కు చెవులు కోసేస్తున్నా ఏమీ అనడు ఆయన. ఇంకోడైతే లబోదిబోమని మొత్తుకునేవాడు. పోలీసు కంప్లెయింట్ ఇచ్చేవాడు.

ఎడిటర్ గారు రెండు గంటల సేపు ముక్కి ముక్కి ఎడిటోరియల్ రాస్తాడని శంకరయ్యగారు విమర్శించారు. నార్ల గారు ముప్పావు గంటలో రాసి పడేసే వాడట. అవకాశమిస్తే నేను పావుగంటలో రాసిస్తానని ఛాలెంజ్ చేశాను. శంకరయ్యగారు గతుక్కుమన్నాడు. తను న్యూసెడిటరు గారితో జనాంతికంగా అన్న మాటలు నేను వినేసినందుకు ఆయన చాలా ఇదైపోయాడు.

ఆగస్టు 2:

ఇవాళ ఆఫీసులో చాలా గగ్గోలు జరిగింది. నేను సెక్షన్‌లోకి అడుగు పెట్టగానే అటెండర్ బాయ్ ఎడిటర్ గదిలోకి వెళ్ళి చెప్పినట్టున్నాడు. ఎడిటరుగారు గది లోంచి బైటికొచ్చి కరికి లంఘించు

కొదమ సింహము వోలె నా మీద విరుచుకుపడ్డాడు. "నీకసలు బుర్ర ఉందా? బార్ అసోసియేషన్ ప్రెసిడెంటును పట్టుకుని మద్యపాన ప్రియుల సంఘాధ్యక్షుడని రాస్తావా? తెల్లారి లేస్తూనే ఫోన్‌లో ఆ పెద్ద మనిషి చేత ముక్క చివాట్లు తినాల్సి వచ్చింది. పరువు నష్టం దావా వేస్తానంటున్నాడు. నువ్వు రాసే తప్పుడు రాతలకి నేను క్షమాపణలు చెప్పుకోవాల్సి వస్తోంది. నీ వల్ల పేపరు ప్రతిష్ఠ



మట్టిగొట్టుకు పోతోంది" అంటూ అనర్గళంగా దులిపాడు. ఆ బాధిత పెద్దమనిషి న్యాయ వాదుల సంఘం అధ్యక్షుడట. 'బార్' అంటే మద్యపానశాల కదా. న్యాయవాదుల సంఘమైతే అడ్వొకేట్స్ అసోసియేషన్ అని ఏడవచ్చు కదా. శ్లేషార్థం వచ్చేటట్లు 'బార్' అనడం దేనికి వెధవ పాండిత్య ప్రకర్ష కాకపోతే. ఎడిటర్ గారితో ఆమాటే అన్నాను. "యూ షటప్... ఇంక మాట్లాడకు. బి.ఏ.ఫైనల్ చదువుతున్నావు. పొట్టకోస్తే ఇంగ్లీషు ముక్క రాదు" అంటూ గర్జించాడు ఆయన. తర్వాత న్యూసెడిటరు వేపు తిరిగి "ఇతగాడికి ఇంగ్లీషు ఐటమ్స్ ఇవ్వవద్దని ఎన్నిసార్లు చెప్పానండి మీకు?" అని కోప్పడ్డాడు.

"ఇది ఇంగ్లీషు ఐటమ్ కాదు సార్. తెలుగు కరపత్రం. దాన్ని ఓ చిన్న ఐటమ్‌గా రాయవయ్యా అని ఇచ్చాను. అందులో శుభ్రంగా ప్రెసిడెంట్ఆఫ్ బార్ అసోసియేషన్ అని ఉంటే ఇతను సొంత తెలివితేటలు ఉపయోగించి ట్రాన్స్‌లేట్ చేశాడు. తెలుగు కరపత్రమే కదా ఆ మాత్రం రాయలేక పోతాడా అని చెక్ చెయ్యకుండా కంపోజ్‌కిచ్చాను" అని సంజాయిషీ చెప్పుకున్నాడు న్యూసెడిటరు.

ప్రూఫ్ దిద్దే అతన్ని అడిగితే అతను యాజ్‌పర్ వర్జినల్ దిద్దానన్నాడు. అతను ఇదివరకోసారి సబ్ఎడిటర్‌గా ప్రమోషన్ అడిగితే ఎడిటరు గారు 'నో' అన్నాడు. 'రాంబాబు పాటి చెయ్యక పోయానా సార్' అని వాదించాడు అతను. అప్పట్నించి అతను నా పై కక్ష కట్టాడు. అందుకే బార్ అంటే న్యాయవాది అని తెలిసి కూడా దిద్దకుండా ఊరుకున్నాడు. ఇహ నించి నా చేత ఐటమ్స్ రాయించవద్దనీ, ప్రూఫులు దిద్దించమనీ హుకుం జారీ చేశాడు ఎడిటరుగారు. ప్రూఫ్ రీడర్లందరికీ పరమానందం అయింది. సరే ఇకనుంచి నేను కూడా యాజ్‌పర్ వర్జినల్ దిద్ది న్యూసెడిటర్నీ, శంకరయ్య గారినీ ఎక్స్‌పోజ్ చేయాలని ప్రతిజ్ఞ పట్టాను.

ఇవాళ్టితో దిక్కుమాలిన చదువుమీద, ఉద్యోగం మీద, జీవితం మీద వైరాగ్యం పరాకాష్ఠ నందుకుంది. వీలైనంత అనతికాలంలో సన్యాసం స్వీకరించాలి. తర్వాత హిమాలయాలకు పోవాలి. తీవ్రంగా జ్ఞాన సముపార్జన చేసి దివ్య తేజస్సుతో తిరిగి రావాలి. పొడుగాటి గెడ్డం,

కాషాయాంబరాలతో కూడిన నా రూపం మనోనేత్రం ఎదుట సాక్షాత్కరించింది. అప్పుడు ఎడిటరు ప్రభృతులు సంసార జంజాటంలో పడికొట్టుకుంటున్న విడివిడి జ్ఞానంలుగా, అంగుష్ఠమాత్రంలుగా కనిపిస్తారు. వారందరినీ క్షమించేస్తాను. వారు నా గీతోపన్యాసాలకు వచ్చి భక్తి శ్రద్ధలతో చేతులు కట్టుకుని వింటారు. తర్వాత పూర్వాశ్రమంలో నేను రాంబాబునని తెలుసుకుని పశ్చాత్తాప పడి క్షమాపణ



వేడుకుంటారు. నా ఉపన్యాసానికి వర్లక్ష్మి కూడా వస్తుంది.

ఆ సమయంలో వర్లక్ష్మిని చూసినప్పుడు నా మనస్థితి ఎలా ఉంటుంది?

కన్నీళ్ళు ఆగటం లేదు... ఇంక రాయ లేను...

ఆగస్టు 7 :

వర్లక్ష్మి వ్రతం. నా అత్యంత అభిమాన పండుగ దినం. మ్యూజింగ్సు బుక్కు తిరిగి ఇవ్వడానికి వెళ్ళినట్టూ అవుతుంది, ఆరాధ్య దేవతా దర్శనమూ అవుతుందని మామయ్యగారింటికి వెళ్ళాను. అనతి కాలంలో సన్యాసం పుచ్చుకుని హిమాలయాలకు వెళ్ళిపోవాలన్న కృతనిశ్చయాన్ని ఓ కాయితం మీద రాసి దాన్ని పొరపాటున మర్చిపోయినట్టుగా బుక్కులో పెట్టాను. వర్లక్ష్మిని చూస్తే మనస్సు కకావికలమై పోయింది. మనో మందిరంలో మూర్తీభవించిన వర్లక్ష్మి దేవిలా ఊహించుకుని వెళ్ళానా... తీరా చూస్తే కళ్ళకి కాటుక లేదు, మొహాన బొట్టు లేదు, చేతికి తోరం లేదు. కనీసం చీరైనా కట్టుకో లేదు. పరికిణీ, ఓణీ అయినా వేసుకోలేదు. జీన్సు వేసుకుని ఇంటి ముందు రోడ్డు మీద తమ్ముడితో షటిల్ ఆడుతోంది. ఆ వెధవ జీన్సు పండుగ నాడే వేసుకోవాలా – అందులోనూ ఈ పండగ నాడు! తెలుగింటి ఆడపడుచుల జీన్ వస్త్రధారణను నిషేధిస్తూ అన్నగారు ఆర్డినెన్సు తీసుకొస్తే బావుణ్ణు.

"హల్లో బావా... బుక్కు చదివావా?" అంది ఆట ఆపకుండానే, నావంక చూడకుండానే.

"చదివాను. నీతో ఏకీభవించకుండా ఉండలేక పోతున్నాను" అంటూ బుక్కు అందించాను.

"ఒక్క నిమిషం ఆగరా" అని బ్యాట్ తమ్ముడికిచ్చి బుక్కు తీసుకుని లోపలికి వెళ్ళింది. నేనూ లోపలికి వెళ్ళాను. తను బుక్కు గదిలో పెట్టి హాల్లోకొచ్చి, కాయితం నా చేతిలో పెట్టి 'కంగ్రాచ్యులేషన్స్' అంది.

"దేనికి?" అన్నాను అయోమయంగా.

"దేనికేమిటి? ఇంత చిన్న వయస్సులో సన్యాసం పుచ్చుకోవాలనే వైరాగ్యం ఎవరికొస్తుంది బుద్ధ భగవానుడి లాంటి అవతార పురుషులకి తప్ప. ఇంతకీ ఎప్పుడు ప్రయాణం హిమాలయాస్‌కి?" అంది.

"అరెరే... ఈ కాగితం ఆ బుక్కులోకి ఎలా వచ్చింది? ఈ మధ్య బొత్తిగా పరధ్యానం ఎక్కువై పోయింది" అన్నాను.




"నీకు పూజలు, వ్రతాలు బాగా ఇష్టం కాబోలు... లోపలికి వెళ్ళి అమ్మవారిని చూడు" అంది.

"అవునవును.... అసలు వచ్చిందే వరలక్ష్మీ దేవి దర్శనానికి" అన్నాను.

"అబ్బో... నీకు అప్పుడప్పుడు కవిత్వం కూడా వస్తుందే" అంది.

అత్తయ్య వంటింటోంచి వచ్చి "రావోయ్... అమ్మవారిని చూడు" అని ఆహ్వానించింది.

ధూపదీపాల మధ్య వర్లక్ష్మీ అమ్మవారు కళకళ వెలిగిపోతోంది. వర్లక్ష్మి పొద్దున్నే పూజ్జేసేసి తరవాత తెలుగు బట్టలు తీసేసి ఇంగ్లీషు బట్టలు వేసుకుంది కాబోలు అనుకున్నాను. కాని నాది అడియాసే అయింది. వర్లక్ష్మి పూజ చేసిన దాఖలా లేవీ కనిపించలేదు. పాదాలకి పసుపు లేదు. నెత్తి మీద అక్షింతలైనా లేవు. తన తరపున కూడా అత్తయ్యే పూజ్జేసినట్టుంది.

భారతీయ సంస్కృతీ సంప్రదాయాలకు అవసాన దశ వచ్చినట్టుంది. అందుకే దీర్ఘ సుమంగళీ త్వమునకై నోములు నోచుకోవలసిన ఆడపడుచులు ఇలా ప్రవర్తించుచున్నారు. 'పిదప కాలము' అనగా నిదియే.

ఆగస్టు 11 :

నా గెడ్డం మీద రకరకాల వ్యాఖ్యానాలు వినవస్తున్నాయి. ఇంటలెక్చువల్ లుక్కొచ్చిందని నేను సంతోషిస్తుంటే 'తిరపతి మొక్కా' అనడిగారు తెలుగు లెక్చరరు గారు. 'ప్రేమ వైఫల్యం కాబోలు' అని బ్యాక్ బెంచర్స్ ఊహాగానం. "బికారి సన్యాసి వెధవ గెడ్డం నువ్వూ.... షాబీగా ఉంది తీసెయ్" అని కసిరాడు భాస్కర్రావు. బాగా పెరిగిన తరవాత బాగానే ఉంటుందేమో గాని పెరుగుతున్నప్పుడు మాత్రం మహా చిరాగ్గా ఉంటుంది. చెమట పోస్తూ ఉంటుంది. దురద పుడుతూ ఉంటుంది. కాని దీర్ఘకాలిక ప్రయోజనం దృష్ట్యా భరించక తప్పదు.

ఇది ఇలా ఉండగా, సాయంత్రం సుల్తాన్ బజార్ మీదుగా వెళ్తుంటే ఓ రెడీమెడ్ షాపు బైట 'రాక్ బాటం ప్రైసెస్' అని పెద్ద బోర్డు కనిపించింది. 'ట్రౌజర్స్ సెవెంటీ రుపీస్ ఓన్లీ' అని కూడా ఉంది. భలే మంచి చౌక బేరము అనుకుంటూ లోపలకి వెళ్ళాను. బెల్ బాటమ్స్ ఫాషన్ పోయి రాక్ బాటమ్స్ వచ్చాయి కాబోలు ఎలా వుంటాయో చూద్దామనుకున్నాను. "రాక్ బాటమ్స్ చూపించవయ్యా" అని అడిగితే షాపు వాడు వెర్రిమొహం వేసి "వ్వాట్" అన్నాడు.

"రాక్ బాటమ్స్ ప్రైసెస్ సెవెంటీ ఓన్లీ అని బైట పెద్ద బోర్డు పెట్టావు గదయ్యా" అన్నాను.

అతను ముసిముసి నవ్వులు నవ్వుతూ "అదా... భలే జోకు వేశారండీ" అంటూ పాంట్లు తీసుకొచ్చి చూపించాడు.

"జోకు వేశానంటాడేమిటి వీడి పిండాకూడు" అనుకుంటూ పాంట్లు తిరగ మరగా వేసి చూశాను. పేరు డాబు తప్ప అవి మామూలు పాంట్లే. అయినా లేటెస్టు ఫాషను కదా, ప్రస్తుతపు గెడ్డానికి మాచింగ్‌గా, మంచి ట్రిమ్ముగా ఉంటుందని ఒకటి కొన్నాను. పైగా ఇప్పటి దాకా క్లాసులో రాక్ బాటమ్స్ కొన్న వాడెవడూ లేడు.

రూముకొచ్చి సారధికి, భాస్కర్రావుకి చూపిస్తే వాళ్ళు ఒకటే నవ్వటం. "లేటెస్టు ఫాషనూ కాదు, నీ తలకాయీ కాదు. రాక్ బాటమ్ ప్రైసెస్ అంటే లోయెస్ట్ ప్రైసెస్" అని అర్థం అన్నాడు సారధి.

"లోయెస్ట్ ప్రైసెస్ అనే ఏడవచ్చుగా. రాక్ బాటం ఏమిటి వాడి బొంద. అది అమెరికన్ ఇంగ్లీషా, జర్మన్ ఇంగ్లీషా? సామాన్య మానవులకి అర్థం కావాలా వద్దా? బెల్ బాటమ్ లాగా ఇదీ ఒక ఫాషన్ కాబోలు నని మిస్ లీడైపోరూ జనం?" అన్నాను.

పేరేదైతేనేం... ఏదో చీప్‌గా వచ్చింది అని సంతోషించాను. కాని భాస్కర్రావు మాత్రం "అది పరమ చీప్ సరుకు. డెబ్భై రూపాయలు కూడా దండగ" అని తేల్చేశాడు.

"మీరు అపార్థం చేసుకున్నారు దీని అర్థం ఇది కాదు" అని షాపువాడు చెప్పక పోవడం మోసం, దగా. ఈ విషయమై పత్రికా ముఖంగా వినియోగదారులను హెచ్చరించడం అవసరం.

ఆగస్టు 15 :

స్వాతంత్ర్యం వచ్చి నలభై యేళ్ళు అయిందిట. రాజీవ్ ప్రభుత్వం పెద్ద పండగ చేస్తోంది. స్వాతంత్ర్యం వచ్చింది ఎవరికి? అధికార మదాంధులైన రాజకీయ నేతలకు, బడా భూస్వాములకు, సంపన్న పారిశ్రామిక వేత్తలకు తప్ప సామాన్యులకు స్వాతంత్ర్యం వల్ల ఒరిగిందేమిటి? అసలు స్వాతంత్ర్యం మనగా నేమి? రాజకీయ స్వాతంత్ర్యమా? ఆర్థిక స్వాతంత్ర్యమా? వాక్స్వాతంత్ర్యమా? భావ ప్రకటన స్వాతంత్ర్యమా? పత్రికా స్వాతంత్ర్యమా? పోటీకి నిలబడే

నలుగురు అప్రయోజకుల్లో ఒకణ్ణి ఎన్నుకుని తీరాల్సిందేగాని నా ఇష్టం వచ్చిన వాణ్ణి ఎన్నుకునే స్వేచ్ఛ లేదు కదా. ఇంక రాజకీయ స్వాతంత్ర్యానికి అర్థమేమిటి? దారిద్ర్య రేఖకు అడుగున ఉన్న వారికి ఆర్థిక స్వాతంత్ర్యం ఎక్కడిది? రోడ్లన్నీ వెహికిల్సు ఉన్న వారికే గాని వాక్ చేసే వారికి కాదు కదా. "వాక్ ఆన్ ది పేవ్‌మెంట్ ఓన్లీ. డోంట్ వాక్ ఆన్‌ది రోడ్" అంటారు పాదచారులను. ఇంక వాక్ స్వాతంత్ర్యం ఎక్కడుంది? ఇంక పత్రికా స్వాతంత్ర్యం అంటే – ప్రొప్రయిటర్ల స్వాతంత్ర్యమా? ఎడిటర్ల స్వాతంత్ర్యమా? సబెడిటర్ల స్వాతంత్ర్యమా? నా లాంటి సబెడిటర్లకి భావ ప్రకటన స్వాతంత్ర్యం ఎక్కడుంది? నా లాంటి వాడు ఎడిటర్ గారి ఇనప పాదాలకింద నలిగిపోవాల్సిందే గదా. పోనీ సింబాలిక్‌గా స్వాతంత్ర్య దిన సందర్భంగా నైనా "ఇవాళ ఎడిటోరియల్ నీకు అప్ప జెప్పుతున్నాను. నీ ఇష్టం వచ్చినట్టు రాసుకో" అన్నాడా? ఎడిటోరియల్ కాదు గదా కనీసం న్యూసైనా రాయించకుండా సబ్బెడిటరునైన నాచేత ప్రూఫులు దిద్దిస్తున్నాడు. గాంధీజీ, నెహ్రూజీ మున్నగు మహనీయుల త్యాగాలను గురించి, ప్రస్తుత రాజకీయ రంగంలో నానాటికి ప్రబలుతున్న అవినీతి గురించి, మూడు కాలాల ఎడిటోరియల్ రాశాడు. పైగా ఎడిటోరియల్ ప్రూఫులు నా చేతే దిద్దించాడు. "అలా కొన్నాళ్ళ పాటు దిద్దితే ఎడిటోరియల్ రాయడంలో ఉండే మెలుకువలు తెలుస్తాయోయ్.. నీ మేలు కోరే నిన్ను ప్రూఫ్ రీడింగ్‌లో పెట్టాను" అన్నాడు కన్నీటి తుడుపుగా. నేను మౌనం వహించాను.

"ఏమిటలా దిగాలు పడిపోయావ్?" అనడిగాడు ఆయన.

"చాలా ఆవేదనగా ఉంది" అని చెప్పాను.

"ఏం జరిగిందేవిటి?" అనడిగాడు.

"నిజం చెబితే మీకు కోపం వస్తుంది. అయినా చెప్పక తప్పదు. మన సంస్థలోనే లంచగొండి తనం వర్థిల్లు తుంటే మనం అన్నగారి ప్రభుత్వాన్ని విమర్శించడంలో అర్థం లేదు" అన్నాను.



"మన ఆఫీసులో లంచగొండి తనం ఏమిటి నీ తలకాయి".

"అవును. మీ ముక్కు కిందనే అవినీతి ఉంది".

"నా ముక్కు కింద ఏమిటి? మతి ఉండే మాట్లాడుతున్నావా?"

"ఎస్. అండర్ యువర్ వెరీ నోస్ దేరీజ్ కరప్షన్".

"మనమే లంచాలిచ్చుకోవాల్సిన స్టేజిలో ఉంటే

మనకి లంచాలిచ్చేంత తలమాసిన వాడెవడోయ్?"

"దేరీజ్ కరప్షన్ ఎట్ హైయెస్ట్ లెవెల్. పట్టపగలు, బాహాటంగా సాగుతోంది అవినీతి" అన్నాను.

"వెధవ నాన్పుడు మాని సరిగ్గా చెప్పి ఏడు ఏం జరిగిందో" అన్నాడు ఆయన విసుగ్గా.

న్యూసైటమ్ ఇవ్వడానికి వచ్చిన ఓ పెద్దమనిషిని న్యూసెడిటరు ఉంగరం ఇమ్మని అడగడం లంచగొండితనం కాదా? అన్నాను.

"ఉంగరం అడగడం ఏమిటోయ్. అసలు వాళ్ళు మాట్లాడుకున్నదేమిటి, నువ్వు విన్నదేమిటి?"

"అవును. ఆ పెద్దమనిషి ఏదో వార్త ఇచ్చి అది పద్ధెనిమిదో తేదీ పేపరులో రావాలని అడిగాడు. న్యూసెడిటరు గారు సరేనని తీసుకుంటూ 'బట్ గివ్ మి ఎ రింగ్ ఆన్ సెవెంటీన్త్' అనడిగాడు. ఆ పెద్దమనిషి సరేనని చెప్పి వెళ్ళిపోయాడు. నాతో పాటు సెక్షన్‌లో ఇంకా కొందరు కూడా విన్నారు. కావాలంటే పిల్చి అడగండి" అన్నాను.

ఎడిటరు గారు పగలబడి నవ్వుతూ "చంపేశావుగదయ్యా. నీ దుంపతెగ. ఫోన్ చేసి జ్ఞాపకం చెయ్యమని న్యూసెడిటరు అడిగితే ఉంగరం ఇమ్మన్నట్లుగా అర్థమయిందా నీకు? ఇంకా నయం... నీ మాట విని ఆయన్ని పిల్చి అడిగాను కాదు. ఈ మాత్రం ఇంగ్లీషు రాని వాడివి నీకు జర్నలిజం దేనికోయ్ – శుభ్రంగా బడ్డీకొట్టు పెట్టుకోక" అన్నాడు.

ఎడిటరు గారు మొత్తానికి ఇలాగే ఏదో చెప్పి న్యూసెడిటర్ని వెనకేసుకొస్తాడని ముందే అనుకున్నాను. లేకపోతే అసలు రింగ్ ఇవ్వమనండలో గల శ్లేషార్థం ఎడిటరుగారికి అర్థం కాలేదేమో.

## ఆగస్టు 19 :

పక్కింటి కోతిని చూసి ఎన్నాళ్ళయిందో. ఊళ్ళోలేదేమో. ఉహూ... ఊళ్ళోనే ఉండి ఉంటుంది. కాని నేనే తనని గమనించడం లేదేమోననుకుంటా. పాపం ఏమనుకుంటుందో ఏమో. ఆమెను తలుచుకుంటే జాలేస్తోంది. వరలక్ష్మి మీద ఎంత ప్రేమ ఉన్నప్పటికీ ఒక సాటి జీవిని ఈ విధంగా అవమానించడం క్షమార్హం కాదు. పాపం తను ఎన్నిసార్లు అందంగా మేకప్ చేసుకున్నప్పటికీ నేను చూడలేదో కదా!

మధ్యాహ్నం ఎకనామిక్సు క్లాసులో బాబూరావు తన ప్రేమగాథను హృదయ విదారకంగా వివరించాడు. అమ్మాయి అచ్చంగా విజయశాంతిలా ఉంటుందిట. (విజయశాంతి లాగా ఉండే అమ్మాయినే పెళ్ళి చేసుకోవాలని అతను లోగడ ప్రతిజ్ఞ చేసిన విషయం విదితమే.) తను రోజూ కాలేజీకి బయలుదేరే టైముకి వీధిలో ఎదురవుతూ ఉంటుందిట. కాగా అతని నాన్నగారేమో మేనరికం చేసుకోమని వత్తిడి చేస్తున్నార్ట. పిల్ల పేర ఎకరం మాగాణి, రెండెకరాల మెట్ట ఉందిట.

ఇరవై తులాల బంగారం ఉందిట. కట్నం, లాంఛనాలు అమాం బాపతూ అరవై వేల దాకా ముట్ట జెబుతార్ట.

"ఇంకేం లక్షణంగా చేసుకోక అలా ఏడుపు మొహం పెడతావేం" అన్నాను.

"సాటి ప్రేమికుడుగా నా హృదయాన్ని అర్థం చేసుకోగలవని చెబితే నువ్వు కూడా ఇలా అంటావా రాంబాబూ" అన్నాడు దీనాతి దీనంగా.

నాకు గుండె తరుక్కుపోయింది. "ఏం మీ మరదలు బావుండదా?" అనడిగాను.

"బాగానే వుంటుంది. కాని విజయశాంతిలా వుండదు" అన్నాడు.

"విజయశాంతిలా ఉంటే సినిమాల్లో చేరుతుంది గాని పెళ్ళి చేసుకుంటుందిటోయ్.. అయినా మనలాంటి మిడిల్ క్లాసు వాళ్ళు అందమైన వాళ్ళని చేసుకోగూడదోయ్" అని సలహా ఇచ్చాను.

"చేసుకుంటే ఏమవుతుంది?"

"సినిమాల్లో చేరిపోతారని చెప్పానా. ఇప్పటి దాకా నువ్వు ఆ అమ్మాయిని చేసుకోక పోవడం నీ అదృష్టం అనుకో".

"అంతేనంటావా? అయితే మీ మరదలు అందంగా ఉండదా?"

"ఏదో సంసార పక్షంగా ఉంటుంది. అయినా నేను ఆరాధించేది హృదయ సౌందర్యాన్ని. బ్యూటీ ఈజ్ స్కిన్ డీప్ ఓన్లీ. ప్రేమ విషయంలో నేనే నీకు గురుతుల్యుణ్ణి కదా. నువ్వు కూడా మీ మరదలు హృదయ సౌందర్యాన్ని ఆరాధించడం నేర్చుకో" అని శ్రేయోభిలాషిలాగా ఉపదేశించాను.

"థాంక్యూ రాంబాబూ. పైపై మెరుగులకు భ్రమసి పోయే నాకు కర్తవ్యబోధ చేసి కళ్ళు తెరిపించావు. ప్రేమకు హృదయమే ప్రధానం గాని శరీరం కాదని గుర్తింప చేశావు. నీ మేలు ఈ జన్మలో మరువలేను" అన్నాడు.

తలయెత్తి చూస్తే ఎకనామిక్సు లెక్చరరు గారు. "హావ్యూ ఫినిష్ట్ యువర్ డిస్కషన్? షలై ప్రొసీడ్ విత్ మై లెక్చర్?" అన్నాడు ఆయన. క్లాసులో అందరూ మావంకే చూస్తున్నారు.

ఆగస్టు 23 :

నేను రాసే తప్పుల పట్ల నిరసన సూచకంగా ఈ మధ్య నాకు సబ్బింగ్ వర్క్ ఇవ్వడం మానేసి ప్రూఫ్ రీడింగ్ సెక్షన్‌లో కూచో బెట్టారుగదా. ప్రూఫ్ రీడింగ్ గుర్తులన్నీ అలవాటయ్యేలోగా ప్రయోగాత్మకంగా నాకు స్టాండింగ్ గ్యాలీ ప్రూఫులు ఇస్తున్నారు. వాటిల్లో తప్పులేవీ ఉండవు. నిన్నో, మొన్నో ఫైనల్ కరెక్షన్ కూడా అయిపోయి ఉంటాయి. పేపర్లో చోటులేక ఆపేసిన ఐటములు అవి. వాటిల్లో 'నేడు' అని ఉంటే 'నిన్న' అని మార్చితే సరిపోతుంది. దాంతో పాటు పైన డేట్‌లైన్‌లో

తేదీ కూడా మార్చాలి. ఇవాళ్టి తేదీ వెయ్యాలి. అసలు వార్త ఏమీ చదవక్కర్లేదు. నేడు, నిన్న, మొన్న దిద్దుకుంటూ పోవడమే. ఈ పని మూడో క్లాసు పిల్లాడైనా చెయ్యగలడు. నా లాంటి మేధావి చేత ఇటువంటి పని చేయించడం జర్నలిస్టు ఫ్రాటర్నిటీకే తలవంపులు.

ఇదిలా ఉండగా, ఇవాళ చిన్న తరహా రాజకీయ నాయకుడు 'సుజనమిత్ర' పేపరు పట్టుకుని ఆఫీసుకి వచ్చాడు. తిన్నగా ఎడిటరు గారి గదిలోకి వెళ్ళాడు. తరవాత ఎడిటరు గారూ, ఆయనా



కలిసి బైటికొచ్చి న్యూస్ ఎడిటరు దగ్గరికి వెళ్ళారు. ఎడిటరు గారు పేపర్లో అండర్లయిన్ చేసిన ఓ వాక్యం చూపించి "ఇదేమిటండీ... ఇలా పడింది. దీని అర్థం ఏమిటి?" అనడిగారు. న్యూసెడిటరు గారు అర్థం కాక బుర్ర గోక్కున్నారు.

"అదికాదు సార్. నేను నా ఉపన్యాసంలో నేడు దేశంలో ఎక్కడా చూసినా అవినీతి తాండవిస్తోంది అన్నాను. మీ పేపర్లోనేమో' మొన్న దేశంలో ఎక్కడ చూసినా అవినీతి తాండవిస్తోంది' అని పడింది. నేనన్న దొకటి, మీరు వేసిందొకటి. ఇలా అయితే ఎలా సార్" అన్నాడు ఆ రాజకీయ నాయకుడు.

న్యూసెడిటరు గారు ఎంక్వయిరీ చేయగా అది శంకరయ్య గారు రాసినట్టు తెలిసింది. ఆయన్ని పిలిచి అడిగితే తను 'నేడు' అనే రాశాననీ, పేపర్లో అలా ఎందుకు పడిందో తనకు తెలీదనీ వాదించాడు. పైగా అది మూడు రోజుల కిందట రాశానన్నాడు. వర్జినల్ తెప్పించి చూస్తే అందులో 'నేడు' అనే ఉంది. తర్వాత న్యూసెడిటరు గారు ప్రూపు తెప్పించాడు. అందులో 'నిన్న' అని ఉంటే 'మొన్న' అని దిద్ది ఉంది. అలా మార్చింది నేనే నని తెలిసి నా మీద విరుచుకుపడ్డారు. "గుడ్డెద్దు చేలో పడ్డట్టు దిద్దుకు పోవడమేనా? అందులో ఏముందో చూసుకోవద్దూ" అంటూ లంకించుకున్నారు.

"ఇలా అయితే మీ పేపరు ఎవరు కొంటారు సార్" అన్నాడు నాయకుడు.

నాకు ఒళ్ళు మండిపోయింది. "మీరు మా పత్రిక చందాదారులా?" అనడిగాను. అతను కాదన్నాడు. "అంటే రోజూ షాపులో కొంటున్నారన్నమాట" అన్నాను. అదీ కాదన్నాడు అతను.

"అయితే ఇవాళ ఒక్క రోజే కొన్నారన్నమాట".

"కొనలేదండీ. ఎవరిదగ్గరో కనిపిస్తే చూశాను."

"పోనీ ఈ అచ్చు తప్పు పడకుండా ఉంటే మీరు చందా కట్టి ఉండేవారా?"

"ఇదెందుకు కొంటానండి. ఈనాడో, జ్యోతో కొనుక్కుంటాను.

"మీరు డెబ్బయి పైసలు పెట్టి మా పేపరు కొనలేదు కదా. మీ డెబ్బేమీ నష్టం కాలేదు కదా. మా పేపరు ఎవరూ కొనకపోతే నష్టపోయేది మేము కదా. మీకు దేనికి బాధ?"



"అయితే మాత్రం నా ఉపన్యాసాన్ని మీరు తప్పుగా వేస్తే ఎల్లాగండీ?

"తప్పెలా అవుతుంది? నేడు అవినీతి తాండవిస్తోందని మీరు ఇవాళ చెప్పగలరు గాని మొన్న చెప్పలేరు కదా. మీరు ఆ మాట అన్నది మొన్న. ఇవాల్టి సంగతి మొన్న ఎలా చెప్పగలరు? చెప్పే అధికారం మీకెక్కడిది? మొన్నటి సంగతి మొన్న చెప్పారు. అదే వేశం పేపర్లో. దిసీజ్ జర్నలిజం. నాట్ ఎ జోక్. వాడ్డూయూ నో ఎబౌట్ జర్నలిజం?" అంటూ దులిపాను.

"అంతేనంటారా?" అన్నాడు నాయకుడు. "అంత కాక ఇంకెంత" అన్నాను.

"సారీ సార్" అంటూ అతగాడు పేపరు చంకన బెట్టుకుని వెళ్లిపోయాడు.

నా వాగ్దాటికి సెక్షన్‌లో అందరూ అదిరిపోయినట్టున్నారు.

"చేసింది వెధవ పనైనా నీ వితండ వాదంతో వాణ్ణి హడలగొట్టి పంపేశావు. సవరణ వేస్తారా ఛస్తారా అంటూ జిడ్డులా తగులుకున్నాడు వాడు" అన్నాడు ఎడిటరు గారు.

"ఇటువంటి కేసులు ఏవొచ్చినా నా దగ్గరకి పంపండి సార్. వాళ్ళ సంగతి నేను చూసుకుంటాను" అని అభయమిచ్చాను.

"ఏడిశావ్... ప్రూఫులు తిన్నగా దిద్దు" అని ఆయన తన గదిలోకి వెళ్ళిపోయాడు.

పైకి అలా అన్నాడు గాని నిజానికి ఆయన మనస్సులో చాలా సంతోషించి నట్టున్నాడు.

*(హాస్య ప్రియ 1987)*

మొదటి భాగం సమాప్తం

పునర్దర్శనం రెండో భాగంలో